శ్రీ

# సేవాసదనము

రచన :

ఉపన్యాస సామ్రాట్, స్వర్గీయ

ప్రేమ్‌చంద్

కృష్ణాజిల్లా పెనమలూరు గ్రామస్థులు
చిగురుపాటి బుచ్చిరామయ్య గారు
డా॥ చంద్రశేఖర్ గారు
బహూకరించిన పుస్తకం

అనువాదము :

సాహిత్యరత్న, హిందీ & తెలుగు విద్వాన్,

యస్. యస్. వి. సోమయాజులు

(ఆంధ్ర విశ్వవిద్యాలయ బహుమతి గ్రహీత)

ప్రకాశకులు :

ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్,

విజయవాడ-1.

శ్రీ

ప్రథమ ముద్రణ
1955

తెలుగు భాషలో
ఈ గ్రంథమునకు సంబంధించిన
సమస్త హక్కులు,
ప్రకాశకులవి.



మూల్యము రూ 4-0-0

వాహిని ప్రెస్, విజయవాడ-1.



—ప్రేమ్‌చంద్

# పరిచయం

హిందీ సాహిత్య జగత్తులో అమరకథాకారుడు, నవలాసామ్రాట్ శ్రీ ప్రేమ్‌చంద్ మహిమాన్వితమైన పేరు సంపాదించెను. ఆయన రచనలు దేశములోని అన్నిభాషలలోను అనువదింపబడి ప్రచురింపబడినవి.

కాశీ దగ్గరనున్న 'లమహీ' అనే గ్రామములో 1880 సం॥ జూలై 31న జన్మించెను. ఆయన అసలుపేరు

'ధనపతరాయ్ శ్రీవాత్సవ్.' ముద్దుపేరు 'నవాబ్ రాయ్.' అతిపేదకుటుంబములో పుట్టి అయిదవ సంవత్సరములో 'ఉరుదూ' అక్షరాభ్యాసముతో విద్యార్థి జీవితము నారంభించి, సవతితల్లి పెట్టు కష్టములను సహించుచు, ఆర్థిక పరిస్థితుల వలన, గృహచ్ఛిద్రములవలన కృంగిపోవుచు, హతాశుడు మాత్రము గాకుండ దీక్షగ విద్యాభ్యాసము సాగించెను. 1905 లో శ్రీమతి శివరాణిని వివాహము చేసికొనెను. నవాబ్ రాయ్ పేరుతో ప్రచురించిన సోజేవతన్ కథల సంపుటిని బ్రిటిష్ ప్రభుత్వము కాల్చివేయుటతో పేరుమార్చుకొని 'ప్రేమ్‌చంద్' పేరుతో కథలను పెద్దపెద్ద నవలలను పెక్కింటిని రచించెను. 1921 లో గాంధీ మహాత్ముని శంఖారావము విని, డెప్యూటి ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స్ ఉద్యోగమునకు రాజీనామానిచ్చి, అసహాయోద్యమములో పనిచేసి, కష్టములనొంది, కొందరు సహచరులతో కలిసి 'సరస్వతీ ప్రెస్'ను స్థాపించి, ఎగుడు దిగుళ్ళను తట్టుకొనుచు 1930 లో 'హంస' పత్రికను స్థాపించి, యువ రచయితలను ప్రోత్సహించుచు 'సేవాసదన్, గోదాన్, నిర్మల' మొదలగు నవలలను కథలను అసంఖ్యాకముగ ప్రచురించి, బ్రిటిష్ ప్రభుత్వమీయవచ్చిన 'రాయ్‌సాహెబ్' బిరుదును తిరస్కరించి, విశ్వసాహిత్య క్షేత్రములో 'ఉపన్యాససామ్రాట్' (నవలా చక్రవర్తి)గ యశస్సునొంది 1936 అక్టోబరులో అమరత్వము నొందిరి.

---

# సేవా సదనము

## 1

పశ్చాత్తాపమను కటుఫలమును ప్రతి మానవుడును ఆస్వాదింపవలసివచ్చును. కొందరు దుర్మార్గవర్తనమునకు పశ్చాత్తాపముఁ జెందుదురు. కాని, పోలీసు యిన్‌స్పెక్టరు-కృష్ణచంద్రుడు మాత్రము తన మంచితనమునకు, సన్మార్గవర్తనమునకును పశ్చాత్తాపముఁ జెందుచున్నాడు. అతఁ డీ యుద్యోగమును పాతిక సంవత్సరములనుండి చేయుచున్నాఁడు; కాని తన ధర్మమును, నీతిని మాత్రము వీడలేదు. మనసు భోగవిలాసములకై తహతహ లాడునట్టి యౌవనకాలమున సైతము నిస్పృహభావముతో తన కర్తవ్యమును పాలించినాఁడు. కాని పాతిక సంవత్సరముల పిమ్మట నేఁడు తన అమాయకత్వమునకు, సరళస్వభావమునకు, తన వివేకమునకు పశ్చాత్తప్తుఁడగుచున్నాఁడు. అతని భార్య గంగాజలి గొప్పయిల్లాలు. ఆమె సతతము తన భర్తను దుష్టపథమున నడుగిడకుండ కాపాడినది. కాని నేఁడుమాత్ర మామెయు విచారించుచునే యున్నది.

కృష్ణచంద్రుఁడు సరసుఁడు, ఉదారస్వభావుఁడు, సజ్జనుఁడు. తన క్రింది యుద్యోగులయెడ సోదరప్రేమతో ప్రవర్తించెడివాఁడు. కాని యా యుద్యోగుల దృష్టిలోమాత్ర మాతని యీ సత్ప్రవర్తనమునకు విలువలేదు. 'మాపొట్ట

నిండనప్పుడు ఈ సత్ప్రవర్తనమేల? మమ్ము కట్టుకొని పోవుటకా?' యని వారి వాదన!

కృష్ణచంద్రుని పైయధికారులుసైత మాతనియెడ నసంతుష్టులే! వారితర ష్టేషనులకు వెళ్ళినచో నచట వారి కాదరసత్కారములు లభించును. వారి పరివారము, నౌకర్లు, రైటర్లు, గుమాస్తాలు హాయిగ విందు లనుభవింతురు. వారి నౌకర్లకు మామూళ్ళు లభించును. రైటర్లకు గుమాస్తాలకు ముడుపులు చెల్లును. తమకు కావలసిన కానుక లసంఖ్యాకములుగ వచ్చి పడును. కాని కృష్ణచంద్రుఁడు వారికి విందులు చేయడు, కానుక లర్పింపడు, మర్యాదలు మామూళ్ళు చెల్లింపడు. ఇతరులవద్ద తీసికొననివాఁడు తానెట్లిచ్చును? ఎచటి నుండి తెచ్చియిచ్చును?

లోభవిదూరుడై యున్నను కృష్ణచంద్రుఁడు పొదుపు నెఱుఁగఁడు. అతఁడు విలాసపురుషుఁడు కాఁడు; కాని తన పరివారమును సుఖపెట్టుట తన కర్తవ్యముగ భావించువాఁడు. భార్య, యిరువురు కొమార్తెలు - యిది యాతని పరివారము. అతఁడు తన కొమార్తెలను ప్రాణముకంటె నెక్కుడుగ ప్రేమించును. వారికై బహుమూల్యములైన వస్త్రములఁ దెచ్చును. క్రొత్తగ నే వస్తువు వచ్చినను కొమార్తెలకుఁ గొని తెచ్చి యిచ్చును. కన్పట్టిన వస్తువును కొని యిల్లునింపుట యాతని కొక పిచ్చి. ఇల్లంతయు కుర్చీలు, బల్లలు, డ్రాయర్లతో నిండి పోయినది. పిల్లలకు సంగీతము, కుట్టుపని నేర్పుటకొక కిరస్తానీ వనితను నియమించినాఁడు.

గంగాజలి జాగ్రత్తగల యిల్లాలు. ఆమె యనేక పర్యాయములు చెప్పి చూచినది - 'కొంచెము వెనుక ముందు చూచి ఖర్చు చేయుఁడు. ఏ ఘనకార్యములఁ జేయకున్నను పిల్లల పెండ్లిండ్లు చేయవలెనుగదా! ఆ నాఁ డెవరివద్దకుఁ బోయిన నెవరిత్తురు? ఇప్పటినుండియు మఖమల్ స్లిప్పర్లు కొనియిచ్చి యలవాటు చేసినచో ముందెట్లుండునో యోచించి నారా?' యని. కాని యాతఁ డీ మాటలను లెక్కించెడివాఁడు కాఁడు - 'అన్ని పనులు జరిగినట్లే యీ రెండు కార్యములును జరిగిపోవును' అని. ఒక్కొక్కప్పుడు భార్యమాటలకు 'ఇట్టి మాటలతో నా కిప్పటినుండియు దుఃఖముఁ గలుగజేయకుము!' అని విసుగుకొనును. ఇట్లే కాలము గడచిపోవుచున్నది. పిల్ల లిరువురును పద్మములవలె వికసించినారు. పెద్దపిల్ల సుమన్- చురుకైనది, అభిమానవతి, అందకత్తె. చిన్నపిల్ల శాంత - అమాయకురాలు, గంభీరస్వభావ, సుశీల. సుమన్ యెల్లప్పుడు తానితరులను మించి యుండవలెనని కోరును. బజారునుండి పిల్ల లిరువురికిని నొకే విధమైన చీరలు వచ్చినచో సుమన్ మూతి ముడుచును. ఏ స్వల్పమునకైనను సంతుష్టయగును శాంత.

గంగాజలి పూర్వాచారము ననుసరించి శీఘ్రముగ పిల్లల వివాహ మొనరించి ఋణవిముక్త కాఁ గోరును. కాని యిన్స్పెక్టరుగారు—'ఇప్పుడేమి పెండ్లి? పదునారు సంవత్సరములు నిండనిదే ఆఁడుపిల్లకు పెండ్లిచేయుట పాపము!'అందురు. వార్తాపత్రికలందు కట్నములకు విరుద్ధముగ ప్రచురింపబడు

వ్యాసములను, విమర్శనములను చదువునప్పుడాతని సంతోష మునకు మేరయుండదు. 'ఇక రెండు మూడు సంవత్సరము లలో నీ వరశుల్కముల దురాచారము రూపుమాసిపోవును. దిగులు పడవలసిన యగత్యము లేదు' అని భార్యతో ననును. ఇట్లుండగనే సుమనకు పదునారు వత్సరములు నిండినవి.

ఇక కృష్ణచంద్రుడు వెనుకటివలె తన్ను తాను వంచించుకొనజాలక పోయినాడు. ఆతని పూర్వపు నిశ్చింత సామర్థ్యజ్ఞానమునుండి యుత్పన్నమైనది కాదు – అయ్యది ఆతని యకర్మణ్యతకు ఫలితముగ కలిగిన నిశ్చింత. పవలంతయు నొక చెట్టునీడయందు విశ్రమించి, సంధ్యాసమయమున లేచి, యెదురుగ తా నతిక్రమింపవలసిన మహోన్నత శైల శిఖరమును గాంచి, "సాహసమును కోల్పోయినవానివలె నున్నాడు కృష్ణచంద్రుడు. అతడు భయకంపితుడైనాడు. వరాన్వేషణమునకు పరుగెత్తినాడు. వరుడు సుశిక్షిత పరివార మునకుఁ జెందినవాడు కావలెనని యాతనికోరిక. అట్టి పరివార ములందు వరశుల్కముల ప్రమేయ ముండదని యాతని యుద్దే శ్యము. చదువుకొనినవారు కట్నము లడుగరని యాతని యాశయము. కాని వరుని మూల్యము చదువునుబట్టి యున్నదని తెలిసినంతనే యాశ్చర్యమైనది. ఒకడు నాలుగు వేలనును. వేఱొకడు ఐదువేలు పాడును. మఱియొకడింకను పైకి ప్రాకును. పాపమాతడు నిరాశతో తిరిగి వచ్చెడివాడు. ఆరు నెలలనుండి యాతని కిదే చింత! ఆతని బుద్ధి క్రియా శూన్యమైపోయినది. చదువుకొనిన సజ్జనుల కాతనియెడ

సానుభూతి లేకపోలేము. కాని సమయము వచ్చునప్పటి కేవియో వంకలు చెప్పఁదురు - తప్పించుకొనుటకు ! ఇఁక కృష్ణచంద్రుఁడు మాటాడుటకు వీలులేకుండునట్లు! ఒక సజ్జనుఁ డనినాఁడు - 'మహాశయా! నాకీ వరశుల్కము లనిన మంట!- కాని యేమిచేయగలను? గడచిన సంవత్సరమే పిల్ల పెండ్లి చేసి నాను. రెండువేలు కట్నమిచ్చినాను. మఱి రెండువేలు పైఖర్చులకైనది. ఆ సొమ్ము యెట్లు పూడవలెనో తమరే సెలవింపు!' అని.

వేఱొక డింతకంటెను నీతి కుశలుఁడు, చతురుఁడు!- 'ఇన్‌స్పెక్టరుగారూ! పిల్లవానిని పెంచి పెద్దఁజేసినాను. చదువు లకు వేలు క్రుమ్మరించినాను. ఈ చదువుసంధ్యలవలన నా కుమారునివలెనే, మీ పిల్లయు లాభముఁ బొందునుగదా ! ఈ భారమంతయు నేనొక్కఁడనే భరించుట యేమి న్యాయమో మీరే సెలవిండు!' అనినాఁడు.

కృష్ణచంద్రుడు తన మంచితనమునకు, తన నిజాయతీకి పశ్చాత్తప్తుఁడగుచున్నాఁడు. తన నిస్పృహత్వముపై నాతనికి గల గర్వము అంతరించినది. పాపభీతిని వీడియున్నచో, నేఁడిట్లు బాధపడవలసివచ్చెడిది కాదుగదా యనుకొనును. భార్యాభర్త లిరువురును చింతామగ్నులై యుండిరి. కొంతసేపైన తరువాత కృష్ణచంద్రుఁడనినాఁడు — 'చూచితివా ! ప్రపంచమున ధర్మమార్గమున సంచరించినందుల కియ్యదియే ఫలము ! నేనే గనుక ప్రజలను దోచి, పీల్చి పిప్పిచేసి ధనము సంపా దించి యున్నచో నాతోడి సంబంధము తమ యదృష్టముగ

తలంచి యుండెడివారు. ఇఁక రెండే యుపాయము లున్నవి—సుమన్ నొక భిక్షుకునకు కట్టఁబెట్టుట, లేదా యొకబంగరుపిట్టను పట్టుట! మొదటి విషయమెట్లును తప్పదు; గాన బంగరు పిట్టకై యన్వేషింతును. ధర్మము, నీతి, సన్మార్గాచరణము, వీటి ఫలితము చూచితిని. ఇఁక ప్రజలను బాగుగ దోచుకొందును – రెండుచేతుల లంచములు పట్టుదును. ఇదియే చివరి యుపాయము. ప్రపంచ మిదియే కోరును. బహుశః భగవంతుఁడుసైతమిదియే కోరుచుండును. అట్లే యగుగాక!'

గంగాజలి శిరమువాంచి భర్తమాటలు వినుచు దుఃఖించుచున్నది. ఆమె మాటాడలేదు. కను లశ్రుపూర్ణములై యున్నవి.

## 2

కృష్ణచంద్రుని పోలీసు యిలాకాలో రామదాసను మఠాధిపతి యొకఁడున్నాఁడు. అతఁడు బైరాగుల మఠమున కధికారి—గురువు. ఆ మఠమునకు సంబంధించిన వ్యవహారము లన్నియు బిహారీ పేరిట జరుగుచుండును. బిహారీ వడ్డీవ్యాపారము చేయుచుండును. రూపాయికి అణావడ్డీ చొప్పున నిచ్చును. శిస్తులు వసూలుచేయుట, కవులు వసూలుచేయుట, కవుళ్ళు వ్రాయుట మున్నగునవన్నియు నాతడే చేయును. బిహారీ డబ్బు ఎగవేయుట కెవరికిని సాహసము చాలదు. తమ డబ్బుకై అతనిని తొందరపెట్టుటకును సాహసింపరు. అతనికిఁ

గోషము తెప్పించినచో నా యిలాకాలో నుండుటయే కష్ట మగును. రామదాసునివద్ద నిత్యము పదిమంది బలిష్ఠులైన బైరాగులుందురు. కఱ్ఱసాము చేయుట, సీమబాదపుపాలు త్రాగుట, గంజాయి దమ్ముపీల్చుట వారి ముఖ్య కార్యక్రమములు. ఇంతటి బలిష్ఠులతో విరోధము పెట్టుకొన సాహ సించు వారెవరు?

పీఠాధిపతికి అధికారులలో మంచి పలుకుబడి యున్నది. బిహారీ యధికారులను బాగుగ మేపుచుండును. అతని ప్రసా దము నెవరు కాదందురు ? ఈ ప్రపంచములో నడుగిడినప్పు డీ ప్రపంచపు నియమములనే యనుసరింపవలెనుగదా !

ఈ సంవత్సరమే మఠాధిపతి తీర్థయాత్ర కేగినారు. తిరిగివచ్చిన పిమ్మట బ్రహ్మాండమైన యజ్ఞమును ప్రారంభించి నారు. నెల రోజులవరకు హోమగుండము ప్రజ్వలించుచునే యున్నది – హోమములు సాగుచునే యున్నవి. పదివేలమంది బైరాగులు ఆహూతులైరి. ఈకార్యక్రమమునకై ఎకరమునకు అయిదురూపాయిలచొప్పున గుంజిరి. కొందరు సంతోషముతో నిచ్చినారు. మఱికొందరు అప్పుతెచ్చి చెల్లించినారు. అప్పు పుట్టనివారు నోటు వ్రాసి యిచ్చినారు. బిహారీమాట సాగని దొక్క రైతువద్దమాత్రమే ! అతని పేరు శీతాయ. వాడు దరిద్రుడు. వరుసగ కొన్ని సంవత్సరములనుండి దరిద్రదేవత వానిని వెంటాడుచున్నది – పంటలు నాశనమగుచున్నవి. కొలది దినములక్రితమే బిహారీ కవులు ఎగగొట్టినాడని వానిపై దావా వేసి ఋణభారముతో మఱెంత పాతాళము

నను త్రొక్కినాఁడు. వాఁడీ చందా నిచ్చుటకై నిరాకరించి నాఁడు – నోటుకూడ వ్రాసి యివ్వలేదు. ఇట్టి ద్రోహిని ఠాకూర్ బిహారీ క్షమించునా ? ఒకనాడు కొందరు మహాత్ము లాతనిని పట్టి తీసికొనివచ్చిరి. మఠముముందే వానిని బాద సాగిరి. శీతాయకును కోపము వచ్చినది. ఆతని కాలుసేతులు బంధింపఁబడియున్నవి. అందుచే వాడు వారిగుద్దులకు దెబ్బ లకు సమాధానము నోటితోడనే యిచ్చుచున్నాఁడు. వారు కొట్టుచునే యున్నారు. నోటిమాట యాగిపోవువఱకు నాతఁడు తిట్టుచునే యున్నాఁడు. ఇట్లు చావబాదినను ఠాకూరునకు తృప్తి కలుగలేదు. ఆ రాత్రికి వాని ప్రాణములను 'సైతము హరించినాడు. ఉదయమే పోలీసుస్టేషనుకు రిపోర్టు చేరినది.

భగవంతుఁడే తనవద్ద కిట్లు బంగారుపిట్లను పంపినాఁడను కొనినాఁడు కృష్ణసింహుఁడు. విచారణకై బయలుదేరినాఁడు.

ఆ యిలాకాలో మఠాధిపతికి పలుకుబడి యెక్కువ. అందుచే సాక్ష్యము దొఱకుటయే కష్టమైనది. కొందరు రహ స్యముగ వచ్చి కృష్ణసింహునితో జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పిరి. కాని ప్రత్యక్షముగ సాక్ష్యమిచ్చుటకు సాహసము లేదు.

మొదట మఠాధికారి చాల బెట్టుసరిగ నుండెను. కాని, కృష్ణసింహుఁడు కొందరిని తన పక్షమునకు త్రిప్పుకొనినాడని తెలిసిన పిమ్మట కొంచెము మెత్తబడినాడు. తన యేజెంటును కృష్ణసింహునివద్దకు బంపినాడు. ఏజెంటు కుబేరుని శరణు జొచ్చినాడు. బేరములైనవి. కృష్ణసింహుఁడనినాఁడు – 'నా

విషయము మీ రెఱుఁగుదురు గదా! లంచమనునది విషముతో సమానము.'

'చిత్తము! మే మెఱుఁగుదుము. కాని, సాధువులపై కనికరము చూపవలెను.'

పిమ్మట యిరువురును గుసగుసలాడినారు. ఏజెంటు అనినాడు – 'కాదు బాబూ! అయిదువేలు – మా శక్తికి మించినది. వారి శక్తిని మించకుండునట్లు, మీ పని జరుగునట్లు చూడుడు.' చివరకు మూడువేల రూపాయలకు బేరము కుదిరినది.

జీవితమంతయు ప్రలోభనములకు గురికాకుండ, నేడు తన యాత్మను బలి యొసంగుట యిన్స్పెక్టరునకు దుఃఖమును కలిగించెను. 'ఈ పనియే తప్పనిసరియైనచో, పాతిక సంవత్సరముల క్రితమే చేసియున్నచో బంగారపు గోడలు కట్టి యుండెడివాఁడనుగదా! గ్రామములే కొని యుండెడివాఁడను గదా! ఇన్ని దినములు త్యాగమువలని ఆనందము ననుభవించిన పిమ్మట నేఁ డీ కళంకమా!' 'ఇందు నీ దోషమేమున్నది? నీ చేతనైనంతవరకు నిర్వహించితివి. భోగవిలాసాదులకై యధర్మము నాచరింపలేదుగదా! దేశకాలాచారములు, నీ బంధువుల స్వార్థచింతనము నిన్ను చెడుత్రోవకుఁ గొంపోవుచున్నవి. ఇందు నీ దోషమేమున్నది? నీ యాత్మ నేటికిని పవిత్రమైనదే! భగవానుని సమక్షమున నేటికిని నీవు నిరపరాధివే!' అని మనసు సమాధానమిచ్చును. ఇట్టి తర్కముతోడనే కృష్ణచంద్రుఁడు ఆత్మను సమాధాన పఱచినాఁడు.

కాని పరిణామమువలని భయముమాత్ర మాతనిని వీడుటలేదు. అతఁడెన్నఁడును లంచమెఱుఁగఁడు. అందుకుఁ గావలసిన ధైర్యసాహసములే లేవు. ఇతరులపై నెన్నఁడును చేయి జేసికొననివాఁడు అకస్మాత్తుగ కత్తిఁబట్టజాలఁడు గదా! ఈ రహస్యమే బయటపడినచో కారాగారమేగతి! నేటి వఱకును తాను సంపాదించిన మంచితనము మట్టిపాలగును. ఆత్మను తర్కముతో సమాధానపరుపవచ్చును. కాని, యూతర్కము పరిణామము వలని భయమును పోఁగొట్టజాలదుగదా! ఆ భయమునకు ఆచ్ఛాదనము కావలె! సాధ్యమైనంతవఱకాతఁ డీ విషయమును రహస్యముగ నుంచెను. ఈ విషయము మూడవ చెవిని పడరాదని ఏజంటుతో గట్టిగ చెప్పినాఁడు. స్టేషను లోని పోలీసులకు, గుమాస్తాలకుఁగూడ తెలియనీయలేదు.

రాత్రి తొమ్మిదిగంటలైనది. కృష్ణచంద్రుడు స్టేషను లోని పోలీసుల నేదియోవంకబెట్టి బయటకు పంపివేసినాఁడు. కాపలాడ్యూటీలోనున్నవారినిగూడ నేవేవియో వస్తువులఁ దెచ్చునెపమున పంపివేసి తా నొక్కఁడే ఏజెంటుకొఱకు ప్రతీక్షించుచున్నాఁడు.

అరగంట పిమ్మట నెవరో వచ్చుచున్న చప్పుడైనది. ఆతని గుండె వేగముగ కొట్టుకొన నారంభించినది. మంచము పైనుండి లేచి కూర్చుండి తములపాకులు నమల నారంభించినాఁడు. ఇంతలో ఏజెంటును లోనికి వచ్చినాఁడు.

కృష్ణ:- ఏమిటి విషయము?

ఏజం:- మఠాధిపతి...

కృష్ణచంద్రుఁడు గుమ్మమువైపు చూచుచు 'డబ్బు తెచ్చినారా లేదా?' అని యడిగినాడు.

'చిత్తము. తీసికొనివచ్చినాను. కాని మఠాధిపతి...'

కృష్ణచంద్రుఁడు మఱల నలువైపులను దొంగచూపులు చూచుచు - 'ఒకదమ్మిడీ తక్కువైనను పుచ్చుకొనను.' అనినాడు.

'చిత్తము. నా మామూలు...'

'నీమామూలు రామదాసు వద్దనుండి పుచ్చుకొనుము.'

'నూటికి అయిదు మామూలున్నది. క్రొత్తకాదు.'

'ఇందులోనుండి దమ్మిడీకూడ ఇచ్చునదిలేదు. నేనేమియు దొంగతనము చేయుటలేదు. నా యాత్మను విక్రయించుచున్నాను.'

'తమ చిత్తము. కాని నా మామూలు చెడిపోవుచున్నది'

'నాతోకూడ మా యింటికిరావలె!'

వెంటనే బండి సిద్ధమైనది. ఇరువురును బయలుదేరినారు. బండికి ముందు వెనుక నౌకరు లున్నారు. కృష్ణచంద్రునకు ఏగిరి యింటివద్ద వ్రాలవలె ననిపించుచున్నది. బండివానిని తొందరపెట్టుచున్నాడు - 'ఏమిరా! నిద్రపోవుచున్నావా? త్వరగా తోలు!'

పదకొండు గంటలకు యింటికి చేరినారు. ఏజెంటును వెంట బెట్టుకొని యిన్‌స్పెక్టరుగారు గదిలోనికేఁగినారు. కిటికీలు, తలుపులు బిగించినాడు, ఏజెంటు మూట బయటకు

తీసినాడు. కృష్ణచంద్రుడు వెంటనే దాని నందుకొని పెట్టెలో నుంచి తాళమువేసినాడు.

గంగాజలి భర్త రాకకై ప్రతీక్షించుచున్నది. ఏజంటును పంపివేసి యింటిలోనికేగినాడు. ఇంత ఆలస్యమైన దేమని యడిగినది భార్య.

'పని తగిలినది! దూరముకూడను!'

భోజనము చేసి పండుకొనినాడు, కాని నిదుర పట్టదు. భార్యతో నీ విషయము చెప్పుటకు సంకోచమగుచున్నది. భార్యకును నిదుర పట్టుటలేదు. ఆమె మాటిమాటికిని భర్త ముఖమును విలక్షణముగ వీక్షించుచున్నది.

చివరకు కృష్ణచంద్రు డడిగినాడు-'నీవొక నదియొడ్డున నిలబడినావనుకొనుము. వెనుకనుండి సింహము మీదికి దుముకబోవుచున్నది. అప్పుడు నీవేమి చేయుదువు?

భార్య యీ ప్రశ్నయందలి యభిప్రాయమును గ్రహించినది – 'నదిలోనికి దుముకుదును.'

'మునిగిపోయినను సరేనా?'

'అవును. సింహము నోటిలో పడుటకంటె మునిగి పోవుటయే మంచిది.'

'అభిప్రాయము గ్రహించినావా?'

'అంతటి తెలివితక్కువ దానను కాను!' దీనభావముతో భర్త ముఖమును జూచుచున్నది.

'నేనును నట్లే దుమికినాను. మునిగిపోదునో, తేలి పోదునో తెలియకున్నది.'

# 3

కృష్ణచంద్రునికి, పుచ్చుకొని; దానిని బయట పడకుండు నట్లు సమర్థించుకొను మార్గములు తెలియవు. ఈ విషయములో నతడింకను క్రొత్తవాడే! ఈ పాపిష్టిసొమ్ము ఒంటరిగా జీర్ణము కాదని యాతఁడెఱుఁగడు.

'చేసినదంతయు నేనే! నా విషయముననే యిట్టి నాటకమా? నాలుగు డబ్బులు నాకును ముట్టుననియేగదా యింత శ్రమ పడినది! నాకు దమ్మిడీ ముట్టచెప్పలేదు. సరే కానిమ్ము!' అనుకొనినాడు ఏజెంటు.

అతడు కృష్ణచంద్రునివద్దనుండి బయలుదేరి సరాసరి పోలీసుస్టేషను కేఁగి మాటల సందర్భముననే రహస్యము నంతయు బయట పెట్టినాఁడు.

'ఎంతటిమోసము! మనకు తెలియకుండగనే రహస్యముగ పెద్ద మొత్తములే గుంజుచున్నాడన్నమాట! ఇది యంతయు బకధ్యానమన్నమాట! ఈ కపటభక్తునికి తగిన శాస్తి చేయవలసినదే!' అనుకొనినారు స్టేషనులోని పోలీసులు.

కృష్ణచంద్రుఁడు వివాహ సన్నాహములలో నిమగ్నుడై యున్నాడు. వరుడు అందమైనవాడు, సుశీలుడు, సుశిక్షితుఁడు, ధనికుఁడు, కులీనుడు! ఇరుపక్షములందును ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నవి. ఇఁక, అటు ఆఫీసర్లకు రహస్యముగా ఉత్తరములు, రిపోర్టులు చేరుచునే యున్నవి. ఆ ఉత్తరములందు అనేక ప్రమాణములు చూపబడినవి. జరిగిన విషయ

మును విపులీకరించి వర్ణించుటచే ఆఫీసర్లకు అనుమాన మెక్కు వైనది. వారును రహస్యముగనే విచారణ ప్రారంభించిరి. రహస్యమంతయు బయటపడినది.

నెల రోజులు గడచిపోయినవి. రేపే ప్రధానమున కేఁగ వలసిన ముహూర్తము. సాయంసమయమున ఇన్‌స్పెక్టరుగారు పడకకుర్చీపై గూర్చుండియున్నాఁడు. ఇంతలో ఎదురుగా పోలీసు సూపరింటెండెంటు కంటబడినాడు. అతనివెనుక నిరువురు ఇన్‌స్పెక్టర్లున్నారు, కొందరు పోలీసులున్నారు. వారిని చూచి కృష్ణచంద్రుడు భయముతో లేచి నిలునబడి నంతనే ఇన్‌స్పెక్టరొకడు అరెష్టువారంటు చూపినాడు. కృష్ణ చంద్రుని ముఖము వెలవెలబోయినది. అతఁడు చైతన్యహీనుడై శిలావిగ్రహమువోలె నిలువబడి యున్నాడు - తల వంచుకొని నాడు - అతనిమోమున కన్పట్టునది భయముకాదు - లజ్జ! ఆ యిరువురి ఇన్‌స్పెక్టర్లముందు తాను తలయెత్తి సగర్వముగ తిరిగినాఁడు. వారిని తాను నీచులని తలంచెడివాడు. కాని, నేఁడు వారి యెదుటనే తాను తలవంచి నిలువవలసివచ్చినది. జీవితమంతయు కష్టపడి సంపాదించిన మర్యాద నేటితో మట్టిలోగలిసినది. 'ఎవరికంట బడకుండ లంచములు బాగా కొట్టు!' అను కొనుచున్నారు ఠాణాలోని పోలీసులు.

'వెల్! కిషన్‌చంద్! నీవేమైన చెప్పదలచుకొన్నావా?' అని యడిగినాడు సూపరింటెండెంటు.

ఏమని చెప్పను? నేను నిరపరాధినని యందునా? ఇది యంతయు నా శత్రువుల పన్నాగమని చెప్పుదునా? ష్టేషను

లోనివారు నా నిజాయతీవల్ల బాధపడి నన్ను వెడలగొట్టించు టకై యీ పన్నాగము పన్నినారని యందునా? - కృష్ణచంద్రు డి ట్లాలోచించుచునే యున్నాడు.

కాని, యాతఁడిట్టి పాపాభినయమున సిద్ధహస్తుఁడు కాడు. ఆతని యాత్మ పాపభారముచే క్రుంగిపోవుచున్నది. అతఁడు తన దృష్టిలో తానే పతితుడైనాఁడు.

'నీవేమైన చెప్పదలచినావా?'యని మఠాల నడిగి నాడు సూపరింటెండెంటు.

'చిత్తము! నేను అపరాధముచేసినాను. దానికి కఠినాతి కఠినమైన శిక్షను విధింపుడు. నా ముఖమునకు మసి బూసి వీధివీధులను త్రిప్పుడు. మిథ్యామర్యాదలను పెంపొం దించుకొనుటకు, స్థితిని మించిన పోకడలు పోయి గొప్పలు చూపింపదలఁచి, ఆడంబరము కొఱకై నేనొక యపరాధము గావించినాను - దానికిఁ దగిన శిక్షను కోరుచున్నాను. ఆత్మిక, ధార్మిక బంధనములు నన్ను వారింపజాలక పోయినవి. కావున నేను శాసన శృంఖలములకే తగినవాఁడను. ఒక్కసారి యింటి కేఁగుట కనుజ్ఞనిండు. అచటినుండి వచ్చిన పిమ్మట నేను మీ వెంట వచ్చుటకు సిద్ధమే!'

ఈ మాటలను వినుచున్న ఇన్‌స్పెక్టర్లు ఒకరి ముఖ మొకరు చూచుకొనుచున్నారు - వీనికి పిచ్చియెత్తినదా యేమి? అనునట్లు! - స్పృహలేకుండ మాటాడుచున్నాడనునట్లు! అంత పెద్దమనిషి యైనచో నిట్టిపని చేయుటయేల?

సూపరింటెండెంటు కృష్ణచంద్రునివైపు దయాపూర్ణ మైన దృక్కులతో చూచి, లోనికేగుట కనుజ్ఞ నిచ్చినాడు.

గంగాజలి లోపల పళ్ళెరములందు ప్రధానమునకు వలసిన సామానులు సర్దుచున్నది. ఇంతలో కృష్ణచంద్రు డేతెంచి- 'గంగా! రహస్యము బయటపడినది. నన్ను అరెష్టుచేసినారు.' అనినాడు.

గంగాజలి యాశ్చర్యభావముతో జూచినది. ఆమె ముఖకాంతి మాయమైపోయినది. కంటివెంట అశ్రువులు జాలువారినవి.

'ఎందులకీ యేడుపు? నా విషయమున నన్యాయ మేమియు జరుగుటలేదు. చేసినదానికి ఫలిత మనుభవించు చున్నాను. నాపై క్రిమినలుకేసు పెట్టుదురు. నీవు దుఃఖింప వద్దు. నే నన్నియు సహించుటకు సిద్ధపడియున్నాను. నాకై ప్లీడర్లను పెట్టి డబ్బు నాశనము చేయవద్దు. దానిని సుమన్ వివాహమునకై వెచ్చింపుము. ఆత్మ, గౌరవము, జీవనము, సమస్తము నాశనమైపోయినను, ఈ ఋణమునుండి విముక్తుడ నైతినను సంతోషమైనను లభించును. పిల్లదాని జీవితమైనను గట్టెక్కును.'

గంగాజలి నెత్తి బాదుకొనుచు విలపించినది-'అయ్యో! ఈ గతి పట్టునని తెలిసియున్నచో నా పిల్లను వీధినిపోవు భిక్షుకునికిచ్చి యుండెడిదాననుగదా!' యని. అకస్మాత్తుగ - నిద్రనుండి యులికిపడి లేచినట్లు - కృష్ణచంద్రుని చేయి పట్టుకొని యనినది - 'ఆ డబ్బును తగులబెట్టుము. ఆ రామదాసు

నెత్తినకొట్టి రమ్మి! నా పిల్లపెండ్లి కాకపోయినను పరవాలేదు. అయ్యో! భగవానుడా! నా మతి యిట్లేల భ్రమించినది? నేనే ఆఫీసరువద్దకు వచ్చుచున్నాను. పద! ఇంకను సిగ్గేమి?'

'కావలసినదేమియో జరిగిపోయినది. ఇప్పుడేమియుఁ బ్రయోజనము లేదు.'

'నన్ను ఆఫీసరువద్దకు గొనిపొమ్మి! ఈ డబ్బు తీసికొని, శిక్షవిధింపఁదలఁచినచో నాకు విధింపుడని వారి పాదములపై బడి వేడుకొందును. ఈ విపత్తునకు మూలమే నేనని, ఈ విషబీజమును నాటినదాననే నేనని చెప్పికొందును.'

'నామాట వినుము! ఇది యేడ్చుటకు సమయము కాదు. నేను శాసనబంధనములందు చిక్కుకొనినాను. విడిపించుకొనుట సాధ్యముకాదు. ధైర్యముగ నుండుము. భగవంతుని యనుగ్రహమున్నచో మరల కలసికొందుము.'

ఈ మాటయని బయటకు బయలుదేరి నంతనే యిరువురు పుత్రికలు వచ్చి యాతని కాళ్ళను చుట్టినారు. గంగాజలి వారిరువురను పట్టుకొనినది. ముగ్గురును నెత్తి బాదుకొనుచు విలపించుచున్నారు.

కృష్ణచంద్రుఁడును కాతరుడై పోయినాఁడు. 'ఈయబలల గతి యేమగును? ఓ భగవానుడా! నీవు దీనజనావనుడవు! ఈ దీనులనుగూడ రక్షింపుము!'

ఒక్క క్షణమైనపిమ్మట వారినుండి విముక్తుడై బయటకు వెడలిపోయినాఁడు.

# 4

కృష్ణచంద్రుఁడు తానున్న గ్రామములో సర్వజన ప్రియుఁడు. ఈ వార్తతో నగరమంతయు నట్టుడికిపోయినది. కొందఱు పెద్దలు జామీనుండుట కేతెంచిరి. కాని సూపరింటెండెంటు జామీను తీసికొనలేదు.

ఒకవారము దినముల తరువాత నాతనిపై లంచము పుచ్చుకొనిన నేరమునకు కేసు పెట్టబడినది. రామదాసును గూడ అరెస్టు చేసినారు.

రెండు కేసులు నెలల తరబడి సాగినవి. ఆఫీసరు కేసును సెషన్సుకు పంపినాడు. అచ్చట నొక నెలదినములు పట్టినది. చివరకు కృష్ణచంద్రుని కైదుసంవత్సరములు, రామదాసుని కేడుసంవత్సరములు శిక్షవిధించినారు. రామదాసుని యనుచరుల కిరువురికి ద్వీపాంతరవాసము లభించినది.

గంగాజలి కొక సోదరుడున్నాడు - ఉమానాథుడు. కృష్ణచంద్రు డనిన నాతనికి సరిపడెడిదికాదు. అందుచే నాత డిచటికి తరచుగ వచ్చెడివాఁడు కాడు.

కాని, యీ దుర్ఘటన సంభవించుట వలన నాత డూరకుండజాలకపోయినాడు. అతడువచ్చి సోదరిని, పిల్లలను తన యింటికి తీసికొనిపోయినాడు. కృష్ణచంద్రునికి సోదరులు లేరు. పినతండ్రి కుమారు లిరువురున్నారు. కాని, వారెచటనో వేఱుగ నున్నారు. వారు కృష్ణచంద్రుని యింటి మొగమైనను జూడలేదు.

కృష్ణచంద్రుడు భార్యతో రామదాసిచ్చిన డబ్బులో నుండి కోర్టుకు, ప్లీడర్లకు దమ్మిడీగూడ ఖర్చుచేయవద్దని గట్టిగ చెప్పి వెళ్ళినాడు. కాని యామె చూచుచు నూరకుండ లేకపోయినది. ఆమె విచ్చలవిడిగ భర్తను విడిపించుటకై ఖర్చుచేసినది. చివరివరకును ప్లీడర్లు శిక్షతప్పిపోవు ననుచునే యున్నారు.

సెషన్సు తీర్పుపై హైకోర్టుకు అప్పీలుకు వెళ్ళినది. రామదాసుని శిక్ష తగ్గలేదు. కృష్ణచంద్రుని శిక్షమాత్రము కొంచెము తగ్గినది – అయిదేండ్లనుండి నాలుగు సంవత్సరములకు.

గంగాజలి పుట్టినింటికి వచ్చినది. కాని తానొనర్చిన పొరపాటున కామె మనసు దుఃఖించుచునే యున్నది. తాను చిన్నతనమున బొమ్మలాట లాడుకొనిన పుట్టినిల్లు కాదిది. పిచ్చిక గూళ్ళు చేసికొనుచు, తల్లిదండ్రుల యొడిలో నాడు కొనుచు కాలము గడిపిన పుట్టినిల్లు కాదిది. తల్లిదండ్రులు చనిపోయినారు. గ్రామములో నానాటి మనుష్యులు కన్పించుట లేదు. గ్రామస్వరూపమే మారిపోయినది. బీడులు పొలములైనవి. పంటపొలములు బీడులైనవి. ఆమె వదిన జాహ్నవి నిత్యము ప్రతి విషయమునకు మూతి విఱచుచుండును. జాహ్నవి యింటిలో నెక్కువగ నుండదు. పొరుగిండ్లకు పోయి యాడు బిడ్డ విషయములు చెప్పికొని యేడ్చుచుండును. జాహ్నవి కిరువురు కొమార్తెలున్నారు. వారు సుమన్, శాంతలతో నెన్నడును కలిసిమెలసి తిరుగరు.

రామదాసు సొమ్ము గంగాజలివద్ద దమ్మిడీగూడ మిగుల లేదు. తాను మొదటినుండియు నప్పుడప్పుడు యింటి ఖర్చులో మిగిల్చిన నాలుగైదు వందలు మాత్రమే మిగిలియున్నవి. అందుచే నామె యుమానాథునివద్ద సుమన్ పెండ్లి విషయ మెత్తుటలేదు. కృష్ణచంద్రుడు నిశ్చయించిన పెండ్లివారు తమకీ సంబంధ మిష్టము లేదని నిరాకరించి యపుడే ఆరు నెలలైనది.

ఉమానాథుని మాత్ర మీ చింతపట్టి పీడించుచునే యున్నది. వీలు చిక్కినపుడాతడు వరాన్వేషణకై రెండుమూడు దినములపాటు తిరిగి వచ్చుచునే యున్నాడు. అత డే గ్రామ మేఁగినను నచట కొంత హడావిడి ప్రారంభమగును. యువకులు, పెండ్లి యూరేగింపునాడు ధరించు వస్త్రములను మూటలలోనుండి బయటకు తీసి ధరింతురు. ఉంగరములు, బంగారు గొలుసులు మెరువుతెచ్చి ధరింతురు. తల్లులు తమ పిల్లలను ముస్తాబుచేసి ఆడుకొనుటకై వీధిలోనికి పంపుదురు. వివాహముపై నభిలాషయున్న వృద్ధులు మంగలిని పిలిపించి మీసములు కత్తిరింపించి, నెఱసిన వెంట్రుకల నేరివేయింతురు. తమ గొప్పతనమును ప్రదర్శించుటకై నౌకర్లచే కాళ్ళు పిసికించుకొందురు. ఉమానాథుడచట నున్నంతవఱకును స్త్రీలు బయటకు రారు. ఎవ్వరును తమ చేతితో నీళ్ళు తోడరు. పొలము వెళ్ళరు. కాని యాతని కీ సంసారములు నచ్చెడివి కావు.

చివఱకాతఁడు పట్టణములో నేదైన నొక సంబంధమును వెదుక సంకల్పించెను. సుమన్‌కు తగిన సంబంధము గ్రామము

లలో దొరుకదు. కాని, పట్టణవాసుల బ్రహ్మాండమైన కబుర్లు విన్నచో నాతనికి నిరాశకలిగెడిది. గొప్పవారి విషయము చెప్పనక్కరలేదు. గుమాస్తాలు సైతము వేలమీద పాట పాడు చున్నారు. ఒకరిద్దరు సజ్జనులు వంశ మర్యాదను విని వివాహ మాడుటకు సమ్మతించిరి. కాని, వారి జాతకములు కలియ లేదు. అందుచే నాతని కా సంబంధములు నచ్చలేదు. అతనికి తన కులమర్యాదనుండి చ్యుతుడగుట కిష్టములేదు.

ఈ విధముగా నొక సంవత్సరము గడచిపోయినది.

మాఘమాసము. ఉమానాథుడు స్నానమున కేగినాడు. ఇంటికి వచ్చి సరాసరి గంగాజలివద్ద కేగి యనినాడు - 'అమ్మాయీ! నా కోరిక ఫలించినది. బెనారస్‌లో సంబంధము కుదిరినది.'

'మంచిది. ఏదోవిధముగ నీ శ్రమ ఫలించినది. పిల్లవాడు చదువుకొనుచున్నాడా?'

'చదువుటలేదు. ఉద్యోగము చేయుచున్నాడు. ఒక ఫ్యాక్టరీలో 15 రూపాయల జీతము.'

'ఇల్లు, వాకిలి ఉన్నదా?'

'పట్టణములలో నిండ్లెవరికున్నవి? అందఱు అద్దె యిండ్లలో నుండువారే!'

'బంధువులు, తల్లిదండ్రులు నున్నారా?'

'తల్లిదండ్రులు చనిపోయినారు. పట్టణములలో చుట్ట పక్కము లెవరుందురు?'

'వయస్సెంత యుండును?'

'షుమారు ముప్పది యేండ్లుండవచ్చును.'

'చూచుట కెట్లున్నాడు ?'

'చాలా బాగున్నాడు, పేరు గజాధరప్రసాదు.'

'రెండవ పెండ్లియా?'

'అవును. అగుటకు రెండవ పెండ్లియే! అంతమాత్రమున కేమి ?'

'వంశము మంచిదేనా ?'

'ఉన్నతవంశము. మన వంశముకంటెను మంచిది. ఏమి ? యిష్టమేనా ?'

గంగాజలి యుదాసీనయై యనినది - 'నీ కిష్టమైన నాకును నిష్టమే !'

## 5

ఫాల్గుణ మాసమున సుమన్ వివాహమైనది. గంగాజలి యల్లుని జూచి కన్నీరు మున్నీరుగా వేడ్చినది. ఎవరో సుమన్‌ను నూతిలోనికి త్రోసినట్లు దుఃఖించినది.

సుమన్ అత్తవారింటికి వచ్చినది. ఇచటి స్థితి తా ననుకొనిన దానికంటె నధ్వాన్నముగనున్నది.

రెండు గదులు ఒక చిన్నవసారాతో గూడిన యిల్లు. బయట మురుగుకాలువల దుర్గంధము! ఇంటిలో గాలి వెలుగులకు ప్రవేశమే లేదు!

రెండు నెలలపాటు ఆమె జీవితము సుఖముగనే యున్నది. గజాధరుని ముసలిమేనత్త యింటిపనులన్నియు జూచెడిది.

కాని, ఆ వేసవిలో గ్రామమున వ్యాపించిన కలరావ్యాధి యామెను గొంపోయినది. అందుచే సుమన్ జీవితము చిక్కన బడినది. అంట్లుతోము పనిమనిషి మూడు రూపాయలకు తక్కువకు కుదురదు. రెండురోజులపాటు ప్రొయ్యి రాజేయ లేదు. గజాధరు డామె నేమియు ననజాలడు. ఆ రెండు రోజులును బజారునుండి భోజనము తెప్పించినాడు. సుమన్‌ను ప్రసన్నురాలి నొనరింపవలెనని యాతని తలంపు. అత డామె రూపలావణ్యములకు ముగ్ధుడైపోయినాడు. మూడవ నాడు గజాధరుడు తెల్లవారుజామున మూడు గంటలకే లేచి యంట్లుతోమి, యిల్లు వాకిలి ఊడ్చినాడు. పంపువద్దనుండి నీరు పట్టితెచ్చినాడు. సుమన్ మేల్కాంచి యీ వ్యవహారము గాంచి యాశ్చర్య చకితయైనది. ఈపని యంతయు భర్తయే చేసినాడని గ్రహించినది. సిగ్గుచే నామె యాతని నేమియు నడుగలేదు. సాయంకాలము తానే పనులన్నియుం జేసికొనినది. అంట్లు తోముచునే యెప్పుచున్నది.

కాని, కొన్నాళ్ళ కామె కీ పనులలవాటై పోయినవి. ఆమెకు తన జీవితమున నించుక ఆనందానుభూతి కలుగ జొచ్చినది. గజాధనునికి ప్రపంచమును జయించినట్లున్నది. తన మిత్రుల ముందు భార్యను ప్రశంసించును. మరుసటి నెలజీతము వచ్చినంతనే జీతమంతయు భార్యచేతిలో బెట్టినాడు. ఆమెకు నేడు స్వచ్ఛందానందానుభూతి కలిగినది. ఇంక నామెకు ప్రతిసారి యితరులవద్ద చేయిజాపు నగత్యములేదు. ఆ డబ్బు తన యిష్టమువచ్చినట్లు ఖర్చుచేసికొనవచ్చును.

కాని, గృహనిర్వహణమునందు కుశలకాదు గాన, నామెకు ఖర్చులో నవసరమైనదేదో, యనవసరమైనదేదో తెలియదు.

తత్ఫలితముగ నెలపూర్తియగుట కింకను పదిదినము లుండగనే డబ్బంతయు ఖర్చయిపోయినది. గజాధరుని కీ వార్త అశనిపాతమైనది. అతనికి గొన్నాళ్ళకు ముందే యీ విష యమున ననుమానము కలిగినది. కాని యాత డామె నేమియు నడుగలేదు. నెల మధ్యలో డబ్బెచటినుండి వచ్చునాయని రోజంతయు నాతనికి దిగులు.

గజాధరుడు భార్యను స్వామిని నొనర్చినాడు. కాని, యాతడు మాత్రము స్వభావతః కృపణుడు. అల్పాహారము లాతనికి విషసదృశములై తోచును. పప్పులో నేయి చూచి నచో నాతని హృదయమున శూలము గ్రుచ్చుకొనినట్లుండును. భోజనము చేయునప్పు డాతడు గిన్నెలవైపు జూచును - ఎక్కు వగ వండి పారవేయుచున్నదేమోయని! ఇంటిలో నచ్చ టచ్చట బియ్యపు గింజలు, పప్పుబద్దలు కనపట్టినచో నాతని మొదలు మండిపోవును! ఏమైన నేమి? ఆమె సౌందర్యము నకు వశభూతుండై పోయినాఁడు - నోటితో నామె నేమియు ననజాలఁడు.

కాని, నేఁడుమాత్ర మెందరివద్ద చేయిఁజాపినను అప్పు పుట్టక పోవుటచే నాతనికి కోపమువచ్చినది. ఇంటికే తెంచి భార్యపై కోపించినాడు - 'డబ్బంతయు ఖర్చుపెట్టినావు. ఇప్పు డెచటినుండి వచ్చును?'

'నేనేమైన పారవేసినానా?'

మాటపై మాట పెరిగి పోట్లాట ప్రారంభమైనది. గజాధరుడు కఠినముగనే మాటాడినాఁడు. చివఱి కామె తాకట్టు పెట్టుటకై తన కంటె తీసియిచ్చినది. అతడు లోలోన గొణిగి కొనుచు దానిని గొంపోయినాడు.

ఆమె జీవితమిదివఱకు సుఖముగ గడచినది. మంచి తిండి, మంచిగుడ్డలు లభించెడివి. వీధిలో అమ్మకపు కేకలు వినిపించినచో నా తట్టలు దింపించునంతవఱకు నామెకు నిద్ర పట్టదు. ఇంతవఱకు నామె తాను కొనిన పదార్థములను గజాధరునికిగూడ పెట్టెడిది. ఇప్పు డామె తా నొక్కతెయే తిను చున్నది.

మెల్లగ నామె సౌందర్యప్రశంస వీధియంతయుఁ బ్రాకినది. ఇరుగుపొరుగు స్త్రీ లామెను జూచుటకు రాఁదొడగిరి. ఆమె వారిని నీచదృష్టితో జూచును. సామాన్యముగ ఉన్నత కులములందలి పిల్లలకుండెడి ప్రవృత్తి యామెది. ఇరుగుపొరుగువా రామె యాధిపత్యమును కొలఁది దినముల లోనే యంగీకరించిరి. వారిమధ్య యామె రాణివలెనున్నది. ఇందువలన గర్వపూర్ణమైన యామె ప్రకృతికి మిక్కిలి యానందము లభించుచున్నది. ఆమె వారిముందు తన గుణము లను హెచ్చుగ ప్రదర్శించును. వారు తమ భాగ్యమును నిందించుకొనుచు నామె యదృష్టమును కొనియాడుచుందురు. వారెవరినైనను నిందించినచో నామె వారికి నీతిని బోధించును. ఆమె తన పుట్టినింటినుండి తెచ్చుకొనిన పట్టుచీరలు కట్టుకొని

వారిముందు కూర్చుండును. పట్టురవికలు చిలుకకొయ్యకు తగిలించును. ఆమె మాటలకంటెను, ఈ ప్రదర్శన ప్రభావము వారిపై నెక్కువగ పనిచేయును. వస్త్రాభూషణాదికములందు వారు సుమన్ అభిప్రాయమునకే యెక్కువ విలువ నిత్తురు. ఆమె నిష్కామభావముతో వారికి సలహాలిచ్చును, కాని తన మనసులో మాత్రము మిక్కిలి దుఃఖించుచుండును. వారందరు క్రొత్త క్రొత్త నగలు చేయించుకొనుచున్నారని, క్రొత్తచీరలు కొనుచున్నారని, తనకు తిండికిగూడ గతిలేదని లోలోన బాధపడుచుండును. 'ప్రపంచమున దరిద్రురాలను నేనొక్కతెనేనా?' యనుకొనును. ఆమె పుట్టినింట మానవుడు జీవితమున సమస్త భోగములు ననుభవింపవలెనను విషయ మును మాత్రమే నేర్చుకొనినది. మనసున సంతోష బీజా రోపణ మొనర్చునట్టి ధార్మికచర్చ నామె యెన్నడును విన లేదు, ధార్మికశిక్షణను పొందలేదు. ఆమె హృదయము అసంతోషముతో వ్యాకులపడుచునే యున్నది.

గజాధరు డీమధ్య యెక్కువ శ్రమపడుచున్నాడు. ఫ్యాక్టరీనుండి వచ్చినంతనే వేఱొక దుకాణపులెక్కలు వ్రాయుటకేఁగును. అచటినుండి రాత్రి 8 గంటలకు వచ్చును. ఇందువలన నాతనికి మఱొక 15 రూపాయలు లభించుచున్నవి. అయినను నాతనికి తన యార్థికస్థితియందు భేదము కన్పట్టుట లేదు. సంచయశీలమైన ఆతనిహృదయము 'తిండికి గుడ్డకుసరి' యను స్థితికి దుఃఖించుచుండెను. పైగా భార్య తనదురదృష్టము నకు నిత్యము నేడ్చుచు నాతనిని మఱింత హతాశు నొనరించు

చున్నది. ఆమె హృదయము తన యెడల శిథిలమైపోవు చున్నదని యాతడు స్పష్టముగ గ్రహించుచున్నాడు. తన ప్రేమపూర్ణమైన వాక్కులకంటె మిఠాయిపొట్లము లామె కెక్కువ సంతోషమును కలిగించునని యాతఁ డెఱుఁగడు. అందువలన, ప్రేమవలన-పరిశ్రమవలన ఫలము కలుగకపోవుటచే నాతడద్దానిని శాసనాధికారములతో పొందదలఁచినాడు. ఈవిధముగ త్రాడు రెండువైపులనుండి బిగిసినది.

మన శీలమెంతటి దృఢమైనదైనను గావచ్చును. కాని దానిపై సాంగత్య ప్రభావము తప్పక పొడసూపును. ఆమెతో కలిసి మెలిసి తిరుగునట్టి స్త్రీలందరును తమ భర్తలను ఇంద్రియ సుఖోపభోగమునకు వలసిన యంత్రములుగనే భావించువారు. భర్త యెట్లున్ననుసరే! ఎట్టివాడైననుసరే! భార్యకు నగలు చేయించవలె, మంచి చీరలు కొనిపెట్టవలె, పంచభక్ష్య పర మాన్నము లొసంగవలె; ఇట్టి సామర్థ్యములేని వానికి వివాహము చేసికొను అధికారమే లేదు. అట్టివాడు ప్రేమాదరము లకు యోగ్యుడు కాడు; సుమన్ సైత మిట్టిశిక్షణనే పొందినది. ఎన్నడైన గజాధరు డామెపై కోపించినచో నామె పురుష ధర్మముపై నొక బ్రహ్మాండమైన యుపన్యాసమును, ఉపదేశ మును ప్రారంభించును.

ఆ వీధిలో రసికులైన యువకులకు, తిరుగుబోతులకు లోటులేదు. స్కూలుకు పోవునప్పుడు, తిరిగి వచ్చునప్పుడు విద్యార్థు లామె గుమ్మముపైపు రెప్పవాల్పక చూచుచు పోవుచుందురు. కొందరు తిరుగుబోతులు రాధాకృష్ణుల

ప్రణయగీతములఁ బాడుచు నిటునటు తిరుగుచుందురు. ఆమె యేపనియందున్నను తెరమాటుననుండియే వారికి తనముఖము నొక్కసారి చూపును. ఆమె చంచల హృదయమున కీ తొంగి చూచుటలు అంతులేని ఆనందమును గొల్పును. దుష్టభావనా ప్రేరితమైకాదు; తన యౌవనకాంతిని చూపుటకొఱకు, ఇత రుల హృదయముపై విజయమును సాధించుటకే యీ వినోద క్రీడ పరిమితము!

# 6

సుమన్ యింటి కెదురుగ భోలీయను వేశ్య యొకతె యున్నది. ఆమె నిత్యము సింగారించుకొని తన గదిముందు వసారాలో గూర్చుండును. అర్ధరాత్రి వఱకు నామె యింటిలో నుండి మధుర సంగీతనాదము వినిపించుచుండును. అప్పుడప్పు డామె స్వారిబండిలో షికారు కేఁగును. సుమన్ ఆమెను అసహ్యభావముతో జూచుచుండును.

భోలీ యనేక పర్యాయములు ద్వారయవనిక వెనుక నిలబడియున్నప్పుడు సంజ్ఞ చేసి సుమన్‌ను పిలిచినది. కాని యామె యావేశ్యతో మాట్లాడుట యవమానకరమని యెంచి నది. ఆ వేశ్యకంటె తాను శ్రేష్ఠురాలని యామె భావము. తాను దరిద్రురాలు కావచ్చును; దీనురాలు కావచ్చును, కాని, తన మర్యాదను మాత్రము కోల్పోలేదు. పెద్దమను ష్యుల యింటికేఁగుటకును తన కభ్యంతరముండదు. తన నెవరును నీచముగ జూడరు. ఆ వేశ్య యెన్నిభోగవిలాసము లనుభవించుచున్ననేమి? ఆమె నెవ్వరును గౌరవింపరు. కాని,

కొలఁది దినములకే యా వేశ్య తా ననుకొనినంతటి నీచురాలు కాదనియు, తన కంటె నామెయే గొప్పదనియు తెలిసిపోయినది.

ఆషాఢమాసము - ప్రారంభదినములు. ఎండవలన సుమన్‌కు ఊపిరాడుటలేదు. సాయంసమయమున కామె యుక్కబోతను సహింపలేకపోయినది. ఆమె ద్వారయవనికను తొలగించి గుమ్మమువద్ద కూర్చుండి విసరుకొనుచున్నది. భోలీ యింటిముం దేవియో యుత్సవపుటేర్పాట్లు జరుగుచుండుటను చూచినది. ఇంతలో నా వేశ్య దృష్టి సుమన్ యింటిపై బడినది. ఆమె సుమన్‌వద్దకు వచ్చి 'నేఁడు మాయింటివద్ద మహమ్మద్ జన్మోత్సవము జరుగును. చూడదలచినచో పర్దా యేర్పాటుచేయుదును' అనినది.

'నేనిచట కూర్చుండియే చూతును' సుమన్ నిర్లక్ష్యభావముతో ననినది.

'చూడగలవు! కాని వినజాలవుగదా! పర్దా పర్పాటు చేయుదును. అభ్యంతరమేమున్నది?'

'నాకవి వినవలెనను నుత్సాహమంతగా లేదు.'

ఆ వేశ్య కరుణదృష్టితో జూచి - 'యీ యమాయకురాలు తనలో నేమనుకొనినదో! సరే! నే నెవతెనో నేఁడు తెలిసికొనునుగాక!'యని మనసులో ననుకొని వెడలిపోయినది.

చీకటిపడుచున్నది. సుమన్‌కు ప్రొయ్యివద్ద కేఁగుటకు మనసొప్పుటలేదు. అసలే శరీరము తపించిపోవుచున్నది. ఆ వేడినికూడ నెట్లుసహింపగలదు? కాని, కొంతసేపాలోచించి

లేచినది. ప్రొయ్యి వెలిగించి యెసరుపెట్టి మజిల గుమ్మము వద్ద కేతెంచి తమాషా చూచుచున్నది. ఎనిమిదిగంటలగు నప్పటికి గ్యాసులైట్లతో నా యిల్లు దేదీప్యమానమైనది. రంగుకాగితపు తోరణము లా వెలుగులో మఱింత ప్రకాశించు చున్నవి. నలువైపులనుండి దర్శకు లేతెంచుచున్నారు. ఒక గంటసేపటికి ముందుదొడ్డి యంతయు నిండిపోయినది. వందల కొలఁది జను లేతెంచినారు. పిమ్మట మాలానాగారి బండి వచ్చినది. ఆతని ముఖమున ప్రతిభ వ్యక్తమగుచున్నది. ఆయన సమ్యగలంకృతమైన వేదికపై పడకకుర్చీలో గూర్చుండెను. జన్మోత్సవము ప్రారంభమైనది. అనేకులు అతిధుల గౌరవ సత్కారములందు నిమగ్నులై యుండిరి. ఇట్టి నాగరక పురుషుల యుత్సవ సమావేశములను సుమన్ ఇదివఱకెన్నఁడును జూచి యుండలేదు.

తొమ్మిది గంటలకు గజాధరుడింటికి వచ్చినాడు. భోజనమొనర్చి యాతఁడును పోయి యా యుత్సవ సమూహమున గూర్చుండెను. సుమన్‌కు తిండిగోడవయే లేదు. రాత్రి పంద్రెండు గంటలవఱకు నచటనే కూర్చుండియున్నది. ఉత్సవము సమాప్తమైనది. ఫలహారములు పంచిపెట్టఁబడినవి. సభ సమాప్తమైనది. గజాధరుడింటికి వచ్చినంతనే 'అచట కూర్చుండిన వారందరు నెవ'రని యడిగినది.

గజా:- 'నేను వారందరిని యెఱుగను. మంచివారు చెడ్డవారు అందరున్నారు. పట్టణములోని గొప్పవారు చాల మంది యున్నారు.'

'వీరికొక వేశ్యయింటి కేఁగుట కవమానముతోఁచలేదా ?'

'అవమాన మనుకొనినచో నెందుకు వత్తురు?'

'మీకచటి కేఁగుటకు సంకోచము కలిగియుండు నను కొందును?'

'ఇంతమంది పెద్దలు వెళ్ళినప్పుడు నాకు సంకోచ మెందులకు?'

'వేశ్యలను మిక్కిలి యసహ్యముగ జూతురనుకొను చున్నాను.' ఆమె యాలోచనాపూర్ణమైన భావముతోనన్నది.

'అవును ! అటువంటివారు చాలకొద్ది. కాని, యీ యింగ్లీషు చదువు మనుష్యులను మిక్కిలి యుదారుల నొనర్చి నది. వెనుకటివలె వేశ్యలను తిరస్కరించుటలేదు. పైగా భోలీబాయికి పట్టణములో గొప్ప పేరున్నది-గౌరవమున్నది.'

గజాధరుడు పగలంతయు పనిచేసి అలసియున్నాడు. మంచముపై పరుండినంతనే నిద్రపట్టినది. కాని, ఆమెకు మాత్రము చాలసేపటివఱకును నిద్ర పట్టలేదు.

మరునాడామె యవనిక తొలగించి చూచినంతనే భోలీ డాబాపై గూర్చుండియున్నది.ఆమె ముందువసారాలోని కేతెంచి భోలీబాయితో - 'రాత్రి మీ యింట్లో చాలా సందడిగా నున్నది!' అనినది.

తానే జయించితి ననుకొనినది భోలీబాయి. చిరు నవ్వుతో - 'అవును ! మీకు మిఠాయి పంపుదునా ? బ్రాహ్మ ణుడు తెచ్చినాడు బజారునుండి.' అనినది.

సంకోచముతో సుమన్ అనినది - 'సరే! పంపండి.'

# 7

సుమన్ అత్తవారింటికి వచ్చి సంవత్సరము దాటి పోయినది. ఆమెకు పుట్టినింటి కేఁగు అదృష్టము కలుగలేదు. అచటినుండి ఉత్తరములు వచ్చుచుండెడివి. నన్నుగురించి చింతింపవలదని, సుఖముగా నున్నానని, సుమన్ తన తల్లికి ఉత్తరములు వ్రాయుచుండెడిది. కాని యిప్పుడామె యుత్తరములన్నియుఁ దన విపత్కథలతో నిండిపోవుచున్నవి.

ఆమె తన పొరిగింటి అమ్మలక్కలతో తన పుట్టినింటిని గూర్చిన గొప్పలు చెప్పుకొనుట మానివేసినది. తన భర్తను ప్రశంసించుచుండిన యామె నేఁడాతనిని నిందించుట మొదలు పెట్టినది. 'నన్ను తలఁచుకొనువారే లేరు. పుట్టినింటివారు చనిపోయిన దనుకొనినారు. ఇంటివద్ద నన్నియు నున్నవి. కాని నా విషయ మెవరికిఁగావలె? నే నిచట అష్టైశ్వర్యము లనుభవించుచున్నా ననుకొనుచున్నారు. ఇచటి నా యవస్థలు నాకే తెలియును.' ఇది నేటి యామె ధోరణి.

భర్త యెడల నామె ప్రవర్తనమిప్పుడు శుష్కముగ, నీరసముగ నున్నది. తన ప్రస్తుతస్థితి కాతనినే బాధ్యునిగ జేసి కొనినది. ఆమె చాల ప్రొద్దుపోయి లేచును; రెండు మూడు రోజుల కొకసారియైనను నిల్లు యూడువదు. ఒక్కొక్కనా డాతడు భోజనము చేయకుండనే యుద్యోగమునకు పోవలసి వచ్చుచుండెను. ఇట్టిమార్పు వచ్చుటకుఁ గారణమేమియో యాతనికిఁ దెలియదు.

సుమన్‌కు తన ఇల్లు నచ్చుటలేదు. మనసు యెల్లప్పుడును విసుగుగనుండును. పగలంతయు నిరుగుపొరుగు యిండ్లలో పెత్తనములు చేయుచుండును.

ఒకనాడు రాత్రి యెనిమిదిగంటలకు గజాధరు డింటికి వచ్చినాడు - తలుపు వేసియున్నది. ఈ రాత్రివేళ యెచటి కేగినదో యనుకొనుచు తలుపుతట్టినాడు - ప్రక్కయింటిలో నున్నచో విని లేచివచ్చునుగదా యని! ఆమె విషయమేమియో నేడు తేల్చుకొనవలెనని నిశ్చయించుకొనినాడు. ఆ సమయమున నామె భోలీబాయి మేడపైగదిలో కూర్చుండి మాటాడు చున్నది. భోలీబాయి యామెను నేఁ డెంతయో బలవంతము చేసినది. ఎట్లు కాదనగలదు? తలుపు తట్టుట విని గబగబ యింటికి వచ్చినది. ఆమాటల సందడిలో నెన్నిగంటలైనదో యామెకు గుర్తురాలేదు - ఎంతప్రొద్దుపోయినదో స్పృహ లేదు. ఆమె గబగబ తలుపుతెఱచి దీపమువెలిగించి పొయ్యి రాజేయసాగినది. ఆమె మనస్సు తన యపరాధము నంగీకరించుచున్నది. గజాధరుడు కోపముతో నడిగినాడు - 'నీవింత ప్రొద్దుపోవువఱకు నచట కూర్చుండి యేమిచేయుచున్నావు? మానాభిమానములు పూర్తిగ వదలివేసినావా?'

దైన్యభావముతో నామె సమాధానమిచ్చినది - 'ఆమె యనేకపర్యాయములు పిలిచినది. అందుచే వెళ్ళినాను. గుడ్డలు మార్చుకొనండి. వంట కావచ్చినది.'

'నన్ను అడుగకుండ నీ వచటి కెందుకు వెళ్ళినావో ముందు చెప్పుము! నన్ను పూర్తిగ మట్టిబొమ్మక్రింద జమ

కట్టినావా? నీకు మానాభిమానములను గూర్చిన ఆలోచన మున్నదా?'

'ఆమె యింటి కేగుటలో నేమైన హానియున్నదా? అనేకులు పెద్దలే వెళ్ళుచున్నప్పుడు నాదొక లెక్కయా?'

'పెద్దలు వెళ్ళవచ్చునుగాక! నా భార్య యొకవేశ్యతో కలిసి మెలిసి తిరుగుటను నేను చూడజాలను. ధనమున్నంతనే గొప్పవా రగుదురా? ధర్మమహాత్మ్యము ధనముకంటెను గొప్పది. నీ వా నాటి జనసముదాయమును జూచి భ్రమపడి యుందువు. ఆ వచ్చినవారిలో సజ్జనుడొక్కడును లేడని యెఱుంగుము. ఈనాడు చెప్పుచున్నాను - ఇకనుండి యా యింటి కెన్నడును వెళ్ళవద్దు! వెళ్ళితివా మాటదక్కదు!'

ఆమె మనసున కీ మాటలు నచ్చినవి. అవును! ధనికు లందరును వేశ్యలకు దాసులే! ఈ విషయము భోలీయే చెప్పి నది. తానే పొరపాటు చేసినది!

ఈ యాలోచనమువలన నామెకు చాల సంతోషము కలిగినది. వా రందరును విషయవాసనాలంపటులనియు, నీచు లనియు నామెకు విశ్వాసము కుదిరినది. ఆమె కిప్పుడు తన స్థితి దుఃఖపూర్ణముగ కన్పట్టుటలేదు. భోలీకంటె తాను గొప్ప దాన ననుకొనుట కిప్పుడొక యాధారము దొరికినది.

ఆమెయందిప్పుడు ధార్మికనిష్ఠ జాగృతమైనది. భోలీపై తన ధార్మిక ప్రభావమును ముద్రించుట కామె నిత్యమును గంగాస్నానము ప్రారంభించినది. రామాయణము తెప్పించి యప్పుడప్పుడిరుగుపొరుగువారి కందలి గాథలను వినుపించు

చున్నది. ఒక్కొక్కప్పుడు తానే బిగ్గరగ చదువుకొనును. దీనివల నామె యాత్మ కెట్టిశాంతి లభించుచున్నదో గాని మనసునకు సంతోషము కలుగుచున్నది. చైత్రమాసము. శ్రీరామనవమికి తన స్నేహితురాండ్రతో గలిసి యామె జన్మోత్సవముఁ దిలకించుట కొరకు గుడి కేఁగినది. గుడిలోని జను లిసుక వైచిన రాలనట్లున్నారు. మధుర సంగీతనాదము విని పించుచున్నది. సుమన్ కిటికీలోనుండి తొంగిచూచినది - భోలీబాయి పాడుచున్నది. ఆ సభలో నొకరికంటె నొకరు పెద్దలనేకులున్నారు. వారిలో ననేకుల నామె నిత్యము గంగా స్నానమున కేతెంచుచుండ చూచినది. వారిని విద్వాంసులని ధర్మాత్ములని తలఁచుచున్నది. వీరందరును స్వర్గలోకమునకు జేరినట్లు తన్మయులై యున్నారు. భోలీబాయి వారిపై కటాక్షముఁ బఱపినంతనే రాధాకృష్ణ దర్శనమైనట్లు ముగ్ధులైపోవు చున్నారు. ఈ దృశ్య మామె హృదయమునకు బలమైన యాఘాతమును కలిగించెను. ఆమె యభిమానము చెల్లాచెదరై పోయెను. ఆమె గట్టిగ కాలుమోపి నిలబడియున్న ఆధారము పాదములక్రిందనుండి తొలఁగిపోయినది. ఆమె యచట నొక క్షణమైనను నిలువలేకపోయినది. ఆ వేశ్యముందు ధనమేకాదు, ధర్మముసైతము తల వంచుచున్నది - ఆమె దయను కోరు చున్నది. ధర్మాత్ములామె నాదరించుచున్నారు.

సుమన్ లోనికేతెంచి రామాయణమును వస్త్రమున కట్టి మూల బెట్టినది. గంగా స్నానములు, వ్రతములపైనుండి యామె మనసు తొలఁగిపోయినది. కర్ణధారుడు లేని నౌకవోలె నామె జీవనము మరల పరిభ్రమింపసాగినది.

# 8

భార్యను సంతోషపెట్టుటకు గజాధరుఁడు తనచేతనైన దంతయుఁ జేసిచూచినాడు. కాని, యామె కోఱికె గగన సుమముల దెచ్చుట యాతనిశక్తికి మించినది.

ఇప్పుడాతని ముఖ్యమైన పెద్ద సమస్య తన యిల్లు మార్చుట.అతడింటికొఱకై పట్టణము నలుమూలలను గాలించు చున్నాడు. కాని అద్దె విని నిరాశుడై తిరిగి వచ్చుచున్నాడు.

ఒకనాడాతడు దుకాణమునుండి యెనిమిది గంటలకు తిరిగి వచ్చినాడు. భోలీ యాతని మంచముపై గూర్చుండి సుమన్‌తో నవ్వుచు మాట్లాడుచున్నది. ఆమెను గాంచినంతనే కోపముచే నాతని యధరము లదరినవి. భోలీ యాతనినిగాంచి తొందరగా బయట కేతెంచి – 'మీరు ఆ షాహుకారువద్ద గుమాస్తాలని నాకు తెలియదు. లేనిచో ఏనాడో జీతము పెరిగియుండెడిది.' అనినది.

ఈ మాటలాతనికి గాయముపై కారము చల్లినట్లైనవి.

సుమన్ ఆతనిని గాంచినంతనే యగ్ని ప్రజ్వరిల్లబోవు చున్నదని గ్రహించినది. ఆమె యందుకు సిద్ధపడియే యున్నది. గజాధరుడు తన కోపమును దాచలేదు. మంచముపై గూర్చుం డుచు ననినాడు – 'మఱల భోలీతో స్నేహము కలిపినా వన్నమాట? నే నా నాడు చెప్పితినిగదా!'

ఆమె సావధానచిత్తయై సమాధాన మిచ్చినది – 'ఆమె యస్పృశ్య కాదుగదా! శీలమునందు, స్వభావమునందు,

ఆమె యెవ్వరికిని తీసిపోదు. మానమర్యాదలం దామె యెవ్వరికంటెను తక్కువదికాదు. ఇంక నామెతో మాటాడు టకు సంకోచ మెందులకు? ఆమె మనవంటివారిని తనవద్ద నౌకరీకి నియమించుకొనగలదు !'

'మఱల నా యర్థములేని మాటలే ప్రారంభించినావు ! గౌరవమర్యాద లనునవి డబ్బువలన వచ్చునవికావు!'

'ధర్మమువలన వచ్చునుగదా ! ధార్మికు లామె నాద రించుచున్నారు. శ్రీరామనవమినా డామె గొప్ప పండిత మండలియందు ధార్మిక బృందమున పాడుటను చూచినాను. అందరు నామె ముఖమునే చూచుచున్నారు. ప్రజలామె నాదరింపకున్నను, ఆమెతో మాటాడుట తమ యదృష్టముగ భావించుచున్నారు గదా!'

'నీవు వారు పెట్టుకొనిన పెద్దపెద్ద కుంకుమ బొట్టులను, రుద్రాక్షమాలలను జూచి వారిని గొప్పవా రనుకొను చున్నావా? నేడు ధర్మమనునది ధూర్తులకు ఆచ్ఛాదనముగ నుపయోగపడుచున్నది. వారందరును పాషండులు. ఉజ్జ్వల మైన ధర్మమును కళంకిత మొనర్చువారు, ధర్మము పేరుతో డబ్బు సంపాదించువారు, ధర్మము పేరుతో భోగవిలాసము లనుభవించువారు. వారు పాపులు! భోలీ నాదరించువారు వారుకాక మరెవ్వరు?'

'నిజము చెప్పుచున్నారా? లేక నన్ను వారించుటకా?' సరళభావముతో నడిగినది.

గజాధరుడు కరుణాదృష్టితోఁజూచి – 'కాదుసుమన్! యదార్థమే యిది! మనదేశమున సజ్జనులు చాల అరుదు. కాని సజ్జనులు కొందరు దేశమున లేకపోలేదు. అట్టివారు, భోలీ యప్సరసయై వారివద్ద కేఁగినను కన్నెత్తి చూడరు.' అనినాడు.

సుమన్ మాటాడలేదు. ఆతని మాటలను గూర్చియే యాలోచించుచున్నది.

మరునాటినుండియు నామె గుమ్మమువద్ద నిలబడుట మానివేసినది. వీథిబేరగాండ్రు వచ్చి పిలిచి తిరిగి పోయెడివారు. గూండాలు పాటలు పాడుకొనుచు తిరిగి పోవుచుండెడివారు. ఆమె కిప్పు డెవరును కనిపించుటలేదు. భోలీ యనేక పర్యాయములు కబురుచేసినది. కాని తన మనస్సు బాగుండలేదనిచెప్పి తప్పించుకొనినది. రెండు మూడుసారు లామెయే స్వయముగ వచ్చినది. కాని, సుమన్ మనసువిప్పి మాటాడలేదు.

ఆమె యిరుగు పొరుగిండ్ల కేఁగుటగూడ మానివేసినది. వారిచటికి వచ్చుటగూడ తగ్గిపోయినది. రోజంతయు నామె తన గదిలోనే పడియుండును.

ఆ చీకటి గదిలో పడియుండుటవలన నామె స్వాస్థ్యము చెడిపోవుచున్నది. తల నొప్పి వచ్చుచుండును. ఒకప్పుడు జ్వరము మరొకప్పుడు గుండెలో దడ పుట్టి బాధించును. అజీర్ణ లక్షణములు కన్పట్ట సాగినవి. మామూలుపని యనినను భయమగుచున్నది. శరీరము క్షీణించి, పద్మమువంటి మోము వాడిపోయినది.

గజాధరునికి దిగులు పట్టినది.

ఈయపవిత్రమైన వాయువే యామె రోగమునకుఁ గారణమని యాతనికి దృఢాభిప్రాయమేర్పడినది. గుమ్మమువద్ద నిలబడవద్దని వారించినవాఁడు, గంగాస్నానమునకు-తిరునాళ్ళకు పోవద్దని వారించినవాఁడు, నేఁ డామెను గంగాస్నానమునకు వెళ్ళుమని బలవంతము చేయసాగినాఁడు. తానే ద్వారయవనికలను తొలగించుచున్నాఁడు. ఆతని బలవంతమువలన నామె నిత్యము గంగాస్నానము ప్రారంభించినది. వాడిపోయిన మొక్క సీరుతగిలి మరల చిగిర్చినది.

మాఘమాసము. ఇరుగు పొరుగు వారితో గలిసి యామె స్నానమున కేఁగినది. త్రోవలో 'వేణీ బా గ్' యున్నది. అందు అనేకరకములైన జీవజంతువులుండును. తిరిగి వచ్చునపు డందరును తోటలోని కేఁగి చూడవలెనని నిశ్చయించుకొనినారు. సుమన్ యింటికి వెళ్ళదలఁచినను స్నేహితురాండ్ర బలవంతము వలన తోటలోని కేఁగినది. చాల సేపటివరకు విచిత్రములైన జంతువులను చూచుచునలసి యొక బెంచిపై గూర్చుండెను. అకస్మాత్తుగ - 'ఎవరా బెంచిపై గూర్చున్నది? లెమ్మచటినుండి! నీకొరకేనా ప్రభుత్వమువా రా బెంచివేయించినది?' అను కేకలు వినిపించినవి.

ఆమె వెనుకకు తిరిగి కాతర దృష్టితోఁ జూచినది. ఆ యుపవనరక్షకు డామెను డబాయించుచున్నాఁడు.

సుమన్ సిగ్గుపడి లేచి, ఆ యవమానమును కప్పిపుచ్చుకొనుటకై పక్షులను చూడసాగినది. ఇంతలో నొక బాడుగ

బండి యీ జంతు ప్రదర్శనశాలవద్ద నాగినది. ఆ యుపవనరక్షకుడు, పరుగున నా బండివద్దకేఁగి తలుపులు తెఱచినాడు. బండి నుండి యిరువురు స్త్రీలు దిగిరి. అందొకతె భోలీబాయి! సుమన్ చెట్టుచాటున దాగినది. వారిరువురును తోటలో విహరించుచుండిరి. కాపలావాడు వారివెంట సేవకునివలె తిరుగుచున్నాడు. కొంతసేపైన తరువాత వారిరువురును సుమన్‌ను లేపిన బెంచిపై గూర్చుండిరి. ఉపవనరక్షకుడు వారి ప్రక్కనే వినయ విధేయతలతో చేతులు జోడించి నిలఁబడి యున్నాడు. ఆదృశ్యమును గాంచినంతనే సుమన్ నేత్రములనుండి క్రోధాగ్ని స్ఫులింగములు వెలువడినవి. ఆయిరువురు వేశ్యలును వెడలి పోయినతరువాత సుమన్ సింహివోలె పరుగున కాపలావాని యెదుటికేతెంచి క్రోధవికంపిత స్వరముతో ననినది – 'ఏమి? నీబాబుదైనట్లు నన్ను బెంచిపైనుండి లేపినావు! ఆయిరువురు వేశ్యల నేమియు ననలేదేమి?'

ఉపవనరక్షకుడు అవమానితుడైనట్లు – 'వారును నీవును సమానమా!' అనినాడు. సుమన్ హృదయముపై నీవాక్యము అగ్నిపై నాజ్యముపోసినట్లయినది. పండ్లు కొరుకొొచు ననినది. నోరుమూయుము! మూర్ఖుడా! డబ్బుకొఱకై వేశ్యలచెప్పులు మోయుటకు సిగ్గులేదా? ఇదిగో! చూడు! నీయెదుటనే యీ బెంచిపై గూర్చుందును ఏమిచేతువో నేనును చూతును!'

ముందాతఁడు కొంచెము భయపడినాఁడు. కాని ఆమె బెంచిపై గూర్చుండినంతనే యామెను లాగివేయుటకై ముందునకు సాగినాఁడు. కాని, యామె సింహివలె నగ్నిగోళములవంటి

నేత్రములతో వీక్షించుచు నిలువబడినది. ఆమె మడమలు పైకెగురుచున్నవి. ఎక్కిళ్ళయావేగమును బలాత్కారముగ నాపుటచే నోట మాట వచ్చుటలేదు.

ఇంతలో నొక బండివచ్చి యచట నాగినది. రక్షకుడు సుమన్‌పైఁ జేయిజేసికొన నుంకించునంతలో నాబండినుండి యొక పెద్దమనిషి పరుగునవచ్చి కాపలావాని నొక్కతోపు త్రోసి – 'ఏమిరా! వెధవా! ఆమె చేయి పట్టుకొనుచున్నా వేమి? దూరముగ నుండుము!' అనెను.

కాపలావాడు వెనుకకు తగ్గినాడు. ముఖము వెలవెల బోయినది. బిక్కమొగముతో చేతులు జోడించినాడు. ఇంతలో బండిలో గూర్చుండియున్న మహిళ తనవద్దకు రమ్మని సంజ్ఞచేసి సుమన్‌ను పిలిచినది. ఇరువురకును పరిచయమైనది. ఆమె పేరు సుభద్ర. ఆమెకూడ సుమన్ వీధిలో కొంచెము దూరముగా నివసించుచున్నది. భార్య భర్తలిరువురును గంగాస్నానమొనర్చి వచ్చుచున్నారు. అచటికి వచ్చుప్పటి కామె భర్త, కాపలావాడు సుమన్‌పై చేయి చేసికొన నుంకించుచుండుటను చూచి పరుగెత్తుకొని వచ్చినాడు.

సుమన్ సౌందర్యమునకు, మాటలకు ముగ్ధయై సుభద్ర యామెను తన బండిలో నెక్కించుకొనినది. ఆమె భర్త బండి తోలువాని ప్రక్కకుబోయి కూర్చుండెను. బండి బయలుదేరినది. విమానముపై నెక్కి స్వర్గలోకమునకు బోవుచున్న ట్లనిపించినది సుమన్‌కు. సుభద్రయొక్క నమ్రస్వభావమునకు,

సరళవ్యవహారమునకు, వినయపూర్ణమైన సంభాషణమునకు ఆమె హృదయము పులకితమైనది. త్రోవలో తన స్నేహితురాండ్రవైపు మీ కెన్నడైనను నిట్టి యదృష్టము పట్టునా యనునట్లు చూచినది. ఈ గర్వముతోబాటు వీరు తన యింటిని జూచినచో నేవగించుకొందురేమో యను భయము గూడ కలిగినది. ఈమె యెంతటి యదృష్టవంతురాలు! ఈమె భర్త నిజముగ దేవునివంటివాడు! ఈయన వచ్చి యుండక పోయినచో నచట నాగతి యేమయ్యెడిదో! ఎంతటి సౌజన్యము! ఆమె యిట్లాలోచించుచుండగనే యామె యిల్లు వచ్చినది. ఆమె సంకోచముతో సుభద్రతో ననినది – 'బండి నాపింపుడు! మాయిల్లు వచ్చినది.'

సుభద్ర బండి నాపించినది. సుమన్ దిగబోవుచు సజల నేత్రములతో నామెవైపు జూచి – 'ఇంత ప్రేమను జూపి, చివఱకు నన్ను మఱచిపోకుడు! నా ధ్యాస యెప్పుడును మీమీదనే యుండును' అనినది.

'కాదు సోదరీ! అట్లెన్నడును జరుగదు. నీతో సరిగ మాటాడుటకైనను వీలు పడలేదు. నిన్ను రేపు మా యింటికి పిలిపించుకొందును.'

సుమన్ బండినుండి దిగినది. బండి వెడలిపోయినది.

ఆమె తన యింటిలో నడుగిడినంతనే యేదో యానంద పూర్ణమైన స్వప్నమును జూచి మేల్కొనినట్లైనది.

'ఈ బండి యెవరిది?' అని యడిగినాడు గజాధరుడు.

'ఎవరో ప్లీడరుగారట! జేసీబాగ్‌లో వారి భార్యతో పరిచయము కలిగినది. బలవంతము చేసి తన బండిలో నెక్కించుకొని వచ్చినది.'

'అయిన ప్లీడరుగారితోబాటు బండిలో గూర్చుంటి వన్నమాట!'

'ఏమిమాటలవి? పాపమాయన బండివాని ప్రక్కన కూర్చుండెను. ఇరువురును నిజముగా సౌజన్యమూర్తులు!'

'సరే! బాగుగనే యున్నది! పోయి ప్రొయ్యి వెలిగింపుము! చాలు నీ వర్ణనలు!'

'మీరు వకీలుగారి నెఱిఁగియే యుందురు!'

'ఈ వీధిలో పద్మసింహు డొక్కడే వకీలున్నాడు. ఆయనయే యైయుండును.'

'పెద్దప్లీడరా?'

'నేనేమియు నాతని జమాఖర్చులు వ్రాయుటలేదు! త్రోవలో నెప్పుడైనను చూచుచుందును. మంచివాడే!'

వకీలుకు సంబంధించిన విషయ చర్చ గజాధరునికి రుచించుటలేదని సుమన్ కనిపెట్టినది. గుడ్డలు మార్చుకొని వంట ప్రారంభించినది.

# 9

**మ**రునాడు సుమన్ స్నానమునకుపోలేదు. లేచినప్పటి నుండియు తన పట్టుచీర తీసి మరమ్మతు చేయుచున్నది.

రెండు జాములకు సుభద్రయింటి దాసి యామెను గొనివెళ్ళుటకు వచ్చినది. సుమన్ తనకొఱకు బండి వచ్చు ననుకొనినది. ఆమెకు చిన్నతనము కలిగినది. తాను భయపడి నట్లే జరిగినది.

ఆమె దాసితోగూడ సుభద్రయింటి కేఁగినది. అచట రెండుమూడు గంటలసేపు కూర్చుండినది. ఆమె కచటినుండి లేచుటకు బుద్ధి పుట్టలేదు. సుమన్ తన పుట్టినింటివారి విష యము లన్నియు నామూలాగ్రముగ చెప్పుచుండ సుభద్ర తన యత్తవారింటి విషయములు చెప్పుచున్నది.

వా రిరువురి స్నేహమును వృద్ధి కాఁజొచ్చినది.సుభద్ర గంగాస్నానమున కేఁగునప్పుడు సుమన్నుగూడ వెంటబెట్టు కొనిపోవును. సుమన్కుగూడ దినమునకొక పర్యాయము సుభద్ర యింటి కేఁగకున్నచో తోఁచదు.

సుభద్ర యేదైన పని చేయవలెనన్నచో సుమన్ తానే స్వయముగ నా పనిని చేయుచుండును. ఒకప్పుడు పద్మసింహు నికి ఫలహారము తయారుచేయును, మరొకప్పుడు తమలపాకులు చుట్టి పంపును. ఈ పనులం దామె కెట్టి యాలస్యమును పట్టదు. ఆమె దృష్టిలో సుభద్రవంటి సుశీల, పద్మసింహునివంటి సజ్జనుడు వేఱొకరు లేరు.

ఒకసారి సుభద్రకు జ్వరము వచ్చెను. సుమన్ నిముష మైనను నామె మంచమువద్దనుండి లేవలేదు. కొలఁదిసేపు మాత్రమే తనయింటికేఁగి వంటచేసి మఱల పరుగెత్తుకొని వచ్చును. కాని, గజాధరుని కామె మాటలనిన మంట. అతనికి

సుమన్‌పై నమ్మకము లేదు. అతఁడు సుభద్ర యింటికి వెళ్ళ వద్దనును, కాని సుమన్ వినదు.

ఫాల్గుణమాసము. హోలీపండుగకు గుడ్డల విషయమైన యాలోచనము పట్టినది సుమన్‌కు. ఈమధ్య నెలదినముల క్రిందటనే సాహుకారు గజాధరుని యుద్యోగమునుండి తీసి వేసినాఁడు. ఇప్పు డాతనికి ఫ్యాక్టరీలోని 15 రూపాయలే ఆధారము. ఆమె యనేక పర్యాయములు సిల్కుచీర, మఖ మల్ జాకెట్టు కావలెనని, చెప్పినది కాని గజాధరు డిదిగో యదిగో యని తప్పించుకొనుచున్నాఁడు. ఈ పాతపీలికలతో హోలీయుత్సవమున సుభద్రయింటికేఁగి యెట్లు పాల్గొందునని యామె చింత.

ఈలోపున సుమన్ తల్లి స్వర్గస్థురాలైనదని వార్త వచ్చినది. ఈ వార్తవలన సుమన్‌కు కలుగవలసినంత దుఃఖము కలుగలేదు. ఆమె హృదయ మేనాడో తల్లికి దూరమైపోయి నది. కాని, యీ వార్తవలన హోలీపండుగ దుస్తులనుగూర్చిన చింతనుండి నివృత్తయైనది. ఆమె సుభద్రతో ననినది — 'అక్కయ్యా! నే ననాథనైపోతిని. నాకిపుడు నగలు, గుడ్డల వైపు చూడ బుద్ధి పుట్టుటలేదు. అనుభవించినదే చాలును! ఈ దుఃఖము శృంగారాభిలాషనుగూడ పోగొట్టినది. ఈ వెధవ ప్రాణము శరీరమునుండి పోకున్నది. నా హృదయమందలి బాధ యెవరికని తెలియదు.' తన స్నేహితురాండ్రతోగూడ నిదే విధముగ ననినది.

ఒక నాఁడామె సుభద్రతోఁగూడ కూర్చుండి రామాయణము చదువుచున్నది. ఇంతలో పద్మసింహుఁడు సంతోషముతో వచ్చి – 'నేఁడు పందెము గెలిచినాను' అనెను.

సుభద్ర యౌత్సుక్యముతో – 'నిజమేనా?'యని యడిగినది.

'అరె! ఇంకను సందేహమా?'

'సరే! రానీయండి నా డబ్బు! అచటి పందెమువీఁది! ఇచటి పందెమునాది!'

'అవునవును! ఇత్తును! కొంచెమోపికపట్టుము! బ్రహ్మాండమైన ఆనందోత్సవము చేయవలెనని మిత్రులు పట్టుబట్టుచున్నారు.'

'అవును! చేయవలసినదే!'

'నేను విందు చేయదలచినాను. కాని, అందుల కెవరును సమ్మతించుటలేదు. వా రందరును భోలీబాయి నృత్యప్రదర్శనము కావలెననుచున్నారు.'

'వారి యిష్టప్రకారమే చేయుఁడు. వేలుకావుగదా! హోలీపండుగకూడ రానే వచ్చినది. హోలీనాఁడే యేర్పాటు చేయుఁడు. ఒకే ఖర్చుతో రెండు పనులును జరిగిపోవును.'

'ఖర్చు విషయముకాదు – సిద్ధాంతమునకు బంబంధించిన విషయమిది!'

'పోనిండు! ఈ సారికి సిద్ధాంతమునకు విరుద్ధమైనను సరే!'

'విఠల్‌దాసు అంగీకరించుటలేదు. అతడు నన్ను వదలడు.'

'అతనినట్లే వాగుకొననిండు! ప్రపంచమున నందరును నాతనివలె నుండజాలరుగదా!'

పద్మసింహు డనేక సంవత్సరముల విఫలప్రయత్నము తరువాత నేడు మునిసిపల్ మెంబరైనాడు. ఈ యానందోత్సవ సన్నాహములు జరుగుచున్నవి. అతడు విందుచేయ సంకల్పించినాడు. కాని మిత్రులు పాటకచేరీకై బలవంతము చేయుచున్నారు. విఠల్‌దాసు పద్మసింహుని ముఖ్యస్నేహితుడు. అతడు భోగము మేళములకు, వేశ్యల నృత్యప్రదర్శనములకు పరమ శత్రువు. పద్మసింహుడు నియమశీలియైనను తన సిద్ధాంతములపై స్థిరముగ నుండు సాహసములేదు. కొంత ఆడంబరము, కొంతవఱకాతని సరళస్వభావమే దీనికి గారణము. కొందఱు మిత్రులు విమర్శింతురను భయముతో నాతడు తన సిద్ధాంతముపై నిలిచి యుండలేడు.

చివఱ కాతడు వేశ్యాభక్తులైన మిత్రుల పక్షమునే యంగీకరించినాడు. భోలీబాయి నృత్యప్రదర్శనమే నిశ్చయమైనది.

నాలుగు దినముల పిమ్మట హోలీ పండుగ వచ్చినది. ఆనాటిరాత్రికి పద్మసింహుని ఆఫీసు వరండా నృత్యశాల రూపమున మారిపోయినది. చిత్రవర్ణములైన తివాచీలపై మిత్రులాసీనులైనారు. భోలీబాయి తన బృందము మధ్య

కూర్చుండి భావానుగుణముగ మధుర స్వరముతో పాడు చున్నది.

సుమన్, సుభద్ర యిరువురును ద్వారయవనికచాటున జేరి యీ యుత్సవమును తిలకించుచున్నారు. సుభద్రకు భోలీబాయిపాట నీరసముగను, పేలవముగను నున్నది. సుమన్ ఆమెకంటె రసజ్ఞురాలు. ఆమెకు గానముతోబాటు తాళ స్వర జ్ఞానముకూడ నున్నది. పాట వినిపించి నంతనే స్మృతి పట మున నంకితమైపోవుచున్నది.

కాని యీమె ధ్యానమంతయు పాటపైననేలేదు. వందలకొలఁది నేత్రములు భోలీబాయిపై కేంద్రీకరింపబడి యుండుట నామె చూచినది. ఆ నేత్రములందెంత తృష్ణ యున్నది! ఎంతటి వినమ్రత! ఎంతటి ఔత్సుక్యము! వారి కనుబొమలు భోలీ సంజ్ఞల ననుసరించి యెగురుచున్నవి! ఆమెదృష్టి యెవనిపై బడిన వాడు పులకితుడై పోవుచున్నాడు. ఆమె యెవనితో మాటాడిన వానికి కుబేరుని ధనమంతయు లభించినంత సంతోషము కలుగుచున్నది.

'ఈమెయందున్న మహేంద్రజాలమేమి?' యని యాలో చించుచున్నది సుమన్.

సౌందర్యమా? అవును! ఆమె రూపవతియగుటలో సందియములేదు. కాని, నేనును అందవిహీనను కానుగదా! ఆ గదిలోనొక నిలువుటద్దమున్నది. సుమన అద్దమువద్ద కేఁగి తన శరీరము నాపాదమస్తకమును చూచుకొన్నది. ఆమె మనసుపై నంకితమైయున్న భోలీరూపముతో తనప్రత్యంగమును

మును పోల్చి చూచినది. పిమ్మట సుభద్రవద్ద కేతెంచి - 'అక్కయ్యా! ఒక్కమాట యడుగుదును. కోపము రాదుగదా ! ఈయప్సరస నాకంటె నందముగ నున్నదా?' అనియడిగినది.

సుభద్ర కుతూహలముతో నామెవైపు చూచి చిరు నవ్వుతో - 'అట్లడుగుచున్నావేమి?' అనినది.

సుమన్ సిగ్గుపడినది - 'ఏమియులేదు. ఊఱక యడుగు చున్నాను, చెప్పుము!'

'ఆమె శరీరము కష్టమెఱుఁగనిది కాబట్టి కోమలముగ నున్నది. కానీ అందమున మాత్రము నీకు సాటిరాదు.'

సుమన్ ఆలోచింపసాగినది - 'అయిన, అలంకరణము లపై-వస్త్రములపై జనులింతగ ముగ్ధులగుచున్నా రన్నమాట. నేనును ఆమెవలె నలంకరించుకొనినచో, ఆమెవలె నగలు వస్త్రములు ధరించినచో నా సౌందర్యమింకను యినుమడింప కుండునా? నా యౌవనమింకను ప్రకాశింపకుండునా? కాని... నా కవి యెట్లు లభించును?

ఆమె స్వరలాలిత్యమున కిట్లు ముగ్ధులగుచున్నారా? ఆమె కంఠమున మార్దవములేదే! నా కంఠస్వరమంతకంటెను మెఱుఁగు! నాకెవరైనను ఒక నెలరోజులపాటు సంగీతము నేర్పినచో నంతకంటె బాగుగ పాడగలను. నేనును వంకర చూపులు, క్రీగంటి చూపులు చూడగలను. నేనును సిగ్గుతో కనులు క్రిందకు వంచి మందహాస మొనర్పగలను.'

సుమన్ చాల సేపటివఱకచట కూర్చుండి కార్యము నుండి కారణమును వెదకుచున్నది. చివఱకామె 'నా కాళ్ళకు

సంకెళ్ళున్నవి. ఆమెకాళ్ళు స్వతంత్రమైనవి.' అను పరిణామ మును చేరినది. ఆమె దుకాణము తెఱచియున్నది. అందు చేతనే గ్రాహకులట్లు మూగుచున్నారు. కొట్టుమూసి యుండు టచే నిచటికెవరును రారు. ఆమె కుక్కలు మొఱిగినను లెక్కచేయదు, నేను లోకనిందకు భయపడుదును. ఈ లజ్జయే- పరిహసింతురను భయమే నేనొకదాసినై యుండుటకు కారణ మైనవి.

అర్ధరాత్రి దాటినది. సభ సమాప్తమైనది. ఎవరి యిండ్లకు వారు వెడలిపోయినారు. సుమన్ కూడ తనయింటికి బయలుదేరినది. అంతయు చీకటిగనున్నది. ఆమె హృదయము నందు సైతము నిరాశాంధకారము వ్యాపించియుండెను. ఆమె యింటికి వెళ్ళుచున్నది. కాని చాల మెల్లగ నడచుచున్నది- గుఱ్ఱము సెలయేటివైపున కేగునట్లు.

గజాధరుడు మామూలుగ తొమ్మిదిగంటల కింటికి వచ్చినాడు. తలుపు వేసియున్నది. సుమన్ యెచటికేగినదా యని యాశ్చర్యచకితుడైనాడు. ప్రక్కయింటి ముసలమ్మ వలన సుభద్రయింటి కేదోపనిమీద వెళ్ళినదని తెలిసినది. తాళపుచెవులు ముసలమ్మయిచ్చినది. లోనికేగినాడు, భోజనము సిద్ధముగనున్నది. గుమ్మమువద్ద సుమన్ కొఱకు ప్రతీక్షించి నాడు. పదిగంటలైనది. సుమన్ రాలేదు. కోపముతో లోని కేగి అన్నము వడ్డించుకొనినాడు. కాని, కోపమువలన ముద్ద లోనికి పోలేదు. అన్నమంతయు బయట పారవేసి తలుపులు మూసికొని పండుకొనినాడు. ఆమె వచ్చి యెంత తలబ్రద్దలు

కొట్టుకొనినను తలుపు తెరువగూడదని నిశ్చయించుకొనినాడు. 'ఎచటి కేఁగునో చూతునుగాక!' యనుకొనినాడు. కాని యాతనికి చాలా సేపటివఱకు నిద్రపట్టలేదు. ఏమాత్రము చప్పుడైనను నాతడు కన్నుపుచ్చుకొని తలుపువద్ద కేతెంచును. ఆసమయమున సుమన్ వచ్చియున్నచో చావగొట్టెడివాఁడే! కాని, పదునొకండు గంటలకాతనికి నిద్రపట్టినది.

సుమన్ తన గుమ్మమువద్ద కేతెంచునప్పటికి ఒంటిగంట వినిపించినది. ఆధ్వని యామె నరనరములందును ప్రతిధ్వనించినది. ఇంతవఱకు నామె పది, పదునొకండు గంటలై యుండునని యనుకొనినది. ప్రాణము లెగిరిపోయినవి. తలుపు సందులోనుండి చూచినది. దీపపుబుడ్డి వెలుగుచున్నది. ఆ పొగతో గది నిండియున్నది. చేతిలో కన్నుపుచ్చుకొని గజాధరుడు వెలికిలబడి గుఱకలు పెట్టుచున్నాడు. ఆమె హృదయము కంపింపసాగినది. తలుపు తట్టుటకు ధైర్యము చాలలేదు.

కాని, యీ సమయమున నెచటి కేఁగుదును? పద్మసింహుని యింటితలుపులుగూడ మూసివేయబడియుండును. నౌకర్లుగూడ నిద్రించియుందురు. బిగ్గరగా కేకలువేసినచో తలుపు తెఱతురు. కాని ప్లీడరుగా రేమనుకొందురు? అచటి కేఁగుట మంచిదికాదు. ఇచటనే యేల కూర్చుండగూడదు? ఒంటిగంట కొట్టనే కొట్టినది. మూఁడు నాలుగు గంటలలో తెల్లవారును. ఇట్లు తలఁచి యామె యచటనే కూర్చున్నది. కాని, మరొక భయముకలిగినది – నన్నిచట నెవరైన చూచిన

నేమనుకొందురు? ఎవరో దొంగ పొంచియున్నాడనుకొందురు. ఆమె నిజముగ తన యింటిలోనే దొంగవోలె నున్నది.

నే నెంత దురదృష్టవంతురాలను ! సాటివారందరును పట్టుపరుపులపై పరుండియుండ; దాసీజనము పాదము లొత్తు చున్నారు. నేనున్నాను – ఇచట కూర్చుండి నా యదృష్టమున కేడ్చుచున్నాను. నేనీదుఃఖముల నేల అనుభవించు చున్నాను? ఈ గుడిసెలో కుక్కిమంచముపై పండుకొను చున్నాను, పచ్చడిమెతుకులు తినుచున్నాను, నిత్యము తిట్లు చీవాట్లు సహించుచున్నాను. దీనికిఁ గారణమేమి? మర్యాదను పాలించుటకొఱకేగదా! కాని, ప్రపంచము నా యీ మర్యాద పాలనము నేమనుకొనుచున్నది? ప్రపంచపు దృష్టిలో దీని కేమైన విలువయున్నదా ? దసరా యుత్సవములందు, మొహరమ్ పండుగలలో, పూల్‌బాగ్‌లో, దేవాలయములలో, నన్నిచోట్లను ప్రపంచపు పోకడ నే నెఱుఁగనిదికాదు. నేటి వఱకును దుశ్చరిత్రులు మాత్రమే వేశ్యలవెంట తిరుగుచుందు రనుకొంటిని, కాని నేఁడుమాత్రము సచ్చరిత్రులు, సదాచార వంతులు సైతము వేశ్యలవెంట తిరుగుచుందురని తెలిసి కొంటిని. ప్లీడరుగారెంత పెద్దమనిషి? ఆయనసైతము భోలీపై ముగ్ధుడైనాఁడే !

ఈ విధముగ నాలోచించుచు నామె తలుపు తట్టుటకు లేచినది – 'ఏమగునో చూతును! ఇచట యేమంత సాముకొను చున్నానని ఈ విపత్తులను సహింపవలె ?' ననుకొనినది. కాని

మఱల గజాధరుని చేతిలోని కఱ్ఱను చూచినంతనే గుండె యదరినది. పశుబలము మానవుని పరాస్త మొనరించినది.

అకస్మాత్తుగ నామె, లాఠీలను భుజముపై నిడుకొని వచ్చుచున్న, ఇరువురు పోలీసులను చూచినది. చీకటిలో వారింకను భయంకరులై కన్పట్టినారు. సుమన్ గుండె యాగి పోయినట్లైనది. దాగుకొనుటకు చోటులేదు. ఇచటనే కూర్చుండియున్నచో పోలీసులకు తా నేమని సమాధాన మొసంగగలదు? ఆమె తటాలున లేచి తలుపు తట్టినది. కేక వేసినది—'రెండు గంటలనుండి పిలుచుచున్నాను. లేవ రేమి?'

గజాధరు ఉలికిపడినాడు. ఆతని తొలినిదుర పూర్తి యైనది. లేచి తలుపు తీసినాడు. ఆమె స్వరమునందు కొంత భయము, కొంత తొందర కన్పట్టినది. సుమన్ కృత్రిమక్రోధ ముతో ననినది—'ఓహో! ఏమినిద్ర! ఒడలుమఱచి నిశ్చింతగ నిద్ర పోవుచున్నారు! రెండు గంటలనుండి అఱచుచున్నాను. వినబడినగదా! చలికి కాలుసేతులు కొంకరలు పోవుచున్నవి.'

గజాధరుడు జంకుగొంకు లేకుండ—'నావద్ద వేషములు వేయకుము! రాత్రి యంతయు నెచటచున్నావో చెప్పుము!' అనినాడు.

'రాత్రి యంతయు నేమిటి? తొమ్మిది గంటలకు సుభద్రగారి యింటికి వెళ్ళినాను. విందుకు పిలిచినది. పది గంటల కచటినుండి తిరిగి వచ్చినాను. రెండు గంటలనుండి గుమ్మమువద్ద కేకలు వేయుచున్నాను. పంద్రెడు గంటలై

యుండు నేమో ! మీకు నిద్రలో నోడలు తెలియదాయె!' సుమన్ నిర్భయముగ ననినది.

'శుద్ధ అబద్ధము ! పండ్రెండు కొట్టుటను నేను వినియే పండుకొనినాను. ఇఁక నీ నటనలు నీ వేషములు నా వద్ద పనికి రావు ! ఇంతవఱకు నీ వెచట నున్నావో నిజము చెప్పుము! నీ వ్యవహారమంతయుఁ జూచుచునే యున్నాను. నేను గ్రుడ్డి వాడనుకాను. నేనును ఆడవాళ్ళ చరిత్రలు చదివినవాడనే ! సరిగా చెప్పుము ! లేదా జరగవలసినదేదియో జరిగి తీరవలసినదే!'

'ఒక పర్యాయము చెప్పితినిగదా పది పదకొండు గంట లకు వచ్చినానని! మీరు నమ్మకపోయిన నమ్మకపోవచ్చును! నాకు చేయించు నగలు చేయింపవద్దు ! దేనిని చూచుకొనిన కోపమో యేమో ! నిత్యము కారాలు మిరియాలు నూరు చుందురు!'

ఈ మాట లనుచుండ నామె శరీరమంతయు కంపించి నది. హద్దుమీరి పోవుచున్నాననిపించిన దామెకు. గుమ్మము వద్ద కూర్చుండియున్నపు డామె యనుకొనిన మాటలను, ఆమె నిశ్చయించుకొనిన విషయములను, మఱచిపోయినది. లోకాచారములు, మన హృదయమున పాదుకొనియుండు భావములు, మన జీవితమున నాకస్మిక పరివర్తనములకు తావొసంగవు.

ఆమె యనిన కటువచనముల కాతడాశ్చర్య చకితుడై నాఁడు. ఆమె యాతని నెదిరించుట కిదియే మొదలు !

'నీ యిష్టమువచ్చినట్లు నీ వొనర్చుచుండ నేను నోరెత్తకూడదని నీ యభిప్రాయమన్నమాట! రాత్రి యంతయు నెచటనోయుండి, యిప్పు డడుగగా నీ లెక్క యేమనుచున్నావు! పట్టణపుగాలి నీకును సోకినట్లు నా కర్థమైనది - నీవును స్నేహితురాండ్ర నడ్డము పెట్టుకొనుచున్నావు. ఈ ముండల సాంగత్యము వల దని, తిరునాళ్ళకు - ఉత్సవములకు పోవద్దని, యెన్నియో చెప్పినాను. కాని, నామాటపై లక్ష్యములేదు. రాత్రి యంతయు నీ వెచటినుంటివో చెప్పిననేగాని యింటిలో నుండ నీయను. చెప్పనిచో నీకును నాకును నెట్టి సంబంధమును లేదు. నీ యిష్టమువచ్చినట్లు చేయుము!'

'వకీలుగారింటికి తప్ప మఱెచటికిని వెళ్ళలేదు. మీకు నమ్మకము లేకున్నచో వెళ్ళి వారి నడిగిరండు. ఎంత స్నేపైనను నచటనే యైనది. పాటకచేరీ జరిగినది. సుభద్రాదేవి కదలనీయలేదు.' సుమన్ కాతరభావముతో యనినది.

'ఓహో! ప్రస్తుతము వకీలుగారిపై మనసుపోయినదన్న మాట! అట్లు చెప్పుము! ఇంక ఈ కూలివానిపై లక్ష్యమెట్లుం డును?' గజాధరుడు దెప్పిపొడుపుగ ననినాడు.

ఆమె రోషముతో - 'ఏమీటామాటలు? నిష్కార ణముగ నొక పెద్దమనిషిని నోటికివచ్చినట్లని అప్రతిష్ఠపాలు చేయుచున్నారు. నే డింటికి వచ్చుట యాలస్యమైనది కాబట్టి నన్నిష్టము వచ్చినమాటలనుము! తిట్టుము! కొట్టుము! మధ్యలో ప్లీడరుగారిని తీసికొనివచ్చు టెందులకు ? పాపమాయన నే నింటిలోనున్నచో నింటిలో నడుగుపెట్టరు' అనినది.

'చాలు! చాలు! నాకు నేర్పనక్కరలేదు. ఇటువంటి పెద్దమనుష్యులను చాలమందిని చూచినాను. ఆయన దేవుడు! ఆయన వద్దకే పొమ్ము! ఈ పూరిగుడిసె నీవుండుటకు తగినది కాదు. నీ సాహసము మితిమీరిపోవుచున్నది. ఇఁక నీకిచట సాగదు!'

మాటలు పెరిగిపోవుచున్నవని సుమన గ్రహించినది. ఏవిధముననైనను నామె తన మాటల నుపసంహరించుకొను టకు వీలున్నచో నుపసంహరించుకొనును. కాని వదలిన బాణము నుపసంహరించుటెట్లు? ఆమె యేడ్వసాగినది — 'ఆయనవైపు చూచియున్నచో నాకండ్లు పోవుగాక! ఆయ నతో మాటాడినచో నా నాలుక తెగిపోవుగాక! కొంఁచిసేపు సరదాకై సుభద్రయింటికి వెళ్ళినాను. మీరు వలదన్నచో నిఁక వెళ్ళను.'

మనసులో నొక భ్రమకలిగినచో నది తొలగుట చాల కష్టము. తన కోపమును శాంతింపజేయుటకై యామె యిట్లు నటించుచున్నదని భావించినా డతడు – 'వెళ్ళకపోవుటేల? అచట షికారుకు బండ్లుండును. తినుటకు పిండివంటలుండును. పూలపాన్పుపై పరుండవచ్చును. నిత్యము నేదో యొక హడా విడి జరుగుచుండును.'

వ్యంగ్య క్రోధములకు అగ్నికి ఆజ్యమునకు నుండు సంబంధమే యున్నది. వ్యంగ్యము హృదయమును చీల్చి వేయును. సుమన్ యీ మాటలకు క్రోధవిహ్వాలయైపోయి నది — 'చాలును! ఇఁక కట్టిపెట్టుము! మాటలను సరిగ

రానిమ్ము! గంటసేపటినుండియు నోటికి వచ్చినట్లెల్ల వాగుచున్నావు. నేనిచ్చిన లోకువ కిది ఫలము! నన్ను కులటగ భావించుచున్నావా?'

'నేనుమాత్ర మట్లే యనుకొనుచున్నాను.'

'అన్యాయముగ నాపై పాపము నంటగట్టుచున్నావు! నీ విషయము భగవంతుడే కనుగొనగలఁడు.'

'పో! ముండా! పైగా నన్ను శపించుచున్నావా?'

సుమన్ గర్విష్ఠి! ఈ యవమానమును సహింపజాలక పోయినది. 'ఇంటినుండి లేచిపొ'మ్మను డబాయింపు భయంకరమైన నిశ్చయమునకు దోహదమిచ్చెను.

'సరే! ఇదిగో! వెళ్ళిపోవుచున్నాను!' అనుచు నామె గుమ్మమువైపున కొక యడుగు వేసినదే కాని వెడలిపోవుట కామె యింకను నిశ్చయించుకొనలేదు.

గజాధరుడొక నిముషమేదియో యాలోచించి - 'నీ నగలు, గుడ్డలు తీసికొని పొమ్ము! ఇచట నింకెట్టి యవసరమును లేదు.' అనినాడు.

ఈ వాక్యము మిణుకు మిణుకు మనుచున్న దీపము నార్పివైచినది. ఈ యింటితో సంబంధము తీరిపోయినదని యామెకు నమ్మకము కలిగినది. ఏడ్చుచు పెట్టె పుచ్చుకొని గుమ్మము దాటినది. ఇంకను నామె యాశ పూర్తిగ నశింపలేదు. ఇంకను నాతఁడు తనను బ్రతిమాలు ననుకొనుచున్నది. అందుచే నామె గుమ్మమున కెదురుగ రోడ్డుపై నిలువబడినది. ఏడ్పుతో నామె చెంగు తడిసిపోయినది. గజాధరుఁడు తటాలున

రెండు తలుపులను మూసివేసినాడు - ఆశాద్వారమును మూసి వేసినట్లు! ఆమెకిక ఆశలేదు. ఆలోచింపసాగినది - ఎచటికి పోవలె? పశ్చాత్తాపము, గ్లానికి బదులిప్పుడామె కాతనిపై క్రోధము కలిగినది. ఇట్టి కఠినశిక్షకు తగిననేర మామె బుద్ధిపూర్వకముగ నేదియు చేసియుండలేదు. ఆమె యింటికి వచ్చుటయం దాలస్యమైనచో నాలుగు కేకలు చాలును! ఈ నిర్వాసన మామె దృష్టిలో ఘోరమైన అన్యాయము! ఆమె గజాధరుని శాంతుని జేయుటకై చేయవలసినదంతయు జేసినది, ప్రార్థించినది, ప్రాధేయపడినది, ఏడ్చినది. కాని, యీ తడామెను అవమాన పరచుటేకాదు; అసత్యమైన దోషము నామెపై నారోపించినాడు. ఇప్పుడు గజాధరుడు వచ్చి బ్రతిమాలినను ఆమె వినదు. అతడు వెళ్ళునప్పుడు. 'పొమ్మి! ఇక నాకు నీ మొగము చూపవద్దు!' అనినాడు. ఈ శబ్దము లామె హృదయమున గ్రుచ్చుకొనినవి. నా ముఖము చూడడట! నేనంత తీసివేసినదాననా? నేనతనికేల నా ముఖమును చూపుదును? ప్రపంచమున నందరు స్త్రీలకును భర్తలున్నారా? అనాథలెందరు లేరు? నేనును నొక యనాథనే! వసంత సమీరమునకును గ్రీష్మాతపమునకును నెంత భేదమున్నది! అది సుఖదము, ప్రాణపోషకము! ఇది అగ్నిమయము, వినాశకరము! ప్రేమ యనునది వసంతసమీరము! ద్వేషమనునది గ్రీష్మతపము! వసంతసమీరమే పుష్పమును కొన్ని నెలలకు వికసింప జేయుచున్నదో గ్రీష్మకాలపు వడగాలి యీ పుష్పము నొక్క యూపుతో మట్టిలో గలిపివేయును. సుమన్ యింటి

సమీపమున నొక ఖాళీవరండా యున్నది. ఆమె తన పెట్టె నచటపెట్టి పండుకొనినది. మూడు గంటలైనది. ఎచటికి వెళ్ళవలెనాయని యాలోచించుచు రెండు గంటలు గడిపినది. ఆమె నెఱింగియున్నవారిలో హరియా యను దుష్ట యొకతె యున్నది. అచటి కేఁగినచో నాశ్రయము లభించును. కాని, ఆమె యచటి కేఁగలేదు. ఇంకను కొంత యాత్మాభిమాన మామెలో మిగిలియున్నది. ఆమె యిప్పుడొక విధముగ స్వతంత్రురాలు. ఇన్ని దినములనుండి యామె మనసు కోరుచున్న దుష్కామనలను తీర్చుకొనగలదు. బాలుడు ఆవును దూరమునుండి చూచి సంతసించును; కాని యా యావు సమీపమునకు వచ్చినపుడు భయకంపితుడగును. అట్లే సుమన్ తన యభిలాషాద్వారమును సమీపించియు లోనికి ప్రవేశింప జాలకున్నది. లజ్జ, ఖేదము, అసహ్యము, అవమానములు కలిసి యామె పాదములకు సంకెలలైనవి. సుభద్రయింటికి పోవలెననుకొనినది. వారింటిలో వంటపనులు చేసి పడి యుందును. ఆ పైన భగవదేచ్ఛ యెట్లున్న నట్లు జరుగును- అనుకొనినది.

ఆమె తన పెట్టెను చెంగుచాటున నుంచుకొని పద్మసింహుని యిల్లు చేరినది. లోనికేఁగుటకు సంకోచము కలిగినది. కాని యింతలో నొక నౌకరు బయట కేతెంచుటను జూచి ఆమె తొందరగ లోనికేఁగినది. 'ఉదయమే వచ్చినావేమి?' అని యాశ్చర్యముగ నడిగినది సుభద్ర.

'ఇంట్లోనుండి వెడలగొట్టినారు' సుమన్ రుద్ధస్వరముతో నన్నది.

'అరె! ఎందువలన?'

'రాత్రి యింటికి వెళ్ళుట ఆలస్యమైనందుకు!'

'ఈ కాస్త విషయానికై యింత గందరగోళమా? ఉండు! ఆయనను పిలిపింతును. భలేవాఁడే!'

'నే నాయన మొగము చూడను!'

'అయిన; వ్యవహారమంతవఱకు వచ్చినదా?'

'అవును! ఇఁక ఆయనతో నా కేట్టి సంబంధమును లేదు!'

ఈమె కోపములో నిప్పుడు వినదు; రెండు రోజులాగినచో చల్లబడుననుకొనినది సుభద్ర. 'లేచి ముఖము కడుగుకొనుము! కండ్లు వాచినవి. రాత్రి యంతయు నిద్ర లేనట్లున్నది. కాస్సేపు నిద్రపొమ్ము! తరువాత మాట్లాడుదము.'

'సుఖముగ నిద్రపోవునట్టి యదృష్టమున్నచో నిట్టి దరిద్రు డేల దొరుకును? ఇఁక నీ శరణుజొచ్చినాను. ఆశ్రియమిచ్చినచో నుందును. లేదా యీ కళంకముతో ప్రాణములు వీడుదును. ఒక మూల నాకు కొంచెము స్థలమిచ్చినచో పడియుందును. నా చేతనైనంతవరకు మీకు సేవ చేయుదును.'

పద్మసింహు డింటికి వచ్చినంతనే సుభద్రి యీ కథనంతను అతనితో జెప్పినది. అతడు చాల చింతించినాడు. సంబంధములేని స్త్రీని భర్త నడుగకుండ తన యింటిలో

నుంచుకొనుట యాతని కనుచితమనిపించినది. 'గజాధరుని పిలిపించి యాతని కోపమును పోగొట్టుటకు ప్రయత్నింతును. ఈమె యిచటినుండి వెడలిపోవుటయే మంచి'దనుకొనినాడు.

బయటకేతెంచి గజాధరునికై మనిషిని పంపినాడు. కాని యాతడింటిలో లేడు. కోర్టునుండి వచ్చి మరల కబురు చేసినాడు. కాని యీ పర్యాయమును నాతడు కనిపింప లేదు.

సుమన్ పద్మసింహుని యింటికేఁగినదని తెలిసినంతనే గజాధరుని యనుమానము ధృవమైనది. అతడు వీధివీధి తిరిగి పద్మసింహుని యప్రతిష్ఠపాలుచేయ మొదలిడినాడు. ముందుగ విఠల్‌దాసువద్దకు వెళ్ళినాడు. అతడు గజాధరుడు చెప్పినదానిని వేదవాక్యమువలె విశ్వసించినాడు. విశ్వాసపూర్ణమైన అతని హృదయమున ప్రపంచమంతటిపైనను సహానుభూతి యున్నది. కాని, తన ప్రతివాదిపై మాత్రము లేదు.

ఈ సమాచారము విని యాతడానంద పరవశుడైనాడు. వైమనస్యమున గ్రుడ్డినమ్మక మేర్పడును. నాట్య ప్రదర్శన మేర్పాటుచేసిననాటినుండియు నాతనికి పద్మసింహునిపై ద్వేషమేర్పడినది. ఇంకేమున్నది! విఠల్‌దాసు పద్మసింహుని మిత్రులందరితోడను చెప్పివచ్చినాడు.

పద్మసింహుని స్వభావము బాగుగ నెఱిఁగిన మిత్రులే యీ విషయమును విశ్వసించుటయే యాశ్చర్యము!

మరునాడుదయము వకీలుగారి నౌకరు – జీతన్ – ఏదో పనిమీద బజారువెళ్ళినాడు. నాలుగువైపుల నిదే చర్చ

నీయాంశము! అతడు భయముతో పరుగెత్తుకొనివచ్చి —
'బాబూ! అమ్మగారు గజాధరుని భార్యగారిని యింటిలో నుంచి
నారు. దీనివలన పట్టణమున నప్రతిష్ఠపాలగుచున్నాము. ఈమె
గజాధరునితో పోట్లాడి వచ్చినట్లున్నది.' అనినాడు.

వకీలుగారీ విషయము విని నిశ్చేష్టుడైనాడు. ఇప్పు
డేమి చేయవలె? ఇంటిలోనుండి వెడలగొట్టుటకంటె గత్యం
తర మేమున్నది? భార్యపై విసుగుకొనినాడు. నాతో జెప్ప
కుండ యీమె నింటిలోనికి జేర్చినది! తానింటిలో గూర్చుం
డును. ఊరిలో నప్రతిష్ఠ నాకు! తల యెత్తుకొనుటకు వీలు
లేదు. ఇచటినుండి వెడలగొట్టినచో పాపమామె యెచటి
కేగగలదు? బహుశః గజాధరు డిక ఆమెను చేరదీయడు!
ఆమె తన మనసులో నన్ను దయాహీనుడని, క్రూరుడని తిట్టు
కొనును. కాని యీ యప్రతిష్ఠనుండి తప్పించుకొనుట కిది
యొక్కటే యుపాయము. ఈ విధముగ నాలోచించుకొని
నౌకరును పిలిచి - 'ఇంటిలోని కేగి నీవిచట నున్నందువలన
నప్రతిష్ఠ యగుచున్నదనియు, సాధ్యమైనంతవఱకు నేడే లేచి
పొమ్మనియు సుమన్‌తో చెప్పుము! జాగ్రత్త! మనిషివలె
మర్యాదగ మాటాడుము! చెయ్యి చేసికొనకుసుమా! ఇంత
కంటె మనమేమియు చేయజాలమని చెప్పుము!' అనినాడు.

ప్లీడరుగారు మర్యాదగ మాట్లాడుమని చెప్పినను వాడు
వెళ్ళుచునే యామె పేరుపెట్టి బిగ్గరగ కేకవేసినాడు. సుమన్
ప్లీడరుగారికి తమలపాకులు చుట్టుచున్నది. ఈ కేకవిని యులికి
పడినది - భయభీతయై యాతనివంక చూచినది.

'ఏమిటట్లు చూచుచున్నావు? నేఁడే యిచటినుండి వెడలిపొమ్మని అయ్యగారి యాజ్ఞ! దేశమంతట నప్రతిష్ఠ పాలుచేసినావు! నీకు సిగ్గులేదుగాని, అయ్యగారికి పరువు ప్రతిష్ఠలున్నవి! తాఁజెడ్డకోతి వనమెల్ల చెఱచినదట!'

ఈ మాటలు సుభద్ర చెవిని పడినవి; వచ్చి — 'ఏమిటిరా?' అని యడిగినది.

'ఏమియు లేదండి అమ్మగారూ! ఈమె నిచటినుండి వెడలిపొమ్మని అయ్యగారి యాజ్ఞ! పట్టణమున నపకీర్తిష్ఠగనున్నది.'

'నీవు పోయి వారి నిచటికి పంపుము!'

సుమన్ నేత్రము లశ్రుపూర్ణములైనవి. 'అక్కయ్యా! వద్దు! వారి నెందుకిచటికి పిలుచుట? బలవంతముగ నొకరి యింటిలో నింకొకరుండజాలరుగదా! నేనిపుడే వెళ్ళిపోదును.'

ప్లీడరుగా రిట్లుందురని యామె యనుకొనలేదు. విపత్తికాలమున హృదయముపై నాధిపత్యము వహించు స్వాధీనభావముతో నామె యాతనిని దురాత్ముని, నీచుని, దయాశూన్యుని, పిఱికిపందగ నిశ్చయించుకొనినది.

# 10

గుమ్మమువద్ద కేతెంచి యిప్పుడెచటికి వెళ్ళవలెనా యని యాలోచించినది. నాయిల్లు తప్ప నాకు వేఱుగతి లేదు. ఇతరులను దేవురించుటేల? నాకిల్లులేదా? జన్మాంతమిచటనే పడియుండమనా యేమి? ఆయన కోపము కాస్త శాంతించినంతనే

వెడలిపోదును. అయ్యో భగవంతుడా! కోపమున బుద్ధి యెంత భ్రష్టమైపోవును! పొరపాటుననైనను నేనిచటికి వచ్చియుండ గూడదు.

ఈ విధముగ నాలోచించుచు నామె ముందునకు సాగినది. కాని కొలఁది దూరమేఁగునప్పటి కామె భావములు తల క్రిందులై పోయినవి. రాత్రి రెండుగంటలసేపాలస్యమైనందుకే యంత యనుమానము కలిగినది; ఇప్పుడు ఇరువది నాలుగు గంటలైనదిగదా! ఇపుడు వెళ్ళినచో దూరమునుండియే తరిమి కొట్టును.ఆ చీవాట్లు తినుటయెందులకు? నాకు నివసించుట కొక స్థానము కావలెను. తిండి కెట్లో సంపాదించుకొందును. పోయి యొక యిల్లు మాట్లాడుకొందును. భోలీ నా కామాత్రము నాయమొనర్పకుండునా? తన యింటికి మాటి మాటికిని పిలిచిన భోలీబాయి యీ మాత్రము దయ చూపకుండునా?

పుట్టింటికి వెళ్ళినచో? అచట నావాళ్ళెవరున్నారు? తల్లి చనిపోయినది. శాంతయున్నది. దాని బ్రతుకే కష్టమైనది. నాగొడవ పట్టించుకొనువా రెవరున్నారు? మేనత్త బ్రతుకనియదు. పొడిచి పొడిచి చంపును. భోలీవద్దకే పోయి యడుగుదును. ఏమగునో చూతును. ఎచటను కాకపోయినచో గంగాభవాని యుండనేయున్నది.

భోలీయింటిగుమ్మమువఱకు వెళ్ళి మఱల ననుకొనినది— భోలీ యింటికేఁగుటయేల? ఏ పొరుగింటికైనను వెళ్ళినచో పని సానుకూలముకాదా? ఇంతలో భోలీ యామెనుజూచి పైనుండియే రమ్మని సంజ్ఞచేసినది. సుమన్ పై కేఁగినది.

'ఈ పెట్టె తీసికొని వచ్చుచున్నా వెచటినుండి ?' అని యడిగినది భోలీబాయి.

'ఆ రామాయణము తరువాత చెప్పెదను. ముందు నాపై దయయుంచి నా కొక చిన్నయిల్లు మాట్లాడిపెట్టుము. నే నందులో నుందును.'

భోలీ యాశ్చర్య చకితయైనది-'ఏమి భర్తతో పోట్లాడి నావా ?'

'లేదు ! పోట్లాట దేనికి ? నా కే యట్లనిపించినది.'

'సుమన్! నీవు దాచనక్కఱలేదు. నేను కనిపెట్టినాను. కోపము రాకున్నచో నొకమాట చెప్పెదను. ఎప్పుడో యొక ప్పుడు నీ కతనితో సరిపడకుండ పోవునని నే నెఱుంగుదును. నీ వెచటనో గొప్పయింటిలో రాణివి కావలసిన దానవు. కాని, నీ పాదము లొత్తుటకుకూడ పనికిరాని యీ దద్దమ్మ పాలఁబడినావు. నీవు కాబట్టి యెట్లో నెట్టుకొని వచ్చినావు. మఱియొక తెయైనచో నీపాటి. కెన్నడో రెండు మొట్టికాయలు వేసి లేచిపోయి యుండెడిది. నీవు బాగా చదువుకొనలేదేమో!'

'రెండు సంవత్సరములపాటు ఒక క్రిష్టియన్ లేడీవద్ద చదివినాను.'

'మఱి రెండుమూడేండ్లు చదివియున్నచో మన జీవిత ధ్యేయమేదియో బాగుగ నర్థమై యుండెడిది. తల్లిదండ్రు లెవరిమెడ కంటగట్టిన వారితో నుండుటకు మనము గొఱ్ఱె లముకాము ! నీవు కష్టము లనుభవించుటయే భగవదేచ్ఛ యగుచో నీ కింతటి సౌందర్యము నేల ప్రసాదించును ! స్త్రీల

నింత నీచముగ జూచుట మన దేశములోనే! ఇతర దేశము లందు స్త్రీలు స్వతంత్రులు - తమ యిష్టమువచ్చిన వారిని పెండ్లాడుదురు - ఇష్టము కానప్పుడు విడాకులిత్తురు.'

'ఏమిచేతును? లోకాపవాద భయమున్నది! లేనిచో సుఖముగ నుండవలెనను తలంపెవరికుండదు?'

'ఆ భయమునకు ఫలితమేయిది! నా తల్లిదండ్రులు సైతము నన్నొక మూడుకాళ్ళ ముదుసలికిచ్చి కట్టిరి. అచట కావలసినంత యైశ్వర్యమున్నది, సుఖము లున్నవి; కాని నా కతని ముఖము జూచిన నసహ్యము. ఎట్లో ఆరు నెలలు గడిపి లేచి వచ్చినాను. జీవిత మనునది వరదానము! ఏడ్చుచు రోజులు గడపుట కేర్పడినదికాదు. అప్రతిష్ఠ వచ్చునని నేనును ముందు భయపడితిని. కాని యింటిలోనుండి యడుగు బయట పెట్టిన క్షణమునుండి గొప్పగొప్పవారే నా వద్ద కేతెంచి చేతులుకట్టుకొని నిలబడినారు. నే నింటివద్ద నుండగనే కొంచెము సంగీతము నేర్చుకొంటిని. తరువాత మఱికొంచెము నేర్చు కొంటిని. ఇంకేమున్నది? పట్టణమంతయు నా ప్రశస్తి ప్రాకి పోయినది. ఇప్పుడు నా పాదము లొత్తుటయే తమ యదృష్ట ముగ భావింపని భాగ్యవంతులుగాని, పండితులుగాని, పెద్ద మనుష్యులుగాని యెవరున్నారు? దేవాలయములందు నా నృత్యప్రదర్శనములు జరుగును. ప్రజలు నావద్ద కేతెంచి ప్రబతిమాలి నన్ను గొనిపోదురు. ఇది యగౌరవమని యెట్లను కొందును?'

'సరే! పాట యెన్ని దినములలో వచ్చును?'

'నీకు ఆరు నెలలో చక్కని సంగీతజ్ఞాన మలవడును. ఇపుడు సంగీత మెవరికి కావలె? రెండు కీర్తనలు, నాలుగు సినిమా పాటలు వచ్చినచో చాలును - నిన్ను పట్టశక్యము కాదు. కావలసినది సంగీతము కాదు; - అందము, చక్కని కబుర్లు! భగవంతు డీ రెండును నీకు సమృద్ధిగ ప్రసాదించి నాడు. నీ వొక్కసారి యీ యినుప సంకెళ్ళను త్రెంచుకొని చూడుము - ఈ ప్రజలు నీ వెనుక పిచ్చివారై యెట్లు పరు గెత్తుదురో!'

సుమన్ చింతితభావముతో నన్నది - 'నా కిదియే...'

'నచ్చకున్నదా? అయిన వారితోడను కాని వారి తోడను సిగ్గువిడిచి మాటాడుట నీకు నచ్చదన్నమాట! అదేనా? కాని, నీ వద్ద కేతెంచుటకు ప్రతివానికిని సాహసము చాలదు. మనవద్దకు భాగ్యవంతులు మాత్రమే వత్తురు. వారిని పట్టుకొని యుంచినచో చాలును. అతడు మంచివాడైనచో మనసు కలిసియేపోవును. కానిచో మాటలతోమాత్రము వలలో చిక్కించియుంచుము. చేతనైనంతవఱకు దోచి వేయుము. చివఱకు విసుగుపుట్టి వాడే వెడలిపోవును. వాడి బాబు మఱొకడు చిక్కును.'

సుమన్ చిరునవ్వుతో - 'ముందు నీవు నాకొక యిల్లు మాట్లాడి పెట్టుము.' అనినది.

చేప యెరను కొరకనున్నదని భోలీ గ్రహించినది. ఇంక గాలము గట్టిగ బట్టి యుంచవలె! అన్నది - 'నీ కీ యిల్లు సిద్ధముగ నున్నది. నీ విచటనే హాయిగ నుండుము!'

'నీతో నుండను.'

'అప్రతిష్ఠ వచ్చుననియా?'

'ఇఁక నేనేమి చెప్పగలను?'

అధర్మము, దురాచారము యెడల మానవునిలో నుండు స్వభావసిద్ధమైన అసహ్యమే యామె హృదయమును డోలాందోళిత మొనర్చుచున్నది.

'అయిన నెంత యద్దెలో కావలెను?' అని యడిగినది భోలీ.

'ఏదో; రెండు మూడు రూపాయలలో.'

'ఏమిపని చేయుదువు?'

'కుట్టుపని చేయుదును.'

'ఒంటరిగనే యుందువా?'

'ఆఁ! ఇంకెవరున్నారు?'

'చిన్నపిల్లలవలె మాట్లాడుచున్నావు! పిచ్చిదానా! కండ్లుండియు గ్రుడ్డిదానివై పోవుచున్నావు. ఒంటరిగ నొక్క దినమైనను గడపగలవా? పట్టపగలే మర్యాదను దోచు కొందురు. అంతకంటె మఱల భర్తవద్ద కేఁగుటయే మంచిది!'

'అతని మొగము జూచుట కిష్టములేదు. మొన్న వకీలుగారింట నీ నృత్యప్రదర్శనముజరిగినది. వకీలుగారి భార్యకు నేనననిన మిక్కిలి యిష్టము. ఆమె నన్ను ప్రదర్శనము చూచుటకు రమ్మనినది. ఒంటిగంటవఱకును నన్ను కదలనీయలేదు. దీనికై యాతడు కోపించి నోటికి వచ్చినట్లెల్ల వాగినాఁడు. వకీలుగారికి పాపమంటగట్టి నన్ను యింటినుండి వెడలగొట్టి

నాడు. నాలుగైదు రోజు లచటనుండి యేమగునో చూతమని వకీలుగారింటి కేఁగితిని. ఆ దుర్మార్గుడు వకీలుగారిని అప్రతిష్ఠ పాలుచేసినాడు. ప్లీడరుగారు నన్నచటినుండి వెడలిపొమ్మని కబురు చేసినారు. ఎన్ని దుఃఖము లనుభవించినను భగవంతుడు గౌరవమును కాపాడుచునే యున్నాడు. కాని, యీ నాటికి కళంకము రానేవచ్చినది. ఇఁక యేమైనను ఆయింటికిమాత్రము వెళ్ళను.'

ఈ మాటలను నప్పటికి సుమన్ కండ్లు చెమ్మగిలినవి. భోలీ ధైర్యము చెప్పినది — 'సరే! ముందు కాలుసేతులు కడిగికొనుము. భోజనము చేసి మాట్లాడుకొనవచ్చును. రాత్రి యంతయు నిద్రలేనట్లున్నది.'

'ఇచట నీళ్ళున్నవా?'

భోలీ చిరునవ్వుతో — 'అన్నియు సిద్ధముగనున్నవి. మా పనికత్తె హిందువే!' అన్నది.

ముసలి పనికత్తె సుమన్‌కు స్నానాగారమును చూపించినది. ఆమె స్నానాగారమున కేఁగి సబ్బుతో స్నానముచేసినది. వృద్ధ యామె తలదువ్వి జడవేసినది - ఒక క్రొత్త పట్టుచీర కట్టుకొనుట కిచ్చినది. సుమన్ పైగదిలోనికి వచ్చినంతనే భోలీబాయి చిరునవ్వుతో — 'ఒకసారి అద్దములో నీరూపమును చూచుకొనుము!' అన్నది.

సుమన్ అద్దము ముందు కేఁగినది. సౌందర్యమూర్తి తన యెదుట సాక్షాత్కరించినట్లున్నది. ఆమె తా నింతటి సౌందర్యవతినని యెన్నఁడు ననుకొనలేదు. లజ్జతో గూడిన

అభిమానముతో నామె ముఖము వికసించినది. 'ఈ సుఖమును వదలిపెట్టి యీ చీకటిగదిలో పడియుండు టేల?' అనుకొనినది.

'గజాధరుడు నీ విషయమడిగినచో నేమని చెప్పుదును?' అని యడిగినది భోలీబాయి.

'ఇచట లేదని చెప్పుము!'

భోలీ మనోరథము సఫలమైనది. ఇంతవఱకును తప్పించుకొని తిరుగుచున్న సేఠ్ బలభద్రదాసు ఈసౌందర్యవతిచుట్టును భ్రమరమువలె తప్పక పరిభ్రమించునని నిశ్చయించుకొనినది.

# 11

పద్మసింహుని అన్నగారు మదనసింహుడు. అతడే యింటి వ్యవహారములన్నియుఁ జూచుచుండును. కొంత పొలమున్నది. వడ్డీ వ్యాపారమున్నది. అతని కొక్కడే కొడుకు. పేరు సదనసింహుడు. మదనసింహుని భార్య పేరు భామ.

సదనసింహుడు బాల్యమున మొండిపట్టుదల గలవాడు. వయసు వచ్చిన పిమ్మట సోమరియైనాడు. దానికి తోడు కోపిష్ఠి, ఉద్దండుడు. వీనిని నా వెంట పంపినచో నొక యింగ్లీషు బడిలో జేర్పింతునని పద్మసింహు డెన్నిమోసారులు చెప్పినాడు. కాని అన్నగారును వదినెయు నంగీకరింపలేదు.

సదనునికి పినతండ్రితో వెళ్ళవలెనని మిక్కిలి యుబలాటము! పినతండ్రి చెప్పులు, బూట్లు, గడియారము, కాలర్లు, సబ్బులు చూచి యాతడు ముచ్చిళ్ళూరుచుండెడివాడు. ఇంటిలో

నన్నియు నున్నవి. కాని యీ నాగరికతా చిహ్నములైన వస్తువులు మాత్రములేవు. మంచి దుస్తులు ధరించి పినతండ్రి వలె గుఱ్ఱపుసార్టుపై షికారుకు పోవలెనని యాతనికోరిక. అతడు పినతండ్రి నెక్కువ మన్నించును — గౌరవించును. ఆయన చెప్పినపని కాదనడు. తల్లిదండ్రులమాట వినడు — వినకపోవుటయేకాదు, వాదమునకు దిగును. కాని పినతండ్రి యెదుటమాత్రము వినయ విధేయతలకు ప్రతిమూర్తివలె నుండును. పినతండ్రి వేషభాష లాతనినాకర్షించినవి. పద్మసింహుడు యింటికి బయలుదేరినచో అన్నకుమారునికై వస్త్రములు, చెప్పులు కొనితెచ్చును. సదను డీ వస్తువులను జూచి యానందపరవశుడగును.

పద్మసింహుడు ప్రతి సంవత్సరమును హోలీ పండుగకు తన స్వంతయింటికేగుచుండును. ఈ సంవత్సరముగూడ వారము దినములకు ముందుగా వచ్చుచున్నానని వ్రాసినాడు. సదనసింహుడు పట్టులాల్చీ, క్రొత్తచెప్పులు వచ్చునుగదాయని యుబలాటపడుచున్నాడు. రేపు హోలీయనగా మదనసింహుడు స్టేషనుకు మేనా పంపినాడు — ఉదయము సాయంకాలము కూడ. మరునాడుకూడ రెండుపూటలను బండి పంపినాడు. కాని అచట భోలీబాయి నృత్యప్రదర్శనములాయె! ఇంటి కెవరువత్తురు? పద్మసింహుడింటికి రాకుండ జరిగిపోయిన దీ యొక్క హోలీ పండుగయే! భామ కంట తడిపెట్టినది. మదన సింహుడును చిన్నబోయి కూర్చుండెను. సదనసింహుని నిరాశ కంతేలేదు. గుడ్డలులేవు, చెప్పులులేవు! హోలీయాడు టెట్లు?

దినమంతయు పాతపీలికలతో వ్రేలాడినాడు. సాయంకాలము తల్లివద్దకేఁగి 'నేను బాబాయివద్ద కేఁగుదును' అనినాడు.

'అచట నీ కెవరున్నారని?'

'ఏమి? బాబాయిలేడా?'

'ఉన్నాడు! కాని ఈ బాబాయి వెనుకటి బాబాయి కాడు! నిన్ను పలుకరింపనైనను పలుకరింపడు!'

'ఏమైనను సరే! నేను వెళ్ళకతప్పదు.'

'ఒకసారి చెప్పిన తరువాత నన్ను విసిగింపవద్దు! అచటి కేఁగుట నాకిష్టములేదు.'

భామ వారించిన కొలఁదియు సదనుని పట్టుదల యెక్కు-వైనది. చివరికామె విసుగుపుట్టి లేచిపోయినది. సదనసింహుడును బయటకు వచ్చినాడు. పట్టుదలపై ప్రత్యాఘాతము పనిచేయదు. ప్రక్క-దెబ్బతీయవలె!

పినతండ్రివద్దకు పారిపోవలెనని సదనుడు నిశ్చయించుకొనినాడు. తగిన తరుణమునకై వేచియున్నాడు. రాత్రిపూట యింటిలో నందరు నిద్రించిన పిమ్మట చల్లగ లేచి జారినాడు.

* * *

సుమన్ వెడలిపోయిన పిమ్మట పద్మసింహుని హృదయమున,నొక విధమైన ఆత్మగ్లాని జనించినది – నేనొనర్చినపని మంచిదికాదు. పాప మామె యెక్క-డికేఁగినదో! నేను గొప్ప పొరపాటు చేసితిని. ఇఁక నీమర్యాదపాలనమువలన ప్రయోజనములేదు. ఆమె మునిగిపోవుచుండును. ఆమెను రక్షింపవలె!

అతడు గజాధరుని యింటికేఁగుటకు వస్త్రములను ధరించి బయలుదేరెను. కాని, 'గజాధరుఁడేమనుకొనును?' అను సంశయము కలిగినది. అతఁడు నాపై కెదురుతిరిగినచో వ్యవహారము మఱింత ముదిరిపోవును. వెంటనే యాతడు వెనుదిరిగి యింటికి వచ్చెను.

పదిగంటలకు భోజనముముందు కూర్చుండినప్పుడు సుభద్ర ప్రారంభించినది -- 'ఉదయమే ఆమెపై కోపించినారేమి? వెడలగొట్టవలెనన్న మంచిమాటలతో పంపింవేయరాదా? ఆ ముసలివానిని పంపినారు. వాడు నోటికి వచ్చినట్లెల్ల ప్రేలినాఁడు. పాపమామె నోరెత్తలేదు - వెడలిపోయినది. సిగ్గుతో నాకు చచ్చినంత పనియైనది. నాతో చెప్పిన నేనే మెల్లగ చెప్పియుండెడిదాననే! ఆమె తెలియనిదికాదుగదా! ఎచటనైన తన యేర్పాట్లు గావించుకొని వెడలిపోయి యుండెడిది. ముందు వెనుక లాలోచింపక నాదిర్‌షావలె ఆజ్ఞాపించినారు. అప్రతిష్ఠయనిన నింతటిభయమా? ఆమె సరిగ నింటికేఁగకున్నచో నింతకంటె తక్కువ యప్రతిష్ఠ యగునా? ఆమె యెక్కడికేఁగునో యేమో! ఈ తప్పెవరిది?'

సుభద్ర మనసులోని కోపమును వెడలఁగక్కినది. పద్మసింహుడు తన యపరాధము నంగీకరించినట్లు తలవంచుకొని కూర్చుండెను. అతని మనసులోనున్న భావములే సుభద్ర నాలుకపైనున్నవి. మాటాడక భోజనమొనర్చి కోర్టుకు బయలు దేరినాడు. ఆ ప్రదర్శనము జరిగి మూడు దినములై పోయినది. ఇదివరకు పద్మసింహుని కోర్టులోని వాఱందఱును శీలవంతుడని

తలఁచెడివారు - ఆతనిని గౌరవించెడివారు. కాని, యీ రెండు మూడు దినములనుండి మిగిలిన ప్లీడర్లు సమయము చిక్కినపుడెల్ల పద్మసింహునివద్ద జేరి శృంగారచర్చ ప్రారంభింపసాగిరి. ఆతని కీ చర్చలనిన నసహ్యము! 'నేను వేశ్యల కేజంటునా? వీరందఱు నాతో నిట్లు మాట్లాడుచున్నారేమి?' అనుకొనును.

కోర్టు నౌకర్ల ప్రవర్తనమునందు సైతము చాల మార్పు కన్పట్టుచుండెను. వారికి తీరిక లభించినప్పుడెల్ల సిగరెట్టు ముట్టించి పద్మసింహునివద్ద కేతెంచి యదేవిధమైన సంభాషణము ప్రారంభింతురు. అతడేదియో వంకబెట్టి దూరముగబోయి తప్పించుకొని తిరుగవలసివచ్చుచుండెను.

నేఁడు కూడ నాతడు కోర్టులో నెక్కువసేపు నిలువజాలకపోయినాడు. ఈ యసహ్యకరమైన సంభాషణములకు విసిగిపోయి రెండు గంటలకే యింటికి వచ్చినాడు. గుమ్మము వద్దకేతెంచినంతనే సదనసింహు డెదురువచ్చి నమస్కరించినాడు.

'అరె! ఎప్పుడు వచ్చినావురా?'

'ఈ బండిలో వచ్చినాను.'

'ఇంటివద్ద నందఱు క్షేమమా?'

'అందఱు క్షేమమే!'

'హోలీకి రాలేదని వదిన ఏమైన ననుకొనుచున్నదా?'

'మీ కొఱకు రెండు రోజు లెదురు చూచినారు. నాన్నగారు రెండురోజులు స్టేషనుకు బండి పంపినారు. అమ్మ

కంటనీరు పెట్టుచున్నది - నాకు తోచలేదు. రాత్రి లేచి బయలుదేరినాను.'

'అయితే, యింటివద్ద చెప్పలేదా?'

'అమ్మ నడిగినాను. కాని ఆమె నెరుగుదురుగదా! ఆమె యొప్పుకొనలేదు.'

పద్మసింహుడు అన్నగారికి - భయపడవద్దనియు, సదను డిచటికి వచ్చినాడనియు, వానినొక స్కూలులో చేర్చుదు ననియు - టెలిగ్రాము ఇచ్చినాడు. -

సాయంకాలమైనది. పద్మసింహుడు సదనునితోగూడ షికారు బయలుదేరినాడు. ఆతని మనసు వ్యాకులముగ నున్నది. ఆతని కండ్లు అటునిటు సుమన్ కొఱకు వెదకు చున్నవి. ఈ పర్యాయ మామె కనిపించినచో నెంత యప్ర తిష్ఠ కలిగినను ఆమెను వదలననుకొనినాడు. ఆమెభర్త నాపై కేసుపెట్టును; అంతేగదా! ఆమె కిష్టమైనచో భర్తవెంట వెడలిపోవును! ఆమె యింటికి వచ్చియుండవచ్చును. నేనుగూడ వారి ఇంటికి పోవుటమంచిది - అనుకొనుచు నతడు గజాధరుని యింటికేఁగినాడు. అతడప్పుడే దుకాణమునుండి తిరిగి వచ్చి నాడు. అతనికి మధ్యాహ్నమే ప్లీడరుగారు సుమన్‌ను ఇంటిలో నుండి వెడలగొట్టినారనువార్త తెలిసినది. అయినప్పటికిని ప్లీడరుగారే మరెచ్చటనైనను నామెను దాచియుంచినారేమో యను అనుమానము కలిగినది. కాని, ప్రస్తుతము ప్లీడరుగారు తన గుమ్మమువద్ద కేతెంచినపు డాతనిని గౌరవింపకుండ నుండ జాలక పోయినాడు. మంచముపైనుండి లేచి పద్మసింహునికి

నమస్కరించినాడు. ప్లీడరుగా రచటనే నిలబడి — 'ఆవిడ యింటికి వచ్చినదా?' యని ప్రశ్నించెను.

గజాధరుని యనుమానము కొంత తొలగెను—'లేదు మీయింటినుండి వెడలి పోయిన పిమ్మట నామె జాడ తెలియ రాలేదు.'

'ఆచూకీ తీయలేదా? మీరామెను యింటికి తీసికొని వెళ్ళగోరినచో మా యింటిలో నున్నప్పుడే తీసికొని వెళ్ళ వచ్చునుగదా! సోదరా! తనయప్రతిష్ఠ నెవడును సహింప జాలడుగదా! అందువలననే నే నామెను మాయింటినుండి పంపివేసితిని. నే నేమిచేయగలనో నీవే చెప్పుము! గౌరవమనునది యందఱకు కావలసినదేగదా! ఆమె హోలీ పండుగనాడు నాయింటివద్ద నున్నది; అంతనఱకే యీ వ్యవహారమున నా యపరాధము. ఆయుత్సవమునకు ఫలిత మిట్లగునని నేను తలంచి యున్నచో నుత్సవమే యేర్పాటు చేసియుండెడివాడనుకాను. లేదా ఆమెను నాయింటికి రానిచ్చెడి వాడను కాను. ఈ నా స్వల్పమైన అపరాధమునకే పట్టణమున నాపేరు ప్రతిష్ఠలను గంగలో కలిపితివి.'

గజాధరుని మనసులోని భ్రమ తొలగిపోయినది. కంట నీరు పెట్టినాడు — 'మహాశయా! నే నొనర్చిన యపరాధము నకు మీరెట్టిశిక్ష విధించినను నేను సిద్ధమే! నేను పల్లెటూరి వాడను - మూర్ఖుడను. ఎవరేమాట చెప్పినను నమ్ము స్వభావమునాది. ఆ బ్యాంకులో నుద్యోగస్థుడున్నాడే... అతని పేరేమి?...విఠల్‌దాసు! అతని వలలో, అతని మాయ

మాటలలో చిక్కినాను. నేనాతనిని పెద్దమనిషియనుకొంటిని. పరోపకారపారీణునివలె కబుర్లు చెప్పుచుండునుగదా! అట్టివారి మాటలపై నమ్మకముకలుగుట సహజము. మీతో నాయనకు గల విరోధమేమియో తెలియదు.. కాని, సంసారమును మాత్రము నాశన మొనర్చినాడు.

విఠల్‌దా సాతని పరమ మిత్రము. పద్మసింహు డాతని నధికముగ గౌరవించును. తమలో తమ కెన్ని యభిప్రాయ భేదములున్నను, ప్లీడరుగా రాతని పవిత్రమైన ఆదర్శములను గౌరవించెడివారు. అట్టి వ్యక్తి తనాతట తాను, కావలెనని ఇట్టిపని చేసినచో నేమనగలను? ఉన్నతభావములతో గూడిన క్రూరుడన్నమాట! హోలీనాటియుత్సవ విషయమైనపట్టింపుతో విఠల్‌దా సీ యగ్నిని రగుల్కొల్పినాడని పద్మసింహుడు గ్రహించినాడు. నన్నవమానించుటకు, పదిమందిలో నన్నగౌరవపఱచుటకే యిట్టి పన్నాగము పన్నినాడన్నమాట! కొంచెము కోపముతో గజాధరుని వైపు తిరిగి – 'నీ వీ విషయము నాతనిముందు చెప్పగలవా?' అని యడిగినాడు.

'తప్పక ! నిజము చెప్పుటలో భయమేమి ? పదండి ! ఇప్పుడే 'యాతనిముందు చెప్పెదను. కాదనుట కాతనికి సాహసమున్నదా?'

క్రోధావేశమున పద్మసింహుడు బయలుదేరుటకు సిద్ధపడినాడు. కాని కొలందిసేపటిలో నా తుపాను వేగము కొంత తగ్గినది. కొంచెము శాంతించినాడు. 'సరే! నేను పిలిపించినప్పుడు రమ్ము. కాని, నిశ్చింతతో – నిరాశతో

గూర్చుండవద్దు సుమా! ఆమె విషయమై ఆచూకీ తీయుము. రోజులు బాగుండలేదు. డబ్బు కావలసినచో నన్నడుగుము!'

ఇట్లని పద్మసింహుడు యింటికేఁగెను. విఠల్ దాసొనర్చిన గుప్తాఘాతమున కాతడు నిస్తేజుడైపోయెను.విఠల్ దాసు కేవలము ద్వేషమువలననే యిట్టి పన్నాగము పన్నినాడని తలఁచినాడు. కాని యాతడు సద్భావప్రేరితుడై, నిష్కల్మష హృదయము తోనే – సంపూర్ణవిశ్వాసముతోనే ఇట్లొనర్చి యుండవచ్చు నను విషయ మాతనికి తోచలేదు.

# 12

మరునాడు పద్మసింహుడు సదనుని వెంటబెట్టుకొని పాఠశాలలో జేర్చుటకు బయలుదేరెను. కాని యెచటికేఁగినను నొకటే సమాధానము – 'సీటులేదు' అని.

చేయునది లేక తానే చదువుచెప్ప సంకల్పించుకొని నాడు. కాని, ఒక వారము రోజులగునప్పటికి నిరాశచెంది నాడు. ఈ పనికి తగిన యోగ్యత తనకు లేదని నిశ్చయించు కొనినాడు.

ఆ వీధిలో నొక మాష్టరున్నాడు. నెల కిరువది రూపా యలు తీసికొని సదనునికి చదువుచెప్పుట కంగీకరించినాడు. కాని, డబ్బెచటనుండి వచ్చును? ఇపు డీ క్రొత్తచింత పట్టినది. పద్మసింహుడు నాగరకుడు – షోకిల్లా, ఖర్చు యెల్లప్పుడు నెక్కువగనే యుండును. ఫాషన్లనిన గిట్టెడిది కాదు. కాని

వాటిని కాదనను లేము. చాలసేపటివఱకు ఏకాంతముగ నాలోచించెను. పిమ్మట సుభద్రవద్దకు వచ్చి, మాష్టరుగారు 20 రూపాయల కంగీకరించినారని చెప్పినాడు.

'మాష్టర్లు దొరకకపోయినారా? వందలున్నారు! డబ్బుయేదీ?'

'ఏదో యుపాయ మాలోచింపుము!'

'ఆదాయవ్యయములు మీకు తెలియనివా? నే నేఖర్చులు తగ్గింపగలను? పాలు, నెయ్యి తప్పవుగదా! కాఫీ ఖర్చులు అత్యావసరమేనాయె! చిరుతిండ్లకు లోపము రాకూడదు! పనిమనిషి లేనిది పనిజరుగదుగదా! వంటమనిషి తప్పనిసరియాయె! ఇఁక తగ్గింపదగిన ఖర్చు లేమున్నవి?'

'పాలు తగ్గించివేయుము.'

'మానివేయవచ్చును. మీ కక్కరలేకపోయినను, సదనునికైనను కావలెనుగదా!'

'పోనీ, ఎలక్ట్రిక్ ఛార్జీలలో నేమైన మిగల్చవచ్చునా?'

'మిగల్చవచ్చును. దీపములు దేనికి? ప్రొద్దు గ్రుంకక ముందే ముద్ద నోటిలో వేసికొని, ప్రక్కలు పరువవచ్చును. ఎవ్వరైనను మాటాడుటకు వచ్చినచో అఱచి అఱచి వారే వెడలిపోదురు. 'ఫాన్'లు దేనికి? చేతితో విసరుకొనిన సరిపోదా?'

'పోనీ, గుఱ్ఱపుదానా తగ్గించిన?'

'ఆఁ! భలేయుక్తి తట్టినది! ఎంతటి దూరపు ఆలోచన! అవును! అసలు దానా దేనికి? గడ్డి చాలదా? ఎముకలు

బయట పడును! – అంతియేగదా!. చచ్చిచెడి యేదోవిధముగ కోర్టువరకు నీడ్చుకొని పోవును గదా! ప్లీడరుగారికి బండిలేదని యెవరును ననుటకు వీలుండదు!'

'ఆడపిల్లల పాఠశాలకు నెలకు రెండురూపాయలు చందా, క్లబ్బుచందా రెండురూపాయలు, అనాథాలయమునకు మూడు రూపాయలు! ఈ చందాలన్నియు ఆపివేసినచో?'

'చాల మంచిది! అవును! తనపొట్ట చూచుకొని యితరులపొట్ట చూడమనినారు. ప్రపంచమునందలి పద్ధతియే యిదిగదా!'

సుభద్ర యనుచున్న యీ వ్యంగ్యపూర్ణమైన మాటలకు ప్లీడరుగారికి లోలోన కోపము కలుగుచున్నను నిగ్రహముతో – 'ఈ ఖర్చులలో తగ్గించి 15 రూపాయలు నేనిత్తును. మిగిలిన 5 రూపాయలు నీవంతు. నేను లెక్కలు డొక్కలు అడుగను. ఎట్లో నీవే పూర్తి చేయుము!' అనినాడు.

'పూర్తియగుట యేమంత కష్టముకాదు. వంట ఒకపూట చేసినచో సరిపోవును. రెండుపూటలు వంట దేనికి? ప్రపంచమున ననేక కోట్లమంది ఒకేపూట వండుకొని తినుచున్నారు. వారందఱును బలహీనులై రోగిష్ఠులు కాలేదు.'

ప్లీడరు గారికి కోపమువచ్చినది. ఆయనకు గృహకలహములనిన భయమే! కాని యీ వ్యంగ్యాఘాతములను సహింపలేకపోయినాడు — 'సదనునికొఱకై మాష్టరును నియమింపవద్దని నీ యుద్దేశ్యమా? వాఁడట్లే పాడైపోవలెనని నీ కోరికయా? నాకు సాయమొనర్పవలసినదిపోయి నన్నేడ్పించు

చున్నావు! సదనుడెవడనుకొంటివి? నన్నుస్కూలులో చేర్పు టకై చల్దిమూటను, బియ్యపు సంచిని నెత్తినపెట్టుకొనివచ్చిన నా యన్న కుమారుడు! నే నా దినముల నింకను మఱచి పోలేదు. ఆయన చూపిన ప్రేమను తలంచుకొనినచో నాతని పాదములపై బడవలెననిపించును. ఆతడొనర్చిన ఉపకారము లకు నా జీవితమంతయు ధారవోసినను ఋణముతీరదు. సదనుని కొఱ కెన్నికష్టములనైనను సహింతును. వానికొఱకై నడిచి కోర్టుకు పోవలెనన్నను, ఉపవాసములు చేయవలసివచ్చినను నాకిష్టమే! లేనిచో నావంటి కృతఘ్నుడు వేఱొకడుండడు!

ఆత్మగ్లానిచే సుభద్ర ముఖకమలము వాడిపోయినది. పద్మసింహు డా మాటలు హృదయపూర్వకముగ ననినను, నామె తన్ను సిగ్గుపఱచుటకే యనినట్లు భావించినది. ఆమె తలవంచినది – 'నేను సదనుని కొఱకై మాష్టరును నియమింప వద్దనినానా? మీరు నియమింపదలంచినచో నియమింపుడు. మీ రేపని చేయమనిన నది చేయుదును. ఈ విషయమై మీ రెన్నడును గట్టిగ చెప్పియుండలేదు; గాన అవసరమైన ఖర్చు కాదనుకొంటిని. అతడిచటికి వచ్చిననాటినుండియే మాష్టరును నియమించియుండవలసినది. దీనికై యింత వెనుకముందు లేల? ఈపాటి కేమైనను కొంత చదువుకొని యుండెడివాడు.'

తానొనర్చిన ప్రతివాదము సుభద్రకు దుఃఖము కలి గించినది. అది సంధిపత్రమా యనునట్లు తాను చుట్టిన తములపాకులందిచ్చినది. పద్మసింహుడు ఆకులు గ్రహించినాడు. సంధి పొసగినది.

అతడచటినుండి వెడలునప్పుడామె 'సుమన్ విషయ మేమైన తెలిసినదా?'యని యడిగినది.

'లేదు! ఎచటమాయమైపోయినదో యేమో ! గజాధరుడును కనిపింపలేదు. ఇల్లు వాకిలి వదలి యెచటికో లేచి పోయినాడని వినుచున్నాను.'

మరునాటి నుండియు మాష్టరుగారు సదనునికి చదువు చెప్పుట ప్రారంభించినారు. 9 గంటలకు చదువుచెప్పి మాష్టరు వెళ్ళిపోయెడివాడు. సదను డంతట స్నానమొనర్చి భోజనము చేసి పండుకొనును. స్నేహితులు లేరు. ఒంటరితనమువలన నాతనికేమియుఁ దోచుటలేదు. మాట్లాడువారే లేరు - వేళాకోళములు వెక్కిరింతలు లేవు - ఎట్లు తోచును? ఉదయము మాత్రము కొంతసేపు కసరత్తు చేసెడివాడు - అది యాతని కలవాటు అతడు తన గ్రామమున నొక తాలింఖానా నేర్పాటు చేసినాడు. ఇచట తాలింఖానా లేదు. అందుచే తనగదిలోనే దండెములు తీసెడివాడు. సాయంకాలమందు తనసూటు ధరించి సగర్వముగ షికారు వెడలును. ఒకనాడు 'దాల్ మండీ'వైపునకు, మరొకనాడు 'చౌకు'వైపునకు వెళ్ళెడివాడు. అలంకార లాలసయను పెనుభూతము నెత్తి నెక్కి తాండవమాడునట్టి యౌవనావస్థ యాతనిది. అతడు రూపవంతుడు, సుదృఢుడు, బలిష్ఠుడునైన యువకుడు. పల్లెటూరిలో నుండుటవలన చదువుసంధ్యలు లేవు, మాష్టర్ల భయములేదు, పరీక్షల దిగులులేదు. కావలసినన్ని పాలు పెరుగు! ఇంటిలో పాడియున్నది. కావలసినన్ని పాలు త్రాగెడివాడు

ఆపై కసరత్తు చేసెడివాడు. చక్కని శరీరము వచ్చినది. విశాలమైన వక్షస్థలము, నిండైన మెడ! చదువు సంధ్యల వలన, జ్ఞానమువలన జనించునట్టి గాంభీర్యము, కోమలత్వము నాతని మోమున కానరావు. పరాక్రమము, సాహసమే యాతని ముఖమున తాండవించును. చంచలాతితీక్ష్ణములై మాదకములైన నేత్రములు! అయ్యది యుపవనమందలి పెంపుడు మొక్క కాదు - అరణ్యమందలి వృక్షము! ఆతని యందమునకు, ఆతని సుదృఢ తనుశ్రీకి అందరి దృష్టులు నాకర్షితములగును. యువకు లీర్ష్యతో జూచుచుండ, పెద్దలు ప్రేమతో జూతురు. త్రోవపోవువారుసైత మొక క్షణమాగి యాతనిని గాంతురు - దుకాణదారు లీతడెవరో గొప్ప భాగ్య వంతుని బిడ్డడనుకొనిరి.

ఆ దుకాణములే సౌందర్యపు బజారులు. సదనుని గాంచినంతనే బజారులో నొక విధమైన హడావిడి బయలు దేరును. వేశ్యలు మేడలపైనుండి ప్రేమకటాక్షములను బాణ ముల నాతనిపైకి వదలెడివారు - ఈ దారి తప్పివచ్చిన కపోత మెవరి యింటిపై వ్రాలునో! ఈ బంగారుపిట్ట యే వలలో చిక్కునో - యనుకొనెడివారు. సదాచారమును రక్షింపజాలు నటి వివేక మాతనియందు లేదు - కండ్లను పైకెత్తనీయక కాపాడునట్టి ఆత్మసమ్మానమును లేదు. సదనుని దృష్టి యా స్త్రీలవైపే లగ్నమైయుండెడిది. యౌవనావస్థయొక్క పూర్వార్థ మున తమ చెడుకోరికలను వ్యక్తము చేయుచు గర్వించు చుందురు, ఉత్తరార్థమున తమ సద్గుణములను ప్రదర్శించి

గర్వింతురు. తన రసికత్వమును చూపవలెనని యాతనితలంపు. ప్రేమకంటెను, అప్రతిష్ఠనే యెక్కువగ కాంక్షించును. ఆ సమయమున నతనికొక సన్నిహితమిత్రుు డుండి యున్నచో నాతనితో తన కృత్రిమ ప్రేమకు సంబంధించిన విస్తృత గాథల నతిరంజితముగ వర్ణించియుండెడివాడు.

క్రమక్రమముగ నాతని చిత్తచాంచల్యము పెరిగిపోయి, చదువుసంధ్యలు పూర్తిగ నాగిపోయినవి. మాష్టరు వచ్చి పోవుచున్నాడు. కాని యాతనిరాక సదనునికి రుచించుటలేదు. అతని మనస్సెల్లప్పుడును బజారుపై నుండును. అచటి దృశ్యములే తలపునకు వచ్చును. ఆ మగువల హావభావవిలాసములు, ఆ మందహాసములు గుర్తుకు వచ్చును. ఆ స్మృతియందే యాతని మనసు మగ్నమై యుండును. ఈ విధముగ పవలు గడచినంతనే సాయంకాలము చక్కగ ముస్తాబై 'దాల్‌మండీ'కి బయలుదేరును. ఈ మానసిక దుష్ప్రవృత్తికి ఫలితము సామాన్యముగ కలుగునట్లే కలిగినది. రెండుమూడు నెలలలో నాతని సంకోచము పూర్తిగ తొలఁగిపోయినది.

# 13

ప్రాచీన మహర్షులు ఇంద్రియ దమనమునకు రెండు సాధనములను చెప్పినారు - ఒకటి రాగము, రెండవది విరాగము. మొదటి సాధనము మిక్కిలి కఠినమైనదే కాక దుస్సాధ్యముకూడను. కాని, మన నాగరక సమాజము కొన్ని

ముఖ్య ప్రదేశములందు వేశ్య వాటికలను స్థాపించి యా కఠిన మార్గమునే గ్రహించినది. గార్హస్థ్యమును బురదలోని పద్మముగా తయారు చేయవలెనని యా సమాజపు తలంపు.

జీవితమందు కొన్ని భిన్న భిన్నములైన వయస్సులందు భిన్న భిన్నములైన వాసనలకు ప్రాబల్యముండును. బాల్యము మిఠాయిలకు తగిన వయస్సు. వార్ధక్యము లోభమునకు తగిన యవస్థ. యౌవనము లాలసలతో - కోరికలతో నిండిన సమయము. ఈ వయస్సులో వేశ్యవాటికలందు తిరుగుట జీవితమున నొక విప్లవమును రేకెత్తించును. ధైర్యశీలురు, లజ్జాశీలురు, భావశూన్యులు తత్ప్రభావమునుండి తప్పించుకొనగలరు. మిగిలినవారు జారిపోదురు - పడిపోదురు. సందేహము లేదు.

కల్లుపాకలను పట్టణములకు దూరముగ నుంచుటకై ప్రయత్నించుచున్నాము. అంతేకాదు, జూదగృహములను సైత మసహ్యించుకొనుచున్నాము; కాని, యీ వేశ్యల దుకాణములను మాత్రము ఉన్నతములైన మేడలపై, పట్టణమునకు మధ్యభాగమున నలంకరించుచున్నాము. ఇయ్యది పాప ప్రవృత్తి యుత్తేజితమగుటగాక మరేమి?

ఈ విషనాగినులను సామాన్య జనసముదాయమునకు చాల దూరముగ నుంచుట యవసరము. అప్పుడా నింద్యప్రదేశముల కేఁగుటకు మనకు సంకోచము, సిగ్గు కలుగును.

కొన్ని నెలలు గడచిపోయినవి. వర్షకాల మారంభమైనది. తిరునాళ్ళెక్కువైనవి. సదనము వస్త్రాదులతో మస్తాబై

నాలుగు బజార్లు తిరిగివచ్చును. ఆతని హృదయమున ప్రేమ లాలస యగ్నివలె జ్వలించుచున్నది. అతడు సంకోచహీనుడై పోయినాడు. అతడు నిస్సంకోచముగ వేశ్యా వాటికలందు తిరుగును. కిళ్ళీ దుకాణములవద్ద తములపాకులు నములుచు కూర్చుండును. అచటి వారందఱు నితఁడెవఁడో చెడిపోయిన భాగ్యవంతుడని యనుకొనుచు, ఆ వేశ్యావాటికా విశేషములను నిత్యనూతనముగ నాతనిముందు వర్ణించుచుందురు! సదను డీ మాటలను శ్రద్ధతో వినుచుండును. అతడీమధ్య రసజ్ఞుఁడైనాడు. ఇంతకు బూర్వము నిరర్థకము లనిపించిన ప్రేమగీతము లిప్పుడాతని హృదయ తంత్రులను మ్రోగించుచున్నవి. మధుర సంగీతనాదముల కాతని హృదయమున్మత్తమగుచున్నది. ఆమేడ మెట్లెక్కకుండ కష్టముపై నాపుకొనుచున్నాడు.

సదనుడు క్రొత్తఫాషన్ల ననుసరించుట పద్మసింహుని కిష్టమే! కాని యాతని వస్త్రాదు వేషము మాత్రము నచ్చెడిది కాదు. సదనుడు వేశ్యావాటికలో నిలుచుండియుండుటను పద్మసింహుడు చూచినాడు. పినతండ్రిని చూచినంతనే యేదియో కొనుచున్నట్లు నటించెడివాడు. ప్లీడరుగా రాతనిని చూచి తలవంచుకొని వెడలిపోయెడివారు. ఆ వీధికి పోకుండ ఆపవలెనని చాలసారులనుకొనెను; కాని లజ్జావశమున చెప్ప జాలకపోయినాడు.

ఒకనాడు పద్మసింహుడు షికారు వెళ్ళుచుండగా త్రోవలో నిరువురు సజ్జనులు కనిపించిరి. వారిరువురును మునిసిపల్

కౌన్సిలర్లు. అబుల్‌వఫా యొకడు, అబ్దుల్‌లతీఫ్ రెండవవాడు. పద్మసింహుని చూచి ఆగినారు.

వఫా:- సలామ్! జనాబ్! మీ విషయమే మాటాడు చున్నాము. మీతో నొక ముఖ్యమైన విషయము మాట్లాడ వలసియున్నది. మీ యింటికే రావలెనని యనుకొను చున్నాము.

పద్మ:- ఆ విషయమేమో చెప్పండి!

వఫా:- మీ ... ఆమె 'సుమన్‌బాయి' యైపోయినది.

లతీఫ్:- వల్లాహ్! మీది మంచి సెలక్షన్! నాలుగైదు రోజులనుండి యీమె 'దాల్‌మండీ'లో చేరినది. ఈ నాలుగు రోజులలోనే యందరిని ఆకర్షించినది. నిన్న యీమె పాట విని ఆశ్చర్యపడినాము. ఆమె కంఠ మాధుర్యము మరెవ్వారి యందును కన్పట్టదు.

వఫా:- ఎచటకేఁగినను ఆమెను గూర్చిన ప్రశంసయే వినుచున్నాను. పెంటప్రోగులో పడియున్న రత్నమును వెలికి గొనివచ్చుట మీవంటి రసజ్ఞులకే తగును! పదండి! వెళ్ళి వెనుకటి పరిచయమును మరొకసారి పెంపొందించుకొనుడు. మీవల్ల మేమును కృతార్థుల మగుదుము.

పద్మసింహు డీ విషయము విని లజ్జ, గ్లాని, దుఃఖ భారములచే నడఁగిపోయి, తలయెత్తలేకపోయినాడు. తా నే విషయమై భయపడుచున్నాడో యది జరుగనే జరిగినది. ఏకాంతముగ కూర్చుండి యీ దుర్ఘటననుగూర్చి యాలోచింప వలెనని, దీని బాధ్యత తనపై నెంతవఱకున్నదో నిశ్చయించు

కొనవలెననుకొనినాడు. ఖిన్నుడై యనినాడు – 'క్షమింపుడు! నే నచటికి రాజాలను!'

వఖా:– ఎందువలన?

పద్మ:– ఒక గౌరవనీయమైన కుటుంబమునకుఁ జెందిన స్త్రీని యిట్టి స్థితిలో చూడజాలను. మనసులో మీరేమను కొనుచున్నను, ఆమె మా యావిడవద్దకువచ్చి పోవుచుండుట వఱకే నా కామెతో సంబంధము.

ఇరువురు నెంతో బలవంతము చేసిరి; కాని, పద్మ సింహు డిష్టపడలేదు. వారిని విడిపించుకొని యింటికి బయలు దేరినాడు. 'ఈ దుర్ఘటనకు బాధ్యులెవరు?' అను ప్రశ్న యాతని హృదయమున నుదయించుచుండెను. ఆతని వివేచనా శక్తి వెనుకటి విషయముల నాలోచన చేయుచున్నది – నే నామెను యింటినుండి వెడలగొట్టకున్నచో నామె యీ స్థితికి వచ్చియుండెడిది కాదు – యింత పతితయయ్యెడిది కాదు. నా యింటినుండి వెడలిపోయినపిమ్మట నామె కెచటను ఆశ్రయము లభించియుండదు, క్రోధనైరాశ్యములకు లోనైన స్థితిలో తప్పని సరియై ఈ భీషణ నిర్ణయమునకు వచ్చియుండును. ఈ యపరాధమంతయు నాదే!

కాని, గజాధరుడు సుమన్‌పై నింతగా నేలకోపించి నాడు? ఆతడు సుమన్‌ను వారించియున్నచో జగడము తీరి పోయెడిదే! విఠల్‌దాసు మొదటినుండియు నగ్నిని రగుల్కొల్పి యుండుటచే నట్లు జరిగియుండలేదు. నిస్సందేహముగ, అప రాధ మంతయు నాతనిదే! విఠల్‌దాసుపై దోషారోపణ

మొనర్చుకొనుటవలన నాతనికిఁ గొంతధైర్యము, స్థిమితము కలిగినది. ఈ నిశ్చయము, కొన్ని నెలలనుండియు నాతని హృదయమున జ్వలించుచున్న, పశ్చాత్తాపవహ్నిని చల్లార్చి నది. విఠల్‌దాసు నవమానపరచుట కతనికొక యవకాశము లభించినది. ఇంటికేఁగినంతనే విఠల్‌దాసుని కొకయుత్తరము వ్రాయ మొదలిడెను. వస్త్రములు మార్చుకొనవలెనను ధ్యానముకూడ లేదు.

పట్టణమందలి సార్వజన సంస్థలన్నిటికి విఠల్‌దాసు ప్రాణమువంటివాఁడు. జాతీయసేవానిమగ్నుఁడై తన స్వార్థమును, సుఖమునుగూడ మఱచినవాఁడు. ఒకప్పుఁడు అనాథాలయ ములకు చందాలు ప్రోగుచేయును, మఱొకప్పుఁడు విద్యా ర్థులకు విద్యార్థివేతనము లేర్పాటు చేయించుటయందు నిమగ్నుఁడైయుండును. జాతి కెట్టివిపత్తు వాటిల్లినను నాతని హృదయము దేశప్రేమతో పొంగిపోవును. తన యాస్తినంతను దేశమున కర్పించినాఁడు; కాని గర్వపడఁడు. ఉన్నతవిద్య నభ్య సింపలేదు. భాషణశక్తిగూడ సామాన్యమైనదే! గొప్ప నీతి కుశలుఁడుకాని, చతురుఁడుకాని, తెలివిగలవాఁడుకాని, కాఁడు. కాని, దేశప్రేమ యను సుగుణమువలన నాతఁడు పట్టణమున సర్వజన సమ్మాన్యుఁడైనాఁడు.

పద్మసింహుఁడు వ్రాసిన ఉత్తరము విఠల్‌దాసునకు చెంపపెట్టువలె తగిలినది. భ్రమలోపడి నాస్నేహితు నొకనిని అప్రతిష్ఠ పాలుచేసితిని గదా యను దుఃఖముసైత మాతనికి కలుగలేదు. జరిగిపోయిన విషయములకై పశ్చాత్తాపపడుట

యాతడెఱుఁగడు – ఇప్పుడేమి చేయవలెనో నిశ్చయించు కొనుటయే యాతనిపని! అతడొక నిశ్చయమునకు వెంటనే వచ్చినాడు. ఉత్తరీయము పైనవేసికొని 'దాల్ మండీ'కి బయలు దేరినాడు. సుమన్‌బాయి యింటి గుర్తులు తెలిసికొని అమాంతము పైకి వెళ్ళినాడు.

తొమ్మిదిగంటలైనది. సుమన్‌బాయి కచేరీ యప్పుడే సమాప్తమైనది. ఆమె నిద్రించుట కేఁగనున్నది; విఠల్‌దాసుని జూచి యులికిపడినది. ఆమె యాతని ననేక పర్యాయములు ప్లీడరుగారి యింటివద్ద చూచినది. ఉలికిపడి నిలబడినది. తల వంచుకొని – 'దారితప్పి యిటు వచ్చినారేమి?' యనినది.

విఠల్‌దాసు తివాచీపై గూర్చుండి ప్రారంభించి నాడు – 'దారితప్పి రాలేదు. రావలెననియే పనికట్టుకొని వచ్చినాను. నే నెన్నడును నమ్మజాలని విషయమును చూచు చున్నాను. పద్మసింహుని యుత్తరము చదివి ఆయన కెవరో తప్పుడు మాటలు చెప్పియుందు రనుకొంటిని. కాని, యిచట పూజ్యమైన బ్రాహ్మణమహిళ కళంకితమైన మార్గమున చరించుట కనులార చూచుచున్నాను. ఇఁక మన పతనమున కంతులేదు. సుమన్ ! నీవు హిందూజాతికి తలవంపులు తెచ్చినావు!'

సుమన్ గంభీరభావముతో సమాధాన మిచ్చినది – 'మీరట్లు తలచుచున్నారేమోగాని మరెవ్వరును అట్లను కొనుటలేదు. ఇంతకు పూర్వమే నా కచేరికి అనేకులు పెద్ద మనుష్యులు వచ్చి వెళ్ళినారు. వారిలో చాలమంది హిందువు

లున్నారు. వారిలో 'నెవరికిని తలవంపులైనట్లు నాకు కన్పట్ట లేదు. నా యింటికి వచ్చినందులకు - రాగలిగినందులకు చాల సంతసించినారు. హిందూజాతికే సిగ్గులేనప్పుడు నావంటి యబలలు దాని నెట్లుద్ధరింపగలరు? - ఎంతవరకు నుద్ధరింప గలరు?'

'సుమన్! నీవు చెప్పినది నిజము! నిస్సందేహముగ హిందూజాతి యధోగతిని పొందినది. హిందూ స్త్రీలే గనుక జాతిమర్యాదను రక్షించి కాపాడకున్నచో నీపాటికి పూర్తిగ నాశనమై లుప్తమైపోయి యుండెడిది. కాని, అట్టి పుణ్య మూర్తులే యీ విధముగ మర్యాదా భంగమొనర్చుట శోచ నీయము! సుమన్! నీ కింటివద్ద చాలకష్టముగ నున్నదని, నీ భర్త దరిద్రుడని, కోపిష్ఠియని, చరిత్రహీనుడని, నిన్ను యింటినుండి వెడలగొట్టినాడని యంగీకరింతును. కాని, నీవుమాత్రము నీచజాతికి జెందిన కులట లొనర్చు పని చేసితివి. భర్తపై కోపించి పుట్టినింటికి కేఁగుట కలదు. పుట్టినింటివద్ద కుదరనిచో 'నుయ్యో గొయ్యో' చూచుకొందురు. లక్షల కొలఁది నీ సాటి సోదరీమణులు ఎట్టి స్థితిలో హాయిగ సంతోష ముతో జీవితము గడపుచున్నారో ఆ స్థితి నీ కసహ్యమైపోయి, లోకలజ్జను - కులమర్యాదను వీడి యీ దుష్టమార్గమును గ్రహించితివి. నీ కంటెను దీన, దరిద్ర, దుఃఖితలను నీ వెన్న డును చూడలేదా? కాని, ఇట్టి నీచమైన ఆలోచనలు వారిని సమీపింపవే! కానిచో నెన్నడో యీ స్వర్గఖండము నరక మైపోయి యుండెడిది.'

సుమన్ నేత్రములు సజలములైనవి. లజ్జాభరమున తల యెత్తలేకపోయినది. విఠల్‌దాసు మఱల ప్రారంభించినాడు - 'నీ కిచట భోగవిలాససామగ్రి కావలసినంత లభించు ననుటలో సందేహము లేదు; కాని నీ వా సామగ్రికై యెంతటి విలువయైన జీవిత సర్వస్వమును విక్రయించుచున్నావో ఆలోచింపుము. వాటికొఱకై మానమర్యాదలను విక్రయించుటయా ? నిన్నాదరించి, నీ పాదరజమును శిరమున నిడుకొనిన వారే నిన్ను చూచుట పాపమనుకొనుచున్నారు...

సుమన్ మాట మధ్యలోనే యందుకొనినది - 'మహాశయా ! నా కిప్పుడు లభించుచున్న ఆదరసత్కారములలో శతాంశమైనను నా కిదివరలో లభింపలేదని నా యనుభవము. నేను భోగలాలసలకై యీ దుష్టపథమున నడుగిడినానని మీ భావమై యుండవచ్చును. కాని యదార్థ మది కాదు. మంచిచెడుగులను గుర్తింపజాలనంతటి గ్రుడ్డిదానను కాను. నే నొనర్చిన పని నికృష్టమైనదని నే నెఱుంగుదును. కాని తప్పనిసరియైనది. ఇంతకంటె గత్యంతరము లేదు. పద్మసింహుని యింటినుండి బయలుదేరి భోలీబాయి యింటికిచేరి యామె శరణుజొచ్చితిని. ఆ స్థితియందు సైతము నే నీ చెడు త్రోవనుండి తప్పుకొనియే తిరిగితిని. గుడ్డలు కుట్టి జీవితము గడపవలెననుకొంటిని. కాని, దుర్మార్గుల బాధ పడలేక యీ గోతిలో పడినాను. ఈ కళంకితమైన గోతిలో పడినను సత్యమును మాత్రము దాచనని ప్రతిజ్ఞ చేసినాను. పాడుదును - ఆడుదును; కాని, నన్ను నేను భ్రష్ట మొనరించుకొనను.'

'భ్రష్టవైపోవుట కిచట కూర్చుండుటయే చాలును!'

'ఇంక నేనేమి చేయగలను ? నా జీవితము గడుపుకొనుటకు మఱొక యుపాయ మేదియో మీరే చెప్పుడు?'

'ఈశ్వరుడు నీకు సద్బుద్ధిని ప్రసాదించుచో, సామాన్య జీవితమును గడపుటకీ వేశ్యవాటికలో గూర్చుండనక్కఱలేదు. నీ యింటిలో గూర్చుండి చేసికొనదగిన వృత్తులెన్నియో యున్నవి.'

ఇంక సుమన్‌కు వేఱొక వంక దొరకలేదు. ఆతని సముత్సాహ మామెను వశీభూత నొనర్చుకొనినది. సత్య పురుషులను మనము మోసగింపజాలము. వారి సత్యమే మనలో నున్నత భావములను జాగృత మొనర్చును. ఆమె యనినది - 'ఇచట కూర్చుండుట నాకే సిగ్గుగానున్నది. నా విషయమున నెట్టియేర్పాటొనరింతురో చెప్పుడు! నేను పాడగలను; సంగీతము నేర్పగలను.'

'ఇచట అట్టి పాఠశాల లేదుగదా!'

'నేను కొంతవఱకు చదువుకొనినాను. ఆడపిల్లలకు చదువు చెప్పగలను.'

'అవును! బాలికా పాఠశాల లనేకములున్నవి. కాని వారు నిన్ను చేర్చుకొందురో లేదో!' యని విఠల్‌దాసు విచార భావముతో ననెను.

'అయిన నన్నేమి చేయుమందురు ? నాకు నెలకు 50 రూపాయలిచ్చునట్టి హిందూజాతి ప్రియుడు - జాతి భక్తుడున్నాడా?'

'అది చాల కష్టము!'

'అయిన విసిరింపదలచినారా? వద్దుదంపింపదలచినారా? నే నంతటితో సంతోషించుదాననుకాను.'

విఠల్‌దాసు సిగ్గుతో - 'ఏతంతు శరణాలయమున నుండుట కిష్టపడినచో నేర్పాటు చేయింతును.' అనినాడు.

సుమన్ కొంచెముసేపాలోచించి - 'నా కిట్లుండుట యైన నిష్టమేగాని అచటి స్త్రీల గుసగుసలు సహింపజాలను - అచట క్షణమైనను నుండజాలను' అనినది.

'ఇయ్యది హిరణ్యాక్షవరము! నేనెందరినోళ్ళు నొక్కగలను? శరణాలయమువారు నిన్నుగ్రహించుట కంగీకరింతురో లేదో కూడ యనుమానమే!'

'తమ హిందూజాతి యింత హృదయశూన్యమై పోయినప్పు డా జాతి మర్యాదను కాపాడుటకై నే నేల కష్టముల సహింపవలెను? నేను ప్రాణము లర్పించుట దేనికి? మఱొక్క కోరిక కోరుదును. దానిని సైతము మీరు నెరవేర్ప జాలకపోయినచో నిఁక మిమ్ములను బాధింపను. ప్లీడరుగారి నొక పర్యాయ మిచటకు రప్పింపుడు. వారితో నేకాంతముగ మాటాడవలసియున్నది. పిమ్మట నే నిక్కడనుండి వెడలి పోదును. మీరు జాతీయ నాయకు లనుకొనువారి దృష్టిలో నా పశ్చాత్తాపమున కెంత విలువయున్నదో చూడవలెనని యున్నది.'

విఠల్‌దాసు సంతోషముతో - 'ఆపని చేయగలను! ఎప్పుడాతనిని తీసికొని రమ్మందువు?' అని యడిగెను.

'మీా యిష్టము!'

'మాట తప్పవుగదా!'

'ఇంకను నంతటి నీచురాలను కాలేదు.'

# 14

విఠల్‌దా సిందులకు చాల సంతసించినాడు. ఈ చిన్న పనికి పద్మసింహుడు తిరస్కరింపడని యాతని నమ్మకము - అతనివద్ద కేఁగుటయే యాలస్యము - తప్పక యంగీకరింపగలడని విశ్వాసము. హోలీపండుగకు కొన్ని దినముల ముందునుండియే యాతడు ప్లీడరుగారింటికి వెళ్ళుటలేదు. చేతనైనంతవఱకు ప్లీడరుగారిని నిందించుటలో నెట్టిలోటును చేయలేదు. అందుల కాతఁడు మనసులో సిగ్గుపడుచున్నను, పద్మసింహుని యింటి కేఁగుట కేమాత్రమును సంకోచింపలేదు. బయలుదేరినాడు. రాత్రి పదిగంటలైనది. పట్టణపు సందడి యింకను తగ్గలేదు. విఠల్‌దాసు తనకు కన్పట్టిన ప్రతిపరిచయస్తునితోడను తన విజయమునుగూర్చివివరించును - 'ఎచటినుండి వచ్చుచున్నానో తెలియునా? సుమన్‌బాయి సేవకై వెళ్ళితిని. నా మాటలకు తలయెత్తలేకపోయినది. విధవాశ్రమమున కేతెంచుట కంగీకరించినది. పనిచేయువారి పద్ధతియే యిట్లుండును! తెలిసినదా?' అని.

పద్మసింహుడు మంచముపై పరుండి నిద్రాదేవి నాహ్వానించుచున్నాడు. ఇంతలో విఠల్‌దాసు కేకవేసినాడు. ఏదియో క్రొత్తసమాచార ముండియుండును. అందుచేతనే

యింత ప్రొద్దుపోయి వచ్చినాడనుకొని పద్మసింహుడు బయటికి వచ్చినాడు.

విఠల్‌దాసు:- దయచేయుడు! మీకు శ్రమ కలిగించినందులకు క్షమింపుడు. సుమన్‌బాయి యింటికి వెళ్ళివచ్చినాను. మీ యుత్తరమును చూచినంతనే యామెను సరియైన మార్గమునకు గొనివచ్చుటకై యామె యింటికి పరుగెత్తితిని. ఇయ్యది కేవల మామెకేకాదు – జాతికే యప్రతిష్ఠ! అచట ఆమె హడావిడి చూచి యాశ్చర్యపడినాను. ఆ యమాయకురాలిప్పుడు 'దాల్‌మండీ'కి రాణియైపోయినది. ఇంతలో నామె యింతటి చతుర యెట్లైనదో యాశ్చర్యముగనున్నది. కాస్సేపు నా మాటలువిని కంటనీరు పెట్టినది. ఇనుము యింకను వేడిగనే యున్నదని గ్రహించి నాలుగు దెబ్బలు వేసితిని. దారికి వచ్చినది. మొదట విధవాశ్రమము పేరు విని భయపడినది. 'నాకు నెలకు 50 రూపాయలిప్పింపు'డని యడిగినది. 50 రూపాయ లిచ్చువారెవరున్నారు? మీ రెఱుఁగరుకనుకనా! నేను హామీ యీయలేదు. చివరికొక షరతు పెట్టినది. ఆషరతు పూర్తిచేయుట మీపని.

పద్మసింహు డాశ్చర్యచకితుడై విఠల్‌దాసు వైపు చూచినాడు.

విఠల్ :- భయపడనద్దు! సామాన్యమైన షరతు! – మీతో నేదియో మాట్లాడవలెనట. మీ రొకసారి యట కేఁగవలెను. ఎప్పుడు వెళ్ళెదురు? రేపు ఉదయము వెళ్ళెదురా?

పద్మసింహు డాలోచనాశీలుడు. గంటల తరబడి ఆలోచించిననేగాని యేవిషయమున నొక నిర్ణయమునకురాడు. ఉపరతు పెట్టుటలో నామె యభిప్రాయమేమి? నాతో మాట్లాడగోరు విషయమేమైయుండును? ఆమాటలేవో యుత్తరము వ్రాయరాదా? ఇందులో నేదియో రహస్య మిమిడి యున్నది. నన్నవమానపఱుపగోరుచున్నదేమో! నేను వెళ్ళి నప్పటికిని ఆమె తనమాట నిలబెట్టుకొననిచో నేమికావలెను? తప్పించుకొనుట కాతని కీ యుక్తి మిక్కిలి యుపయుక్తముగ తోచినది – 'నేను వెళ్ళినందువలన ప్రయోజనములేదు. నా పరువు ప్రతిష్ఠలను మట్టిలో గలపదలంచినచో నది వేరు విషయము!'

'ఒక జాతీయకార్యమున మీవంటివారిట్లు మీనమేషములు లెక్కించుట విచారకరము! ఒక హిందూస్త్రీ నూతిలో పడిపోయియుండ, ఆజాతికి జెందిన ఆలోచనాశీలురై యుండియు నామె నుద్ధరించుట కిట్లు వెనుక ముందాడుట విచారకరమైన విషయము! మూర్ఖులైన రైతులను, జమీందార్లను పిండుట మాత్రమే మీపనియా? మీవలన మరేమియు జరుగదా?'

పద్మసింహు డీ తిరస్కారవచనముల కెట్టి సమాధానము నీయలేదు. తన అకర్మణ్యతకాతనికే సిగ్గగుచున్నది. ఈ తిరస్కారమునకు తగినవాడనే యనిపించినది. కాని, ఈ పాపమున కంతకు మూలకారకుడైన వాని నోటినుండి యిట్టి

మాట లప్రియముగ నేయున్నవి. సమాధానము చెప్పవలె నను ఆవేగమును మిక్కిలి కష్టముపై నాపుకొనినాడు. నిజమున కాతడు సుమన్‌ను రక్షింపదలంచుచున్నాడు; కాని గుప్తమార్గమున. 'ఇంకేమైనను షరతులున్నవా?' అని యడిగినాడు.

'ఉన్నవి! కాని వాటిని పూర్తి చేయు సామర్థ్యము మీకున్నదా? ఆమె జీవికకు నెలకు 50 రూపాయలు కావలెనట! మీరివ్వగలరా?'

'50 రూపాయ లివ్వజాలను; కాని, 20 రూపాయ లివ్వగలను.'

'ప్లీడరుగారూ! ఈ మాటలతో నేమి ప్రయోజనము! కాస్త శ్రమకు వెనుదీయుచున్నారు. నెల కిరువది రూపాయ లిత్తురా?'

'తప్పక యిత్తునని వాగ్దానము చేయుచున్నాను. నా అదాయము పెరిగినచో పూర్తిగ 50 రూపాయలిత్తును.'

'సరే! ఒకవేళ 20 రూపాయలు మీరిచ్చినను, మిగిలిన ముప్పదిరూపాయ లెవరిత్తురు? మిగిలినవారి వ్యవహారము మీ రెఱుంగనిదికాదుగదా! అనాథాలయమునకు కావలసిన చందాలు వసూలగునప్పటికే ప్రాణములుపోవుచున్నవి. నేను వెళ్ళుచున్నాను. నాచేతనైనంతవఱకు ప్రయత్నింతును. కాని కార్యము సానుకూలము కాకపోయినచో నా దోషమంతయు మీదే!'

# 15

సాయంసమయము. సదనుడు 'దాల్‌మండీ'లో మేడల వైపు, కిటికీలవైపు చూచుచు నడచుచున్నాడు. సుమన్ అచటికి చేరిననాటినుండి యేదో వంక బెట్టుకొని యాతడాయింటి వద్ద కొలదిసేపాగును. అతడా సరళ సౌందర్యమూర్తికి తన ప్రేమను సమర్పింప గోరుచున్నాడు; కాని, అందుకు తగిన వీలు చిక్కుటలేదు. ఆమె యిల్లెల్లవేళల రసికులతో నిండి యుండును. అచట నెవ్వరైన తన పినతండ్రి నెఱిగిన వా రుందురేమోయని యాతని భయము. అందుచే పైకి పోవుట కాతనికి ధైర్యము లేకుండెను. తన ప్రబలమైన ఆకాంక్షను లోలోన నణచుకొనుచు నిత్యము నిరాశతో నింటికేగును. కాని, నేడుమాత్ర మెంతయాలస్యమైననుసరే, ఆమెను కలిసికొనితీరవలెనని నిశ్చయించుకొనినాడు. విరహ దాహము నాతడు సహింపలేకున్నాడు. అతడు సుమన్ యింటివద్దకు చేరినాడు. శ్యామకల్యాణి రాగములో మధుర సంగీతనాదము వినిపించుచున్నది. ముందుకు సాగి రెండు గంటలసేపు పార్కులో గూర్చుండి,తొమ్మిది గంటలకు మఱల 'దాల్ మండీ'కి బయలుదేరినాడు. ఆశ్వయుజమాసపు చంద్రుని యుజ్జ్వల కిరణములు సుమన్‌బాయి మేడపై బంగరుపూత పూసినవి. అతడు మఱల సుమన్‌బాయి గుమ్మముముందు ఆగినాడు. సంగీత మాగిపోయినది. మాటల చప్పుడు సైతము వినబడుటలేదు. ఎవరును లేరని నిశ్చయించుకొనినాడు. అతని శ్వాసవేగము హెచ్చినది. గుండెవేగముగ కొట్టుకొనుచున్నది.

ఆ సమయమున సుమన్ ఆలోచన సుభద్రపైకి పోయినది. లోలోన నామెతో తనను పోల్చుకొనుచున్నది. పద్మసింహుడు కోర్టునుండి వచ్చినంతనే సుభద్ర యెంతో ఉల్లాసముతో ఫలహారములు తయారుచేసి తమలపాకులు చుట్టియిచ్చును. అతడింటికి వచ్చినంతనే యెంతో ప్రేమ విహ్వాలయై యాతనిని కలిసికొనును. నేనామె ప్రేమాలింగనమును సైతము గాంచితిని ! అహో ! అయ్యది యెంత భావపూర్ణమైనది ! ఎంత సత్యమైనది ! నా కా సుఖమెక్కడిది ? ఇచటికి వచ్చువా రంధులో లేక వాక్శూరులో యైయుందురు. ఒక్కొక్కడు తన డబ్బు చూపును, మరొకడు తన మాటలను చూపును. వారి హృదయములు భావశూన్యములై, శుష్కములై, తుచ్ఛములై యుండును.

ఇంతలో సదనసింహుడు గదిలో నడుగు పెట్టినాడు. సుమన్ ఉలికిపడినది. ఆమె యాతనిని చాలసార్లు చూచినది. ఆతని పోలికలు పద్మసింహుని పోలి యున్నవి. ఆతని మోము లోని గాంభీర్యమునకు బదులీతని మోమున నుద్దండతయున్నది. అమాయకుడై, సరళభావముతో నీ యువకు డనేక పర్యాయములు తన యింటివైపు చూచుచుండుట నామె కనిపెట్టినది. పిట్ట రెక్కలు విప్పుచున్నది, ఎగిరి యే యింటిమీాదనో వ్రాలుననుకొన్నది. అతడు నేడు తన యింటి కేతెంచినంతనే యామెకు గర్వముతో గూడిన ఆనందము కలిగినది. కుస్తీలో గెలిచిన వస్తాదుకు కలిగెడి గర్వ మామెకును కలిగినది. ఆమె లేచి సదనునివైపు చిరునవ్వుతో చేయి జాపినది.

లజ్జచే నాతనిమోము అరుణారుణ మైపోయినది. కనులు వ్రాలిపోయినవి. పరవశు డైపోయినాడు. నోటమాటరాలేదు.

అతడు సుమన్‌బాయికి తన పూర్తిపరిచయము నొసంగకపోయినను తన పేరు మాత్రము సదనసింహుడని చెప్పినాడు. కాని ఆతని రహస్య మెన్ని రోజులో దాగలేదు. సుమన్ హిరియాద్వారా ఆతని విషయము పూర్తిగ తెలిసికొనినది. నాటినుండి యామె మఱింత చిక్కన బడినది. అతనిని చూడకుండ నుండజాలదు. ఆమె హృదయము రోజు రోజుకు అతనివై పాకర్షింపబడుచున్నది. అతడచట నుండగా నెంతటి భాగ్యవంతులనైనను లెక్కచేయదు. కాని తన యీ ప్రేమ యనుచితమైనదనియు, నిషిద్ధమైనదనియు తలంచి రహస్యముగ దాచుచున్నది. ఈ విషయము సుభద్రకు, పద్మసింహునికి తెలిసినచో వారు త న్నేమనుకొందురు? వారి దృష్టిలో తా నెంతటి నీచురాలై పోవును? సదనసింహుడు ప్రేమ రహస్యముల నెత్తినపు డామె మాట తప్పించి, ప్రసంగమును మార్చును. కాని, సదనునిమాత్ర మట్లే చేతికి చిక్కించుకొని యుంచుకొనవలె ననుకొనును. ఈ ప్రేమ కల్పనమువలన లభించు ఆనందమును కోల్పోవు టామె కిష్టములేదు.

కాని, సదను డామె భావముల నెఱుంగజాలకపోవుటచే, యామె యీ ప్రేమశైథిల్యమునకు గారణము తన నిర్ధనత్వమే యనుకొనెడివాడు. రోజురోజుకు సుమన్ దూరదూరముగ నుండుటనుగాంచి పవిత్రమైన ప్రేమ కిచట స్థానములేదను కొనెడివాడు. ఇచటి యీ దేవత లుపాసనతో ప్రసన్నలుకారు;

మాటలతో సంతసింతురు! కాని డబ్బెట్లు వచ్చును? ఎవరి నడుగగలడు? తత్ఫలితముగ తనకిక్కడ భోజన సౌకర్యము బాగుండలేదనియు, పినతండ్రి నడుగుటకు సిగ్గుగా నున్నదనియు, కొంతడబ్బు పంపుడనియు తండ్రికి జాబు వ్రాసినాడు.

ఈ యుత్తర మందినంతనే భామ భర్తను దెప్పి పొడువ నారంభించినది — 'ఈ మాత్రపు తమ్మునిపైననేనా మీకింతటి యభిమానము! గర్వముతో భూమిపై నాగుట లేదు! ఇప్పటికైనను తెలిసివచ్చినదా?' సదనుడే యిట్లు కపట నాటకమాడుచున్నాడని మదనసింహుని యనుమానము. తన సోదరునిపై నాతని కచంచల విశ్వాసమున్నది. కాని భార్య బలవంతముపై డబ్బు పంపక తప్పినదికాదు. సదనుడు ప్రతిరోజు పోష్టాఫీసుకు వెళ్ళి టపాబంట్రోతు నడుగును. చివరకు నాల్గవనాడు 25 రూపాయల మనియార్డరు వచ్చినది. పోష్టుమన్ అతని నెఱుంగును. అందుచే డబ్బుముట్టుటలో నిబ్బంది కలుగలేదు. సదనుని సంతోషమున కంతులేదు. బజారుపోయి మంచి సిల్కుచీర కొనినాడు. కాని సుమన్ కీ చీర నచ్చదేమో యను దిగులు బాధించుచునే యున్నది. బాగుగ చీకటిపడిన తరువాత సుమన్ యింటికి చేరినాడు. చీరతీసి యచటి బల్లపై బెట్టినాడు. ఆతని రాకయందలి యాలస్యమునకు సుమన్ లోలోన విచారించుచున్నది. అతనిని జూచినంతనే యామె మోము వికసించినది — 'ఏదో తెచ్చినావే!'

సదనుడు సిగ్గుతో – 'ఏమియు లేదు. నేడు బజారులో నొక చీర కనిపించినది. నాకు నచ్చినది. నీకొఱకు తెచ్చి నాను.' అనెను.

ఇంతడబ్బు ఇతని కెట్లు లభించినది? ఇంటిలోనుండి దొంగతనముగ తెచ్చినాడేమో! ప్లీడరుగారింత డబ్బు యెందు కిత్తురు? లేక, ఆయనను మోసగించి, మఱొక వంకపెట్టి తెచ్చినాడేమో! అనుకొనినది. చీరను త్రిప్పియిచ్చివేయవలె ననుకొన్నది. కాని, యాతని మనసుకు కష్టముతోచునేమో! ఈచీరను గ్రహించినచో నాతని యీ దురుత్సాహము పెరిగి పోవునేమో! ఈసారికి దీనిని గ్రహించి, యిక ముందిట్లు చేయవద్దని మందలింపదలచి — 'నీ యనుగ్రహము వలన కృతార్థురాలనైతిని. కాని, నేనిట్టి యుపహారముల నాశించుట లేదు. నావద్దకు మీరు వచ్చుచుండుటయే పదివేలు! నాకు కావలసినది మీ కృపాదృష్టి మాత్రమే!' అనినది.

ఈ పారితోషికము వలన నామె దృష్టిలో నేమాత్ర మును మార్పు పొడసూపక పోవుటచే తనప్రయత్నమంతయు విఫలమైనట్లాతడు భావించినాడు. ఎగిరి ఆకాశమందలి నక్ష త్రములను గ్రహింపనుంకించినట్లు, ఈ స్వల్పపారితోషిక ముతో నామెనుండి మహత్ఫలము నాశించినందుల కాతడు లజ్జించినాడు. ఇక, బహుమూల్యమైన ప్రేమోపహారము నీయవలెనను ఆలోచనలో పడినాడు. కాని, కొన్ని నెలల వరకు నాతని కట్టి యవకాశము లభింపలేదు.

ఒకనాడాతడు స్నానమునకు బయలుదేరినాడు. సబ్బు కనిపింపలేదు. లోని స్నానాగారములోనికేఁగి చూచినాడు. గూటిలోనున్న గాజులపై నాతని దృష్టిపడినది. సుభద్ర యప్పుడే స్నానమొనర్చి వెళ్ళినది. ఆమె గాజులు తీసి యచట నుంచినది. వెళ్ళునపుడు గుర్తురాలేదు. కోర్టువేళ యగుటచే నామె వంటయింటిలోనికి వెళ్ళినది. గాజులచటనే యుండి పోయినవి. సదనుడు గభాలున వాటిని తీసికొనినాడు. ఆ సమయమున నాతనిమనసులో నెట్టి దుష్టభావములులేవు. కొంతసేపు పినతల్లిని భయపెట్టి యిచ్చివేయవలెననుకొనినాడు. గాజులను దీసి బయటికితెచ్చి పెట్టెలో పెట్టినాడు. భోజనములైన పిమ్మట సుభద్ర అలసి నిద్రపోయి మూడుగంటలకు లేచినది. ఇంతలో పద్మసింహుడు కోర్టునుండి వచ్చుటచే నాతనితో మాట్లాడుచున్నది. గాజులనుగూర్చిన ధ్యానమేలేదు. గాజుల విషయమేమైన వచ్చునేమోయని రెండు మూడుసార్లు సదనుడు లోనికేఁగినాడు. కాని, ఆగొడవయేలేదు. సాయంసమయమున షికారుకు పోవునప్పు డాతనికొక యాకస్మిక భావము తట్టి, యా గాజులను జేబులో పెట్టుకొనినాడు. ఈ గాజులు సుమన్‌బాయి కిచ్చినచో నెంతబాగుండును! ఇంటిలో నన్నెవ్వరు నడుగరుకదా! అడిగినను నాకు తెలియదు పొమ్మందును. నౌకరు లెవరైన తీసినారేమోయని యనుకొందురు. ఈ విధమైన దుష్టభావన లాతని సంకల్పమును బలపరచినవి. అతని మనసు షికారుపైకి పోలేదు. అతడొక చిన్న మఖమల్ పెట్టెను సంపాదించి దానిలో నా గాజులు పెట్టి సుమన్‌యింటికి

బయలుదేరినాడు. ఈ బహుమూల్యమైనవస్తువు నతిసామాన్య వస్తువు నిచ్చుచున్నట్లీయవలెనని యాతని యుద్దేశ్యము. అతడు చాలసేపు కూర్చుండియుండెను. నే డాతనికి ప్రేమాలాపములపై మనసు పోవుటలేదు. ఈ గాజులనెట్లు బహూకరించుటయా యనునదే యాతనికిపట్టిన చింత. చాలసేపైన తరువాత లేచి నెమ్మదిగ పెట్టెను తీసి మంచముపైనుంచి గుమ్మమువైపునకు బయలుదేరినాడు. సుమన్ చూచినది – 'ఈ పెట్టెయేమిటి?'అని అడిగినది.

'ఏమియులేదు, ఖాళీపెట్టె!'

'కాదు! ఆగుము! నేను చూతును!' ఇట్లనుచు నామె యాతని చేయిపట్టుకొని ఆపినది. పెట్టెతెఱచి చూచినది. ఈ గాజులనామె సుభద్రచేతిని చూచినది. వాటిచేత అందమైనది. గుర్తించినది. గుండెపై ఱాయిపెట్టినట్లైనది. విచారముతో – 'ఇటువంటి వస్తువులు కోరుదానను కానని యెన్నిసారులో చెప్పితిని. నన్ననవసరముగ నవమానించుచున్నావు!' అనినది.

సదనుడు మహారాజువోలె నిర్లక్ష్యముగ ననినాడు – 'ఈ దరిద్రుడర్పించు పత్రపుష్పఫలతోయములను స్వీకరింపవలసినదే!'

'నా కన్నిటికంటెను మూల్యవంతమైనది మీ దయ! అదియున్న చాలును! నా హృదయమున మీయెడ పవిత్రమైన ప్రేమయున్నది. దాని కే కోరికలులేవు. మీ ప్రవర్తనవలన మీరు నన్నొక బజారు స్త్రీగా భావించినట్లు స్పష్టమగుచున్నది.

మీ కొక్కరికే నాప్రేమను – నాసర్వస్వమును నర్పించితిని. కాని మీరుమాత్ర మద్దాని మూల్యమును గుర్తింపలేదు.'

అతని కనులు చెమ్మగిలినవి. నిజముగ తనదే తప్పు అనుకొనినాడు. బహుమూల్యమైన ఆమె ప్రేమ నీ తుచ్ఛమైన కానుకలను కోరుదానిగ తలచినాను. అఱచేతిలో వైకుంఠము చూపనెంచినట్లీమెయెడ ప్రవర్తించుచున్నాను. ఈమె ప్రేమకటాక్షమునకై తమ సర్వస్వము నర్పించునట్టి యైశ్వర్యవంతు లీ పట్టణమున నెందరులేరు? ఎందరో భాగ్యవంతులు వచ్చిపోవుచున్నారు; కాని వారివైపు కన్నెత్తియైన జూడదు. కాని నేనొక్కడనే యిట్టి ప్రేమరత్నమును రాగిడబ్బులతో కొనజూచుచున్నాను. ఈ గ్లానిపూర్ణమైన భావముతో నాతని కేమపు వచ్చినది. తా ననిన మాటలకు కష్టము తోచినదని సుమన్ కనిపెట్టినది. కరుణాస్వరముతో – 'కోపము వచ్చినదా?' అనినది.

సదనుడు గ్రుడ్లనీరుగ్రుక్కికొనినాడు – 'అవును! కోపమే వచ్చినది.'

'కోప మెందులకు?'

'నీవు నన్ను, నా హృదయమును బాణములతో ఛేదించుచున్నావు! నేనిట్టి తుచ్ఛవస్తువులతో నీప్రేమను కొనజూచుచున్నా ననుకొనుచున్నావు.'

'మఱి యీ వస్తువులను గొనివచ్చు టెందులకు?'

'అది నా యిష్టము!'

'కాదు ! ఇకనుండి వద్దు ! ఇట్లనుచున్నందుకు క్షమింపుము!'

'సరే!'

'మీ మొగము జూచి యీ కానుకను ఉంచుకొందును; కాని, దీనిని నా వద్ద దాచినట్లు భావింతును. ఇంకను నీవు స్వతంత్రుడవుకావు. నీవు నీ యాస్తికి యజమానుడవైనప్పుడు నా యిష్టము వచ్చినంత దోచుకొందును. ఇప్పటినుండి వలదు.'

# 16

విఠల్‌దాసు ఎన్నడును నొక పనిని అసంపూర్ణముగ వదలిపెట్టడు. పద్మసింహుని విషయమున నిరాశజెంది సుమన్‌కై 50 రూపాయల నేర్పాటు చేయుటకు నెలసరి చందాలవిషయ మాలోచింప సాగినాడు. అతడు స్థాపించిన సంస్థలన్నియు చందాలతోడనే నడుచుచున్నవి. చందాలు వసూలుచేయుట కనేక కష్టముల నెదుర్కొనవలసి వచ్చుచున్నది. కాని, చందాలు తప్ప డబ్బు ప్రోగుచేయుట కాతనికి మఱొక యుపాయము కన్పట్టలేదు. సేఠ్ బలభద్రదాసు పట్టణమున ప్రధాన నాయకుడు, ఆనరరీమేజస్ట్రేటు, మునిసిపల్ చైర్మన్. విఠల్‌దాసు ముందుగ బలభద్రదాసువద్ద కేఁగినాడు. బలభద్ర దాసు తన బంగాళాలో పడకకుర్చీపై బరుండి హుక్కా-పీల్చుచున్నాడు. పచ్చగ, పల్చగ నుండును - కాని మంచి రసికుడు! ఏ పనియందైనను బాగుగ ముందు వెనుక లాలో

చించిగాని ప్రవేశింపడు. విఠల్‌దాసు చెప్పిన విషయము విని యనినాడు - 'ఉద్దేశ్యము మంచిదే! కాని మీ రీ గొడవలో చిక్కుకొనవద్దని నా సలహా. లోకనిందవలని భయములేని దానిని, సిగ్గువీడిన స్త్రీని యే శక్తియు రక్షింపజాలదు. మన యవయవములందొకటి వికృతమై చెడిపోయినప్పుడు దాని విష మితర యవయవములకు వ్యాపింపకుండ నఱికివేయుటయే మంచిది. సంఘవిషయమున గూడ నీ నియమమే వర్తించును. నాయుద్దేశ్యముతో మీ రేకీభవింపరని నే నెఱుంగుదును. కాని నాయుద్దేశ్యమును నేను స్పష్టమొనర్చితిని. ఈ వేశ్యను శరణాలయమున జేర్చు సలహా మాత్రము నే నెన్నడు నీయను.'

విఠల్‌దాసుకి రోషము కలిగినది - 'ఈ విషయమున నాకు సాయము చేయరన్నమాట! మీమాటల సారాంశ మిదియేగదా! మీవంటిమహాపురుషులే యిట్లున్నచో నితరుల విషయ మడుగనేల? క్షమింపుడు! మీ యమూల్యమైన సమయమును పాడుచేసితిని!'

ఇట్లని విఠల్‌దాసచటినుండి సేఠ్‌చిమ్మన్‌లాల్‌వద్ద కేగినాడు. శ్యామవర్ణము! స్థూలకాయుడాతడు. సామాన్య స్థూలముకాదు - ఎముకలకు బదులు మాంసము, మాంసముండవలసినచోట వాయువు నిండియున్న శరీరము! శరీరమువలెనే యాతని భావములును వికృతములై యుండును. అతడు సనాతన సభకు సభాపతి. రామలీలోత్సవ కమిటీ చైర్మన్, రామలీలాపరిషత్తున కార్యకర్త. రాజనీతియనిన విషసర్పమనియు, పత్రికలు కోరలంవటివనియు నాతనిభావము.

అధికారుల వెంట తిరుగుపిచ్చిమాత్రము బాగుగనున్నది. ఆంగ్లేయ సమాజమున నాతనికి విశేషగౌరవమున్నది. ఆతని సద్గుణములను వారుమిక్కిలి కొనియాడుచుందురు. అత డుదార స్వభావుడుకాడు; కృపణుడును కాడు. ఈ విషయమున చందా దారుల పట్టికయే యాతని మార్గమును నిశ్చయించుచుండును. ఆతని సమస్త దుర్గుణములను కప్పిపుచ్చునట్టి సద్గుణ మొకటి యాతనిలో నున్నది. అది యాతని వినోదప్రియత్వము.

విఠల్‌దాసు చెప్పిన విషయము వినినాడు – 'మహాశయా! మీరు పూర్తిగ విరసులైపోయినారు. మీలో రస మేమాత్రమును కన్పట్టుటలేదు. బహుకాలమునకు నేడు 'దాల్‌మండీ'లో నొక రత్నము కానవచ్చినది. ఆ రత్నమును మాయ మొనర్పజూచుచున్నారు. కనీసము ఈసారి రామలీలో త్సవమువఱకైన నాగుడు. కల్యాణమునాడు కచేరీ పెట్టుదము. హుషారుగానుండును. మహమ్మదీయ స్త్రీలు వచ్చి దేవాలయములు నాశన మొనర్చుచున్నారు. బ్రాహ్మణస్త్రీ నైనపు డభ్యంతర మేముండును? సరే! క్షమింపుడు! ఏదో వేళాకోళమున కంటిని. ఇటువంటి శుభకార్యములు మీ చేతి మీదుగ నడచుచున్నందుకు ధన్యవాదములు! ఏదీ! చందాల జాబితా!'

విఠల్‌దాసు తల గోకికొనుచు ననినాడు – 'ఇంతవఱకు బలభద్రదాసు వద్దకు మాత్రమే వెళ్ళితిని. ఆతని విషయము మీ రెఱుఁగనిదేమున్నది? శుష్కప్రియుడు! ఆ మాట లీ మాటలు చెప్పి తప్పించుకొనినాడు.'

బలభద్రదాసు ఒకరూపాయి వేసియున్నచో నిచట రెండు పడెడివి. అతడు రెండు వ్రాసినచో నితడు నాలుగు వేసియుండెడివాడు. గుణ్యము శూన్యమైనప్పుడు గుణకార ఫలితము శూన్యమేగదా! కాని తప్పించుకొనుటెట్లు? వెంటనే యాతని కొక యుపాయము తట్టినది – 'మహాశయా! ఈ విషయమున నాకు పూర్తి సానుభూతి యున్నది. కాని, బలభద్రదాసు దూరమాలోచించియే తప్పకొని యుండును. దూరమాలోచింపగా దీనిలో రాజనైతిక ప్రయోజనమేదియో దాగియున్నట్లు తోచుచున్నది. ఇందులో సందేహములేదు. మీ దృష్టికి తోచకున్నను నాకు మాత్రమేదో రాజనైతికపు టెత్తు లున్నట్లు కన్పించుచున్నది. మహమ్మదీయులకిది తప్పక కోపకారణమగును. వారు వెళ్ళి యధికారులతో రిపోర్టు చేయుదురు. అధికారుల సంగతి యెఱుంగుదురు గదా! వారికి చెవులుండునేగాని కన్నులుండవు! ఏదో కుట్ర పన్నుచున్న ట్లనుమానింతురు.'

విఠల్‌దాసు మనోరథ మిచటగూడ సఫలము కాలేదు. ఈ విషయమాతనికి క్రొత్తకాదు. ఇట్టి నిరాశాపూర్ణమైన యనుభవము లాతని నిత్యకృత్యములోనివే! అచటినుండి డాక్టర్ శ్యామచరణునివద్ద కేఁగినాడు. డాక్టరు మహాశయుడు తెలివిగలవాడు, చదువుకొనినవాడు. పట్టణములో ముఖ్యమైన రాజకీయ నాయకుడు. ఆతని పేరు బాగుగ వ్యాపించినది. తూచి తూచి మాటాడును. ఆతని మానగాంభీర్య మాతని విచారశీలతకు నిదర్శనము. శాంతిప్రియుడు; అతనితోడి

విరోధమువలన హానిగాని, స్నేహమువలన లాభముగాని యుండదు. అందఱు నతనిని మిత్రునిగనే భావింతురు. అందఱు నాతనిని శత్రువుగనే భావింతురు. అతడు జిల్లాసలహాసంఘ సభ్యుడు. విఠల్ దాసు మాటలు విని అనినాడు – 'నాచేత నైనంతవఱకు నేను చేయుటకు సిద్ధముగ నున్నాను. కాని యీ దురాచారమును రూపుమాపి, వారి నుద్ధరించుటకు ప్రయత్నింపవలెను. అంతేగాని ఒక లెను కాపాడినంతమాత్ర మున నేమగును? ఇట్టి దుర్ఘటనలు నిత్యము జరుగుచునే యుండును. మూలకారణములను సంస్కరింపవలెను. కౌన్సిల్ లో ఏమైన ప్రశ్న లడుగుమందురా?'

విఠల్దాసు ఎగిరి గంతువేసినాడు – 'చిత్తము! అది చాల మంచిపని.'

పిమ్మట డాక్టరుగారు తన పార్టీలతో సంభాషణము ప్రారంభించినాడు. విఠల్ దాసు అరగంటవఱకు కూర్చుండి విసుగుపుట్టి -- 'నా కేమని యాజ్ఞ నిచ్చినారు?' అని యడిగి నాడు.

'నా మాటను విశ్వసింపుడు. ఈసారి గవర్నమెంటు దృష్టి నీ విషయమువైపునకు తప్పక ఆకర్షింతును.'

డాక్టరును పట్టుకొని నాలుగు దులపవలెననిపించినది విఠల్ దాసునకు. కాని, ఆలోచించి యూగినాడు. ఇఁక మఱొక పెద్దమనిషివద్ద కేఁగుటకు బుద్ధి పుట్టలేదు. కాని యా కర్మవీరుడు తన ప్రయత్నమునుమాత్రము వీడలేదు. ఏ సజ్జనునివద్దకో యేఁగి నిత్యమును యాచించును. ఆతని ప్రయత్నము పూర్తిగ

విఫలము కాలేదు. కొన్ని వందలకు వాగ్దానములు లభించినవి. కొన్నివందలు నగదు ప్రోగైనది. కాని నెలకు ముప్పది రూపాయల లోటు యీ స్వల్ప మొత్తమువలన నెట్లు భర్తీ యగును ? మూడు నెలల నిరంతర పరిశ్రమకు ఫలముగ నెలకు పది రూపాయల కేర్పాట్లు చేయగలిగినాడు.

ఇంక లాభము లేదనుకొనిన పిమ్మట నొకనాడాతడు సుమన్‌బాయి యింటి కేఁగినాడు. అతనిని చూచినంత నే యామె యన్యమనస్కవోలె-'ఇటు వచ్చినారేమి?ఏమిటి విశేషములు?' అని యడిగినది.

'నీ వనినమాట జ్ఞాపకమున్నదా?'

'ఇంతకాల మైపోయిన పిమ్మట మఱచిపోయినను తప్పుకాదు.'

'త్వరలోనే యేర్పాటొనరింపవలె ననుకొంటిని. కాని, జాతీయభావము పూర్తిగ లోపించిన జాతియైపోయినది ! అయినప్పటికిని నా ప్రయత్నము వ్యర్థము కాలేదు. నెలకు 30 రూపాయలవఱకు వచ్చునట్లొనర్పగలిగితిని. మిగిలిన లోటు కూడ భర్తీ కాగలదను ఆశ యున్నది. దీనిని స్వీకరించి యీ నరకకుండమునుండి బయటకు రమ్మని నా ప్రార్థనము!'

'ప్లీడరుగారిని తీసికొని రాలేకపోతిరా?'

'ఎన్ని చెప్పినను ఆయన వచ్చుట కంగీకరింపలేదు. ఈ ముప్పదిలో నెల కిరువది చొప్పున నిచ్చుట కాయనయే యంగీకరించినాడు.'

సుమన్ ఆశ్చర్యచకితయైనది! - 'ఆయన గొప్ప యుదారస్వభావుఁడే!'

ప్రస్తుత మామె సదనుని ప్రేమజాలమున చిక్కుకొని యున్నది. ఆమె కెన్నడు ప్రేమలోని యానందము లభింప లేదు. ఈ దుర్లభమైన రత్నమును పొంది దానిని చేయి జారి పోనిచ్చుట యామె కిష్టములేదు. ఈ ప్రేమకు పరిణామము వియోగము తప్ప వేఱుకాదని యామె యెఱింగియున్నను, లభించినంతకాల మీ యానందము ననుభవింపుమని యామె మనసు ప్రబోధించుచున్నది. ముందుముందేమి జరుగనున్నదో యెవడెఱుఁగును? ఈ జీవననౌక యే సుడిగుండములో చిక్కు కొనునో, యెటు పరిభ్రమించునో యెవరు చెప్పగలరు? భవిష్య త్తుకు సంబంధిచిన ఆలోచనల నామె దరిజేరనిచ్చుటలేదు. కారణమేమన, భవిష్యత్తున నంధకారముకంటె వేఱొకటిలేదు. వెనుక జీవితపునరుద్ధరణోల్లాసమునకు వశీభూతయై విఠల్ దాసుతో నట్లనినది. ప్రస్తుత మా యుత్సాహము క్షీణించినది. ప్రస్తుతము విఠల్‌దాసు నెలకు వందరూపాయ లిత్తుననినను ఆమె యంగీకరింపదు. కాని, అనినమాటను కాదనుటకు కొంచెము సిగ్గుగనున్నది. అందుచే - 'కొంచె మాలోచించు కొని రేపు చెప్పెదును.' అన్నది.

'ఆలోచించుట కేమున్నది?'

'ఏమియులేదు. కాని, రేపు చెప్పెదనుగదా!'

రాత్రి పదిగంటలైనది. శరత్కాలపు వెన్నెల వ్యాపించి యున్నది. సుమన్ కిటికిలోనుండి నీలవర్ణాకాశమును జూచు

చున్నది. వెన్నెలలో తారకాగణ జ్యోతి మలినమైపోయినట్లు ఆమె హృదయమున సద్భావోదయమువలన వికారములు ప్రభావహీనములై పోయినవి.

విఠల్‌దాసు కేమని సమాధానము చెప్పవలెను? ఇదియే యామె ముందున్న గొప్పసమస్య.

రేపు సమాధానమిత్తునని ఉదయము తప్పించుకొనినది. కాని పగలంతయు నాలోచించిన మీదట నామె భావములలో కొంత సంశోధనము జరిగినది.

ఆమె కిచట భోగవిలాసములకు లోటులేకున్నను, ముఖము జూచినంతనే యసహ్యము కలుగునట్టివారిని సైతము తా నాదరింపవలసివచ్చుచున్నది. మాటలను వినినంతనే జుగుప్స కలుగునట్టివారిని గౌరవింపవలసివచ్చుచున్నది. ఆమె మనసున నుత్తమ భావము లింకను పూర్తిగ నశింపలేదు. దుర్వ్యసనములు హృదయమందలి సమస్త సద్భావములను నాశన మొనరించునట్టి యధోగతి కామె యింకనుపోలేదు. ఆమె భోగవిలాసములను కాక్షించుచున్నదనుటలో సందియము లేదు. కాని తత్ప్రాప్తికై వలసిన నిర్లజ్జత యామె కసహ్యమైనది. ఒక్కొక్కప్పుడామె తన వర్తమాన స్థితిని పూర్వస్థితితో పోల్చి చూచుకొనును. అచట ఈ యాడంబరములు లేవు, కాని తన సమాజమున తా నాదరింపబడినది. ఎవరివద్దను అవమానముతో - సిగ్గుతో తలవంచుకొనవలసిన యగత్యము కలుగలేదు. కాని, యిచట తన యభిమానపూర్ణమైన హృదయము అడుగడుగునను తలవంచుకొనవలసి వచ్చుచున్నది.

ఒక కులట ముందు సైతము తాను తలయెత్తుకొని తిరుగ జాలననిపించుచున్నది. ఆనాటి నిరాదరణము, అవమానముల కంటె, నేటి ప్రేమప్రసంగములు, ఓరచూపులు మిక్కిలి దుఃఖ మును కలిగించుచు నామె భావపూర్ణమైన హృదయమున కుఠారాఘాతము లగుచున్నవి. అట్టి సమయమున నామె పద్మ సింహుని తలఁచుకొని పండ్లు పటపట కొరుకును. ఆ నిర్దయు డానాడు సంఘమునకు జంకి తన్ను నిరాదరింపకున్నచో తా నీ యగ్నికుండమున దుమికియుండెడిదికాదు. నాల్గు దినము లైనను నాతడచట నుండనిచ్చినచో నింటికి వెళ్ళెడిది, లేదా గజాధరుడేవచ్చి బ్రతిమాలెడివాడు. వెనుకటివలెనే తిట్లతో, పోట్లాటలతో కాలము గడచిపోయెడిది. అందుకొఱకే విఠల్ దాసుతో పద్మసింహుని రప్పింపుమని షరతులను విధించినది.

కాని విఠల్‌దాసువలన పద్మసింహుడామె నుద్ధరించుట కెంత యుత్సుకుడై యున్నాడో తెలిసికొనినంతనే, యాతనిపై గల యసహ్యభావము పోయి, శ్రద్ధాభావ ముదయించినది. అతఁడు సజ్జనుఁడు. నేనే నిష్కారణముగ నాయపరాధము నాతనిపై మోపుచున్నాను. అతఁడు నాపై దయజూపినాఁడు. పోయి యాతని పాదములపైఁబడి 'యీ నిర్భాగ్యురాలికిమీ రొనర్చిన యుపకారమునకు భగవంతుఁడు మీకు ప్రత్యుపకార మొనర్చుగాక!'యని వేఁడుకొందును. ఈగాజులుసైత మిచ్చి వేయుదును. దానితో నా యాత్మను పతనముకాకుండ కాపాడు కొనుచుంటిననియు, అయోగ్యురాలను కాననియు, నాతఁడు

తెలిసికొనగలఁడు. అచటినుండి తిరిగివచ్చి యీ పాపపంకిలము నుండి లేచిపోదును.

కాని సదనసింహుని మఱచిపోవు టెట్లు?

తన యీ మానసిక దౌర్బల్యమున కామెకు కోపము వచ్చినది. ఆ పాపమయమైన ప్రేమకొఱకై యీ జీవితమునే తరింపజేయు తరుణమును - అవకాశమును పోగొట్టుకొందునా? నాలుగురోజుల వెన్నెలకై శాశ్వతముగ పాపాంధకారమున బడుటయా? నా చేతులతో నేను నా హృదయమును నాశన మొనర్చుకొనుటయా? నా యెడ సద్వ్యవహారమును నెఱపిన పద్మసింహునియెడ నిట్టిమోసమా? ఇట్టి కపటనాటకమాడు టయా? ఛీ! ఈ కపటప్రేమను హృదయమునుండి తొలగింతును. సదనుని మఱచిపోదును. నీవును ఈ మాయజాలము నుండి తప్పుకొని తొలగిపొమ్మని చెప్పుదును.

అయ్యో! నేనెంత మోసపోతిని! ఈ ప్రదేశము దూరమున కెంత రమ్యముగ కన్పట్టినది! ఎంత సుఖమయముగ దోచినది! నేనిద్దానిని పుష్పవనమనుకొంటిని. ఇయ్యది ఘోరారణ్యము. క్రూరజంతువులతో-విషధరములతో నిండియున్నది!

ఈ నది దూరమునకు బంగరు దుప్పటి పఱచినట్లెంత రమణీయముగనున్నది! కాని, దీనిలో లభించునదేమి? భయంకరమైన జలజంతువులకిది క్రీడాస్థానము! సుమన్ ఆలోచనాసాగరమున మునింగియున్నది. ఏదో విధముగ తెల్లవారిన బాగుండునుగదా! విఠల్‌దాసు వచ్చినంతనే యిచటినుండి శీఘ్రముగ తొలగిపోవచ్చుననిపించుచున్నది. అర్ధరాత్రియైనను

నా మెకు నిద్రపట్టలేదు. తెల్లవారిన పిమ్మట విఠల్ దాసు రాక పోయినచో నేమగును? మఱల వెనుకటివలెనే యీ పాపాభినయము ప్రారంభము కావలసిన దేనా? మఱల పాపరజోలిప్తమైన యీ బొమ్మల నాదరింపవలసిన దేనా? అను శంక పొడసూపెను. ఆమె యిచటికే తెంచి ఆరునెలలేయైనను నిచటి పరిస్థితులు పూర్తిగ అనుభవమునకు వచ్చినవి. ఇరువదినాలుగు గంటలు నామెఇంటివద్ద కాముకులు, దుష్టులుమూగియుందురు. వారు తమ దురాచారములకు, పాపకర్మములకు, నీచపుఁ బనులకు సంబంధించిన గాథలను సగర్వముగ వర్ణించుచుందురు. ఒకడు జేబులు కత్తిరించుటలో నేర్పరి; వేఱొకడు జూదమున చతురుడు; మఱొకడు క్రొత్తచేతులను బట్టుటలో నిపుణుడు, ఇంకొకడు గోడలుదూకుటలో నందెవేసినచేయి. అందఱును తమ దుస్సాహసమునకు, దౌర్బల్యమునకు సంతోషించువారే! ఇరుగుపొరుగు స్త్రీలు సైతము వచ్చి కూర్చుందురు - అలంకారములతో, ముస్తాబై దీపమువోలె జాజ్వలించుచుందురు. కాని యివి విషముతో నిండిన స్వర్ణపాత్రలు ! నీచత్వమునకు, మోసమునకు, దుష్టవాసనలకు ప్రతిమూర్తులు! వారు తా మొనర్చిన పాపకర్మల నతిరంజితముగ వర్ణించుచుందురు. వారిలో లజ్జ యనునది నామమాత్రముగనైనను మిగులలేదు. మోసము, కపటము, పాపతృష్ణ, వీటిలోనే వారి మనసు లిప్తమైయుండును. పట్టణములోని పెద్దమనుష్యులిచట నిందింపబడుచుందురు - వారిని హేళన చేయుదురు. వారికి దద్దమ్మ, చచ్చువెధవ, నపుంసకుడు అను బిరుదులను ప్రసాదింతురు.

ఇరువదినాల్గు గంటలును దొంగతనములు, బందిపోట్లు, గర్భ స్రావములు, వ్యభిచారములే యిచటి చర్చనీయాంశములు ! ఇచటి ప్రేమాదరముల యదార్థస్వరూప మిపుడామెకు గోచరించుచున్నది. ఇయ్యది ప్రేమకాదు, ఆదరముకాదు; - కామలిప్స! ఆమె ధైర్యముతో నీ విపత్తుల నన్నిటిని సహించినది. ఈ నరకకూపములో నుండదలచినప్పు డిట్టివాటినుండి యెన్ని నాళ్ళని తప్పుకొని తిరుగగలదు? నరకములో ప్రవేశించిన పిమ్మట నరకధర్మములనే పాటింపవలెను. మొదటిసారి విఠల్ దాసామెవద్ద కేతెంచినప్పు డాతని నుపేక్షించినది. ఆనాటివఱ కామె కిచటి పరిస్థితులను గూర్చి పూర్తిగ తెలియలేదు. కాని, నేడు మోక్షద్వారము కనిపించిన తరువాత, నీ కారాగారమున నొక్క క్షణకాలముండవలెనన్నను కష్టముగనే యున్నది. అవకాశము ననుసరించి మానవునిలోని పాపచేష్టలు జాగృతములగునట్లే ధార్మిక ప్రవృత్తిసైతము జాగృతమగును. రాత్రి మూడుగంటలైనది.ఆమె యింతవరకు నటునిటు పొరలుచున్నది-నిద్రపట్టలేదు. ఆమె మనసు బలముగ సదనుని వైపాకర్షింపబడుచున్నది. తెల్లవారుచున్నకొలఁది నామె వ్యగ్రతయు హెచ్చుచున్నది.ఆమె మనసును సమధాన పఱచుకొనును 'ఈ ప్రేమకై యువ్విళ్ళూరుచున్నావా? ఈ ప్రేమకాధారము కేవలము బాహ్యరూపమని నీకు తెలియదా ? ఇయ్యది ప్రేమకాదు;- ప్రేమలాలస ! నిజముగ ప్రేమించువాడిచటికి రాడు. గుడిలోనికి భక్తితో నుపాసించుట కెవడును పోనట్లే యీ వేశ్యవాటికలోని కెవడును నిజమైన ప్రేమతో రాడు.

ఉబుసుపోకకుమాత్రమే, లేదా వినోదమునకు మాత్రమే వత్తురు! ఈ భ్రమలో పడవద్దు సుమా!'

అరుణోదయ మగుచుండగా సుమన్‌కు నిద్ర పట్టినది.

# 17

ఆమె పగలంతయు విఠల్‌దాసుకొఱ కెదురు చూచినది. కాని, యాతడు సాయంకాలమువఱకును రాలేదు. ఆమె మనసులో నుదయించుచున్న వివిధములైన శంకలు పరిపుష్టములైనవి. ఏదియో విఘ్నము కలిగినది – ఇఁక నాతడు రాఁడు. అతఁడు వేఱొక పనిలో నిమగ్నుఁడై యుండవచ్చును, లేదా ఆతనికి సాయ మొనరింతుమని మాటయిచ్చినవారు మాట తప్పియుందురు. అసలేమి జరిగినదో నాకు తెలిసిన నెంత బాగుండును! ఇతరు లెవరును నాకు సాయమొనర్పక పోయిన నేమాయె! నా వ్యవహారము నేనే చూచుకొందును. నాకు కావలసినది సజ్జనుఁడైనవాని రక్షణము! విఠల్‌దాసు ఆ మాత్రము సాయమొనర్పలేఁడా? వెళ్ళి యాతనితో, నా కార్థిక సహాయ మక్కఱలేదనియు, దానికై మీరు బాధ పడవద్దనియు, నా నివాసమున కేర్పాటుచేసి నా భుక్తి గడచి పోవుట కేదైన పని పురమాయింపుఁడనియు చెప్పుదును. నా కింకేమియు నక్కఱలేదు. కాని ఆతఁడెక్కఁడ యుండునో తెలియదు. అతనికై యెచ్చటెచ్చటికని తిరుగుదును?

పార్కువైపు కేఁగుట మంచిది. అచటికి చాలమంది షికారుకు వత్తురు. ప్లీడరుగారు నిత్యము నటువైపే షికారు

వెళ్ళుచుందురు. వారైనను కనబడుదురేమో! వారికీ గాజు లిచ్చి, ఆ సందర్భములో నాలుగు మాటలు మాట్లాడవచ్చును.

ఇట్లాలోచించి యామె బండి పిలిపించి యొంటరిగ వాహ్యాళికి వెడలినది. బండి క్వీన్సు పార్కు వైపు బయలు దేరినది. ఈ పార్కు పట్టణమునకు దూరము. అందుచే నచటికి చాల తక్కువమంది వెళ్ళుచుందురు. కాని, పద్మసింహుని యేకాంతప్రియత్వ మాతని నచటికి లాగుకొనివచ్చినది. ఆయన పార్కులో నొక ఆనుడుబెంచిపై గూర్చుండి యాలోచనా మగ్నుడై యుండెను. బండి గేటువద్దకు జేరినంతనే సుమన్‌కు ఒంటరిగా కూర్చుండియున్న పద్మసింహుడు కన్పట్టెను. ఆమె హృదయము దీపకళికవోలె చలించుచుండెను. భయమువలన నిట్టి స్థితి సంభవించునని యామెకు తెలిసి యున్నచో వచ్చియుండెడిదికాదు. కాని, ఇంతదూరము వచ్చి, ఎదురుగ ప్లీడరుగారిని చూచి, ఊరక తిరిగిపోవుట మౌర్ఖ్యమే యగును. కొంచెము దూరమున నుండగనే బండి నాపించినది. బండినుండి దిగి, శబ్దము వాయువునకు ప్రతికూలముగ పయనించునట్లు మెల్లగ ప్లీడరుగారివైపుకు బయలు దేరినది.

పద్మసింహుడు కుతూహలముతో బండివైపు చూచుచుండెను. అతడు సుమన్‌ను గుర్తింపలేదు. ఆమె యెవరో యిటే వచ్చుచున్నదేమని ఆశ్చర్యపడినాడు. ఎవరో క్రిష్టియన్ లేడీ యైయుండుననుకొనినాడు. కాని, దగ్గరకు వచ్చినపిమ్మట నాతడు సుమన్‌ను గుర్తించినాడు. ఓరకంటితో నామెను

చూచినాడు. ఆతని శరీరమంతయు కుంచించుకొని పోయినది. సుమన్ తలవంచి యాతని యెదుట నిలబడినంతనే యాతడు సిగ్గుతో, దైన్యదృక్కులతో తప్పించుకొనుటకు మార్గమును వెదకుచున్నట్లు చూడసాగెను. అంత నాతడకస్మాత్తుగ లేచి వెనుకకు తిరిగి గబగబ బయలుదేరినాడు. ఆమె కియ్యది వజ్రపాత సన్నిభమైనది. ఆమె యే మాశించి వచ్చినది? ఏమైనది? ప్రభో! ఈతడు నన్నింత నీచురాలినిగ భావించి, నా నీడసైతము సోకకుండుటకై తప్పించుకొని పోవుచున్నాడు గదా! పద్మసింహునిపై నామెకున్న శ్రద్ధాభావము క్షణములో లుప్తమైపోయినది. ఈ యవమానమును సహింపజాలక పోయినది-'నేను మిమ్ముల నేమియు యాచించుటకు రాలేదు- మీ రింత భయపడుటకు! నే నీ గాజుల నిచ్చిపోవుటకు వచ్చితిని. ఇవిగో! తీసికొనుడు! ఇఁక నేనే వెళ్ళిపోదును!' అని తీవ్ర స్వరముతో నన్నది. ఇట్లని యామె యా గాజుల నాతనివైపు నకు విసరివేసినది.

పద్మసింహు డాగిపోయినాడు. నేలపై బడియున్న గాజులను చూచినాడు. అవి సుభద్రచేతి గాజులు.

సుమన్ బండి యున్నవైపునకు కొన్ని యడుగుల దూరమేఁగినది. ప్లీడరుగారామెను సమీపించి 'నీ వద్ద కీ గాజు లెట్లు వచ్చినవి?' అని యడిగినాడు.

'నేను మీ మాటలు వినక మోము త్రిప్పి వెడలిపోయి నచో మీ రేమియు కష్టపడకూడదు.'

• 'సుమన్! నన్ను లజ్జితు నొనర్పవలదు. నాకు నీ మొగము చూచుటకు సైతము యోగ్యతలేదు.

'ఎందువలన?'

'ఆనాడు నిన్ను నాయింటినుండి వెడలగొట్టకున్నచో నీకిట్టి దురవస్థ ప్రాప్తించి యుండెడిది కాదుగదాయని నిత్యము నా మనసు బాధపడుచున్నది.'

'దీనికై మీరు సిగ్గుపడుట దేనికి? మీరు నన్ను వెడల గొట్టి నాకుపకారమే చేసినారు. నా జీవితము బాగుపడినది.'

ఈ యుపాలంభనముతో ప్లీడరుగారు గ్రుక్కత్రిప్పు కొనలేకపోయినాడు - 'ఒకవేళ ఇయ్యది యుపకారమేయైనను, ఆకీర్తి గజాధరునికి, విఠల్‌దాసుకి దక్కవలసినదేకాని నే నందులకు తగినవాడనుకాను.'

'రక్షింపబోయి భక్షించినట్లు మీరు భావించుకొను చున్నారేగాని, నేనుమాత్రము యదార్థముగ మీ యుప కారము నంగీకరించుచున్నాను. ప్లీడరుగారూ! నన్ను కదలింప వద్దు! మనసులోని మాట మనసులోనే యుండనిండు. కాని, మీవంటి సహృదయు లింతటి నిర్దయులైపోదురని నే నను కొనలేదు. గౌరవాదరముల కాంక్ష గొప్పవారికి మాత్రమే యుండునని మీరనుకొనవచ్చును; కాని దీనస్థితియందున్న ప్రాణులకే వాటిపై కోరిక యెక్కువయుండును. నాకట్టి యాదరమెట్లులభించునాయనియే యెల్లప్పుడు నామనసు తహ తహలాడెడిది. హోలీనాడు మీ యింటివద్ద జరిగిన యుత్స వము నాకు గౌరవవాదరములను సంపాదించుటకు చక్కని

మార్గమును చూపినది. నేనానాడు మీయింటికి రాకుండినచో నాగుడిసెతోనే సంతృప్తి జెందియుండెడిదానను! మీరు సచ్చరిత్రులని నా భావము. అందుచే మీ రసికత ప్రభావమింకను నాపై యెక్కువ పనిచేసినది. భోలీబాయి మీ ముందు గర్వముగ కూర్చున్నది. మీ రామెయెదుట ఆదరముతో భక్తుని వోలె కూర్చుండిరి. మీ మిత్రులామె సైగల ననుసరించి కొయ్యబొమ్మలవోలె నాడిరి. సరళహృదయయు, గౌరవాదరములను కాంక్షించునట్టి స్త్రీపై నిట్టి దృశ్యముల ప్రభావమెట్లు కలుగునో, తత్ఫలిత మెట్లు పరిణమించునో, నా విషయమున సరిగ నట్లే జరిగినది. సరే! ఇప్పుడా గొడవయేల? జరిగినదేదియో జరిగిపోయినది. మిమ్ముల నెందుకనవలెను? ఇదియంతయు నా యపరాధమే! నేను... ...

సుమన్ యింకేమియో చెప్పనున్నది. కాని, గంభీర భావముతో నిది యంతయు వినుచున్న పద్మసింహుడు మాట మధ్యలో నందుకొనినాడు – 'సుమన్! నన్ను సిగ్గుపఱచుట కిట్లనుచున్నావా? లేక యదార్థమా ?'

'మిమ్ము సిగ్గుపఱచుటకే చెప్పుచున్నను, విషయము మాత్రము యదార్థమే! ఈ విషయమును చాల దినముల క్రితమే మఱచిపోతిని. కాని, యీ నాడు మీరు నా నుండి దూరముగ తొలఁగిపోవుచుండుటను చూచి మఱల జ్ఞప్తికి వచ్చినది. ఇట్లనినందులకు నాకే పశ్చాత్తాపము కలుగుచున్నది. క్షమింపుడు!'

పద్మసింహుడు తలయెత్తి మఱల ఆలోచనా నిమగ్నుడైనాడు. సుమన్ ఆతనికి ధన్యవాదము లర్పించుటకై వచ్చినది. కాని, సంభాషణాక్రమము చెడిపోవుటవలన నామె కట్టి యవకాశమే లభింపలేదు. ఈ యప్రియమైన సంభాషణ తరువాత నాతని యనుగ్రహమునకు సంబంధించిన విషయముల నెత్తుట యామె కసంగతముగ దోచెను. ఆమె తన బండివైపుకు బయలుదేరినది. 'మఱి, యీ గాజులో?' అని యకస్మాత్తుగ ప్రశ్నించినాడు పద్మసింహుడు!

'నిన్న నా కివి షరాబు దుకాణములో కనిపించినవి. మీ యావిడచేతి కిదివరలో వీటిని చూచినాను. అందుచే గుర్తుపట్టి తీసికొని వచ్చితిని.'

'ఆ షరాబు పేరేమియో చెప్పగలవా?'

'చెప్పజాలను! చెప్పనని మాట యిచ్చితిని' అని సుమన్ వెడలిపోయినది. పద్మసింహుడు మఱికొంతసేపు కూర్చుండి బెంచిపై నడుము వాల్చినాడు. ఆమె యనిన ప్రతి శబ్దము నాతని చెవులలో ప్రతిధ్వనించుచున్నది. తన ప్రవర్తనపై, తన యాచారవ్యవహారములపై, తనకర్తవ్యపాలనముపై, నాతనికి గర్వమున్నది. నేడా గర్వము పూర్తిగ నశించి పోయినది. అతడు నేటివఱకును ఈ యపరాధమును గజాధరుని పైనను, విఠల్‌దాసుపైనను మోపి తన మనసును సమాధాన పఱచుకొనినాడు. కాని నేడది వందరెట్ల భారముతో తన నెత్తిన పడినది. ఆలోచనలు తీవ్రమై రూపమును దాల్చెను. ఎచటినుండియో దూరమునుండి యొక ధ్వని వినవచ్చు

చున్నది – 'ఆ యుత్సవమే జరుగకున్నచో నా కుటీరమున నేను సంతుష్టనై యుందును' అని! ఇంతలో గాలి వీచినది. ఆకులు కదిలినవి! తమ భయంకరములైన నల్లని తలలూపి యామె యీ దుర్గతికి నీవే కారణమ వనుచున్నట్లు చెట్లు కదలుచున్నవి!

పద్మసింహునికి భయముకలిగినది. చాల ఆలస్యమైనది. ఎదుట సమున్నతమైన జంతు ప్రదర్శనశాల శిఖరమున్నది. అందుండి గంటలు వినబడుచున్నవి. ఆ గంటల సుమధుర నాదము నీవే సుమన్ దుర్గతికి కారణమ వనుచున్నది.

అతడు తన యాలోచనములన్నిటిని చిక్కబట్టి అడుగు ముందుకువేసినాడు. అతని దృష్టి యాకాశముపై బడినది. నల్లని తెరపై నుజ్వలమైన అక్షరములతో నీవే యామె దుర్గతికి కారణమవని వ్రాసినట్లున్నది. ఒక మైదానమున నడచుచు, మేఘములు క్రమ్ముకొని వచ్చుటనుగాంచి, పాంథుడు దూరమున నున్న నొక వృక్షమువైపు వేగముగ పరుగిడునట్లు పద్మసింహుడు అంగలువేయుచు పార్కునుండి జనసముదాయము వైపు బయలుదేరినాడు. కాని భావచిత్రమాతని నెట్లువీడును? సుమన్ ఆతనిని వెంబడించి మధ్య మధ్య యాతని కడ్డము వచ్చి నీవే నా దుర్గతికి కారణమ వనుచున్నది. అటు వైపునుండి యొకసారి, యిటునుండి యొకసారి యామె వచ్చుచున్నట్లు తోచును – ఆ మాటలే విన్పట్టును. పద్మసింహుడెట్లో యింటికి జేరి ముఖము కప్పుకొని గదిలో పండుకొనినాడు. సుభద్ర భోజనమునకు రమ్మని యెంతో బ్రతిమాలినది. కాని తల

నొప్పిగ నున్నదని వంకబెట్టినాడు. రాత్రియంతయు సుమన్ అతని హృదయముపై గూర్చుండి తిట్టుచునే యున్నది. నీవు విద్వాంసుడవు! నీవేమో వివేకవంతుడ ననుకొనుచున్నావు; కాని నీవు పూరియిండ్లవద్ద మందుసామాను కాల్చుచున్నావు. నీవు నీడబ్బు తగులవేయదలచినచో నొక బీడువద్దకు పోయి తగులబెట్టుము. మావంటి బీదవాళ్ళ కొంపలకు నిప్పంటించు టెందులకు?

తెల్లవారినంతనే పద్మసింహుడు విఠల్‌దాసు యింటి కేఁగినాడు.

# 18

సుభద్రకు సాయంకాలము గాజుల విషయము జ్ఞాపకము వచ్చినది. స్నానపు గదిలోనికి పరుగెత్తినది. అచట గూటిలో పెట్టిన విషయ మామెకు బాగుగ జ్ఞాపకమున్నది. కాని యచట కనపడలేదు. భయము కలిగినది. తన గదిలోనికి వెళ్ళి పెట్టెలు, గూళ్ళు, అల్మారాలు వెదకినది. వంట యింటిలో నన్నిమూలలందు వెదకినది. చివరకామె నిరాశ చెంది మంచముపై వ్రాలినది. సదనుడు స్నానాగారములోని కేఁగుటను చూచినది. అతడే వేళాకోళముగ దాచియుండు ననుకొన్నది. కాని యాతని నడుగుటకు ధైర్యము చాలలేదు. పద్మసింహుడు భోజనమునకు వచ్చినప్పుడు చెప్పవలెననుకొన్నది. అతడింటికి వచ్చినంతనే సుభద్ర భర్తతో చెప్పినది. 'సరిగా వెదకుము! ఇంట్లోనేయుండును! ఎవరు తీసికొని పోదురు?' అనినాడు.

'ఇంట్లో అన్నిమూలలు వెదకినాను.'

'నౌకర్ల నడుగుము!'

'ఇరువురిని అడిగినాను. ఇద్దరు ఒట్లు పెట్టుకొను చున్నారు. స్నానపుగదిలో గూటిలో పెట్టినట్లు నాకు బాగుగ జ్ఞాపకమున్నది.'

'అయిన వాటికి రెక్కలు వచ్చినవందువా? ఎగిరి పోయినవా?'

'అడుగమనినచో సదనుని అడిగి చూతును. అతడా గది లోని కేఁగుటను చూచితిని. నవ్వులాటకు దాచియుండవచ్చును.'

'ఎంత తెలివి! వానిని మాత్రమడుగవద్దు! వాడు తీసి యున్నచో చెప్పెడివాడే!'

'అడిగిన నింతలో మునిగి పోయినదేమి? బాగుగ నేడ్పించి యివ్వవలెననుకొనినాడేమో!'

'అడుగుట తప్పు! వాడు చూడకున్నచో తనపై దొంగతనమును మోపుచున్నారనుకొనును.'

'మీ వంటి మనసును నేనెచటను చూడలేదు. అడిగి నచో కొంత ధైర్యము గలుగునుగదా!'

'ఏమైనను సరే! వానినిమాత్ర మడుగవద్దు!'

సుభద్ర యప్పటికిమాత్ర మూరకుండినది. కాని రాత్రికి పినతండ్రి, కొడుకు భోజనముముందు కూర్చుండినపుడుమాత్ర మూఱకుండలేకపోయినది – 'అబ్బాయీ! నా గాజులు కనిపించుటలేదు. దాచియుంచినచో నిమ్ము! నన్నెందుకు బాధ పెట్టెదవు!' అనియన్నది.

సదనుని మోము వెలవెల బోయినది. అతని గుండె కంపించుచున్నది. దొంగతనముచేసి, యెఱుగనట్లు నటించుట యాతనికి తెలియదు. నోటిలో ముద్దయున్నది. దానిని మ్రింగు టయే మఱచిపోయినాడు. ఏమియు వినిపింపని వానివోలె మౌనముగ నున్నాడు. పద్మసింహుడు నిప్పులు వర్షించునట్లు సుభద్రవైపు చూచినాడు. ఆమె ప్రాణములెగిరిపోయి నట్లైనది. మఱల నాలుక యెత్తుట కామెకు ధైర్యము చాలలేదు. సద నుడు నాలుగు ముద్దలు మ్రింగి పీటపైనుండి లేచినాడు.

'నేను వలదన్న పని చేసితీరుట నీ కలవాటైపోయినది' అని సుభద్రపై కోపించినాడు పద్మసింహుడు.

'అతని మొగము చూచినారా? అతడే తీసినాడు. అబద్ధమైనచో దొంగకు విధించు శిక్షను నే ననుభవింతును!'

'సరే! పోనిమ్ము! ఈ వెధవ గాజులొక లెక్కయా? ఈ శరీరమే వాళ్ళచే పోషింపబడినది. నా ప్రాణమడిగినను సంతోషముతో నిత్తును. నా సర్వస్వము వానిదే! అడిగి తీసి కొనిపోయినను సరే! లేదా యెత్తుకొనిపోయిననుసరే!'

'మీరు సేవాపత్రము వ్రాసి యిచ్చియున్నచో మీ యిష్టము వచ్చినట్లు వారికి సేవ చేయవచ్చును. కాదనను! కాని నా వస్తువును దొంగిలించినచో నేనూఱుకొనను!'

మరునాడు సాయంకాలము పద్మసింహుడింటికి వచ్చి నంతనే సుభద్ర యాతనిని భోజనమునకు పిలుచుటకై వెళ్ళి నది. అతడా గాజు లామెముందు విసరికొట్టినాడు. సుభద్ర ఆశ్చర్యముతో పరుగెత్తి తీసికొనినది. గుర్తించినది – 'నేను

చెప్పితినిగదా ఎచటనో దాచి యుంచినాడని! నా మాట నిజ మైనదా?'

'మఱల అర్థములేని వాగుడు ప్రారంభించినావు! ఇవి బజారులో నొక షరాబు దుకాణములో దొరికినవి. నీవు సదనుని అనుమానించి వాడికి కష్టము కలిగించినావు! మనకును మాట తెచ్చినావు!'

# 19

సుమన్ ముప్పది రూపాయల కంగీకరించుట కిష్టము లేకపోవుటవలననే రేపు సమాధాన మొసంగుదునని తప్పించు కొనినదని యనుమానపడినాడు విఠల్‌దాసు. అందువలననే మఱునాడాతడు సుమన్ యింటికి వెళ్ళలేదు. మిగతా డబ్బు విషయ మెట్లని యాలోచించుచున్నాడు. ప్రక్క గ్రామము లకు, పట్టణములకుపోయి ప్రోగుచేయవలె ననుకొనును. ఒక ప్పుడు నాటకములు వేయింపవలెననుకొనును. అతని కధికారమే యున్నచో నీ పట్టణమందలి ధనికులనందరిని ఓడపై నెక్కించి ద్వీపాంతర వాసమునకు బంపి యుండెడివాడు. అమెవద్ద కేఁగుటయా, మానుటయా! యను సంకల్పవికల్పములలో బడి కొట్టుకొనుచున్నాడు. ఇంతలో పద్మసింహుడు కనిపించి నాడు. కనులెఱ్ఱబడి వాచియున్నవి. శరీరము మలినముగ నున్నది. రాత్రి నిద్రపోయినట్లు లేదు. దుఃఖమూర్తివోలె నున్నాడు. మూడు నెలలనుండి విఠల్‌దా సాతని యింటికేఁగ లేదు. అతనియెడ విరక్తి కలిగినది. కాని యీ స్థితిలో నాతనిని

చూచినంతనే విఠల్‌దాసు హృదయము నీరైపోయినది. ప్రేమతో చేతులు ముందుకుజాపి – 'రమ్మ ! క్షేమమా? ఏదో విచారముగ నున్నట్లున్నావే!' యనినాడు.

'అవును ! క్షేమమే ! కొన్ని నెలలనుండి మీ దర్శనము లేదు. మిమ్ములను కలుసుకొనవలె ననుకొనుచున్నాను. సుమన్ విషయ మేమిచేసినారు?'

'రాత్రింబవళ్ళదే యాలోచనతో సతమతమగుచున్నాను. ఇంత పెద్దపట్టణమున్నది. కాని నెలకు 30 రూపాయలకు దగిన సొమ్ము సమకూరలేదు. పదిరూపాయలకు తగిన సొమ్ము ప్రోగైనది. ఈ భాగ్యవంతు లందరును పాషాణ హృదయులు ! ఆ భాగ్యవంతుల విషయ మటుండనిమ్ము! ప్రభాకరరావుకూడ మొండిచెయ్యి బయటపెట్టినాడు. ఆతని వ్యాసములు చదువుచున్నచో దేశప్రేమకు నిధివోలె, దయాసాగరునివోలె కన్పట్టును. కాని, యీ జాతీయ కార్యము నుండి పూర్తిగ తప్పుకొని తిరుచున్నాడు. మిగిలినవారు కొంచెము సంకోచించిరి; కాని యాతడు మాత్రము పూర్తిగ మెదురు తిరిగినాడు!'

'నెల కేబదిరూపాయ లిచ్చినచో నామె విధవాశ్రమమునకు వచ్చునని మీకు నమ్మకమున్నదా?'

'ఉన్నది! ఆశ్రమ పాలకవర్గమామెను నిరాకరించినచో నది వేఱువిషయము! అట్టిచో మఱియొక యేర్పాటు చేతును!'

'అయినచో నిదిగో! తీసికొనుడు! నేను నెలకు 50 రూపాయలిత్తును. భగవదనుగ్రహమున్నచో జీవితాంతము వఱకు నిచ్చుచుందును.'

విఠల్‌దాసు ఆశ్చర్య చకితుడై పద్మసింహునివైపు చూచి యాతనిని కౌగలించుకొనినాడు - 'సోదరా! నీవు ధన్యుడవు! నీ పాదములకు సాష్టాంగ నమస్కార మొనర్ప దగిన పనిచేసితివి. నీవు హిందూజాతి గౌరవమును నిలబెట్టి తివి. ఈ లక్షాధికారుల చెంపపై చెప్పుదెబ్బ కొట్టితివి. కాని, యింతటి భారమునెట్లు భరింపగలవు?'

'అన్నిపనులు జరిగిపోవుచునే యుండును! భగవంతు డేదో యొక త్రోవ చూపకపోడు!'

'మీ యన్నకుమారుని వీధులవెంట తిరుగకుండ కొంచెము కట్టుదిట్టము చేయలేరా?'

'వా డెచట తిరుగుచున్నాడో నాకు తెలియదు. అప్పు డప్పుడు బజారు వెళ్ళుచుండును. వాడు సచ్చరిత్రుడనియే వానివిషయమై పట్టించుకొనుటలేదు.'

'పెద్ద పొరపాటు చేసినారు. ఇదివరలో నాతడెంత సచ్చరిత్రుడై యుండినను, ప్రస్తుతపు ధోరణి బాగుండలేదు. అతని ననేకపర్యాయములు చూడరానిచోట చూచినాను. సుమన్‌బాయి ప్రేమజాలములో చిక్కుకొనినట్లున్నాడు.'

పద్మసింహుని ప్రాణము లెగిరిపోయినట్లనిపించినది— 'మీరొక దుర్వార్త చెప్పినారు. వాడు మా కులదీపకుడు! వాడు దుర్మార్గగామి యైనచో నా ప్రాణముపైకి వచ్చును.

సిగ్గుతో మా యన్నగారికి ముఖము చూపజాలను.' ఈ మాట లనుచుండ నాతని కనులు కన్నీటితో నిండిపోయినవి – 'మహాశయా! వానినెట్లైనను చెప్పి మంచి త్రోవకు తీసికొని రండు!'

విఠ:– 'అతనిని మంచి మార్గమునకు దెచ్చుటకు ప్రయత్నింతును. నాకీ నాటివఱకు నాతడు మీ యన్నగారి కుమారుడని తెలియనే తెలియదు. నే నికనుండి యీ పనిపై నుందును. రేపు సుమన్ అచటినుండి తొలఁగిపోయినచో నాతడు తనంతతానే బాగుపడును.'

'సుమన్ వచ్చివేసినంతమాత్రమున వేశ్యావాటిక ఖాళీయైపోదుగదా! మఱొక్కతె వలలో చిక్కుకొనును. ఏమి చేయమందురు? ఇంటికి పంపివేతునా?'

'ఇఁక నాతడచటికి వెళ్ళి యుండినట్లే! అతడు వెళ్ళనే వెళ్ళడు. ఒకవేళ వెళ్ళినను మఱునాడే మరలివచ్చును. యౌవనకాలమందలి దుర్వాసనలు చాల ప్రబలమైనవి. ఇది యంతయు సంఘమునందలి యీ దురాచారమునకు ఫలితము! నగరమందలి కూడలిప్రదేశములలో నీ వ్యాపారము సాగుటయే యీ యనర్థములకు కారణము.'

'ఈ విషయమున మీరు ఆందోళన చేసియేయున్నారు.'

'చేసితిని! కాని, నోటిమాటలతో మీరు సహానుభూతిని ప్రకటించి మాటతప్పినట్లే మిగిలినవారును నా మాట త్రోసివేసిరి. ఒక్కనివలన నేమగును? నా వద్ద డబ్బులేదు; ఉన్నతపదవి లేదు; ప్రజలు నన్ను పిచ్చివానిక్రింద జమకట్టుచున్నారు. నా మాటలు వారి దృష్టిలో పిచ్చి మాటలు.

పట్టణమున నిందరు విద్వాంసులున్నారు. వారు పొరపాటున నైనను నా మాట వినరు.'

పద్మసింహునిది శిథిల ప్రకృతి. అతనిని కర్తవ్య క్షేత్రములోనికి గొనివచ్చుట కేదేని బలవత్తరమైన ఉత్తేజన మవసరము. మెలకువతో నున్న సోమరులలో లెక్క. అనేక పర్యాయములు జాతీయమైన పిలుపులు వినిపించినవి; కాని యాతడు లేవలేదు. ఈ సారి యాతనికి వినిపించిన పిలుపు, అమాంత మాతనిని లేపి కూర్చుండబెట్టినది. తన ప్రాణమును కంటె నెక్కుడుగ ప్రేమించుచున్న తన యన్న కుమారుని రక్షించుటకై, తన సోదరుని యసంతృప్తిని నివారించుటకై, యాత డెట్టిపనినైనను జేయును. ఇట్టి భయంకర పరిణామమునకు గారణమైన దురాచారమును మూలోచ్ఛేదన మొనర్చుటకై యాతడు నడుము కట్టుట కింతకంటె వేఱు ప్రమాణము లనవసరములు! – 'నేను మీ కేవిధముగనైన నుపయోగపడగలిగినచో నేను సంసిద్ధుడను' అనినాడు పద్మసింహుడు.

విఠల్‌దాసు సంతోషించినాడు – 'సోదరా! నీవు నా కండయై నిలిచినచో భూమ్యాకాశముల నేకముచేయగలను. కాని, క్షమింపుము! నీ సంకల్పము దృఢమైనదై యుండదు. నేం డిట్లే యందువు. రేపు చల్లబడిపోదువు. ఇట్టి విషయము లందు ధైర్యము మిక్కిలి యవసరము.'

పద్మసింహుడు సిగ్గిలినాడు – 'భగవంతుడు సరిగ జూచినచో నీ పర్యాయము మీ రిట్టి ఫిర్యాదుచేయుట కవకాశము లభింపదు.'

'అట్లైనచో నిఁక మన సాఫల్యము నిశ్చితమే!'

'మీరు నన్ను నడిపింపుడు!'

'అట్లయిన, నా యుద్దేశ్యము వినుము! మొదటిది, వేశ్యలను పట్టణమందలి సార్వజనికమైన ప్రదేశములనుండి తొలగించుట; రెండవ యుద్దేశ్యము, వేశ్యల నృత్యగాన ప్రదర్శనముల యాచారమును రూపుమాపుట. ఈ రెండును మీ కిష్టములేనా?'

'ఇంకను సందేహమా?'

'నృత్య ప్రదర్శనముల విషయమున నింకను మీకు వెనుకటి యభిప్రాయములు లేవుగదా?'

'ఒక సంసారము నాశనమైనపిమ్మటగూడ నట్లే ప్రవర్తింతునా? ఆనాటి యుత్సవమే సుమన్ బాయి పతనమునకు గారణభూతమైనదని నిశ్చయమైపోయినది. కాని, యిచట నాకొక యనుమానము కలుగుచున్నది. మనముగూడ, ఈపట్టణములందే మనజీవితమును గడపుచున్నాముగదా; మన కీ దుర్వ్యసనము లంటలేదేమి? పట్టణమున నిత్యము ప్రదర్శనములు జరుగుచునే యున్నవి; కాని యిట్టి పరిణామమెన్నడును కానరాలేదే! కాబట్టి, మానవ స్వభావమే యిందు ప్రధాన కారణమని తేలుచున్నది. మీ రీ యాందోళనమువలన స్వభావములను మార్పజాలరుగదా?'

'మన యుద్దేశ్యమదిగాదు. దుర్బల స్వభావములు నాశనమగుట కుపకరించు పరిస్థితులను తొలగించుటయే మన పని. పొట్టకూటికై చాకిరి చేయుచు, క్షణము తీరికలేని మనకు, వేశ్యవాటికలందు గౌరవము లభించునని యెన్నడును ననుకొనని మనకు, ఇట్టి దుర్వ్యసనము లెట్లంటును? ధనికులు, రూపవంతులు, ఉదారులు, రసికులు నైనవారు మాత్రమే యచటికి పోయి వారి వలలో జిక్కుకొందురు. భగవంతుడు స్త్రీలకు సౌందర్య మిచ్చునపుడు, ధనధాన్యములనుండి వంచితల నొనర్పగూడదు. ధనహీనలైన సౌందర్యవతులు, చతురలు ఇట్టి దుర్వ్యసనములకు తేలికగ వశీభూతలగుదురు.'

సుమన్ పార్కునుండి వచ్చిన పిమ్మట ప్లీడరుగారికి దుఃఖమును కలిగించునట్లు మాట్లాడితిని గదాయని విచారించినది. ఆయన యెంతో ఔదార్యముతో నా కొనర్చిన సాయమున కిట్టి ప్రత్యుపకార మొనర్చితిని! వాస్తవముగ నా దౌర్బల్యమువలన జరిగిన యపరాధము నాతనిపై మోపితిని. నన్నీ యంధకారమునుండి యుద్ధరింపవచ్చిన వానిని నేనిట్లవమానించితినిగదా!

ఆయన తన మనసులో నన్నెంత కృతఘ్నురాలని యనుకొనునో! నన్ను చూచినంతనే పాపము తొలగిపోవనెంచినాడు. నేనే సిగ్గుతో తలకొట్టుకొని చచ్చియుండవలసినది. కాని యీ పాపమువలని భయముతో సిగ్గులేకుండ ఆయనను తిరస్కరించితిని.

రాత్రియంతయు నిట్టి యాలోచనలతోనే గడచి పోయినది. ఉదయమే లేచి విఠల్‌దాసు వద్దకేఁగి తన కాశ్రయ మును జూపుమని యడుగుటకు నిశ్చయించుకొనినది. నాకు మీరేమియు చేయనక్కరలేదు; సురక్షితమైన ప్రదేశమును చూపుడు, పిండి విసిరిపెట్టి, బట్టలు కుట్టిపెట్టి పొట్టపోసికొందు నని యడుగదలచినది.

తెల్లవారినది. ఆమె లేచి విఠల్‌దాసు నింటికి పయన మగుచుండగా నతడే యచటికి వచ్చినాడు. అతనిని గాంచి నంతనే సుమన్‌కు భక్తునికి ఆరాధ్య దైవము సాక్షాత్కరించి నంత సంతోషము కలిగినది. – 'దయచేయుడు! నిన్నటిదిన మంతయు మీకై యెదురుచూచితిని. ఇప్పుడే మీ యింటికి రావలెననుకొనుచున్నాను. నా నివాసమున కేమైన నేర్పాటు చేసినారా?'

'నా వలన నేమియు కాలేదు. కాని పద్మసింహుడు గౌరవము కాపాడినాడు. అతడు నీ షరతును పూర్తిచేసినాడు. ఇంతక్రితమే వచ్చి జీవిత పర్యంతము నెల కేబది రూపాయల చొప్పున నిచ్చెద ననినాడు.'

ఆమె విస్మయపూర్ణమైన నేత్రములు సజలములైనవి. పద్మసింహుని యీ గొప్ప యౌదార్య మామె యంతఃకరణను, భక్తి శ్రద్ధాభావములతో పరిప్లావిత మొనరించినది. ఆమెకు తా ననిన కటువచనములకు మిక్కిలి బాధ కలిగినది – 'ఆయన దయాసాగరుడు! ధర్మదేవత! ఈ జీవితమున వారి ఋణము తీర్చుకొనజాలను. భగవంతు డాయనకు శుభములఁ

గూర్చుగాక! కాని, నే నా దినమున ననిన మాటలు కేవలము మిమ్ము పరీక్షించుటకొఱకనిన మాటలేగాని వేఱుగావు! మీరు నిజముగ నన్నుద్ధరింప నెంచినారో లేక మామూలు ధోరణిలో మర్యాద కనిన మాటలో తెలిసికొనగోరి యట్లంటిని. మీ రిరువురును దైవస్వరూపులైన సజ్జనులని విదితమైపోయినది. మిమ్మనవసరముగ కష్టపెట్టను. నాకు కావలసినది సహాను భూతి మాత్రమే! అట్టి సహానుభూతి లభించినది. ఇఁక నా బ్రదుకుభారము మీపై నిడను. నాకెట్టి విఘ్నములు, బాధలు కలుగని ప్రదేశమును నా నివాసమునకై యేర్పాటు చేయుడు.

విఠల్ దాసు చకితుడైనాడు. జాతీయభావ గౌరవముతో నాతని కనులు ప్రకాశించినవి. మన దేశమందలి పతిత స్త్రీల భావములుసైత మింత యుజ్వలములై యున్నవి గదా యని సంతసించినాడు – 'సుమన్! నీ నోట నిట్టి మాటలు వినుచుండ నా యానందమున కంతులేకున్నది. కాని, డబ్బు లేకుండ నీ జీవితమెట్లు గడచును?'

'నేను శరీర పరిశ్రమ చేయుదును. ప్రపంచమున దుఃఖిత లనేకులున్నారు. వారందరికిని భగవానుడు తప్ప సహాయకు లెవరున్నారు? నా నిర్లజ్జతకు పన్ను మీ వద్ద వసూలు చేయజాలను.'

'ఆ కష్టములను సహింపగలవా?'

'ఇదివఱలోనైనచో సహింపలేకపోయెడిదానను. కాని యిప్పుడన్నియు సహింపగలను? ఇచటికి వచ్చిన పిమ్మట నిర్లజ్జత యనునది కష్టములలో కెల్ల దుస్సహమైనదని

గ్రహించితిని. ఇతర కష్టములవలన శరీరమునకు బాధకలుగును. కాని యీ కష్టమువలన ఆత్మయే చనిపోవును. నన్ను రక్షించుటకై మిమ్ము పంపిన భగవానునికి ధన్యవాదములు!'

'సుమన్! నీవు నిజముగ విదుషీమణివి!'

'సరే! ఇచటినుండి వెడలిపోవుట యెప్పుడు?'

'నేఁడే! ఇంతవఱకును నీ వాశ్రమములో నుందువని కమిటీ వారితో చెప్పలేదు. కాని, పరవాలేదు! నీ వచటికేఁగి యుండవచ్చును. కమిటీ వా రభ్యంతము తెల్పినచో తరువాత చూచుకొనవచ్చును. కాని, ఒక విషయము మాత్రము జ్ఞాపక ముంచుకొనుము. నీ విషయముమాత్ర మెవరితోడను చెప్ప వద్దు; చెప్పినచో విధవలలో గందరగోళము బయలుదేరును.'

'మీ రెట్లు తోచిన నట్లు చేయుఁడు. నేను సిద్ధముగ నున్నాను.'

'సాయంకాలము బయలుదేరవలెను!'

విఠల్‌దాసు వెడలిపోయిన కొలఁదిసేపటి కిరువురు వేశ్యలు సుమన్ యింటికి వచ్చిరి. నాకు తలనొప్పిగ నున్న దని చెప్పినది సుమన్. ఆమె తానే స్వయముగ వంటచేసికొను చున్నది. ఆమె పతితయైనప్పటికిని ఆహార విహారములందు జాగ్రత్తవహించుచునే యున్నది. నేఁ డామె యొక వ్రతము చేయదలఁచినది! విడుదల కలుగు రోజున ఖైదీలకు సైతము భోజనము రుచింపదు. మధ్యాహ్నము పండ్రెండు గంటలకు విటసమూహము మూగినది. కాని, యామె వంకబెట్టి తప్పించుకొని వారిని పంపివేసినది. సేట్ బలభద్రదాసువద్దనుండి

కమలాఫలముల బుట్టవచ్చినది. ఆమె వెంటనే తిరుగగొట్టినది. నాలుగు గంటలకు సేట్ చిమన్‌లాల్ తన గుఱ్ఱపుసార్టు పంపినాడు – ఆమె షికారు వెళ్ళుటకు. ఆమె బండిని సైతము త్రిప్పి పంపివేసినది.

నేఁ డామె సదనుని కలిసికొనవలెనని యుత్కంఠతో నున్నది – నేఁ డది చివరి కలయికయగును. నేటితో ఈ ప్రేమాభినయము సమాప్తమగును. ఆ మనోమోహకమైనరూప మిఁక కనిపింపదు. ఆ రూపమును చూచుట కిఁకనుండి నా నేత్రములు తపించుచుండును. సరళమైన ప్రేమవాక్కులిక వినరావు. జీవితము మఱల ప్రేమవిహీనమై నీరసమైపోవును. కలుషితమైనను, యీ ప్రేమ సత్యమైనది. ఓ భగవానుడా! నాకీ వియోగమును సహింపజాలు శక్తిని ప్రసాదింపుము. కాదు, కాదు; ఇప్పుడు సదనుడు రాకుండుటయే మంచిది. అతనిని కలిసికొనకుండుటయేమంచిది. అతనిని జూచినంతనే నా సంకల్పము చెదరిపోవునేమో యెవ రెఱుంగుదురు? కాని, ఒక పర్యాయ మాతడు వచ్చినచో బాగుండును; నా హృదయము విప్పిచెప్పుకొనవచ్చును; అతనిని యీ మాయా సాగరమున బడకుండ రక్షించుటకు ప్రయత్నింతును.

ఏడుగంటలైనది. సదనుడు రాలేదు. ఎనిమిది గంటల వఱకాతనికై ప్రతీక్షించి నిరాశ జెందినది. అతడిచటికి వచ్చుట ప్రారంభించిన నాటినుండి యీనాడే నాగాపడినది. సుమన్‌కు నిర్జనమైనచోట దారితప్పి మాఱుపడినట్లున్నది. హృదయమున నొక తీవ్రమైనను సరళమైనట్టిదియు, దుఃఖపూర్ణమైనను మనో

హారమైనట్టి యాకాంక్ష యుద్వేలితమగుచున్నది. అతడు రాకపోవుటకు గారణమేమని మనసు ప్రశ్నించుచున్నది. ఏదో యనిష్టమైన శంక యామెను కలవర పరచుచున్నది.

ఇంతలో విఠల్‌దాసు కిరాయి బండిలో వచ్చుటను చూచినది. ఆమె హృదయము వేగముగ కొట్టుకొనసాగినది.

క్షణములో విఠల్‌దాసు పైకి వచ్చినాడు – 'అరె! నీ వింకను సిద్ధముకాలేదేమి? బెడ్డింగుకూడ కట్టలేదే!'

'ఇచటి వస్తువేదియు తీసికొనిపోను. ఇక వాస్తవముగ నా పునర్జన్మ ప్రారంభము కానున్నది.'

'మఱి, ఈ సామాను?'

'మీ రీ సామగ్రిని అమ్మివేసి యేదేనొక శుభకార్యమున వెచ్చింపుడు.'

'సరే! బాగుగనే యున్నది! ఈ గదికి తాళము వేయుదును. సరే! బయలుదేరుము! బండి సిద్ధముగ నున్నది.'

కొంతసేపటి సుమన్ క్రిందికి దిగివచ్చినది. ఒక మామూలుచీర కట్టుకొనినది. చేతులకు గాజులుసైతము లేవు. ఆమె మోము విచారముగ నున్నది. భోగవిలాసములనుండి దూరమైపోవుచున్నందులకు కలిగిన విచారముకాదిది – ఈ యగ్నికుండములో నెందుకు దూకితినా యనువిచారము! ఈ నిస్పృహయందు మాలిన్యములేదు! ఒక విధమైన సంయమమున్నది. కల్లు త్రాగినవాని నిర్లక్ష్యము కాదిది – త్యాగము, భావాభాసితమైన నిర్లక్ష్యము!

విఠల్‌దాసు యింటికి తాళమువేసి బండితోలువాని ప్రక్కన కూర్చుండెను. బండి బయలుదేరినది.

బజారులోని దుకాణము లన్నియు మూసియున్నవి. కాని రోడ్డుపై సందడిమాత్రము తగ్గలేదు. సుమన్ బండికిటికీ సందులోనుండి చూచినది. దీపమాలలు మనోహరముగ నున్నవి. బండి ముందుకు పోవుచున్నకొలఁది ఆ కాంతి మాలయు ముందుకు సాగుచునే యున్నది. దగ్గఱదగ్గఱగ దీపములు కలిసిపోవుచున్నవి. కాని యా దీపమాల అభిలాషల వలెనే దూరముగ పారిపోవుచున్నది.

బండి వేగముగ పోవుచున్నది. ఆమె భావిజీవన యానముసైతము ఆలోచనాసాగరమున నటునిటు నూగుచు నక్షత్రకాంతిలో చిక్కుపడుచు పోవుచున్నది.

# 20

సదనుడు ఉదయమింటిలోని కేఁగినంతనే పినతల్లి చేతిని గాజులు చూచినాడు. సిగ్గుతో నాతని కనులు భూమిలోనికి చొచ్చుకొని పోయినవి. భోజనముచేసి తొందరగా బయటకు వచ్చివేసి యీ గాజులు మఱల యెట్లు వచ్చినవని యాలోచింపసాగినాడు.

సుమన్ యిచటికి పంపియుండుట సంభవమేనా? ఈ గాజు లెవరివో యామెకేమి తెలియును? నేనామెకు నా విషయమే చెప్పలేదే! ఆ నమూనాలో చేయించిన వేఱొక గాజుల జతయేమో యిది! కాని, యింత తొందరలో నెట్లు తయా

రగును? సుమన్ తప్పక నా యునికిని తెలిసికొనియుండును. ఆమెయే పినతల్లి కివి పంపియుండును.

సదను డెంతయో యాలోచించినాడు. ఎంత యాలోచించినను నీ నిశ్చయముననకే చేరుచున్నాడు. అతడు మఱల మఱల యాలోచించినాడు - సరే! ఆమెకు నా విషయము తెలిసి యున్నదనుకొనుము; కాని, నే నిచ్చిన వస్తువును ఆమె యిచటికి పంపునా? అట్లే జరిగియున్నచో తప్పక నిది విశ్వాసఘాతము క్రిందనే లెక్క.

ఆమె నా విషయమును తెలిసికొనియున్నచో మనసులో నన్ను ధూర్తునిగ, కపటిగ తలంచియుండదా? గాజులు పిన్ని వద్దకు పంపివేసి నన్ను దొంగక్రిందకూడ జమకట్టి యుండును.

నేటిసాయంకాల మాతనికి సుమన్ యింటికి వెళ్ళుటకు ధైర్యముచాలలేదు. దొంగయై-దగాకోరై తా నెట్లు పోగలడు. ఆతని మనసు ఖిన్నమై యుండెను. ఇంటివద్ద కూర్చుండుట బాధయనిపించెను. కాని, యా బాధనైనను సహించినాడు గాని సుమన్ యింటికేగుటకు సాహసింపజాలకపోయినాడు.

ఈ విధముగ నొక వారము దినములు గడిచిపోయినవి. ఆమెను కలిసికొనవలెనను ఉత్కంఠ ప్రబలమగుచుండెను. శంకలన్నియు నీ యుత్కంఠక్రింద అణగి పోవుచుండెను. సాయంసమయమున నాతనిస్థితి పిచ్చివానివలె నుండెను. ఎవరితోడను మాటాడ బుద్ధిపుట్టదు. ఎచటకూర్చుండిన వా డచటనే యుండును. జబ్బుపడి లేచినవాని మనసువోలె నాతని మనసు

ఉదాసీనమై యుండును. లేచుటకు కూర్చుండుటకుగూడ బుద్ధిపుట్టదు.

చివరికి కాతడు సహింపలేకపోయినాడు. ఎనిమిదవనాడు సుమన్ యింటికి బయలుదేరినాడు. నేడామెతో తన వ్యవహార మంతయు చెప్పివేయవలెనని నిశ్చయించుకొనినాడు. తాను ప్రేమించినవారివద్ద దాపరిక మేల? మంచివాడనైనను, చెడ్డవాడనైనను నే నిఁక నీ పాదభక్తుడనని చేతులు జోడించి చెప్పివేయుదును. నీ వే శిక్ష విధించినను సరే! నీ యెదుట తలవంచితిని! దొంగతనము చేసినను, మోసము చేసినను నీ ప్రేమకు వశుడనై చేసితిని! క్షమింపుము! అని చెప్పదలఁచినాడు.

నీతి, జ్ఞానము, సంకోచము ననునవి యెంత యణచినను విషయవాసనలు అణఁగియుండవు. మత్తులో నొడలు తెలియదు.

వ్యాకులుడై యాత డైదుగంటలకే బయలుదేరి అటు నిటు తిరిగి నదీతీరమునకు జేరినాడు. శీతల మందవాయు వాతని తప్తమైన శరీరమునకు సుఖమును చేకూర్చుచున్నది. సన్నని మేలిముసుగులోనుండి సుందరీనేత్రములు ప్రకాశించునట్లు నిర్మలమైన ప్రవాహములో చేపలు గంతులు వేయుచున్నవి.

సదనుడు తీరమున గూర్చుండి యీ మనోహర దృశ్యమును జూచుచున్నాడు. ఇంతలో నొక జటాధారి చెట్లచాటునుండి తనవైపే వచ్చుచుండుటను చూచినాడు. మెడలో రుద్రాక్షమాలలున్నవి. కనులెఱ్ఱబారి యున్నవి. జ్ఞాన, యోగములవలన కలుగు ప్రతిభకంటె నాతని మోమున

సరళత, దయ వ్యక్తము లగుచుండెను. తనవద్ద కేతెంచి నంతనే సదనుడు లేచి యాతని నాదరించెను.

అతనితో పరిచయ మున్నవానివలె నా సాధు వాతని చేయి పట్టుకొనెను – 'సదన్! చాల కాలమునుండి నిన్ను కలిసికొనవలె ననుకొనుచున్నాను. నీ మేలుగోరి యొక మాట చెప్పదలచినాను: నీవు సుమన్‌బాయి యింటికేగుట మాని వేయుము. లేనిచో నీ సర్వనాశనము జరిగితీరును. ఆమె యెవతెయో నీ వెఱుఁగవు. ప్రేమోన్మాదమున నీ కామె దూషణములు వినిపింపవు. ఆమె నిన్ను ప్రేమించుచున్నదను కొనుచున్నావు. అది కేవలము భ్రమ! తన భర్తను వదలి పెట్టిన స్త్రీ యితరులను ప్రేమించి యా ప్రేమను నిర్వహింప గలదా? నీ విప్పుడామెవద్దకే వెళ్ళుచున్నావు! ఈ సాధువు చెప్పినమాట వినుము! ఇంటికి తిరిగి పొమ్ము! అదియే నీకు మేలు!'

ఈ మాటలని యా సాధువు వచ్చిన దిక్కునకే వెడలి పోయెను. సదను డాతనిని ప్రశ్నించుటకు నిశ్చయించుకొను నంతలో దృష్టికి కనిపింపకుండ మాయమైనాడు.

సదను డాలోచింపసాగినాడు – ఈ మహాత్ముఁడెవడు? ఇతడు నన్నెట్లెఱుఁగును? నా రహస్యము లీతని కెట్లు తెలిసినవి? ఆ ప్రదేశమందలి నీరవత కొంత, తన మానసికస్థితి కొంత, ఆ మహాత్ముని ఆకస్మికాగమనము – ఆతని దివ్యదృష్టులు కొంత కలిసి యాతని మాటలు ఆకాశవాణివలె మహత్వపూర్ణ మైపోయినవి. ఆతని మనసున నేదో జరుగనున్న అనర్థమునకు

సంబంధించిన శంక పొడసూపినది. సుమన్ వద్ద కేఁగుటకు సాహసింపలేకపోయినాడు. ఈ యాశ్చర్యకరమైన ఘటనను గూర్చి యాలోచించుకొనుచు నింటికి బయలుదేరినాడు.

సుభద్ర సదనుని గాజులవిషమై ప్రశ్నించిన నాటినుండి పద్మసింహు డామెపై కోపించియున్నాడు. అందుచే నామె కేమియు తోఁచుటలేదు. కొన్ని రోజులపాటు యెచటి కైన వెళ్ళి రావలె ననుకొనుచున్నది. సదనుని ఇంటికి పంపివేయ వలెనను ఆలోచనలోనున్నాడు పద్మసింహుడు. సదనునికిగూడ యచటనుండుట విసుగుగానున్నది. అతడుగూడ నింటికేఁగ దలచుచున్నాడు. కాని, యెవ్వరును నోరెత్తలేకున్నారు. కాని, మరునాడు మదనసింహుని ఉత్తరము వచ్చుటతో నందరి కోరికలు నెఱవేరినవి. ఉత్తరములో సదనునికి సంబంధము వచ్చినదనియు, మఱదలిని గూడ పంపవలసినదనియు వ్రాసి నాడు.

ఈ కబురు విని సుభద్ర సంతసించినది. రెండు నెలల పాటు హాయిగ, ఆనందముగ, ఆటలు పాటలతో గడచిపోవును. ఈ సంతోషమును మనసులో దాచుకొనలేకపోయినది. ఆమె యీ కాఠిన్యమునకు పద్మసింహుడు మఱింత విచారించినాడు. ఆమెకు తన సుఖమేగాని నా విషయ మక్కఱలేదనుకొనినాడు. రెండు నెలలకు మఱలవచ్చుట! ఇదేమి సుఖము? అనుకొనినాడు.

సదనుడుగూడ ప్రయాణమునకు సిద్ధమైనాడు. అతడు ఇంటి కేఁగుట కంగీకరింపడనుకొనినాడు పద్మసింహుడు. కాని యట్లు జరుగలేదు.

పగలు రెండు గంటలకు బండి బయలుదేరును. అందుచే ప్లీడరుగారు కోర్టుకు వెళ్ళలేదు. ప్రేమవిహ్వలుడై యనేక పర్యాయము లింటిలోని కేగినాడు. కాని సుభద్ర కాతనితో మాటాడుటకు తీరిక యెక్కడిది? ఆమె నగలు గుడ్డలు సర్దుకొనుచున్నది. ఆమె కీ గొడవయే లేదు.

ఒంటిగంటయైనది. నౌకరు బండి తెచ్చి గుమ్మమువద్ద నిలిపినాడు. సదనుడు తనపెట్టె, బెడ్డింగు బండిలో పెట్టినాడు. సుభద్ర కనులు కన్నీటితో నిండిపోయినవి. పద్మసింహు డామె యశ్రువులను తుడిచినాడు. గాఢాశ్లేష మొనరించినాడు. సుభద్ర బండిలో గూర్చున్నది.

స్టేషను చేరినారు. బండి బయలుదేరు ననగా సదనుడు పరుగెత్తి పెట్టెలోని కెక్కినాడు. సుభద్ర కూర్చుండక పూర్వమే బండి బయలుదేరినది. ఆమె కిటికీవద్ద నిలబడి భర్త వైపు జూచుచున్నది. అతడు కనిపింపకుండ దూరమైపోవు నంతవఱకు నామె కిటికీవద్ద నుండి కదలలేదు.

సాయంకాలమునకు రైలు గమ్యస్థానముచేరినది. మేనా, ఒక గుఱ్ఱముతోగూడ మదనసింహుడు స్టేషనువద్ద సిద్ధముగ నున్నాడు. సదనుడు తండ్రికి నమస్కరించినాడు.

గ్రామము సమీపించుచున్నకొలఁదియు నాతని తొందర యెక్కువగుచుండెను. గ్రామమింకను నాలుగు ఫర్లాంగుల దూరమున్నదనగా పొలముగట్లపై నుండి గుఱ్ఱమును నడిపించుట కష్టమని యెంచి గుఱ్ఱముపై నుండి దిగి, గబ గబ ఊరిదిక్కునకు నడువసాగెను. నేఁ డాతనికి తన గ్రామము నిస్తబ్ధముగ

నున్నట్లు తోచెను. సూర్యాస్తమయమైనది. రైతులు తమ యెడ్లను తోలుకొని యింటికేఁగుచున్నారు. సదను డెవరి తోడను మాటాడలేదు. తిన్నఁగ యింటిలోనికేఁగి తల్లికి నమస్కరించినాడు. తల్లి యాతనిని జేరి యాశీర్వదించినది.

భామ:- 'ఆవిడగారెక్కడ నున్నది?'

సద:- 'వచ్చుచున్నది. నేను పొలముల కడ్డముపడి వచ్చితిని.'

'బాబాయి, పిన్నివద్ద మనసు తీరినదా?'

'ఏమి?'

'నీ ముఖమే చెప్పుచున్నది!'

'అదేమిటి? నేను అచటికేఁగిన తరువాత బలిసితిని!'

'ఏడ్చినావు! పిన్నమ్మగారు తిండికే మొగము వాచునట్లు పెట్టియుండును.'

'పిన్ని అటువంటిదికాదు! ఇచటికంటె నాకచటనే హాయిగా నున్నది. అచట మంచి పాలు దొరకును.'

'మఱి, డబ్బుకావలెనని వ్రాసినావేమి?'

'మీ ప్రేమయెట్టిదో పరీక్షింపవలెనని వ్రాసినాను. మీ వద్ద తీసికొనినది పాతికేగదా! బాబాయివద్ద కనీసము 5,6వందల రూపాయలు తీసికొంటిని. సిల్కువస్త్రములతో జమీందారువలె తిరిగితిని. పిన్ని అనేకరకాల పిండివంటలుచేసి పెట్టినది. త్రాగినన్నిపాలు, తినినన్నిపండ్లు! అచటి సుఖము మరపునకు రాదు. మనము సంపాదించి యనుభవించునదిలేదుగదా, దొరికి

నప్పుడే యనుభవింపవలెననుకొంటిని. మనసు లన్నియు తీరి పోయినవి.'

ఆతని మాటలలో నొక విధమైన క్రొత్తదనము వచ్చి నట్లు భామ కనిపెట్టినది. అతనిలో నాగరక లక్షణములు కన్పట్టుచున్నవి.

అతడు తన యీడునకు, సహజమైన గుణమునకు తగి నట్లు పట్టణజీవితమును వర్ణింపసాగినాడు.

భామహృదయము సుభద్రయెడల నిర్మలమయ్యెను.

మఱునా డుదయము గ్రామములోని పెద్ద లందఱి యెదుట సదనుని వివాహమునకై తాంబూలములు పుచ్చు కొనిరి.

వివాహమనెడి ధర్మబంధనమును కండ్లయెదుట చూచు చున్నను నాతని కెట్టి చింతయు కలుగలేదు! ఆతని ప్రేమ లాలసయంతటి ప్రబలమైపోవుచున్నది. ఆతనికి సుమన్ పైనున్న ప్రేమలో తృష్ణయే యెక్కువ. సుమన్ అతని హృదయ ములో నున్నను, అతని జీవితమున కాధారము మాత్రము కాలేకపోయినది. ప్రేమకు ప్రాణసదృశమైన విశ్వాస మాతని కామెపై నెక్కడున్నది? ఇప్పుడాతడిక కపటప్రేమయొక్క మాయాజాలమునుండి విముక్తుడైపోవును. ఇఁక నాతనికి బహువేషధారణ మొనర్పవలసిన యవసరముండదు. సుమన్ వద్ద నెన్నడును లభింపని వస్తువాతనికి నేఁడు లభింప నున్నది. ఈ భావములతో నాత డీ నూతనప్రేమకై విహ్వాలు డగుచున్నాఁడు. వధువు అందకత్తె కాదేమో ? రూపలావ

ణ్యాము లనునవి ప్రాకృతికగుణము! అందెన్నడును పరివర్తన ముండదు. స్వభావమనునదొక. యుపార్జిత గుణము; అది చదువు—సత్సాంగత్యములతో సంస్కరింపబడును. సదనుడు వధువునుగూర్చిన విషయములను అత్తవారింటి నౌకరుద్వారా తెలిసికొనదలంచినాడు. అందుచే వానిని బాగుగ త్రాగించి, మిఠాయి పొట్లములు కొనిపెట్టినాడు. వాడు త్రాగుడు మైక ములో వధువును నఖశిఖ పర్యంతము బాగుగ వర్ణించినాడు. ఆ నఖశిఖ వర్ణనము సుమన్ సౌందర్యమును పోలియున్నది. అందుచే నూత్నవధువు నాహ్వానించుట కాతడుత్సుకుడైనాడు.

# 21

తాను సృష్టించిన ప్రతివానికిని భగవంతు డేదోవిధ ముగ నన్న వస్త్రము లొసంగుననుట పూర్తిగ నిజముకాదు. ఉమానాథుడెట్టి శ్రమయులేకుండ సుఖము ననుభవించు చున్నాడు. అతనిది ఆకాశ ప్రవృత్తి. అతనికి ఆవులు, గేదెలు లేవు! కాని యింటిలో పాలు పెరుగులకు లోటులేదు. అతనికి వ్యవసాయము లేదు. కాని, యింటిలో ధాన్యమునకు లోటుం డదు. గ్రామములో నెచట చెట్లు కొట్టినను, పంటకోసినను, పండ్లు రాలినను, విందులైనను, అడుగకయే యాతని భాగ మింటికి వచ్చును. అతని గ్రామము పెద్దది. మూడువేల జనసంఖ్య యున్నది. ఆతని యనుమతి లేనిదే గ్రామమున నెట్టి పనియు జరుగదు. ఆడవాళ్ళు నగలు చేయించుకొన వలసినచో నుమానాథునితో జెప్పెదురు. పిల్లల వివాహము

లన్నియు నాతని మధ్యవర్తిత్వమున పరిష్కారము కావలసినదే! దస్తావేజులు, కవులుకత్తులు; నన్నియు నాతని చేతిమీదుగనే పూర్తికావలెను. వ్యాజ్యములు తగాదాలు ఆతనిద్వారా పరిష్కారము కావలసినదే! ఆశ్చర్యమేమన, ఆతని యీ గౌరవ మునకు గారణ మాతని సౌజన్యముకాదు. గ్రామీణులయెడ నాతడు మిక్కిలి దురుసుగను, నీరసముగను ప్రవర్తించును. ముఖస్తుతి మాటలు, అమ్మా తల్లీ యనుట యాతని చేతగాదు. ఏ మాటయనినను చెప్పపై కొట్టినట్లుండును. అయినను నాతని యీ కటువచనములను జనులు పాలవోలె గుటక వేయుదురు. మఱి యాతని స్వభావమున నున్న మాయ యేమియో తెలి యదు. కొంతమంది యాతని తెలివితేటలు, అదృష్టమే యిందు లకు గారణమందురు. మఱికొంద ఱాతనికి మంత్రప్రభావ మున్నదందురు. కాని, మా యుద్దేశ్యమునమాత్ర మాతని కున్న మానవ స్వభావ పరిజ్ఞానమే యిందులకు గారణము. ఎచట వంగవలెనో, ఎచట పట్టుబట్టవలెనో యాతనికి బాగుగ తెలియును. పట్టువిడుపులు బాగుగ నెఱుంగును. గ్రామీణుల వద్ద బిగియవలెను. అధికారులవద్ద వంగవలెను. పోలీసు ఇన్ స్పెక్టర్లు, పోలీసులు, తహసీల్దారులు, బంట్రోతులు నందఱు నాతనిపై దయాదృష్టిని ప్రసరింప జేయుచుందురు. తహసిల్దారు గారి కాతడు జాతకఫలము వ్రాయుచుండును. డిప్యూటీ తహసి ల్దారుగారికి ప్రమోషను వచ్చునని చెప్పెను. అమీనా లాతని యింటికి పిలువని చుట్టములే! కొందరికి తాయెత్తులు, యంత్ర ములు నిచ్చును. మఱికొందరికి భగవద్గీత వినిపించును. ఇవి

యేవియు నచ్చనివారికి మృష్టాన్నములతో విందులొనర్చును. పోలీసు ఇన్‌స్పెక్టరుగారి కతడు కుడిభుజము. ఇన్‌స్పెక్టరుగారి వ్యవహారము తేలికగ పరిష్కారముకానిచోట ఉమానాథుని ద్వారా యాతని రొట్టె విరిగి నేతిలో బడును. ఇట్టి వ్యక్తిని గ్రామీణులేల పూజింపరు?

ఉమానాథునికి తన సోదరియైన గంగాజలిపై నభిమానము మెండు. కాని, గంగాజలి పుట్టింటికే తెంచిన కొలఁది దినములకే వదినగారి యవజ్ఞలముందు అన్నగారి యభిమానము పనిచేయదని గ్రహించినది. ఉమానాథుడు తన సోదరిని తన యింటికి గొనివచ్చినందులకు చాల పశ్చాత్తాపపడెడివాడు. అతడు తన భార్యను సంతృప్తిపఱచుటకై పైకి మాత్రము భార్యమాటలకు తాళము వేసెడివాడు. గంగాజలికి శుభ్రమైన వస్త్రము కట్టుకొనుట కధికారమెక్కడిది? శాంత యెంత ముద్దుగా పెఱిగిననేమి? నేఁడు ఉమానాథుని కుమార్తెలతో సరిసమానముగ నుండుట కధికారమెక్కడిది? ఉమానాథుడు తన భార్య నోటినుండి ద్వేషపూరితములైన మాటలను విని తల యూపును. గంగాజలికి కోపమువచ్చినప్పు డాతనిపైననే చూపును. తన భార్యను నెత్తికెక్కించుకొని నన్నవమానపఱచుచున్నాడని యామె యనుకొనును. అతడే గనుక భార్యను కోపపడినచో నోరెత్తగలదా? న న్నీవిధముగ ననగలదా? యనుకొనును. ఉమానాథుఁ డవకాశము చిక్కినపుడెల్ల నేకాంతముగ సోదరిని బ్రతిమాలి నచ్చ జెప్పుచుండును. కాని, సాధ్యమైనంతవఱకు జాహ్నవి యట్టి యవ

కాశమును లభింపనీయదు. పైగా, అన్నగారి సహానుభూతిపై గంగాజలికి విశ్వాసమునులేదు.

ఈ విధముగ నొక సంవత్సరము గడిచిపోయినది. గంగాజలికి విచారము, నిరాశ, దుఃఖములవలన రోగము వచ్చినది. ఆమెకు జ్వరము ప్రారంభమైనది. ఆమె స్థితి రోజు రోజుకు నీరసించి పోవుచున్నది. ఆ జ్వరమునకు తోడు అతిసారము గూడ పట్టుకొనినది. ఆమె జీవించునను ఆశ కనబడుటలేదు. బార్లీజావగూడ జీర్ణము కానట్టి యుదరమున జొన్నరొట్టెలు జీర్ణమగునా? తత్ఫలితముగ నామె శిథిల శరీర మీ కష్టములను సహింపజాలకపోయినది. ఆరుమాసములిట్లు బాధపడి యీ దుఃఖిని యకాలమృత్యువు వాతబడినది.

శాంత కిఁక ప్రపంచమున 'నా'యనువారు లేరు. ఆమె సుమన్‌కు రెండు ఉత్తరములు వ్రాసినది; కాని సమాధానము లేదు.అక్కయ్యగూడ తనతోడి సంబంధమును త్రెంచివేసికొనినదని భావించినది. విపత్తిలో నున్నప్పుడెవరు పలుకరింతురు? తల్లి బ్రతికియున్నంతవఱకు తల్లిచాటున జేరి యేడ్చినది. ఇప్పుడా యాధారముగూడ శూన్యమైపోయినది. గ్రుడ్డివాని చేతి కఱ్ఱగూడ పోయినట్లైనది. అప్పుడప్పుడామె తన గదిలోని కేఁగి యొకమూలగూర్చుండి యేడ్చుచున్నది. కాని, తల్లియొడిలో నేడ్చుటకును, గదిలో నొకమూల గూర్చుండి యేడ్చుటకును నెంతభేదమున్నది! అది శీతలజలప్రవాహము! ఇది మరుభూమి!

శాంత కిఁక శాంతిలేదు. ఆమెహృదయము అగ్నివోలె జ్వలించుచున్నది. అత్తమామలే తన తల్లిచావుకు కారణమని

భావించును. ఆమె యిప్పుడు నిరాధారయై బలవతియైనది. ఇప్పుడామె వెనుకటివలె సహనశీలకాదు. ఆమె కిప్పుడు శీఘ్రముగ కోపము వచ్చుచుండును -- దెప్పిపొడుపులకు సూటిగ సమాధానముగూడ నిచ్చుచున్నది. ఎంతటి కఠినమైన బాధలకైనను తన హృదయమును సిద్ధముచేసికొన్నది. మామ యనిన కొంచె మణఁగియుండును. కాని మేనత్తయనినను, మేనత్త కుమార్తెయనినను చెప్పుదెబ్బ కొట్టినట్లు మాట్లాడును. హత్యాభయము నాధారముగాగొని యితరుల చేనిలోబడి మేయుచున్న ఆవువలె నున్నది శాంత.

ఈ విధముగ మఱియొక సంవత్సరము గడచిపోయినది. ఆమె వివాహము చేసివేయవలెనని యుమానాథు డెంతో తిరిగినాడు; కాని తాను కోరినంతటి చౌకబేరము లభింపలేదు. అతడు చుట్టుప్రక్కల తిరిగి 200 రూపాయలు చందా ప్రోగు చేసినాడు. కాని, యింత చౌకగ వరుడెచట లభించును? తన మాట చెల్లుచో జాహ్నవి యామె నొక భిక్షుకుని కిచ్చి పీడ వదలించుకొని యుండెడిది. కాని, ఉమానాథుడు మొదటి సారిగ భార్య కెదురుచెప్పి మంచి సంబంధమును వెదకుచున్నాడు.

## 22

సార్వజనిక సంస్థలుసైతము ప్రతిభావంతుల సాయమపేక్షించుచుండును. విఠల్‌దాసుకు అనుచరుల లోపము లేదుగాని వా రందరును సామాన్యులు. ఉన్నత శ్రేణికిఁ

జెందిన వా రాతనిని తప్పకొని తిరుగుచుందురు. పద్మసింహుని రాకతో ఈ సంస్థకు ప్రాణము వచ్చినది. సన్నని నదీప్రవాహము పొంగులువారుచున్నది. గొప్పవారిలో విఠల్‌దాసుకు సంబంధించిన చర్చ ప్రారంభమైనది. ప్రజ లాతనిని విశ్వసింప దొడఁగినారు.

పద్మసింహుడు తా నొక్కడే రాలేదు. సామాన్యముగ మంచిపనియందుసైతము పాల్గొనుటకు మనము వెనుకంజ వేయుచుందుము - అప్రతిష్ఠ వచ్చునేమోయని భయపడి! గొప్పవా రీ పనిలో పాల్గొనువఱకు వేచిచూచుచుందుము. ఒకడువచ్చి త్రోవ తెలిపినంతనే మనకును ధైర్యమువచ్చును; ఇఁక నవ్విపోదురను భయముండదు. ఒంటరిగనున్నప్పుడు మన యింటిలోనే భయపడుదుము. ఇద్దరున్నచో నడవి యందైనను భయపడము. ప్రొఫెసర్ రమేశదత్తు, లాలా భక్తరామ్, మిష్టర్ రుస్తుంభాయి రహస్యముగ విఠల్‌దాసుకు సాయ మొనర్చుచుండెడివారు. అట్టివా రిప్పుడు బయటకువచ్చిరి. సహాయకుల సంఖ్య రోజు రోజుకు పెరుగజొచ్చినది.

పద్మసింహుడు పట్టుదల మనిషి. అతడెంతో పూనికతో వేశ్యలను పట్టణమధ్యమునుండి పంపివేయుట కాందోళనము ప్రారంభించెను. మునిసిపాలిటీలో నొక రిద్దరు సజ్జను లీతని యనుయాయులుండిరి. కాని వా రీ విషయమునకు కార్యరూప మొసంగుటకు సాహసింపజాలకుండిరి. తలఁచుకొనినంతనే ప్రజలు భయభీతులై పోవునంతటి జటిలసమస్య యిది! ఈ తీర్మానముపై పట్టణమున నేమి గందరగోళము బయలుదేరునోయని వారి

భయము! పట్టణమునందలి అనేకులు షాహుకార్లకు, రాజకీ యోద్యోగులకు, వ్యాపారస్తులకు ఈ ప్రేమ మార్కెట్టుతో సంబంధమున్నది. కొందరు గ్రాహకులైనచో మఱికొందరు పరీక్షకులు, మఱికొందరు బేరగాళ్ళు! వీరందరితో విరోధము తెచ్చుకొనుట కెవరు సాహసింతురు? మునిసిపల్ అధికారులు వారి చేతి కీలుబొమ్మలు!

పద్మసింహుడు మెంబర్లచుట్టు తిరిగి వారి దృష్టి నీ సమస్యవైపు కాకర్షించినాడు. ప్రభాకరరావు తీవ్రలేఖిని యాతనికి మిగుల సాయపడినది. కరపత్రములు పంచిపెట్టినారు. ఉపన్యాసములు ప్రారంభమైనవి. రమేశదత్తు, పద్మసింహుడు, ఈ విషయమున నిపుణులు. ఈ భారమును వారు వహించిరి. ఆందోళన మిపుడొక నియమిత రూపమును దాల్చినది.

పద్మసింహుడు సమస్య నుపక్రమించినాడు. కాని ఆలోచించిన కొలఁదియు నాతని కంతయు నంధకార బంధుర ముగ తోచుచున్నది. వేశ్యలను వెడలగొట్టినందువలన ఆశించిన ఉపకారము కలుగునను నమ్మకము కన్పట్టుటలేదు. ఉపకారమునకు బదులు అపకారమే కలుగవచ్చును. మానవుని విజ్ఞానమే దుర్గుణములకు సరియైనచికిత్స. ఇతరములైన ఉపాయ ములు పనిచేయవు. ఈవిధముగ ననుకొని యొక్కొక్కప్పు డాతడు నిరాశజెందును. ఈ పక్షమున తానొక సభ్యుడగుటవలన మనసులో సందేహమున్నను ఇతరులముందు తన సందేహ మును ప్రకటించుటలేదు.

రోజురోజుకు ఆందోళనము పెరుగుచున్నది. ఈ యభివృద్ధి, ఈ కార్య సాఫల్యము మిక్కిలి యుత్సాహజనకముగ నుండెను.

సదనసింహుని వివాహ మింకను రెండు నెలలున్నది. ఇంటిపనులనుండి నివృత్తుడై పద్మసింహుడు తన శక్తినంతను గొని యాందోళనమున ప్రవేశించెను. కోర్టుపనులపై నాతని బుద్ధిపోవుటలేదు. కోర్టుయందుసైత మీవిషయములే మాట్లాడు చుండును. ఒకే విషయమునుగూర్చి చర్చించి, యాలోచించి, మాట్లాడుచుండుటవలన నా విషయముపై నొక విధమైన అభిమాన మేర్పడును. క్రమక్రమముగ నాతని ప్రేమాభిమానములును పెరిగినవి.

కాని వివాహము సమీపించుచున్న కొలఁదియు నాతని యుత్సాహము క్షీణింపజొచ్చెను. ఇప్పుడొక క్రొత్త సమస్య యెదురైనది — పెండ్లికి అన్నగారు భోగముమేళము మాట్లాడుమని తప్పక వ్రాయుదురు. అప్పుడు నేనేమిచేయవలెను? భోగముమేళము లేనిచో నంతయు చిన్నబోవును. మేళమును చూచుటకు సమీపగ్రామములనుండిసైతము వత్తురు. భోగము మేళము లేనిచో వారికి నిరాశకలుగును. అన్నగారికి కష్టము తోచును. అటిస్థితిలో నా కర్తవ్యమేమి? అన్నగారి నీ దురాచారమునుండి ఆపవలెను. కాని యీ దుష్కరమైన పని యందు నెగ్గగలనా? పెద్దలముందు న్యాయము, సిద్ధాంతముల విషయమై చర్చించుట బాగుండదు. అన్నగారి కెన్నో యభిలాషలున్నవి. ఆయభిలాషలు తీరకున్నచో వారికి కష్టము

కలుగును. ఏమైనప్పటికిని నా సిద్ధాంతము ననుసరించుటయే నా కర్తవ్యము.

ఇట్లాలోచించి యాతడు పెండ్లి ప్రయాణపు సామగ్రిని సమకూర్ప మొదలిడెను. ఇట్టి శుభసంతోషసమయములందు బేరమాడుట, ఖర్చునకు వెనుదీయుట యాతనికి గిట్టదు. ఇతరములైన వస్తుసామగ్రి నధికమొనర్చి భోగముమేళపు లోటును తీర్చ నెంచెను.

# 23

రాత్రి తొమ్మిదిలంటలైనది. పద్మసింహుడు అన్నగారితో గూర్చుండి వివాహవిషయములు మాట్లాడుచున్నాడు. రేపు పెండ్లివారి ప్రయాణము. గుమ్మమువద్ద సన్నాయి మ్రోగుచున్నది. లోపల పాటలు పాడుచున్నారు.

మదనసింహుడు:- నీవు పంపిన బసవ్లు రేపు సాయంకాలమునకు అమ్మోలాగ్రామము (పెండ్లికూతురువారిగ్రామము పేరు) చేరునా?

పద్మసింహుడు:- కాదు, మధ్యాహ్నమునకే చేరవలసియున్నది. నేను ఈవేళమధ్యాహ్నమే బయలుదేరదీసినాను.

మద:- అయితే; ఇచటనుండి యేమేమి తీసికొని పోవలెను?

పద్మ:- భోజనసామగ్రిమాత్రము కొద్దిగా తీసికొని బయలుదేరుడు. అన్నియు నేను సిద్ధముచేసితిని.

మద:- భోగముమేళ మెంతకు కుదిర్చితివి? అచట రెండు మేళములు దొరకునుగదా !

ఇంక మేళము విషయమే వచ్చునని పద్మసింహుడు భయపడుచునే యున్నాడు. ఈ ప్రశ్న వినుసరికి సిగ్గుతో నాతని శిరము వ్రాలిపోయినది. కొంచెము అణకువతో 'నేను భోగముమేళమును కుదర్చలే'దనినాడు.

ఎవరో గిల్లినట్లు మదనసింహు డులికిపడినాడు — 'ధన్యుడవురా నాయనా! చాల గొప్పవాడవు! మధ్యలో నావనుముంచివేసినావు. మఱి ఆడవాళ్ళకొఱ కేమొనర్చినావు? ఏమి? తీరికలేకపోయినదా? లేక ఖర్చుకు లోభించియా? అందు వలననే నాలుగు రోజులు ముందుగ ఉత్తరము వ్రాసితిని. ఖర్చుకు భయపడినచో నాకు కబురుచేసియుండిన డబ్బు నేను పంపియుండెడివాడనుగదా! భగవంతుని దయవలన నింతవఱకు లోపములేదుగదా! మఱి యిప్పుడేమి చేయవలెనో చెప్పుము! మన కిది యవమానమగునా కాదా? ఒక పెద్దమనిషి యింటికి పెళ్ళివారమై యేగుచున్నప్పుడు వా రేమనుకొందురు? దూర దూరములనుండి వారి చుట్టపక్కములు వచ్చియుందురు; మన బంధువులు వత్తురు; వా రందరు నేమనుకొందురు ? రామ ! రామ!'

మున్షీబైజనాథుఁ డా యగ్రహారమున నర్థ రూపాయి భాగస్వామి. అతడు మదనసింహునివైపు నిగూఢముగజూచి— 'అయ్యా! మనసులోననుకొనరు. మొగముమీదనే యందురు. పేరు గొప్ప ఊరు దిబ్బయనుకొందురు. ఇంటిపేరు కస్తూరి

వారు, ఇంట గబ్బిలాలకంపు అని నిందింతురు. లోకమున నప్రతిష్ఠపాలై పోదుము. మేజువాణీలు, నృత్యప్రదర్శనములు, ఆడవాళ్ళకే కాదు. నామటుకు నేను భోగముమేళములేని పెండ్లి చూడలేదు. బహుశః మనవాడికి తొందరలో తోచి యుండదు' అనినాడు.

పద్మసింహుడు భయముతో — 'కాదు! అదికాదు విషయము! ప్రస్తుతము పట్టణమున ప్రజలు భోగముమేళము లను చెడు ఆచారముగ భావించుచున్నారు. చదువుకొనిన వారందరును భోగము మేళములను వ్యతిరేకించుచున్నారు. నేనుగూడ ఆ సంఘమున చేరితిని. నా సిద్ధాంతమును వీడుటకు సాహసింపలేకపోతిని'అనినాడు.

మదన:-'అదియా విషయము! సరే! పాపము! నేటికి కండ్లు తెఱచినారు. న్నేను ఈ యాచారమును నింద్యమని యొప్పుకొందును. కాని, అప్రతిష్ఠపాలగుటకు, మాటపడుటకు అంగీకరింపను. నా కొక్కడే కుమారుడు! నా యభిలాష లన్నియు తీరవలెను. పెండ్లి యైపోయినతరువాత నేనును నీ యభిప్రాయములనే గ్రహింతును. ఈ సారికి నన్నీ పాత త్రోవలో పోనిమ్ము. కష్ట మనుకొననిచో ఉదయము బండికే వెళ్ళి బజానాయిచ్చి తిరుగుబండిలో రమ్ము! నిన్నచట చాల మంది యెఱిగియుందురు గాన నీతో చెప్పుచున్నాను. మఱి యొకరు వెళ్ళినచో నిష్టము వచ్చినట్లు దోచివేయుదురు.'

పద్మసింహుడు తలవంచి యాలోచింపసాగినాడు. అతడు మాటాడకుండుటనుగాంచి మదనసింహుడు కోపించి నాడు—'మాటాడవేమి? వెళ్ళుట కిష్టములేదా?'

'అన్నయ్యా! మీరు నన్ను క్షమించుచో......' పద్మసింహుడు దీనభావముతో నేమియో చెప్పబోయినాడు.

'అక్కరలేదు. నీ కిష్టము లేనిచో బలవంతము చేయను. నీవు వెళ్ళనక్కరలేదు. బైజ్‌నాథ్! నీకు కష్టమే! అయినను, నా కొఱకై నీవు వెళ్ళక తప్పదు.'

బైజ్:- నా కెట్టి యభ్యంతరమును లేదు!

తన అన్నగారికి కోపము వచ్చునను భయముతో పద్మసింహుడు అణగి మణగియున్నాడు. తల యెత్తుటకు సాహసము చాలుటలేదు. ఒకవైపున అన్నగారి మనసుకు కష్టము, వేఱొకవైపున సిద్ధాంతమును, న్యాయమును హత్య చేయుట! ఒకవైపున చీకటిలోయ, మఱొకవైపున నిటారున నున్న శిఖరము! ఎటుపోవుటకును తోచుటలేదు. చివఱికి భయముతో—'అన్నయ్యా! అనేక పర్యాయములు నా తప్పులను క్షమించినావు! ఈ సారికి యీ యవినయ మునుగూడ సహింపుము. భోగము మేళముల యాచారము మంచిది కాదని తెలిసియు దానికై యింత పట్టుదలయేల?' అనినాడు.

మదనసింహుడు విసుగుకొనినాడు— 'నీ వీ దేశములో పుట్టనట్లు, ఎచటినుండియో దిగివచ్చినట్లు మాట్లాడుచున్నావు. ఇదే కాదు, దోషమని తెలిసియు మన మాచరింపవలసి

వచ్చుచున్న దురాచారము లనేకములున్నవి. లోకాచారము ననుసరింపకున్నచో ప్రపంచము వెక్కిరించును. భోగము మేళమును తీసికొని వెళ్ళకున్నచో డబ్బు ఖర్చుకు వెఱచి, లోభియై తీసికొనిరాలేదందురు. మన మర్యాదకే భంగము!'

ఈడబ్బును మఱొక తగిన విధముగా ఖర్చుచేసినచో లోభియనియు, డబ్బు ఖర్చుకు వెనుదీసినాడనియు ననుకొనరు. మీరు రెండు మేళములు తీసికొని వెళ్ళదలచుచున్నారు. మూడు వందలకు తక్కువైనచో రారు. ఆ మూడు వందలకు బదులు 500 రూపాయలు పెట్టి దుప్పట్లుకొని ఆ గ్రామము లోని బీదలకు పంచిపెట్టుడు. అది కానిచో, నచట మంచినీటి నూతిని త్రవ్వింపుడు. ఇట్లైనచో మీ కీర్తి చిరకాలముండును.

దీనితో అప్రతిష్ఠ, పరువునష్టము అను పేరుతో మదన సింహుడు చెప్పినవాదము నిలువలేకపోయినది. అతడు సమా ధానముకై వెదకుచున్నంతలో బైజనాథుడు — 'అన్నయ్యా! ప్రతిపనికిని ఒక నియమితమైన సమయముండును. దానము చేయవలసిన తరుణమున దానమే చేయవలె. భోగముమేళముల తరుణమున భోగముమేళములే యుండవలె! అతుకని మాటలు దేనికి? పైగా పట్టణమై, తెలిసినవారైనచో నా ధోరణి, ఆ వ్యవహారము వేఱు! ఇది పల్లెటూరాయె! ఆ పల్లెటూరిలో దుప్పట్లు పంచిపెట్టినచో నందరు నవ్వుదురు.' అనినాడు.

మదనసింహు డందుకొనినాడు — 'అవును మఱి! వసంతఋతువున మల్హారరాగము పాడువాని నేమందురు? సమయముకాని సమయమున చేయుపని శోభింపదు. అందు

చేతనే నిన్ను ఉదయమే వెళ్ళి రెండు మేళములు కుదిర్చిరమ్మని చెప్పుచున్నాను.'

వీరిరువురును తమకు తోచినట్లు చేయుదురు. కాని వీరు తమ వాదమును సమర్థించుకొనుట కేయుక్తుల జెప్పుదురో చూతుననుకొనినాడు పద్మసింహుడు. నిస్సంకోచముగ నడిగినాడు – 'అయిన, వివాహమనునది ఆనందోత్సవ సమయమని యెట్లనగలము? నా యుద్దేశ్యమున దానధర్మముల కింతకంటె మంచితరుణ మింకొకటిలేదు. వివాహమనున దొక ధార్మిక వ్రతము. ఇట్టి పవిత్రమైన వ్రతసమయముననే మనము గంభీరమైన పనులాచరింపవలె! ధార్మిక విషయములందు మూర్ఖులను రంజింపజేయుటయే ప్రధానము కాదను విషయము మన చదువు సంధ్యలవలననైనను తోచవలె!'

కాని, మున్షీ మాత్రము తన యోటమి నంగీకరింపడు – 'నీవు వకీలువి. నీతో వాదించు సామర్థ్యము మా కెక్కడిది? మంచికావచ్చు, చెడుకావచ్చు, సనాతనాచారము నతిక్రమించుటవలన పరువునష్టము కలిగితీరును. అప్రతిష్ఠతప్పదు. మన పూర్వులు మూర్ఖులు కారుగదా! వారనేక విషయములాలోచించియే యా యాచారమును ప్రచారమొనర్చినారు.'

మదనసింహుని కీ యుక్తి తోచలేదు. చాల సంతోషించినాడు. మున్షీవైపు గౌరవముతో జూచినాడు — 'అవును! నిజముగానే! మనకు నేడు అర్థము కాకపోయినను పూర్వుల ప్రతి ఆచారమందును నేదో యొక రహస్య మిమిడియుండును. ఈ కాలపువారు ఆ యాచారములను నాశన

మొనర్చుటయే తమ గౌరవముగ భావించుచున్నారు. వీరు తమ కంటె గొప్పవారు లేరనుకొనుచుందురు. మనకున్న విద్య, జ్ఞానము, భావములు నన్నియు పూర్వుల సంపత్తియేయని వారనుకొనరు. మన అచార వ్యవహారములన్నియు వయసు ననుసరించి యుండును. వాటిలో జేరములు పనికిరావు.'

పద్మసింహు డీమాటల నెంతో యోపికతో విను చుండెనే కాని సమాధానమీయలేదు. సమాధానమిచ్చినచో మాటపై మాటలు పెరిగిపోవునని భయము. వాదము వివాద ముగ మారినప్పుడు దాని లక్ష్యమే దూరమై మాయమై పోవును. వాదమునందు నమ్రత్వము, వినయము ననునవి ప్రబలమైన యుక్తులకంటె నెక్కువ ప్రభావమును కలుగ జేయును. అందుచే — 'గ్రాహకులెక్కువగ కోరుచుండు వస్తువులే బజారులో కన్పించుచుండుననియు, గ్రాహకుల న్యూనాధిక్యముపై వస్తువుల న్యూనాధిక్యము లాధారపడి యుండుననియు మీ భావము.' అనినాడు.

బైజ్:- అవును! అందులో సందేహములేదు.

పద్మ:- ఒక వస్తువుయొక్క గ్రాహకులే ఆ వస్తువు బజారులోనికి వచ్చుటకు కారణమగుచున్నారు. అవునా? ఎవరును మాంసము తినకున్నచో మేకల మెడలు నరుకవలసిన అనవసరముండదుగదా!

ఇతఁడేదో మఱియొక యుక్తి తెచ్చుచున్నాడనుకొని నాడు బైజ్‌నాథ్; కాని, అందలి మర్మమాతనికి కింకను

అర్థముకాలేదు. కొంచెము భయపడుచు — 'అవును! అంతే!' అనినాడు.

పద్మ:- అగుచో ప్రతిదినము బజారులో సిగ్గు-సతీత్వము లను విడిచి గుమ్మమువద్ద నిలబడి అభిసరించుచు కన్పించు చున్న వందలకొలది స్త్రీల సర్వనాశనమునకు కారణభూతు లము మనమేయని గ్రహించుట కష్టముకాదుగదా! ఈ దురా చారకూపమునబడి నాశనమైపోవుచున్న వేలకొలది సంసార ముల విషయమై భగవంతుని యెదుట మనమే సంజాయిషీ యిచ్చుకొనవలసి యుండును. ఇన్ని దుష్పరిణామములకు నిలయమైన దురాచారమును త్యజించుట యనుచితమగునా?'

మదనసింహు డీమాటలు శ్రద్ధగావినుచున్నాడు. అతడు సాధారణబుద్ధిగలవాడు. విషయమును వదలి శుష్క-వాదమును పెంచు టాతనిసామర్థ్యమునకు మించినది. చిరు నవ్వుతో - 'మున్నీ! ఏమందువు? తప్పుకొనుట కేమైన నుపా యములున్నవా?' అని ప్రశ్నించినాడు.

బైజనాథుడు నవ్వుచు 'నాకు మార్గము తోచుటలేదు' అనినాడు.

మదన:- ఇట్టి ప్రదర్శనములవలన మనసు చంచల మైపోవునని నేనును నంగీకరింతును. వయసులో నున్నప్పుడు వేశ్యానృత్య మెచటనైన జూచినచో మూడు నెలలవఱకు ఆమె రూపమే కండ్లముందుండెడిది. ఆ వేశ్యనుగూర్చిన చర్చలే సాగెడివి.

బైజ:-అన్నయ్యా! పద్మసింహుడు చెప్పినట్లేచేయుడు. కాని దుప్పట్లు పంచిపెట్టుటమాత్రము మానవద్దు.

మద:- ఒక నుయ్యి త్రవ్వించినచో పేరు శాశ్వతముగ నిలిచియుండును. ఇచట అగ్నిప్రదక్షిణము, అచట నూతికి శంకుస్థాపము ఒకసారే జరుగును.

# 24

వర్షకాలము. మేఘము లలముకొనియున్నవి. ఉమానాథుడు చునార్ గఢమువద్ద గంగాతీరమున నావకొఱ కెదురు చూచుచున్నాడు. అతడు చాలగ్రామములు తిరిగి తిరిగి వచ్చుచున్నాడు. సూర్యాస్తమయమునకు పూర్వమే చునార్ గఢమునకు సమీపముననున్న గ్రామము వెళ్ళవలెననుకొనినాడు. ఆ గ్రామమున నొక మంచిసంబంధమున్నదిని వినినాడు. ఈనాడే తిరిగి అమోలా చేరుకొనవలెనని యాతని యుద్దేశ్యము. అందుకు కారణము లేకపోలేదు - ఆ గ్రామమున నేడొక క్రిమినల్ కేసు వచ్చినది. రేపు ఉదయము విచారణకై ఇన్ స్పెక్టరుగారు వత్తురు. కాని యింకను నావ ఆవలియొడ్డుననే యున్నది. అతనికి నావికులపై కోపమువచ్చుచున్నది.

ఇంతలో నొక సాధువు తనవైపుకే వచ్చుచుండుట నుమానాథుడు చూచినాడు. ఆసాధువు నెచటనో చూచినట్లున్నది - కాని, జ్ఞాపకము వచ్చుటలేదు. స్మృతిపై పరదా కప్పబడినట్లున్నది.

అకస్మాత్తుగ సాధువు ఉమానాథుని జూచి నమస్కారము చేసినాడు - 'బాబూ! అందఱు క్షేమమూ? ఇచటి కేలవచ్చినారు?'

ఉమానాథుని కండ్లపైనున్న తెర తొలగిపోయినది. స్మృతి జాగృతమైనది. మనము రూపమును మార్చగలము గాని, మాటలను మార్పజాలము. ఓహో! ఇతడు గజాధరుడా? ఉమానాథుడు కొంచెము భయపడుచు - 'తమ పేరు?' అని అడిగినాడు.

సాధువు:- ఇదివరలో గజాధరపాండే యనెడివారు. ఇప్పటిపేరు గజానందస్వామి.

ఉమా:- ఓహో! అందువలననే గుర్తుపట్టలేకపోతిని. ఎచటనో చూచినట్లున్నది, కాని యీ వేషముతో చూచి యాశ్చర్యపడుచున్నాను. పిల్ల జల్ల యెచట నున్నారు?

గజా:- ఆమాయాజాలమునుండి విముక్తుడనైతిని.

ఉమా:- మఱి, సుమన్?

గజా:- దాల్‌మండీలో నొక గదిలోనున్నది.

ఉమానాథు డాశ్చర్యముతో నాతని మోము చూచినాడు; వెంటనే సిగ్గుతో గజాధరుని శిరము వంగిపోయినది. ఒక్క క్షణమాగి యుమానాథుడు ప్రశ్నించినాడు - 'అదేమిటి? కారణము? నాకేమియు నర్థమగుటలేదు.'

గజా:- ఏమున్నది? ప్రపంచములో సామాన్యముగ జరుగుచున్నట్లే జరిగినది. నా ధార్ష్ట్యము - నిర్దయత్వము, ఆమెలోనున్న చాంచల్యము-విలాసలాలస, ఈ రెండును కలిసి

మాయిరువురి జీవితములను నాశనమొనర్చినవి. ఆ వెనుకటి విషయములను తలచుకొనినచో నొక గొప్పయింటి పిల్లను వివాహమాడి పొరపాటుచేసితిననిపించుచున్నది. వివాహ మాడినపిమ్మట ఆమెను తగినట్లు గౌరవించి యాదరింపక పోవుట మఱింతపొరపాటైనది. ఆమెయెడల నిర్దయుడనైతిని. ఆమె యింటినుండి వెడలిపోవుటకు నేనే కారణమనని యిప్ప డనిపించుచున్నది. ఆమెయెడల నే నెన్నియత్యాచారము లొనర్చితినో యాలోచించుకొనుచున్నకొలది విషము త్రాగి యాత్మహత్య చేసికొనవలెననిపించుచున్నది. నే నొనర్చిన పాపమునకే ప్రాయశ్చిత్త మొనరించుకొనుచున్నాను. ఆమె వెడలిపోయినపిమ్మట నాలుగైదు దినములవఱకు నా యుద్రేక మున్నది. ఆయుద్రేకము, ఆయున్మాదము చల్లబడినకొలఁది నా కా యింటిలోనుండ బుద్ధిపుట్టలేదు. నే నొకగుడిలో పూజారినైతిని. ఆ గుడికి ప్రతిరోజు నలుగురైదుగురు సజ్జను లేతెంచుచుండెడివారు. వారితోగూడ రామాయణాది గాథా పారాయణము ప్రారంభించితిని. అప్పుడప్పుడు కొందరు సాధు వులుగూడ వచ్చుచుండెడివారు. వారి సామీప్యమున సత్సాం గత్యము లభించినది. ధార్మిక కథాశ్రవణమున మనసు భక్తి-ప్రేమలతో పరిప్లావితమైనది. జ్ఞానుల సాంగత్యమువలన భక్తిభావము విరాగరూపమును ధరించినది. గ్రామగ్రామము తిరుగుచు ప్రజలకు నా చేతనైన మేలు చేయుచున్నాను. తమరు కాశీనుండి వచ్చుచున్నారా?'

ఉమా:- లేదు. ప్రక్కనున్న గ్రామమునుండి వచ్చుచున్నాను. సుమన్‌కొక చెల్లెలున్నది. ఆమెకై సంబంధము వెదకుచున్నాను.

గజా:- కాని, ఈసారి మంచి సంబంధము చూడుడు!

ఉమా:- మంచి సంబంధములకు లోటులేదు. కాని, అంతటి సంబంధములు తెచ్చుటకు నాకు శక్తి యుండవలెను గదా! సుమన్‌కై తక్కువ తిరిగితినా?

గజా:- సుయోగ్యుడైన వరుని తీసికొని వచ్చుట కెంత కావలసియుండును?

ఉమా:- కట్నమే వెయ్యిరూపాయ లడుగుచున్నారు. ఖర్చులు ఆపైన నుండనేయున్నవి!

గజా:- తమరు సంబంధమును నిశ్చయింపుడు! భగవంతుని దయయున్నచో వెయ్యి రూపాయల విషయము నేను చూచుకొందును. ఈ వేషమును ధరించి ప్రజలకెంతైనను నుపకారము చేయగలనని గ్రహించితిని. నాలుగైదు రోజులలో మీ యింటివద్దనే మిమ్ము కలిసికొందును.

నావ వచ్చినది. ఇరువురు నావపై గూర్చుండిరి. గజానందుడు పడవవాండ్రతో మాట్లాడుచున్నాడు. ఉమానాథుడు ఆలోచనాసాగరమున మునిగియున్నాడు. 'నీ వలననే సుమన్ జీవితము సర్వనాశనమైపోయిన'దని యాతని మనసు మాటి మాటికిని చాటుచున్నది.

# 25

ఉమానాథుడు సదనసింహుని సంబంధము స్థిర మొనర్చి తాంబూలములు పుచ్చుకొని వచ్చినాడు. అతడు భార్యతో గజానందునిసాయము విషయము చెప్పలేదు. ఆమె యాడబ్బును తన కొమార్తె వివాహమునకై ఖర్చు చేయుమని పట్టు పట్టునేమోయని యాతని భయము. భార్యముం దాతని మాటసాగదు. ఆమె చెప్పినదానికి తల యూపుటకంటె చేయునది లేదు.

అతడు వెయ్యిరూపాయల కట్నమిచ్చుట కంగీకరించి సంబంధము స్థిరమొనర్చినాడు. కాని, యిప్పుడు పెండ్లిఖర్చుల విషయమైన దిగులుపట్టినది. ఎంతతక్కువగ చూచుకొనినను మఱొక వెయ్యిరూపాయలు కావలె! ఈ వెయ్యిరూపాయలు లభించు ఉపాయమాతనికి తోచుటలేదు. కాని, శాంతకు మంచి సంబంధము వచ్చినదని, ఆమె సుఖింపగలదని, గంగా జలి యాత్మ ప్రసన్నము కాగలదని తలచుకొనునప్పుడాతనికి సంతోషముగనున్నది.

కృష్ణచంద్రుడు జైలునుండి విముక్తుడై వచ్చి యొక వారము దినములైనది. కాని, యింతవఱకును వివాహవిషయమై యాతనితో సంప్రదించుట కుమానాథునికి వీలుకలుగుటలేదు. కృష్ణచంద్రునియెదుట కేగుటకే యాతడు సిగ్గుపడుచున్నాడు. కృష్ణచంద్రుని స్వభావములో నొక గొప్పమార్పు గోచరించు చున్నది. అతనిలోని గాంభీర్యమునకు బదులు ఔద్ధత్యము

ప్రవేశించినది. సంకోచమనునది పూర్తిగ లోపించిపోయినది. అతని శరీరము శుష్కించిపోయినది. కాని, యాతనిలో నేదో యద్భుతమైనశక్తి యిమిడియున్నట్లు తోచుచున్నది. అతఁడు రాత్రులందు తఱచుగ 'ఉస్సు'రని నిట్టూర్చుచుండును.

ఆతని కనులందొకవిధమైన చాంచల్యము కన్పట్టుచుండెను. జాహ్నవి యాతని ముందు నిలువలేకున్నది - అతడనిని భయము కలుగుచున్నది.

అత్తవారిల్లగుటవలన స్త్రీలతో నవ్వులాటలకు—వేళాకోళములకు కృష్ణచంద్రుని కధికారమున్నది. ఆతని హాస్యపూర్ణమైన మాటలు, ఆతని దుశ్చేష్టలతో గూడిన చూపులకు స్త్రీలు సిగ్గుతో తలవంచుకొని జాహ్నవిని దెప్పుచుండెడివారు. యదార్థమున కాతడు కామ సంతాపముతో జ్వలించుచున్నాడు.

అమోలా గ్రామమున సుశిక్షితులైన సజ్జను లనేకులున్నారు. కాని కృష్ణచంద్రుడు వారితో కలిసియుండెడివాడు కాడు. అతడెల్లప్పుడును నీచులతో జేరి గంజాయి దమ్ము పీల్చుచుండును. వారితో జేరి కూర్చుండి తన జైలు అనుభవములను వర్ణించుచుండును. ఆ వర్ణనములం దాతని నోటినుండి బూతులు విశేషముగ వెలువడుచుండును.

ఉమానాథుడు గ్రామములో సర్వమాన్యుడు. కృష్ణచంద్రుని దుష్కృత్యములను గాంచి లోలోన బాధ పడుచు, ఈతడిచటినుండి వెడలిపోయిన బాగుండునని భగవంతుని ప్రార్థించుచుండెను.

కాగా, శాంతకుగూడ తండ్రివద్ద కేతెంచుటకు భయము, సంకోచముగనే యుండెను. గ్రామ మందలి స్త్రీలు వచ్చి జాహ్నవితో కృష్ణచంద్రుని దుండగములను చెప్పి నిందించునప్పుడు శాంత మిక్కిలి దుఃఖించుచుండెను. తండ్రి యీవిధముగ మాఱిపోవుటకు గారణమామె కర్థమగుట లేదు. తన తండ్రి యెంతో గంభీర స్వభావుడు! ఎంతో దయాపరుడు! ఎంతో సచ్చరిత్రుడు! అట్టివాడిట్లు మారి పోయినాడేమి? శరీరము వెనుకటిదే! కాని, ఆయాత్మ యేమైపోయినది?

ఈ విధముగ నొక నెల గడిచినది. తన కొమార్తె వివాహము జరుగుచుండగా సీతడెంత నిశ్చింతగ గూర్చుం డెనో చూడుడు! ఈ బాధలన్నియు నేనేల సహింపవలెను? అని ఉమానాథుడు మనసులో విసిగికొనుచుండును. బయటికి పోయి నాలుగు డబ్బులు సంపాదింపడు, తనతోబాటు నన్నుగూడ బైరాగిని చేసివేయుచున్నాడని బాధపడును.

ఒకనా డుమానాథుడు కృష్ణచంద్రుని సహచరులపై కోపించి 'యికనుండి అతనితో గూర్చుండి గంజాయి పీల్చినచో మీ మర్యాద దక్కదు. మీయంతు కనుగొందును జాగ్రత్త' అని కేకలు వేసినాడు. ఆ యూరిలో నుమానాథునికి మంచి పలుకుబడి యున్నది. వారందఱును భయపడిరి. మఱు నాడు కృష్ణచంద్రుడు వారివద్దకేగినంతనే వారు 'బాబూ! మీరిచటికి రావద్దు! మాపై నుమానాథునికి కోపము కలుగు

నట్లు చేయవద్దు. ఆయన యేదైన వ్యవహారములోని కీడ్చినచో చచ్చిపోవుదును' అనినారు.

కృష్ణచంద్రుడు కోపముతో నుమానాథునివద్ద కేఁగి- 'నేనిచట నుండుట నీ కిష్టములేదాయేమి?' అని యడిగినాఁడు.

ఉమా:- ఇది పరాయియిల్లుకాదు! మీ యిష్టమువచ్చినంతకాల మిచట నుండవచ్చును. కాని, ఆ నీచులతో జేరి మీమర్యాదను పాడుచేసికొని నా మర్యాదనుసైతము మంట గలుపవద్దు.

కృష్ణ:- అయితే, ఎవరితో గూర్చుండవలెను? ఇచట నున్న పెద్దమనుష్యులలో నాతో గూర్చుండువారెవరున్నారు? అందరు నన్ను తుచ్ఛునిగ చూచుచున్నారు. నేనిది సహింపలేను. నా యీ స్థితియందుసైతము నన్నాదరించువారితో, నన్ను గొప్పవానిగ నెంచువారితో, కాకుల్లై యుండియు హంసలవోలె నటింపనివారితో జేరి కూర్చుందును. నా యీ ప్రవర్తనమువలన నీ మర్యాదకు లోపము వాటిల్లుచో బలవంతముగ నేనిచట నుండదలచుటలేదు.

ఉమా:- నే నీయుద్దేశ్యముతో వారిని మీతో తిరుగవలదని వారింపలేదనుటకు భగవంతుడే సాక్షి. గవర్నమెంటు ఆఫీసర్లతో నాకు పరిచయమున్నవిషయము మీకు తెలియును. మీరిట్లు తిరిగినచో వారిముందు తలవంచుకొనవలసివచ్చును.

కృష్ణ:- మిత్రమా! చాలును! అనవసరముగ నన్ను రెట్టింపకుము! నానోరు మంచిదికాదు. పోలీసులకు తొత్తువై, వారికి తార్చుచుండు నీకుగూడ నింతటి మర్యాదయేనా?

ఉమా:- నేను అధముడను, పాపిష్టివాడను కావచ్చును. కాని మీయెడ నేను చూపిన మంచితనమునకు మీ రీవిధముగ మాటాడి యుండగూడదు.

కృష్ణ:- అవును! నా సంసారము సర్వనాశనమగునట్లు వ్యవహరించితివి. నీవు నా భార్యను చంపితివి. నాపిల్ల నే లంపటుని మెడకు గట్టినావో తెలియదు. ఈపిల్లచేత నీ యిష్టము వచ్చినట్లు చాకిరి చేయించుకొనుచున్నావు. ఏమియు తెలియని నా భార్యచేత కేసునడిపించు వంకబెట్టి ధనమంతయు నపహరించినావు. నీ యింటికిఁదెచ్చి యామెను నాశన మొనర్చితివి. ఇప్పుడు నీపెద్దమనిషితరహాను వర్ణించుచున్నావా?

'ఏమి జరిగినదో జరిగిపోయినది; ఇఁక నాదుంప తెంపక వెళ్ళి శాంతవివాహపుటేర్పాట్లు జేసికొ'మ్మని చెప్పదలచుకొనినా డుమానాథుడు. కాని కోపముతో నిజముగానే శాంతను వెంటబెట్టుకొని లేచిపోవునేమో యని భయపడి దుఃఖమును బ్రమింగి మిన్నకున్నాడు. నిర్బలమైన క్రోధము- ఉదారహృదయమున కరుణభావము నుద్భవింపజేయును. భిక్షుకునినోట తిట్లుతినిన సజ్జనుడు మిన్నకుండుట తప్ప యేమిచేయగలడు?

ఉమానాథుని సహనము కృష్ణచంద్రుని శాంతింపజేసినది. కాని యిరువురికిని మాటలులేవు. పోట్లాడిన రెండు కుక్కలు ఒకదాని కెదురుగ మఱొకటి కూర్చుండినట్లు వారిరువురును ఆలోచనామగ్నులై కూర్చుండిరి. నేను మాట్లాడకుండుటయే మంచిదైనది; లేనిచో ప్రపంచము నన్నే

నిందించియుండెడి దనుకొనుచున్నాడు ఉమానాథుడు. నాదే తప్పు! అనవసరముగ వెనుకటివాటి నన్నిటిని త్రవ్వి పోసినానని పశ్చాత్తాపపడుచున్నాడు కృష్ణచంద్రుడు. అనుచితమైన క్రోధములో నిద్రాణమైయున్న ఆత్మను మేల్కొల్పుటయందు విశేషానురాగముండును. కృష్ణచంద్రునికి తన కర్తవ్యము స్పష్టముగ గోచరింపసాగినది. అనుచితమైన క్రోధము అకర్మణ్యతాసుషుప్తిని భంగమొనరించినది. సాయంకాలము 'శాంత వివాహమును నిశ్చయ మొనరించితివిగదా'యని యుమానాథుని పలుకరించినాడు కృష్ణచంద్రుడు.

ఉమా:- నిశ్చయించినాను. చునార్ గ్రామమున మదన సింహుని కుమారుని సంబంధము నిశ్చయించితిని.

కృష్ణ:- వారు గొప్ప కుటుంబీకులేమో! కట్నమెంత?

ఉమా:- వెయ్యి రూపాయలు!

కృష్ణచంద్రుడు నిర్విణ్ణుడైనాడు! 'మఱి డబ్బెచటిది?' అని యడిగినాడు కృష్ణచంద్రుడు.

ఉమా:- భగవంతు డేదోవిధముగ సానుకూలము చేయకపోడు.

కృష్ణచంద్రుడు లజ్జితుడైనాడు — 'నా స్థితి నీవు చూచుచునే యున్నావుగదా!' ఈమాట లనునప్పటి కాతని కనులనుండి యశ్రువులు జాలువారినవి.

ఉమా:- మీరేమియు విచారింపవద్దు. అన్నియు నేనే చూచుకొందును.

కృష్ణ:-భగవంతుడు నిన్ననుగ్రహించుగాక! నాయనా! నేను చూపిన అవినయమునకు మనసులో కష్టముంచుకొనవద్దు. ఈ బాధలన్నియు నన్ను పిచ్చివాని నొనర్చినవి. అందుచే నామనసు మనసులో లేదు. ఇంతటి బాధ్యతను నిర్వహించు శక్తి నా కెచటిది? నీవు నిజముగ నన్నుద్ధరించితివి. ఈ నౌకను దరిజేర్చితివి. ఇంతటి భారమును నీపై మోపి నేను సోమరినై కూర్చుండుట భావ్యముకాదు. ఎచటికైనను వెళ్ళి నాలుగు డబ్బులు సంపాదించుట కనుజ్ఞ నిమ్ము! నేను రేపే కాశీ వెళ్ళు చున్నాను. నాకు పరిచయమున్నవా రనేకులున్నారు. కాని, నేను వారియిండ్లకు వెళ్ళను. సుమన్ ఏ వీధిలో నున్నది?

ఉమానాథుని ముఖము వెలవెల పోయినది. ముఖమున నెత్తురుచుక్క లేదు—'వివాహము పూర్తియగువఱకు నిచటనే యుండుడు. తరువాత వెళ్ళవచ్చు.'

కృష్ణ:- కాదు, నన్ను రేపే వెళ్ళనిమ్ము. పెండ్లి యొక వారముదినములున్నదనగా వత్తును. నాలుగురోజులపాటు సుమన్ యింటిలోనుండి నౌకరీ చూచుకొందును. వారు ఏవీధిలో నున్నారు?

ఉమా:- నేనచటికేఁగి చాల కాలమైనది. ఏవీధిలో నున్నారో నాకు సరిగా జ్ఞాపకములేదు. పట్టణములో నుందు వా రచటనే యుందురను నమ్మకమేమున్నది? రోజుకొక యింటిని మార్చుచుందురు. మఱి, యిప్పు డేవీధిలో నున్నారో తెలియదు.

రాత్రి భోజనసమయమున కృష్ణచంద్రుడు శాంతను సుమన్ జాడ యడిగినాడు. శాంత యుమానాథుని సంజ్ఞను అర్థముచేసికొనలేక ఆమె చిరునామా చెప్పివేసినది.

# 26

ఆపట్టణపు మునిసిపాలిటీలో 18 మంది సభ్యులుండిరి. అందు 8 మంది మహమ్మదీయులు, 10 మంది హిందువులు. చదువుకొనిన సభ్యుల సంఖ్య యధికము. అందుచే వేశ్యలను పట్టణమధ్యమునుండి వెడలగొట్టవలెనను తీర్మానము అంగీక రింపబడునని పద్మసింహుని నమ్మకము. అతడు సభ్యులందరిని కలిసికొని వారి యనుమానములకు సమాధానముగూడ నిచ్చి నాడు. కాని, ఈ విషయమున పూర్తిగ వ్యతిరేకించునట్టి సజ్జ నులుగూడ సభ్యులలోనున్నారు. వీరందఱును వ్యాపారస్తులు, ధనికులు, పలుకుబడికలవారు. అందుచే మిగిలిన సభ్యులు వారి యొత్తిడికి లొంగిపోవుదురేమోయని యాతని భయము. హిందువులలో వ్యతిరేకవర్గమునకు నాయకుడు సేట్ బలభద్ర దాసు; మహమ్మదీయులలో హాజీహాశిం. ఈ యాందోళనము నకు విఠల్‌దాసొక్కడే సర్వస్వముగ నున్నంతకాలము ఈ పెద్ద లీవిషయమును పట్టించుకొనలేదు. కాని పద్మసింహుడు, మఱికొందరు సభ్యులు ఈయాందోళనమున జేరినప్పటి నుండియు బలభద్రదాసు, హాశింసాహెబుగార్లకు నిద్ర పట్టుట లేదు. ఈ తీర్మానము సభలో ప్రవేశపెట్టబడునని తెలిసినప్పటి నుండియు నీ యిరువురు మహానుభావులును తమ పక్షమును

నెగ్గించుకొనుటకు పూనుకొనిరి. హాశింసాహెబు మహమ్మ దీయ సభ్యులను ప్రోగుచేసినాడు. హాశిం పలుకుబడిగలవాడు. పట్టణమందలి మహమ్మదీయు లాతనిని తమ నాయకునిగ నెన్నుచుందురు. మిగిలిన 7 గురు సభ్యులలోను మౌలానా తేగ్ ఆలీ యొక గురుపీఠమునకు సంరక్షకుడు. మున్షీ అబుల్ వఫా అత్తరునూనెల పరిశ్రమకుయజమాని. చాలపట్టణములం దాతని వ్యాపార కేంద్రము లున్నవి. మున్షీ అబ్దుల్ లతీఫ్ జమీందారు. తఱచు పట్టణములోనే యుండును. కవిత్వమునిన నెక్కువ యిష్టము; కవికూడను. శాకిర్ బేగ్, శరీఫ్ హాసన్ వీరిరువురును ప్లీడర్లు. వారిసామాజికసిద్ధాంతము లత్యున్నతములు. సైయ్యద్ శఫ్కత్ ఆలీ డిప్టీకలక్టరుచేసి యుపకారవేతనమును పొందు చున్నాడు. శహారత్ ఖాన్ మంచి పేరుపొందిన డాక్టరు. ఈ చివరి యిరువురును సాధ్యమైనంతవఱకు సభాసమ్మేళనము లకు కొంచెము దూరముగ నుందురు. కాని వారిలో నౌదా ర్యము, ఆలోచనలకు లోటులేదు. ఈ యిరువురును ధార్మిక ప్రవృత్తిగలవారు. సమాజమున వారికి విశేషగౌరవమున్నది.

కానిఈ సభవలన విశేషప్రయోజనము కలుగలేదు. ఏపక్షము నవలంబించి యింటి నుండి బయలుదేరినారో ఆపక్షముననే పట్టుదలతో నిలబడినారు. హాజీ హాశింకు తన పక్షమునకు విజయము కలుగునన్న విశ్వాసమున అనుమా నము బయలుదేరినది.

ఈ తీర్మానమును వ్యతిరేకించు సందర్భమున మహమ్మ దీయుల యుత్సవములకు సంబంధించిన విషయములు విని

నంతనే హిందూ సభ్యులు జాగృతులైరి. మహమ్మదీయుల వలన వా రాశించినది విఫలమైపోయినది. మొత్తము పదిమంది హిందూ సభ్యులున్నారు. బలభద్రదాసు చైర్మన్. డాక్టర్ శ్యామచరణుడు వైస్‌చైర్మన్. చిమ్మన్‌లాలు, దీననాథతివారీ, యిరువురును వ్యాపారస్థులు. పద్మసింహుడు, రుస్తుంభాయి, యిరువురును ప్లీడర్లు. రమేశదత్తు కాలేజీయధ్యాపకుడు. లాలా భగత్‌రాం కంట్రాక్టరు. ప్రభాకరరావు హిందీపత్రిక 'జగత్' సంపాదకుడు. అనిరుద్ధసింహుడు, బహాదుర్‌సింహుడు వీరిరువురును ఆజిల్లాలోని పెద్దజమీందారులు. బజారులోని దుకాణములలో నెక్కువభాగము బలభద్రదాసు, చిమ్మన్‌లాలులవే! దాల్‌మండీలో దీనానాథునికి చాల యిండ్లున్నవి. ఈముగ్గురు మహాశయులును తీర్మానమునకు వ్యతిరేకులు. లాలాభగత్‌రాం కాంట్రాక్టు వ్యాపారము చిమ్మన్‌లాలు ఆర్థిక సహాయముపై నాధారపడియున్నది. అందుచే నాతని ఓటుకూడ వారి పక్షమునకే! డాక్టర్ శ్యామచరణ్, అనిరుద్ధుల విషయమింకను నిర్ధారణకాలేదు. ఇరుపక్షములవారును వారి సాయము నపేక్షించుచునేయున్నారు. వారిరువురిపైననే జయాపజయము లాధారపడియున్నవి. పద్మసింహుడింకను పెండ్లినుండి తిరిగి రాలేదు. బలభద్రదాసు తన పక్షమును సమర్థించుకొనుటకిదియే మంచితరుణమనియెంచి హిందూసభ్యులను సుసజ్జితమైన తనయింటికి పిలిపించినాడు. డాక్టరు, అనిరుద్ధులను తన పక్షమునకు త్రిప్పుకొనుటయే యిందలి యుద్దేశ్యము. ప్రభాకరరావు మహమ్మదీయులకు పూర్తివ్యతిరేకి. అందుచే ఈ సమ

స్యకు హిందూ మహమ్మదీయ వివాదమను రంగుపూసి ప్రభాకరరావును సైతము తన పక్షమునకు త్రిప్పుకొనవలెనని యూహ.

# 27

సోమరిపోతు మఱియొకరి కేకవిని మేల్కాంచి, యిటు నటుచూచి, మఱలనిద్రపోవునట్లు కృష్ణచంద్రుడు తనకోపము—గ్లాని శాంతించినంతనే తన కర్తవ్యమును మఱచిపోయినాడు. కాని, యానాటినుండియు నాతడు నీచులతోజేరి గంజాయి పీల్చుట మానివేసినాడు. ప్రస్తుతము సాధ్యమైనంతవఱకు వరండాలోనే కూర్చుండి వచ్చుచుపోవుచుండు స్త్రీలవైపు మిఱిమిఱి చూచుచుండును. అతడు ప్రతివిషయమునందును నుమానాథుని సమర్థించుచుండును. విస్తరియందేదిపెట్టిన నది తిని లేచిపోవును. ఉమానాథుని సంతుష్టు నొనరించుటకు ముఖస్తుతు లొనర్చును. అతని యాత్మస్ఫూర్తిగ నిర్బలమైపోయినది.

ఉమానాథుడు శాంత వివాహవిషయ మాతనితో ప్రస్తావించినప్పుడు — 'నాయనా! నీయిష్టము వచ్చినట్లు చేయుము. దానివిషయమైన బాధ్యతయంతయు నీదే!'యని సరళ స్వభావముతో సమాధానమిచ్చును.

కాని యుమానాథునికిమాత్రము బావగారి వెనుకటి కటువచనములు మఱపునకు వచ్చుటలేదు. కాలినబొబ్బపై

నవనీతము పూసినచో నొక్కక్షణము కాలము బాధ యుప శమించి వెంటనేమఱల మంట ప్రారంభమగును. కృష్ణచంద్రుడు లజ్జితుడై యనినమాటలు వెంటనే మఱపునకువచ్చి యా కృతఘ్నములైన మాటలే మాటిమాటికిని జ్ఞప్తికి వచ్చుచుండును. పండుకొనుట కేఁగినప్పుడు జాహ్నవి భర్తను— 'నేఁడు మా యన్నగారు మీపై కోపించినారెందులకు!' అని యడిగినది.

ఉమానాథుడు అన్యాయముచే పీడింపబడిన దృక్కులతో ననినాడు — 'నీవే నాభార్యను చంపితివి, నా సర్వస్వము నపహరించితివి, నా కొమార్తెను గంగలో కలిపితివి, రెండవ కొమార్తె నేడ్పించుచున్నావు, అనుచు నా కీర్తిని పొగడుచున్నాడు.'

మీ నోటిలో నాలుక లేకపోయినదా? వీరందఱిని బొట్టు కాటుక పెట్టి పిలిచితిమా? ఎచటను గతిలేక వచ్చినారు. నేను జేరనీయకున్నచో గడపగడపకు నేఁగి బిచ్చమెత్తుకొనవలసివచ్చెడిది. మేక ప్రాణాలుపోయినవి, కాని తినువానికి రుచిగాలేదన్నట్లున్నది. మర్యాదకు నానాపాట్లుపడి వీరిని మేపినందు కిదియాఫలితము? ఇంతకాలము ఉద్యోగము చేసినాడు, ఎన్నడైనను గంగాజలి ముఖమున బొట్టుపెట్టి యొక రవికగుడ్డ చేతిలోపెట్టినదా? నాముందే గనుక మాటాడియున్నచో ముఖము వాయునట్లు చీవాట్లు పెట్టెడిదానను. దున్నపోతులవంటి పిల్లల నిద్దరిని మానెత్తినెక్కించి, పైగా నోటికివచ్చినట్లు కూయుటయా? ఈ మందమూలమున నున్నది కాస్త పాడుచేసికొనినందుల కిదియాఫలితము. ఈనాటికైనను

తన పిల్లను తీసికొని యెచటికైనను వెళ్ళకూడదా? ఎందుకు వెళ్ళును? కాళ్ళకు గోరింటాకు పెట్టుకొని కూర్చుండినాడు.'

'వెళ్ళుదుననియే యనుచున్నాడు. సుమన్ అడ్రసుకూడ అడిగినాడు.'

'అయితే, కూతురు నెత్తిన నెక్కనన్నమాట! ఆహా! ఎంత సిగ్గులేనివాడు!'

'కాదు, అచట నెందుకుండును? నాలుగురోజులపా టుండును.'

'దేనికీమాటలు! ఇతనివలన నేమియుకాదు. వీనికున్న కాస్త సిగ్గు పోయినది. ఇకపోయి కొమార్తెనెత్తి నెక్కును. కాని, మీరే చూచుచునుండుడు! అచట నొకదినమైన నుండ జాలడు!'

నేటివఱకు నాతడు సుమన్ ఆత్మపతనమునకు సంబంధించిన విషయము భార్యతో జెప్పలేదు. ఆడువారి నోటమాట దాగదని యాతడెఱుంగును. ఈమె ఎవరితోనైనను నోరు జారినచో గ్రామమంతయు క్షణములో ప్రాకిపోవును. జాహ్నవి ప్రేమకు సంతుష్టుడైన క్షణములందు సుమన్ చరిత్ర చెప్ప వలెనను తీవ్రమైన ఆకాంక్షకలుగును. కాని, పరిణామము నాలోచించి యాగిపోవును. నేడు కృష్ణచంద్రుని కృతఘ్నతతోగూడిన వ్యవహార మాతని జంకును పోగొట్టినది. ఆతని నోట మాటదాగలేదు. భార్యతో విషయమంతయు జెప్పినాడు. కాని రాత్రికి మెలకువ వచ్చినప్పుడాతనికి తన పొరపాటు తెలిసివచ్చినది. కాని, యేమిప్రయోజనము? ధనుర్ముక్త

మైపోయినది బాణము! ఈ విషయమెవరితోడను చెప్పనని భార్యమాట యిచ్చినది; కాని, యామె హృదయభారము మాత్రము తగ్గలేదు. ఆమె కేపనిచేయుటకును తోచుటలేదు. నాతో యీ విషయమెందుకు చెప్పవలెనని భర్తపై విసిగికొనును. ఆమెకు సుమన్‌పై నీర్ష్యగాని, కోపముగానిలేదు. కాని కుతూహలమును కలిగించునట్టి, మానవహృదయమును గూర్చిన మీమాంసచేయుటకు తగిన సామగ్రి లభించినది. స్త్రీశిక్షకు వ్యతిరేకముగ నెంతచక్కటిప్రమాణము లభించినది! జాహ్నవి యెంతకాలమో యీ యానందమువలన వంచితురాలు కాజాలకపోయినది. అట్లు చెప్పకుండుట యసంభవము. తన యింటిలోని ప్రతి చిన్నవిషయమును చెప్పకొనుచున్న యీ యిరువురు సాధ్వులయెడల నది విశ్వాసఘాతమే కాగలదు. ఇంతేగాక, ఇతర స్త్రీ లీ విషయము నెట్లు విమర్శింతురో చూడవలెనను ఔత్సుక్యము తక్కువదికాదు. కొలంది రోజులవఱకు జాహ్నవి తన మనసును ఆపుకొనుచున్నది. ఒకనాడు పండితకుబేరుని భార్య సుభాగి వచ్చి – 'అక్కయ్యా! నేఁ డేకాదశి. గంగాస్నానమునకు వత్తువా?' అని యడిగినది.

సుభాగికి జాహ్నవికి మంచి స్నేహమున్నది. జాహ్నవి సమాధానముగా నన్నది – 'వెళ్ళుదమనే యున్నది. కాని, గుమ్మమువద్ద నొక యమదూత యున్నాడు. ఆయన మూలముగా కదలుటకు వీలులేకున్నదామె!'

సుభాగి:–అక్కయ్యా! ఆయనమాట లేమని చెప్పదును? చెప్పటకు సిగ్గగుచున్నది. మా యింటివారు విన్నచో తల

పగులగొట్టుటకు సిద్ధపడెడివారు. నిన్న మా పెద్దమ్మాయికి వినిపించునట్లుగా ఏమేమో పాటలు పద్యములు ప్రారంభించి నాడు. నేటి యుదయమిరువురు నూతివద్ద నవ్వుకొనుచుండగా చూచితిని. ఆయన గనుక వినెనా ప్రాణములు తీసివేయును. నీతో గనుక చెప్పుచున్నాను. కాస్త యీవలకు పిలిచి బుద్ధి చెప్పుము.

ఇంక జాహ్నవి సహింపలేకపోయినది. ఆమె సుమన్ చరిత్రకు మెఱుగులు దిద్ది యతిరంజితముగ వర్ణించి చెప్పినది. ఇతరులు మనవద్ద తమ రహస్యమును బయట పెట్టినప్పుడు మన రహస్యమును మనము దాచలేము.

మరునాడే కుబేరుడు తన కొమార్తె నత్తవారింటికి పంపివేసి, తనకు జరిగిన యీ యవమానమునకు ప్రతీకార మొనర్పవలెనని నిశ్చయించుకొనెను.

# 28

సదనుని వివాహముహూర్తము సమీపించినది. పెండ్లి వారు చునార్ గ్రామమునుండి అమోలాకు బయలుదేరినారు. సాయంకాలమునకు పెండ్లివారు అమోలా గ్రామము చేరిరి. పెండ్లివారికిని, నౌకర్లకును పద్మసింహుని గుమాస్తా ముందుగా వచ్చి విడుదు లేర్పాటుచేసినాడు. విడిదిగృహములు దీపములతో, తోరణములతో, తివాచీలతో నలంకరింపబడినవి. అల్లిక తెరలు, పడకకుర్చీలు, దిండ్లు అన్నియు యథాస్థానముల

నున్నవి. ఎన్నో భోగముమేళములు వచ్చినవని హడావిడిగ నున్నది.

ద్వారపూజయైనది. ఉమానాథుడు బుజమున నొక యంగవస్త్రము వేసికొని పెండ్లివారికి స్వాగతమిచ్చుచున్నాడు. ఊరిలోని స్త్రీలు వసారాలో నిలబడి మంగళహారతులు పాడుచున్నారు. వారిలో నెవరెక్కువ యందముగ నున్నారో చూడ యత్నించుచున్నారు పెండ్లివారు. ఆ స్త్రీలు సైతము చిరునవ్వులతో దృగ్బాణములను విసరుచున్నారు. జాహ్నవి విచారముగా నున్నది - ఈ వరుడు నాచంద్రకు లభించినచో నెంతబాగుండెడిదని మనసులో ననుకొనుచున్నది. వియ్యంకు డెవరో తెలిసికొనవలెనను నుత్సాహముతోనున్నది సుభాగి. కృష్ణచంద్రుడు సదనుని పాదపూజ చేయుచు మనసులో 'నిది యేమి తలక్రిందులైన ఆచారము!' అనుకొనుచున్నాడు. పళ్ళెములో నెన్నిరూపాయలున్నవో తదేకధ్యానముతో జూచుచున్నాడు మదనసింహుడు.

పెండ్లివారు లోనికేగినారు. పెండ్లివారికి కావలసిన భోజనసామగ్రి నిచ్చుచున్నారు. అంతయు కోలాహలముగ నున్నది - నెయ్యి చాలలేదనువారొకరు; పిడకలు లేవనువారొకరు! లాలా బైజనాథ్ పానీయముకొఱకు పట్టుబట్టినాడు.

సామగ్రి నిచ్చినంతనే వంటలు ప్రారంభమైనవి. పొగ వలన గ్యాసులైట్ల ప్రకాశము క్షీణమైపోయినది.

సదనసింహుడు పడకకుర్చీపై కూర్చుండియుండెను. గానసభ ప్రారంభమైనది. కాశీ సంగీతపరిషత్తువారు శ్యామ కల్యాణిరాగమును ప్రారంభించిరి.

గ్యాసులైట్లచుట్టును వందలకొలఁది జనులు నిలబడి యున్నారు. కొంతమంది వదులుచొక్కాలు తొడిగి తలగుడ్డలు చుట్టి తివాచీపై గూర్చుండి తమలోతాము భోగముమేళము లెచటనున్నవని ప్రశ్నించుకొనుచున్నారు. కొంద రీగుడారము లోనికి, కొంద రాగుడారములోనికి తొంగిచూచుచు - 'ఏమి పెండ్లియిది? ఒకమేళముగూడ రాలేదు. ఈ లైట్లుకూడ దేనికి? దండుగ!' అనుకొనుచున్నారు.

మదనసింహుడు తన విడిదిలో గూర్చుండి గుడ్డలు సర్దుచున్నాడు. ఇంతలో మున్షీ బైజనాథుడు పరుగెత్తివచ్చి - 'అన్నయ్యా! అనర్థము జరిగినది! వ్యర్థముగ, తెలియక, ఈ సంబంధమును నిశ్చయించుకొంటిమి.' అనినాడు.

మదనసింహు డాశ్చర్యచకితుడైనాడు-'ఏమి జరిగినది? ఏమైనను గందరగోళము బయలుదేరినదా?'

'ఇంతకుపూర్వమే యీ గ్రామస్థుడొకడు, యీ యింటి బండారమంతయు బయటపెట్టినాడు. ఆ సమాచారము విను సరికి నా ప్రాణము లెగిరిపోయినవి. ఈ పిల్లతండ్రి యీమధ్యనే జైలునుండి విముక్తుడై వచ్చినాడట! దాల్‌మండీలో నున్న వేశ్య సుమన్‌బాయి యీ పిల్లకు సాక్షాత్తు సోదరియట!'

ఈసమాచారము వినునప్పటికి మదనసింహునికి చెట్టుపై నుండి జారిపడినట్లైనది. కనులు పెద్దవిచేసి యడిగినాడు -

'ఆ మనిషి వీరికి విరోధి కాడుగదా! ఇటువంటి కార్యము లందు విఘ్నములు కలుగజేయుటకై తఱచు కొందరు దుష్టులిట్లే వ్యర్థముగ కళంకములాపాదించుచుందురు.'

బైజ:- కాదు, కాదు! వారి మొగముమీదనే యీ విషయము చెప్పెదుననుచున్నాడు.

ఇంతలో నుమానాథు డొక మంగలిని వెంటబెట్టుకొని వచ్చుచున్నాడు. వధువుకు నగలు వస్త్రములు తీసికొని వెళ్ళుటకై వచ్చినాడు. గుమ్మమువద్ద కేతెంచినంతనే మదనసింహు డొక్కగంతువేసి యాతని రెండుచేతులు పట్టుకొని యూపుచు — 'ఏమయ్యా! పెద్దమనిషివి! నీకళంకమును పరుల నెత్తినగూడ రుద్దుటకు ప్రపంచములో నాకంటె మరెవ్వరును నీకు లభింపలేదా?'యని యడిగినాడు.

పిల్లి చేఁజిక్కిన యెలుకవోలె దీనభావముతో నుమానాథుడు 'నావలన నేమైన నపరాధము జరిగినదా?' యనినాడు.

'అవును! సుమన్‌బాయి యీ పిల్లకు సోదరి.'

ఉమానాథుని మోము వెలవెలబోయినది. సిగ్గుతో తల వంగిపోయినది. కనులు తేజోహీనములై పోయినవి — 'అయ్యా!...' అతని నోటినుండి మఱియొకమాట వెలువడలేదు.

మదనసింహు డురిమినాడు — 'ఉన్నదున్నట్లు చెప్పవేము? ఈమాట నిజమగునా? కాదా?'

ఉమానాథుడు మఱల సమాధానము చెప్పుటకు ప్రయత్నించినాడు — కాని, 'అయ్యా!' యనుటకంటె నేమియు మాటాడ లేకపోయినాడు.

మదనసింహునికిక అనుమానములేదు. క్రోధాగ్ని ప్రచండమైపోయినది. కనులనుండి నిప్పులు రాలుచున్నవి. శరీరము కంపించుచున్నది. ఉమానాథునివైపు అగ్నిని వర్షించుచూపుల నిగిడ్చి - 'బ్రతుకదలచినచో నా యెదుట నుండి వెడలిపొమ్ము. దుర్మార్గుడా! వంచకుడా! పెద్ద బొట్టు పెట్టుకొని పెద్దమనిషివలె తిరుగుచున్నావు. ఇఁక నీయింటివద్ద మంచినీరుగూడ ముట్టము. నీపిల్లమెడలో నొక యంత్రము చేయించి కట్టుకొనుము!' అనుచు చటాలున లేచి సదనుడు పండుకొనియున్న విడిదివద్దకేఁగి బిగ్గరగ కేకవేసి నౌకర్లను పిలిచినాడు.

అతడు వెడలిపోయిన పిమ్మట నుమానాథుడు పద్మసింహుని చేతులు పట్టుకొని - 'బాబూ! మీరైనను అన్నగారికి చెప్పుడు! ఇఁక నాకు తలయెత్తుకొనుటకు వీలుండదు.' అని బ్రతిమాలినాడు.

పద్మసింహుడు విచారముతో-'ఈ విషయము అన్నగారి చెవిని పడకపూర్వమైనచో ప్రయోజన ముండియుండెడిది. సరే! ఆయనవద్ద కేఁగుదును. కాని, వారంగీకరింతురని చెప్ప జాలను.' అని బయలుదేరినాడు.

మదనసింహుడు నౌకర్లపై వెంటనే యిచటినుండి బయలుదేరవలసినదని బిగ్గరగ కేకలు వేయుచున్నాడు. సదన

సింహుడుగూడ తనగుడ్డలు సర్దుకొనుచున్నాడు. తండ్రి విషయమంతయు నాతనికో చెప్పినాడు.

ఇంతలో పద్మసింహుడు వచ్చి — 'అన్నయ్యా! తొందరపడవద్దు. కొంచెమాలోచించి నిర్ణయింపుడు! మోసమే జరిగినది; కాని, యిట్లు తిరిగి వెళ్ళిపోవుటవలన మఱింత యప్రతిష్ఠయగును.' అని ప్రతిమాలినాడు.

సదనసింహుడు పినతండ్రిమాటలనువిని నిర్లక్ష్యముతో జూచినాడు. మదనసింహుని కాశ్చర్యము కలిగినది.

మదన:- నీవు చిన్నవాడవు! నీకీ విషయములు తెలియవు. పద! ప్రయాణమునకు సిద్ధముకమ్ము. ఈ యప్రతిష్ఠయే మంచిది. వంశమునకు శాశ్వతమైన కళంకమంటదుగదా!

పద్మ:- కాని, అపిల్లగతి యేమగునో ఆలోచింపుడు! ఆపిల్ల చేసిన అపరాధమేమున్నది? ఆమె జీవితమే నాశనమైపోవును!

మదన:- నాకనవసరముగ కోపమును తెప్పించుచున్నావు! ఆపిల్లకు నేనేమియు బాధ్యత వహించి హామీపత్రములు వ్రాసి యీయలేదు. దాని యదృష్టమున నెట్లున్నదో యట్లేయగును. ఆవిషయము నా కనవసరము.

పద్మసింహుడు నిరాశతో — 'యిచటికి సుమన్ రాకపోకలు లేనేలేవు. వీ రామెను పూర్తిగ త్యజించినారు.' అనినాడు.

మదన:- 'నాకు కోపమును కలిగింపవద్దని చెప్పితిని! నాతో నీ విధముగ మాటాడుటకు నీకు సిగ్గులేదా? గొప్ప

సంఘసంస్కారివి బయలుదేరినావు! ఒక భోగముముండ చెల్లెలిని నాకుమారునికిచ్చి వివాహము చేయుటయా! ఛీఛీ! నీకీ మాత్రము బుద్ధియైనను లేకుండపోయెనా?'

పద్మసింహు సిగ్గుతో తల వంచుకొనినాడు. అన్నగారీసమయమున చేయుపనినే నీవైనను చేయుదువని యాతని మనసు అంగీకరించుచున్నది. కాని భయంకర పరిణామమును తలంచుకొని మఱొక పర్యాయము చెప్పి చూచుటకు సాహసించినాడు. పరీక్షార్థి గెజిట్‌లో తన నంబరు కన్నట్టక నిరాశ చెందియు, తప్పొప్పులపట్టికపైకి దూకునట్లు పద్మసింహుడు తన్ను తాను వంచించుకొని అన్నగారితో - 'సుమన్‌బాయి యిప్పుడు అనాథశరణాలయమున కేఁగినది.' అనినాడు.

పద్మసింహుడు తలవంచియే మాటాడుచున్నాడు. అన్నగారి చూపుతో చూపు కలుపుటకు ధైర్యము చాలుట లేదు. ఈ వాక్యమాతని నోటినుండి వెలువడినంతనే మదనసింహుడు గట్టిగా నొక్క త్రోపు త్రోసినాడు. దానితో పద్మసింహుడు క్రిందపడినాడు. ఉలికిపడి తల పైకెత్తి చూచినాడు. మదనసింహుడు క్రోధముతో కంపించిపోవుచున్నాడు. పద్మసింహుని తిట్టదలచుకొనిన తిట్లన్నియు - నాతనిని భూమిపై బడియున్న స్థితిలో జూచి పశ్చాత్తాపముతో - నాగిపోయినవి. కోపములో తన శరీరమును తానే రక్కుకొనువాని స్థితిలో నున్నాడు మదనసింహుడు. సదనసింహు డొక్కగంతువేసి పినతండ్రిని లేవనెత్తి తండ్రివైపు కోపముతో జూచి — 'మీ కేమైనను పిచ్చి యెత్తినదా యేమి?' అనినాడు.

ఇంతలో ననేకులచటికి మూగి ప్రశ్నింపసాగిరి —
'బాబూ! ఇది యేమిటి? ప్రయాణము కట్టమనుచున్నారేమి? అయ్యా! ఏదో యొకవిధముగ నిరువురిమర్యాదలు దక్కునట్లు చేయుడు. వారి మర్యాద మీ మర్యాదయే! ఇచ్చి పుచ్చుకొనుటలో నేదేని లోపము వచ్చినచో సర్దుకొనుడు. భగవంతుడు మీ కేమితక్కువచేసినాడు? ఈయన యిచ్చిననేమి? యివ్వకున్ననేమి? ఈతని డబ్బువలన మనము లక్షాధికారులము కాజాలము!' కాని, యీ మాటలకు మదనసింహుడేమియు సమాధాన మీయలేదు.

సంగీతసభలో గందరగోళము బయలుదేరినది. ఇదేమిటని యొకరి నొకరడుగుచున్నారు. విడిది గుమ్మమువద్ద గుంపుజేరినది.

సంగీతసభలో ఆడపెండ్లివారి తాలూకు మనుష్యులు చాలమంది యున్నారు. వారందరును మదనసింహుని ప్రార్థింపజొచ్చిరి – 'అయ్యా! జరిగిన యపరాధమేమో సెలవిండు! మీ రేశిక్ష విధించినను మేము సిద్ధమే! కాని, పెండ్లివారిని మాత్రము వెనుకకు త్రిప్పవద్దు. గ్రామములో నప్రతిష్ఠయగును.' ఈ మాటలకు మదనసింహుడు – 'నా కేమియు తెలియదు. దీనికి గారణ ముమానాథునడుగుడు! అతడే చెప్పగలడు!' అని మాత్రము సమాధానమిచ్చెను.

కృష్ణచంద్రుడు సదనసింహుని చూచినప్పటినుండియు నాతని సంతోషమున కవధిలేకుండెను. వివాహముహూర్తము సమీపించుచున్నకొలఁదియు నాతడు వరునిరాకకై ప్రతీక్షించు

చుండెను. ఇంతలో నెవరో వచ్చి యీవార్త నెఱింగించిరి. 'తిరిగి వెళ్ళిపోవుటకు కారణమేమి? ఉమానాథునితో నేమైన పోట్లాడినారా?' అని యడిగినాడు.

'మాకు తెలియదు. ఉమానాథుడచటనే యుండి వారిని బ్రతిమాలుచున్నాడు.' అని సమాధానమిచ్చిరి.

కృష్ణచంద్రుడు కోపముతో లోనికేఁగి కేకవేసినాడు- 'మదనసింహుడు గారెచటనున్నారు? అయ్యా! ఒక పర్యాయము బయటికి రండు!'

మదన సింహు డీకేకవిని బయటకువచ్చి గంభీరముగా- 'ఏమిటి? చెప్పుడు ఏమి చెప్పవలెనో!' అనినాడు.

కృష్ణ:- మీరు తిరిగి వెళ్ళిపోవుటకు గారణమేమి?

మదన:- మాయిష్టము! మేమీ వివాహము చేయము.

కృష్ణ:- వివాహము జరుగవలనసినదే! మీరు తిరిగి వెళ్ళిపోవుటకు వీలులేదు.

మదన:- మీ యిష్టమువచ్చిన పనిచేసికొనుడు! మేము పెండ్లి చేయము.

కృష్ణ:- కారణము?

మదన:- కారణము మీకు తెలియదా?

కృష్ణ:- తెలిసియున్నచో మిమ్మెందుకు ప్రశ్నింతును?

మదన:- అగుచో నుమానాథు నడుగుడు!

కృష్ణ:- నేను మిమ్ముల నడుగుచున్నాను!

మదన:- మమ్ముల నడుగవద్దనుచున్నాము!

కృష్ణ:- మీరు చెప్పక తప్పదు! ఇంటికి పెండ్లికి పెండ్లి వారిని తీసికొనివచ్చి, త్రిప్పితీసికొనిపోవుటకిది పిల్లల బొమ్మ లాటలా? మీ దృష్టిలో నిది యాటగానున్నది కాబోలు! ఏమైనను నిచట రక్తము కనులజూడక తప్పదు!

మదన:- మేమందులకు సిద్ధమే! ప్రాణము లర్పించుట కైనను సిద్ధపడుదుము. కాని యీసంబంధమును జేసికొనము! మా పరువుప్రతిష్ఠలనుమాత్రము వదలుకొనము.

కృష్ణ:- మీకంటె మేము నీచులమా?

మదన:- అవును! మాకంటె మీరు నీచులే!

కృష్ణ:- అందుల కాధారమున్నదా?

మదన:- ఉన్నది!

కృష్ణ:- ఆవిషయము చెప్పుటకు మీకు సంకోచ మెందులకు?

మదన:- అట్లయిన, వినుడు! తమ పుత్రిక, ఈవధువుకు సోదరియైన సుమన్ పతితయైపోయినది. మీ కింకను ప్రమా ణము కావలెనన్నచో దాల్ మండీకి పోయి చూడుడు!

కృష్ణచంద్రుడు నమ్మకము లేనివానివలె-'పచ్చి అబ ద్ధము!'అనినాడు. కాని, మరుక్షణముననే తా నుమానాథుని సుమన్ జాడ తెలుపవలసినదని యడుగుటయు, నాతడు తప్పించు కొనుటయు జ్ఞప్తికి వచ్చినది. అంతేకాదు, మాటిమాటికిని జాహ్నవి చెప్పినమాటలు, చూచిన చూపులు అర్థమైనవి. నమ్మకము కలిగినది. సిగ్గుతో నాతని తల వంగిపోయినది.

నిశ్చేష్టుడై నేల కొఱిగినాడు. ఇరువైపులవారును వందల కొలఁది జనులచటనున్నారు. అందఱు నాశ్చర్యమగ్నులై యున్నారే కాని నోరువిప్పి మాటాడుట కెవరికిని సాహసము చాలకున్నది.

రాత్రి పండ్రెండుగంట లగునప్పటికి, గుడారములు ఖాళీయైనవి. ఆ తోటలో మఱల నంధకారము వ్యాపించినది. నక్కలు సభచేసినవి. గుడ్లగూబలు రాగాలాపము లొనర్చినవి.

# 29

విఠల్‌దాసు సుమన్‌ను విధవాశ్రమమందు రహస్యముగ జేర్చెను. కార్యవర్గ సభ్యులం దెవరితోడను ఈ విషయము ప్రస్తావించి సూచింపలేదు. ఆశ్రమమందలి విధవలతో నీమెయు విధవయేయని చెప్పినాడు. కాని, అబుల్‌వఫావంటి రహస్య పరిశోధకులముందీరహస్య మెన్నిదినములు దాగగలదు? అతడు హిరియాను వెదకి పట్టుకొని, ఆమె ద్వారా సుమన్ జాడ తెలిసికొనినాడు. పిమ్మట రసికులైన తన స్నేహితుల కీవిషయమును చెప్పినాడు. తత్ఫలితముగ నారసికావతంసుల కృపాదృష్టిని అనాథశరణాలయ మెక్కువగా నాకర్షించినది. ఈ మహాపురుషుల కిప్పుడీయాశ్రమ పారిశుద్ధ్యము, దాసి యార్థికస్థితి, ఆశ్రమమందలి యితర యేర్పాట్లయెడల సానుభూతి కలిగినది. వారు రాత్రింబవళ్ళు ఆశ్రమాభివృద్ధినే కాంక్షించుచు తత్ప్రయత్నమున నిమగ్నులైరి.

విఠల్‌దాసు పని క్లిష్టముగనుండెను. ఒక్కొక్కప్పు డీపదవికి రాజీనామా యీయవలెననుకొనును. 'ఈ యాశ్రమ బాధ్యతయంతయు నేనేవహింపవలెనా యేమి? ఈ వ్యవహార ములు చూడ సమర్థులైనవారు కార్యవర్గసభ్యులం దెందరో యున్నారు. వారియిష్టమువచ్చినట్లు నడుపుకొందురు; నాకేల? ఈదుండగములను నాకళ్ళతో జూడజాల'నని తలచుకొనును. 'ఈదుర్మార్గులనందఱిని ఒకరోజున కేకలువేసి చీవాట్లుపెట్ట వలెను. ఆపిమ్మట నేమిజరుగునో చూచుకొనవచ్చును'అని మఱొకసారి యనుకొనును. కాని, శాంతచిత్తుడై నపిమ్మట నాలోచించినచో వీరందఱితోడను మంచిగానుండి కార్యమును సానుకూల మొనర్చుటకంటె గత్యంతరము కన్పట్టదు. వారితో కటువుగ మాటాడును. వారిమాటలను వ్యతిరేకించుచుండును. మీరిచటికేతెంచుట నాకిష్టము లేదన్నట్లు తన భావమును వ్యక్త మొనరించును. కాని, కేకలువేయుచుండు పిచ్చివానిని చూచియు చూడనట్లు నటింతురుగదా! అట్లే వారును విఠల్ దాసు మాటలను చేతలను పట్టించుకొనెడివారుకారు. వారి యీ కూటనీతిముందు విఠల్‌దాసు తెలివితేటలు పనిచేయ లేదు.

ఒకనాటి యుదయమున విఠల్‌దా సీవిషయములను గూర్చియే యాలోచించుచున్న సమయమున పద్మసింహు డేతెంచినాడు. ఆతని మోమున దుఃఖము, నిరాశ తాండ వించుచుండెను. ప్రయత్నముపై కన్నీటి నాపుకొనుచున్న ట్లున్నది మోము. విఠల్‌దాసు రెండడుగులు ముందునకువేసి-

'అట్లుంటివేమి? శరీరములో బాగున్నదా? గుర్తుపట్టుటకే వీలులేకుండ మారిపోయినావు!' అనినాడు.

పద్మ:- రోగమేమియు లేదు. కాని, చాల విచారముగా నున్నది.

విఠల్:- వివాహము నిర్విఘ్నముగ కొనసాగినదా?

పద్మసింహుడు యింటికప్పువైపు జూచుచుననినాడు - 'వివాహవిషయ మడుగనక్కరలేదు - వివాహముమాత్రము కాలేదు, కాని యొకకన్యజీవితమునుమాత్రము పూర్తిగ నాశనమొనర్చి వచ్చితిమి. ఆపిల్ల యీ సుమన్‌బాయికి చెల్లెలట! మాయన్నగారి కీవిషయము తెలిసినంతనే గుమ్మము వద్దనుండియే పెళ్ళివారిని త్రిప్పివేసినారు.'

విఠల్‌దాసు బిట్టునిట్టూర్చి — 'ఇయ్యది ఘోరమైన అన్యాయము. మీయన్నగారికి మీరు నచ్చజెప్పలేదా?'యని యడిగినాడు.

పద్మ:- నాచేతనైన ప్రయత్నమంతయుజేసి విఫలుడనైతిని.

విఠల్:- ఇఁక, పిల్లగతి యేమికావలె? ఈవార్త సుమన్ విన్నచో నెంతయో దుఃఖించును.

పద్మ:- ఇచటి విశేషములేమియో సెలవిండు. సుమన్ రాకవలన వితంతవులలో గోలబయలు దేరలేదుగదా! ఆమెను తప్పక అసహ్యించుకొనుచుండి యుందురు!

విఠల్:- రహస్యము బయటపడుచో నేటికి యనాథ శరణాలయము పూర్తిగ ఖాళీయైపోయియుండెడిది.

పద్మ:- మఱి, సుమన్ యెట్లున్నది?

విఠల్:- చిరకాలమునుండి యీయాశ్రమమునందే నివసించుచున్నట్లు చక్కగాప్రవర్తించుచున్నది. ఏ పని జేయుటకైనను ప్రసన్నచిత్తముతో సిద్ధమగును. ఇతరులందఱు నిద్రించుచునేయుందురు. ఆమె తనగది యూడ్చుచుండును. కొంతమంది వితంతువులకు కుట్టుపని నేర్పుచున్నది. కొందరు వితంతువులు పాటలు నేర్చుకొనుచున్నారు. ప్రతి స్త్రీయు ప్రతి విషయమునను నామెయభిప్రాయము నపేక్షింతురు. ఆనాలుగు గోడలమధ్య నామెదే రాజ్యము! నేనెన్నడు నిట్లుండునని యాశింపలేదు. ఆశ్రమములో నామె చదువుచెప్పుటగూడ ప్రారంభించినది. మనసులోని విషయము దేవుడెఱుంగును! పైకిమాత్రము పూర్తిగ మాఱిపోయినది.

పద్మ:- ఆమె సహజముగా నంతదుష్టురాలుకాదు. మాయింటికి చాలకాలము వచ్చిపోవుచుండెడిది. మాయావిడ యీమె నెంతోమెచ్చుకొనుచుండెడిది. (ఈ మాట లనునప్పు డాతనికి సిగ్గుకలిగినది) ఏవో దుష్టసంస్కారము లామె నీస్థితికి గొనివచ్చినవి. నిజముచెప్పవలెనన్నచో మనమొనర్చిన పాపములే యామె నీస్థితికిదెచ్చినవి. సరే! ఆసమాచారము లేమైన తెలిసినవా? బలభద్రదాసు క్రొత్తయెత్తులేమైన వేయు చున్నాడా?

విఠల్:- అవును! అతడుమాత్ర మూరకకూర్చుండు వాడుకాడు! ప్రస్తుతము విధివిరామములేకుండ తిరుగు చున్నాడు. రెండురోజులక్రితమే హిందూసభ్యుల సమా

వేశము జరిగినది. నేను వెళ్ళజాలకపోతిని. కాని, విజయము మాత్రమువారిదే! ముఖ్యుల రెండు ఓట్లతో వారికి మొత్తము ఎనిమిది ఓట్లున్నవి. మహమ్మదీయుల నాలుగు ఓట్లతో మనవి ఎనిమిదియగును. రెండుపక్షములును సమానమగును.

పద్మ:- అట్లయిన, మనకు కనీసమింకొక ఓటు కావలె నన్నమాట! ఏమైన నాశయున్నదా?

విఠల్:- నాకేమియు నాశ లేదు!

పద్మ:-వీలైనచో చూతము! డాక్టరుగారివద్దకు, భగత్ రాంవద్దకు వెళ్ళివత్తమా?

విఠల్:- సరే! పదండి! నేను సిద్ధమే!

డాక్టరుగారియిల్లు దగ్గఱేయైనను నిరువురును బండి యెక్కినారు. డాక్టరుగారియింటికి నడిచివెళ్ళుట సభ్యతకు విరుద్ధముగదా మఱి!

పదిగంటలైనది. డాక్టరుగారు తమ యింటిలో నలంకృతమైన గదిలో గూర్చుండి తన కొమార్తెయైన కాంతితో చదరంగమాడుచున్నాడు. బల్లపై రెండు జాతికుక్కలు కూర్చుండి తదేకధ్యానముతో చదరంగపు టెత్తులను జూచు చున్నవి. ఒక్కొక్కప్పు డెత్తులు తప్పుగానున్నవని తోచి నప్పుడు కాళ్ళతో బలగమును చిందరవందర జేయుచున్నవి. మిస్ కాంతి తన కుక్కల యల్లరిజూచి ముద్దుగా నింగ్లీషులో 'యూ నాటీ!' యనుచున్నది.

బల్లకు ఎడమప్రక్క నొకపడకకుర్చీలో సైయ్యద్ తేగ్ ఆలీ కూర్చుండి మిస్ కాంతికి ఎత్తులుచెప్పుచున్నాడు.

ఇంతలో మనమిత్రు లిరువురు నచటికిచేరిరి. డాక్టరు గారు లేచి యిరువురివద్ద కేతెంచి హస్తచాలన మొనరించిరి. మిస్ కాంతి వారిరువురివైపును నిమీలిత దృష్టితో జూచి బల్లపై నున్న పేపరుతీసి చదువ మొదలిడినది.

డాక్టరుగారు యింగ్లీషులో ప్రారంభించినారు- 'మిమ్ము కలిసికొనగలిగినందుకు చాల సంతోషము! దయచేయుడు. మిస్ కాంతికి మిమ్ము పరిచయ మొనర్తును.'

పరిచయమైన పిమ్మట మిస్ కాంతి యిరువురితోడను హస్తచాలన మొనర్చి నవ్వుచు - 'నాన్నగా రిప్పుడే మీ విషయము ప్రస్తావించినారు. మిమ్ము కలిసికొనగలిగినందుకు చాల సంతోషము!' అనినది.

డాక్టరు:—మిస్ కాంతి యిప్పుడే డల్హౌసీ కొండల నుండి వచ్చినది. ఈమె స్కూలు శీతకాలమునకు మూసివేసినారు. అచటి చదువుసంధ్యలు చాలబాగుండును. ఈమె యింగ్లీషు పిల్లలతోబాటు బోర్డింగుహౌసులో నున్నది. లేడీ ప్రిన్సిపాలు యీ పిల్లను నెంతో ప్రశంసించుచుండును. అమ్మాయీ! కాంతీ! మీ ప్రిన్సిపాలు వ్రాసిన ఉత్తరము వీరికి చూపుము! మిష్టర్ శర్మా! మీ రీమె యింగ్లీషు మాటాడుటను జూచి యాశ్చర్యచకితులగుదురు. (నవ్వుచు) ఈమె నాకెన్నియో జాతీయములను నేర్పినది.'

మిస్ కాంతి సిగ్గుపడుచు తన ప్రశంసాపత్రమును పద్మసింహునికి చూపినది. అత డాపత్రమునుచదివి-'ఈమె లాటిన్ గూడ చదువుచున్నదా?' యని ప్రశ్నించినాడు.

డాక్టరు:—లాటిన్ భాషాపరీక్షలో నీమెకు 'మెడల్' వచ్చినది. నిన్న క్లబ్బులో మంచి 'గేమ్' చూపించినది. దొరసాను లాశ్చర్యచకితలైనారు. సరే! మీ రీసారి హిందూ సభ్యుల సమావేశములో లేరే!'

పద్మ:—రాలేదు! పనిమీద యింటికి వెళ్ళితిని.

డాక్టరు:—మీ తీర్మానముమీదనే చర్చ జరిగినది. కొందరపడి మీటింగులో దానిని ప్రవేశపెట్టవద్దని నా సలహా. తీర్మానము నెగ్గునను ఆశ కన్పట్టదు.

తేగ్ ఆలీ:—భాయీ! మహమ్మదీయ సభ్యుల సహాయముమాత్రము మీకు పూర్తిగలభింపగలదు.

డాక్టరు:—కాని, హిందూసభ్యులలో నభిప్రాయ భేదమున్నది.

పద్మ:—మీ సహాయము లభించినచో విజయము లభించుటలో సందేహముండదు.

డాక్టరు:—నా కీతీర్మానముయెడల పూర్తి సానుభూతి యున్నది. కాని నేను గవర్నమెంటుచే నామినేటు చేయబడిన సభ్యుడనని మీ రెఱుంగుదురుగదా! ప్రభుత్వ మీవిషయమును హర్షించునో లేదో తెలియనంతవఱకును నేనొక సామాజికసమస్యపై నభిప్రాయమీయజాలను.

పదకొండు గంటలైనది. డాక్టరుగారు లేచి - 'నా భోజనసమయమైనది. సెలవు! సాయంకాలము నన్ను కలిసికొనుము!' అనినాడు.

'చిత్తము! చిత్తము! హాయిగ వెళ్ళిరండు!' అనినాడు పద్మసింహుడు. ఈయన భోజనమునకై యింతభయపడు చున్నప్పు డితరులవిషయమైమాత్ర మేమియాశింపగలమను కొనినాడు. ప్రతివాడును దేశసేవకుడు, జాతీయనాయకుడు కాగోరును; కాని, ఏమాత్రము కష్టమును సహింప నిష్టపడడు.

లాలా భగత్‌రాం ఎండలో నగుగుపై గూర్చుండి హుక్కా పీల్చుచున్నాడు. ఆతని చిన్న కొమార్తె తండ్రి యొడిలోగూర్చుండి పొగను పట్టుకొనుటకై చేతులు జాపు చున్నది. ఎదురుగ చాలమంది మేస్త్రీలు, తాపీపనివారు కూర్చుండియున్నారు. పద్మసింహుని గాంచినంతనే యాతడు లేచి ప్రత్యుత్థాన మొనర్చినాడు– 'మీరు వచ్చినారని సాయం కాలమే వింటిని. ఉదయమే మీవద్దకు వచ్చియుండెడివాడనే! కాని ఏదో యిబ్బందివలన పీలుచిక్కలేదు. హిందూసభ్యుల సమావేశమైనవిషయము మీరు వినియేయుందురు.'

పద్మ:—అవును! వింటిని. విని చాల విచారించితిని. మీపైనాకు పెద్ద యాశయున్నది. మీ రీసంస్కరణ ముప యుక్తమైనదని తలచుచున్నారా?

లాలా:—ఉపయుక్తమని తలచుటేకాదు; హృదయ పూర్వకముగ దీనికి సాయమొనర్పవలెననియున్నది. కాని, నాయభిప్రాయమునకు నేను యజమానినికాను. స్వార్థము కొఱకై నన్ను నేను విక్రయించుకొంటిని. నన్నొక గ్రామ ఫోను రికార్డునలె భావింపుడు. రికార్డుచేసిన మాటలనే యొప్పగింపగలను.

పద్మ:—కాని, జాతీయ కార్యములందు స్వార్థమును త్యజింపవలెనని యంగీకరింతురుగదా!

లాలా:— అవును! సిద్ధాంతరీత్యా యంగీకరింతును. కాని కార్యరూపమున బెట్టుటకు శక్తిలేదు. నా వ్యాపార మంతయు సేట్ చిమ్మన్‌లాల్ సాయమున నడచుచున్న విష యము మీరెఱుఁగనిదికాదు. వారికి కోపము కలిగించినచో నీ వ్యాపారమంతయు నాశనమగును. కనీసము నెలకు 300 రూపాయలు యింటిఖర్చు! జాతికొఱకై నేను కష్టపడుటకు సిద్ధుడనే! కాని నా పిల్లలను నిరాధారుల నెట్లొనర్పగలను?

ఇతనివలన నెట్టి యాశయు లేదని పద్మసింహుడు గ్రహించినాడు- 'ఇటిస్థితిలో మిమ్మెట్లు బలవంతముచేయగలను? నాకు కావలసిన దొక్క-వోటు! అది లభించు ఉపాయమేదైన నున్నచో జెప్పుడు.'

లాలా:—అనిరుద్ధసింహునివద్ద కేఁగుడు! భగవదేచ్ఛ యున్నచో నాతని వోటు లభింపగలదు. సేట్ బలభద్రదాసు అతనిపై 3000 రూపాయలకు వ్యాజ్యమువేసినాడు. నిన్ననే డిక్రీగూడనైనది. అనిరుద్ధుడు బలభద్రదాసుపై మంటతో నున్నాడు. వెళ్ళి పాచికవేయుడు. పిట్ట చేజిక్కుటకు మఱొక యుపాయము చెప్పుచున్నాను. అతని నేదైన సంఘమున కధ్య క్షునిచేయుడు. అంతే! అతని కళ్లెము మీ చేతిలో నున్నదన్న మాటే !

'సరే! అతనివద్దకే వెళ్ళుదును!' పద్మసింహుడు నవ్వుచు ననినాడు.

రెండుజాములైనది. కాని, పద్మసింహునికి కాకలి దప్పి కలుగుటలేదు. బండిపై నెక్కి బయలుదేరినాడు. అనిరుద్ధుడు వరుణానదీతీరమున నొక బంగళాలో నివసించు చున్నాడు. అరగంటలో పద్మసింహుడచటికి జేరినాడు.

అనిరుద్ధుడాతని నెంతో ప్రేమతో నాహ్వానించినాడు- 'దయచేయుడు! మీ దర్శనములే దుర్లభములైనవి. ఇంటి నుండి యెప్పుడు వచ్చినారు?'

పద్మ:—నిన్నవచ్చితిని.

అని:—ముఖము వాడిపోయినట్లున్నది. సుస్తీచేసినదా?

పద్మ:—లేదు! బాగుగనేయున్నాను.

అని:—కొంచెము ఫలహారముచేయుదురా?

పద్మ:—వలదు! క్షమింపుడు! నేనిప్పుడు మీవద్దకు వేఱొక పనిమీదవచ్చితిని. హిందూసభ్యుల సమావేశమున మీరు షాహుకారుల పక్ష మవలంబించినారని వింటిని.

అనిరుద్ధుడు విరగబడి నవ్వినాడు. ఆ నవ్వుతో గది ప్రతిధ్వనించినది. గోడకు తగిలించియుంచిన యిత్తడి డాలు యాధ్వనికి కంపించినది – 'మీ రెవరినోట వింటిరో నిజము చెప్పుడు!'

పద్మసింహు డీ సమయముకాని సమయమున నవ్విన నవ్వు నర్థము చేసికొనలేక ఆశ్చర్యపడినాడు. అనిరుద్ధుడు తనను మూర్ఖుని చేయదలచుచున్నాడని కోపించి – 'ఎవరని యందును? అందఱు ననుచున్నారు.' అనినాడు.

అనిరుద్ధుడు మరల విరగబడి నవ్వినాడు - 'మీకు నమ్మకము కలిగినదా?'

ఇతడు నన్నవమానింపదలచుచున్నాడని పద్మసింహుడు నిశ్చయించుకొనినాడు - 'నమ్మకుండుటకు తగిన కారణము లేవియు లేవు' అని బిగ్గరగా ననినాడు.

అని:——నాయెడ నన్యాయము జరుగుటకంటె కారణము లేదు. నా వాక్శక్తినంతను తీర్మానమును బలపఱచుటకై వినియోగించితిని. వ్యతిరేకించుటకు గంభీరభావములనవసరమనితలచి సాధ్యమైనంతవఱకు వ్యంగ్యోక్తులనేయాధారముగ గ్రహించితిని. (ఏదో జ్ఞప్తికి దెచ్చుకొని) అవును, ఒక విషయము జరిగియుండును, జ్ఞప్తికివచ్చినది. (మరల విరగబడి నవ్వి) నా మాటలను వారీవిధముగ నర్థము చేసికొనినచో మునిసిపాలిటీయంతయు కుట్టుకుంకలతో నిండియున్నదన్న మాట! వ్యంగ్యోక్తి ప్రభావమును మీ రెఱుంగుదురుగదా! వారి కర్థముకాకపోవుట ఆ వ్యంగ్యోక్తి దోషమేగాని నాది కాదు. నా మాటల యంతరార్థము నొక్కడును గ్రహింపలేదు. కాశీ పురపాలకసంఘమునందలి సుశిక్షితులైన సభ్యులలో నొక్కరును నా మాటల నర్థముచేసికొనలేకపోయిరి. నిజముగ విచారింపవలసిన విషయము! మహాశయా! మీకు కష్టముకలిగించితిని. క్షమింపుడు. నే నీతీర్మానమును హృదయముతో నంగీకరించుచున్నాను.

పద్మసింహుడు చిరునవ్వునవ్వినాడు. అనిరుద్ధుని మాటలను నమ్మినాడు. అతడిచటినుండి వెడలునప్పుడేదో రమణీయ

మైన ప్రదేశమును దర్శించి వచ్చుచున్నంత సంతోషము కలిగినది. అనిరుద్ధుని ప్రేమ, ఆతనిస్వభావము పద్మసింహుని వశమొనర్చుకొనినవి.

# 30

కొన్ని సంవత్సరములపాటు కష్టపడి సంపాదించిన ధనమును తీసికొని, మనసులో ననేకములైన మనోరథములను నింపుకొని, సంతోషముతో నింటికిజేరి, పెట్టె తెఱచినంతనే ఖాళీసంచి కన్పట్టినప్పుడు ఆమానవునిస్థితి యెట్లుండునో యట్లే యున్నది యింటికిజేరిన సదనసింహుని మానసికస్థితి.

భావస్వాతంత్ర్యము, విద్యాసాంగత్యములు-అనుభవము లపైనాధారపడియుండును. ఈగుణము లేవియు నాతనియందు లేవు. ధార్మికభావములపైనను, సామాజికాచారములపైనను నొక విధమైన అభిమానముండునట్టివయసు! మనకు వాటిలోని లోట్లు తెలియవు, మనధర్మమునకు వ్యతిరిక్తమైన వాదములను - ప్రమాణములను వినసాహసింపని రోజులు. అందువలననే మనలో 'ఇదియేమిటి?' 'యెందువలన?' అను ప్రశ్నలు వికసింపవు. ఇంటిలోని స్త్రీలను గంగాస్నానమునకు తీసికొని వెళ్ళుటకంటె సదనునికి యింటిలోనుండి పాఱిపోవుటయే మంచి దనిపించుచున్నది. ఆడవాళ్ళ నవ్వులు బయట పురుషులు కూర్చుండు వరండాలోనికి వినిపించినచో నాతడు లోనికేఁగి తల్లిపై నిష్టమువచ్చినట్లు కేకలువేయును. ఆగ్రామములో

నొక డొకపల్లెదానిని లేవదీసికొనివచ్చి యింటిలో పెట్టినాడు. గ్రామీణు లాతనియింటికి రాకపోకలు మానివేసి, వెలివేసి నారు. గ్రామస్థుల అల్లరిభరింపలేక చివఱి కామెనింటిలోనుండి వెడలగొట్టవలసివచ్చుట నాతడెఱుఁగును. సుమన్‌బాయిపై నాతనికి నిస్సందేహముగ ప్రేమమున్నది. కాని, యాతని లౌకికశాస్త్రమున నామె తనయింటిలో నడుగుపెట్టుటతప్పు. ఆమెపై తనకున్నప్రేమ క్షంతవ్యమే! నేటివఱ కాత డామెయింటిలో తములపాకులైనను గ్రహింపలేదు. తన కుల మర్యాదను, తనసామాజిక సంప్రదాయమును తన యాత్మ కంటె నెక్కుడని భావించుచున్నాడు.

ఒక కులటను తనయింటికి గొనివచ్చినందువలన సామా న్యముగ సంభవించు యవమానమును అపనిందను తలచుకొని నంతనే యాతని శరీరము కంపించును. అతడు పద్మసింహుని మాటలువిని, తండ్రి యామాటలను నమ్మునేమోయని భయపడి నాడు. తన పినతండ్రిమాట లాతని కర్థముకాలేదు. అతడట్లు మాటాడుటకు గారణమాతనికి తెలియదు. ఈమాటలే మఱి యొక డనియున్నచో నాతనిపిలక పట్టుకొనియుండెడివాడు.

సదనసింహునిహృదయ మిటునిరాశజెంది మఱల సుమన్ పై కుఱికినది. అతడు పద్మసింహునివెంట కాశీబయలుదేరినాడు. కాని యిచటికి వచ్చినపిమ్మట యాతనిని మఱొక సందేహము వేధింపజొచ్చినది — ఈ విషయము సుమన్‌బాయికి తెలిసి నచో? ఆమె పుట్టినింటనుండకపోయినను, వారామెను వదలి పెట్టినను, వివాహవిషయమామెకు తప్పక తెలిపియుందురు.

ఇదియే నిజమైనచో నామె నాతో మాటాడనైన మాటాడదు. నన్నామె కసరికొట్టుటయు సంభవమే! కాని, సాయంకాల మైనంతనే యాతడు గుడ్డలు మార్చుకొని దాల్‌మండీవైపు బయలుదేరినాడు. సంయోగపు ఆనందపూర్ణమైన కల్పనలముం దాతని శంకలు నిర్మూలములైపోయినవి. బాలుడు పాఠశాల ముందుకువచ్చి అకస్మాత్తుగ ఆగిపోవునట్లు దాల్‌మండీవద్ద కేతెంచినంతనే యాతని ప్రేమాకాంక్ష మందగించినది. మెల్లగ నాతడు సుమన్‌బాయి యిల్లు కన్పట్టునట్టి ప్రదేశమునకు జేరినాడు. అచటనేయుండి కాతరదృష్టితో నా యింటివైపు జూడసాగెను. తలుపు మూసియున్నది. తాళముగూడ వ్రేలాడు-చున్నది. ఆతని హృదయముపైనున్న బరువు తొలగినట్లైనది. డబ్బులేని సమయమున పిల్లవాని మంకుపట్టును సహింపలేక బొమ్మలదుకాణమునకు వెళ్ళగా, దుకాణము మూసియుండు నప్పుడు తండ్రికెంత సంతోషము కలుగునో ప్రస్తుతము సదన సింహుని కట్టియానందమే కలిగినది.

కాని, యింటికివచ్చిన పిమ్మట సదనుడు తన యుదాసీన భావమునకు పశ్చాత్తాపపడినాడు. వియోగబాధతోబాటు వ్యగ్రతయు పెరిగిపోవుచుండెను. కాని యాతనికి ధైర్యము చాలుటలేదు. రాత్రివేళ యింటిలోనివారందరును నిద్రపోయిన పిమ్మట మెల్లగలేచి దాల్‌మండీవైపునకు బయలుదేరినాడు. శీతకాలము, చలిగాలి బోరున వీచుచున్నది. చంద్రుడు పొగమబ్బులలోనుండి తొంగిచూచుచు భయపడినవానివలె పరుగిడుచున్నాడు. సదనుడు దాల్‌మండీవఱకు తొందర

తొందరగ నడచివచ్చినాడు. కాని యచటికి వచ్చినంతనే యాతనికాళ్ళు ఆగిపోయినవి. కాలుసేతులవలెనే యుత్సాహముగూడ చల్లబడినది. ఈ సమయమున తానిచటికే తెంచుట యాతనికి హాస్యాస్పదముగ తోచినది. సుమన్ వద్దకేగినచో నామె యేమనుకొనును? ఆమె నౌకర్లు నిద్రపోవుచుందురు. నన్ను పలుకరించువారెవరు? ఇంతవఱకు తానెట్లు నడచివచ్చెనో యాతనికే యాశ్చర్యముగనున్నది. 'అయ్యో! నాబుద్ధి యేమైపోయినది?' అనుకొని వెనుకకు తిరిగినాడు.

మరునాటి సాయంకాలము మఱల బయల్దేరినాడు. 'సుమన్ నన్ను చూచి పిలిచినచో వెళ్ళుదును. లేనిచో తిన్నగా నింటికిపోవుదును' అని నిశ్చయించుకొనినాడు. ఆమె నన్ను పిలుచుటలోనే నాయెడల నామె హృదయము నిర్మలముగా నున్నదని వ్యక్తమగును. కాని, దాల్‌మండీలోనికి ప్రవేశించినంతనే వేఱొక యాలోచనతట్టినది – 'నన్ను చూచి యామె మనసులో నేమనుకొనును? – ఓహో! పిల్లజమీందారుగారు దర్జాగాపోవుచున్నారు. దురాగ్రహుడు! మోసగాడు! ధూర్తుడు! అని తిట్టుకొనును!' ఈయాలోచనతట్టుటయే తడవుగ మఱల అడుగు ముందునకుసాగలేదు.

ఈ విధముగ ననేకదినములు గడచిపోయినవి. రాత్రింబవళ్ళు ప్రేమకల్పనానిర్మితములైన ఆతని యిసుకగోడలు దాల్‌మండీవద్ద అవిశ్వాసపు గాలిదెబ్బకు శిథిలములైపోవుచున్నవి.

ఒకనా డాతడు షికారులుచేయుచు క్వీన్సు పార్కు వైపు వెళ్ళినాడు. అచట దీపములు వెలుగుచున్నవి. చాల మంది జనులు కూర్చుండియున్నారు. ప్రొఫెసర్ రమేశదత్తు ప్రతిభాపూర్ణమైన ఉపన్యాస మిచ్చుచున్నాడు సదనుడుగూడ వినుచున్నాడు. నిజముగ వేశ్యలవలన మనకు చాల హాని కలుగుచున్నదనుకొనినాడు. వీరు సంఘమున విషసదృశులు. నేను బ్రతికిపోతిని. లేనిచో నెందుకు పనికిమాలినవాడనై పోయి యుందును. వీరిని తప్పక పట్టణములోనుండి గెంటివేయవలసి నదే! ఈవేశ్యలవాడలే లేకున్నచో నేను సుమన్‌బాయి వలలో చిక్కియుండెడివాడనేకాను.

మఱునాడాతడు మఱల క్వీన్సుపార్కుకు బయలుదేరి నాడు. నేడచట అబుల్‌వఫా భావపూర్ణమై, లలితమైన ఉప న్యాసము జరుగుచున్నది. సదను డీ యుపన్యాసమునుగూడ శ్రద్ధగ వినినాడు. నిజముగ వేశ్యలవలన మన కెంతో యుప కారము జరుగుచున్నది. నిజముగ వేశ్యలే లేకున్నచో మన దేవతలను స్తుతించెడివారే యుండెడివారుకారు. నిజమునకు హిందూ మహమ్మదీయులు నిండుమనసుతో నరమరికలు లేకుండ కలిసికొను ప్రదేశము లీవేశ్యాగృహములే! ఇట్టి వేశ్యలను పట్టణమునుండి వెడలగొట్టుట వారికేకాదు, సంఘ మునకే గొప్ప యత్యాచార మొనర్చినట్లగును.

కొన్నిరోజుల తరువాత మఱల నీ భావము మాఱి పోయినది. ఈ వరుస యాగుటలేదు. అతనియందు స్వతంత్రా లోచనలకు దగినయోగ్యతలేదు. ఒక విషయమును విమర్శించి,

తూచి, పరీక్షించు సామర్థ్యములేదు. అందుచేతనే ప్రతి యుక్తియు నాతని భావములను తేలికగా తలక్రిందులు చేసివేయుచున్నది.

ఒకనాడాతఁడు పద్మసింహుని యుపన్యాసమునకు సంబంధించిన కరపత్రమును చూచినాడు. మూడుగంటలనుండియే ప్రయాణమై నాలుగుగంటలకు 'వేణీబాగ్' చేరినాడు. అయిదు గంటలకు ప్రజల యాగమనము ప్రారంభమైనది. అరగంటలో వేలకువేలు జనులు గుమిగూడిరి.

పద్మసింహుని యుపన్యాసము మనోమోహకమై, కరుణ రసపరిపూర్ణమై యుండెను - 'వేశ్యలపై నీర్ష్యాద్వేషములతో మేము వేశ్యలను పట్టణమునుండి తొలగింపవలెనను తీర్మానమును ప్రవేశపెట్టలేదు. వారి ననహ్యించుకొను అధికారము మాకు లేదు. వారి ననహ్యించుకొనుట వారియెడల నన్యాయమొనర్చుటయగును! మన దుష్టవాంఛలే, మన సామాజికమైన అత్యాచారములే, మన దురాచారములే వీరు వేశ్యలగుటకు కారణములైనవి. వారిని సన్మార్గమునకు గొనివచ్చుట మన విధి. వారిని బాగుచేయుట మన కర్తవ్యము. వారు పట్టణమునకు దూరముగ, ఈ దుర్వ్యసనములకు దూరముగనున్నప్పుడే యయ్యది సాధ్యమగును.' సదనుడు తన్మయుడై యుపన్యాసము వినుచున్నాడు. అతని చుట్టుప్రక్కలనున్న జను లుపన్యాసమును ప్రశంసించునప్పుడు, కరతాళధ్వనులు చేయునప్పుడు అతని హృదయము హర్షగద్గదమగుచుండెను.

సదనుని కొకవిధముగ ఉపన్యాసములపిచ్చి పట్టినది. ఎచట యుపన్యాసమనినను పరుగెత్తును. నెలలకొలఁది యిరు పక్షములవారి వాదములను వినుచుండుటవలన, ఆయా విష యములపై నాలోచించి యొక యభిప్రాయమునకు వచ్చు శక్తి ఏర్పడుచున్నది. ఇప్పుడాతడేదేనొక నూతనమైన యుక్తిని విని మోహితుడగుటలేదు - ప్రమాణముల సత్యాసత్యముల నిర్ణయించుటకు ప్రయత్నించుచున్నాడు. అతనియందు సమా లోచకుని దృష్టి పొడసూపినది. అతడు తన పినతండ్రిపక్షము నవలంబించినాడు.

ఈభావములప్రభావ మాతనిపై నెక్కువగ కన్పట్టి నది. అతడు దాల్ మండీవైపుకు వెళ్ళుటయే మానివేసినాడు. అతని చేతిలోనిపనియైనచో దాల్ మండీలోని ప్రతి యిటుకను పీకివేసి ప్రోగులుపెట్టెడివాడు. కాని సుమన్ మాత్ర మాతని హృదయమున నింకను నివసించియేయున్నది. ఆమె ప్రేమ కల్పనలతో నాతని హృదయ మింకను మేల్కొంచుచునే యున్నది. ఆమె లావణ్యపూర్ణమైనరూప మాతని కనులనుండి మాయమగుటలేదు. ఈ యాలోచనలనుండి యీ దుఃఖము నుండి తప్పించుకొనుటకే యాత డేకాంతముగ కూర్చుండుట మానివేసినాడు. ఉదయమే లేచి గంగాస్నానమున కేఁగును. రాత్రి 10, 11 గంటలవరకు నేవో పుస్తకములు చదువు చుండును. కాని యింత ప్రయత్నించినను సుమన్ మఱపునకు వచ్చుటలేదు. ఆమె యనేకరకముల వేషములను దాల్చి యాతని మనోనేత్రముల యెదుట సాక్షాత్కరించును. ఒకప్పు

డాతనిపై నలుగును; ఒకప్పు డాతనిని బ్రతిమాలును; ఒకప్పుడు ప్రేమతో బాహువుల నాతని మెడకు జుట్టును; ఒకప్పుడు ప్రేమతో చిరునగవులు చిందించును. సదను డకస్మాత్తుగ మేల్కాంచును – నిద్రలో నులికిపడినట్లు! ఈ విఘ్నకరము లైన ఆలోచనలను పోద్రోలుటకై యత్నించును. ఒకనా డాలస్యమగుటవలన నాతడు ప్రతిదినమును స్నానముచేయు రేవువద్ద కేగలేదు. అచట జనసమూహముతో రేవంతయు నిండిపోయినది. అందుచే నాతడు వితంతు శరణాలయ సమీప మునన్ను రేవువద్ద కేగినాడు. దూరమగుటవలన నచటి కెక్కువమందిజనులు రారు.

రేవువద్ద కేగినంతనే యొక స్త్రీ రేవువద్ద కేతెంచుటను చూచినాడు; వెంటనే గుర్తించినాడు. ఆమె సుమన్! ఎంత మాఱిపోయినది! ఆ పొడవైన కేశసంపద లేదు, ఆ మందగమ నము లేదు, చిరునవ్వులను చిందించు గులాబిపెదవులు లేవు! చంచలజ్యోతితో ప్రకాశించు కనులు లేవు! ఆ సింగారము – ఆ రత్నభూషణముల కాంతులు కానరావు! ఒక తెల్లని చీర కట్టి నది. నడకలో గాంభీర్యము, మోమున నిరాశా – వైరాగ్య భావములు తాండవించుచున్నవి. కావ్యముమాత్ర మదియే! కాని అలంకారవిహీనమగుటవలన సరళమై, హృదయంగమమై యున్నది. ఆమెను గాంచినంతనే సదనుడు ప్రేమవిహ్వ లుడై గబగబ నాలుగడుగులు ముందుకువేసినాడు. కాని యామె యీ రూపాంతరమును జూచి యాగిపోయినాడు. గుర్తించుటలో పొరబడినట్లు, ఆమె మఱెవతెయో యనునట్లు!

ఆతని ప్రేమోత్సాహము భంగమైపోయినది. ఈ విధముగ నెందుకు మారిపోయినదో యాతని కర్థము కాలేదు. మఱల సుమన్ వైపు జూచినాడు. ఆమెయు నాతని వైపే చూచుచున్నది. కాని యామె చూపులో ప్రేమకు బదులొకదుఃఖమున్నది. వెనుకటి విషయములను మఱచి పోయినట్లు, మఱచిపోదలచుచున్నట్లు, హృదయమున నణగి యున్న యగ్నిని ప్రజ్వలింపజేయుట కిష్టములేనట్లు కన్పట్టు చున్నది. తన్నొక నీచునిగ, వంచకునిగ, స్వార్థపరునిగ తలచి యుండుననుకొనినాడు సదనుడు. అత డొకక్షణమాగి, తన యనుమానమును నిర్థరించుకొనుట కామెవైపు మఱల చూచినాడు. నిశ్చయముతో బాటు అభిమానము కలిగినది. అతడు తన మనసును తానే ధిక్కరించుకొనినాడు – మఱల వెనుకటి దుష్టవాసనలకు వశుడనైతినని. అతడు మఱల సుమన్ వైపు చూడలేదు. ఆమె తలవంచి యాతని ముందునుండియే వెడలిపోయినది. ఆమె కాళ్ళు వణకుచుండుటను సదనుడు గుర్తించినాడు. అతడచటినుండి కదలలేదు; సంజ్ఞయుచేయ లేదు. నీవు నానుండి యొక మైలుదూరము పారిపోదలచుచో, నేను నీకు దూరముగ రెండుమైళ్లు పారిపోవుదునని తనలో తా ననుకొనినాడు. కాని, తాను తానున్నచోటునే శిలావిగ్రహము వోలె కదలకుంటినని తోచలేదు. ఏభావముల నాతడు రహస్య ముగ నుంచదలచెనో ప్రస్తుతమాభావములకే ప్రతిమూర్తి యైపోయినాడు.

ఆమె కొలఁది దూరమేఁగిన పిమ్మట నాతఁడు వెనుకకు తిరిగినాఁడు. ఆమె వెనుకనే పొంచి బయలుదేరినాఁడు. ఆమె యెచటికేఁగునో చూడవలెనని యాతని యాకాంక్ష. వివేకము వాసనాసమక్షమున తలవాంచినది.

# 31

పెండ్లివారు తిరిగి వెళ్ళిపోయిననాటినుండియు కృష్ణచంద్రు డింటిలోనుండి యడుగు బయటపెట్టలేదు. దిగులుతో గదిలో గూర్చుండియుండును. ఎవరికి మోము జూపవలెనన్నను సిగ్గుగనున్నది. దుశ్చరిత్రురాలైన సుమన్ ఆతనిని ప్రపంచము దృష్టిలో నెంత యవమానముపాలు గావించినను, అతఁడు తనదృష్టిలో తానే యెందుకును కొఱగానివాఁడై పోయినాఁడు. అతఁడు తన యవమానమును సహింపజాలఁడు- అయ్యో! అది యీ విధముగ పరువు మర్యాదలను నాశనమొనర్చునని తెలిసియున్నచో గొంతుపిసికి చంపివేసియుండెడివాఁడనే! ఆమె యభిమానినియనియు, గొప్పయింటిలో నుండదగినదనియు నే నెఱుంగుదును. ఆమె భోగవిలాసములకొఱకై ప్రాణము లర్పించునని యెఱుంగుదును; కాని, యామె యాత్మ యింతటి దుర్బలమైనదని యెఱుంగకపోతిని. నే నామెకు దీనికి తగినశిక్ష విధింతును. ఆమెను పెంచిన చేతులతోడనే యామె కుత్తుకను ఖండింతును. ఆమె యాడుకొనుచుండగా తృప్తినందిన యీ కనులు నేఁడామె రక్తములోపడి పొరలాడుచుండగా చూచి

తృప్తిని పొందగలవు. పోయిన పరువు ప్రతిష్ఠలను నిలబెట్టు కొనుట కింతకంటె మార్గాంతరములేదు. ఆభిజాత్యులు పాప మున కెట్టిశిక్షను విధింతురో ప్రపంచమునకు తెలియగలదు.

సాయంసమయము. కృష్ణచంద్రుడు నేడు హాత్యా మార్గమున పురోగమింప నిశ్చయించుకొనినాడు. ఇప్పుడాతని హృదయ మించుక విచారముగనున్నది. భయంకర కార్యము నకు ముందు మనసు నావరించియుండునట్టి యౌదాసీన్యమే యది! చాలదినములనుండి క్రోధావేగముతో నుత్తేజితుడై, యున్మత్తుడై యున్నపిమ్మట, వాయువు కొంతసేపు వేగముగ వీచి శాంతించునట్లాతని మానసమిప్పు డించుక శిథిలమై యున్నది. ఇట్టి మానసికస్థితియం దీయౌదాసీన్యము మిక్కిలి యుపయోగకరమైయుండును. ఔదాసీన్యమనునది వైరాగ్య మునకు సూక్ష్మరూపము. అయ్యది క్షణకాలముపాటు-పూర్వ స్మృతులు హృదయమున క్రీడించు సమయమున - మానవునికి తన జీవితమునుగూర్చి యాలోచించుకొనునట్టి యనకాశమును ప్రసాదించును.

కృష్ణచంద్రుని కిప్పుడు తన వెనుకటి యానందపూర్ణ మైన రోజులు, తన కొమార్తెల నిరువురిని వెంటబెట్టుకొని వాహ్యాళికి వెడలినదినములు జ్ఞప్తికి రాసాగినవి. కొంతసేపు సుమనను, మఱికొంతసేపు శాంతను యొడిలో గూర్చుండ బెట్టుకొనెడివాడు! వారింటికి వచ్చినంతనే గంగాజలి యెంతో ప్రేమతో వారి నెత్తుకొనెడిది! ఆతని కనులనుండి యశ్రుబిందు వులు రాలినవి. అయ్యో! ఆ యానందమయమైన జీవితమున

కిటి విషాదాంతమా? నేను నా యొడిలో నాడించిన పిల్లను చంపుట కుద్యుక్తుడనైతిని. కృష్ణచంద్రునికి సుమన్‌పై దయ కలిగినది. కాని, యీ దయాభావ మాతని హృదయమున నెంతో కాలముండలేదు.

ఇంతలో నుమానాథుడు వచ్చి కూర్చుండి - 'ప్లీడరు గారివద్దకేగితిని. వ్యాజ్యము వేయుమని సలహానిచ్చినారు.' అనినాడు.

కృష్ణచంద్రుడు ఉలికిపడినాడు - 'వ్యాజ్యమెవరిపై?'

ఉమా:—వారిపైననే! పెండ్లికివచ్చి తిరిగి వెళ్ళిపోయిన వారిపై.'

కృష్ణ:—దానివలన కలుగు ప్రయోజనము?

ఉమా:—వచ్చి పిల్లను చేసికొందురు, లేదా మను వర్తి యిత్తురు!

కృష్ణ:—కాని, యింకను అప్రతిష్ఠ కాదా?

ఉమా:—రావలసిన అప్రతిష్ఠ రానేవచ్చినది. దానికై యెంతకాలము భయపడుచుందుము? నేనును నా పిల్ల లిరువు రికి వివాహములు చేయవలె. ఈ కళంకము నా నెత్తిన రుద్దు కొని వారి పెండ్లిండ్లకు విఘ్నమెట్లు కల్గింపగలను?

కృష్ణ:—అయిన, నీమీద కళంకములేకుండ జేసికొను టకై యీ వ్యాజ్యము వేయుచున్నావన్నమాట!

ఉమా:—అవును! మీ యుద్దేశ్య మట్లున్నచో నంతియే! పెండ్లివారు నా యింటికివచ్చి తిరిగి వెళ్ళిపోయిరి.

లోకులు సుమన్ నాపిల్లయని భ్రమించుచున్నారు. ఎచట జూచినను నాపేరే యెత్తుచున్నారు. పదివేలకు వ్యాజ్యము వేయుచున్నాను. అయిదువేలకు డిక్రీయిచ్చినను మంచి సంబంధముచూచి శాంత వివాహము చేయవచ్చును. ఎంగిలి వస్తువునైనను తియ్యదనమునకు లోభించి కొందరు తినుచుండుట మీరెఱింగినదే! డబ్బులోభము చూపనంతవఱకు శాంతకు వివాహముకాదు. ఒక విధముగ నావంశమునకును కళంకమంటినది. ఇదివఱలో నాయింటి సంబంధమును తమ యదృష్టముగ తలఁచినవారే యిప్పుడు పెద్దపెద్దసంచులు చూపిననేగాని సరిగ మాటాడనైనను మాటాడరు. అసలు సమస్యయేఁయిది!

'సరే! వ్యాజ్యము దాఖలుచేయుము.'

ఉమానాథుడు వెడలిపోయినతరువాత కృష్ణచంద్రుడాకసమువైపుజూచి — 'ప్రభూ! నన్ను తీసికొనిపొమ్మ! నేనీదుర్దశ ననుభవింపజాలను' అని ప్రార్థించినాడు. నేఁడు వాస్తవముగ నాతనికి అవమానమనునది యనుభవమునకు వచ్చినది. పామును చంపినను దానివిషము పోనట్లు సుమన్‌ను చంపుటవలన నీకళంకము తొలఁగదని యాతని కవగతమైనది. ఆమెను హత్యచేసి అపహాసమునకు పాత్రుడగుటకంటె వేఱొండులేదు. పోలీసులు పట్టుకొందురు; కొన్నినెల లిటునటు తిరుగుదును; ఇన్నిబాధలుపడిన పిమ్మట ఉరిశిక్ష విధింతురు. అంతకంటె ముక్కుమూసికొని గంగలో దుముకుట మంచిది.

కొలఁదిసేపటికి శాంత తండ్రిని భోజనమునకు పిలచుటకు వచ్చినది. పెండ్లినాటినుండి నేటివఱకును కృష్ణచంద్రుడామెను చూడలేదు. కరుణదృష్టితో నామెవైపుజూచినాడు. కనుమసగగనున్న దీపకాంతిలో నామె మోమున నొక యలౌకికమైన కాంతి కన్పట్టినది. ఆమె కనులు నిర్మలములై ఆత్మజ్యోతితో ప్రకాశించుచున్నవి. ఆమె మోమున శోక మాలిన్యముల యాభాసమైనను లేదు. సదనునిజూచినప్పటి నుండియు నామె హృదయమున నొకవిధమైన దైవిక వికాసము కలిగినది. ఆమెయం దద్భుతమైన ఆత్మబలముదయించినది. తన మేనత్తతో నిదివఱకు సరిగ మాటాడెడిదేకాదు; కాని, నేఁడు గంటలకొలఁది మేనత్త పాదములవద్ద జేరి యామె పాదములొత్తును. మేనత్తకొమార్తెలపై నెట్టిద్వేషభావమును లేదు. నవ్వుచు నూతినుండి నీరు తోడితెచ్చును; తిరుగలి ముందు కూర్చుండి విసరుటలో నామె కొక పవిత్రమైన ఆనందము కలుగుచున్నది. ఆమెజీవితమున ప్రేమాంకుర ముద్భుద్ధమైనది. ఆమెకు సదనుడు లభింపకపోయినను, ఆతనికంటెను నుత్తమమైన వస్తువు లభించినది. అదియే సదనునిపై ప్రేమ!

కృష్ణచంద్రు డామె ప్రఫుల్లవదనమును వీక్షించి యాశ్చర్యచకితు డగుటతోబాటు భయభీతుడైనాడు. ఆమె వైపు కాతరదృష్టితో జూచి 'అమ్మాయీ! శాంతా!' అనినాడు.

శాంత జిజ్ఞాసాపూర్ణమైన దృష్టితో తండ్రిని జూచినది.

కృష్ణచంద్రునికి డగ్గుత్తిక దొడరినది - 'నేటికి నాలుగు సంవత్సరముల క్రితమే నా జీవననౌక సుడిగుండమున పడి పోయినది. ఈ చెడురోజులు నా సమస్తమును నాశనమొనరించినవి. కాని, నా సంతానపు దుర్గతినిమాత్రము చూడజాలకున్నాను. ఇదియంతయు నా దుష్కర్మకు ఫలితమని యెఱుంగుదును. నేను ముందే జాగ్రత్తవహించియున్నచో మీ కిట్టి దుర్గతి పట్టెడిదికాదు. ఇంక నే నెంతకాలమో బ్రదుకను. నీ వెన్నడైనను దురదృష్టవంతురాలైన సుమన్ను కలిసి కొన్నచో నాన్న నిన్ను క్షమించినాడని చెప్పుము. ఆమెచేసిన పాపమునకు బాధ్యుడను నేనే!'

ఈ మాటలనుచు కృష్ణచంద్రుడాగిపోయినాడు. శాంత నిశ్శబ్దముగ వినుచున్నది. తండ్రిపై నామెకు దయకలిగినది. క్షణమాగి కృష్ణచంద్రుడు మఱల 'నిన్నొక్క విషయమై ప్రార్థించుచున్నాను.' అనినాడు.

శాంత:—ఆజ్ఞాపింపుడు!

కృష్ణ:—ఏమియులేదు. సంతోషమునుమాత్ర మెన్నడును కోల్పోవద్దు! ఈ మంత్రమువలన నెంతటి విపత్సమయమందైనను నీ మనసు చలింపదు.

తండ్రి యింకేమియో చెప్పబోవుచున్నాడని శాంత గ్రహించినది. కాని సంకోచమువలన చెప్పదలఁచినది చెప్పక మాట త్రిప్పివేసినాడు. ఆతని మనసులోనున్న దామెకు తెలియకపోలేదు. ఆమె సగర్వముగ తలయెత్తి సాభిమానముగ

చూచినది. ఈ విశ్వాసపూర్ణమైన దృష్టితో తాను నోటితో చెప్పగలిగినదానికంటె నెక్కుడుగనే చెప్పివేసినది. పాతివ్రత్య సాధనము లభించినపిమ్మట ఇతర సాధనములతో పనియేమని తన మనసులో ననుకొనినది. పాతివ్రత్యమునందే సుఖము, సంతోషము నన్నియు నున్నవి.

అర్ధరాత్రియైనది. కృష్ణచంద్రు డింటినుండి బయలు దేరినాడు. ప్రకృతిసుందరి ముసలిదానివోలె దట్టమైన పొగ మంచుదుప్పటి కప్పుకొని నిదురలో లీనమైయున్నది. ఆకాశ మున చంద్రుడు మబ్బుతెరలమాటున దాగి పరుగెత్తుచున్నాడు. ఎచటికో? ఏలకో?

కృష్ణచంద్రుని మనసులో నా క్షణమున నెట్టి కోరి కయు, నెట్టి యభిలాషయు, నెట్టి దుఃఖమును లేదు. ప్రపంచ మనిన విరక్తి జనించినది. తొందరగా గంగాతీరమునుజేరి యానదిలో పడవలెనని యాతని సంకల్పము!తన ధైర్యసాహస ములు సన్నగిలిపోవునేమోయను భయము కలుగుచున్నది. అతడు తన సంకల్పమున కుత్తేజనము కల్పించుటకై పరుగెత్త నారంభించెను.

కాని కొంత దూరమేఁగినపిమ్మట ఆగిపోయి యాలో చింపసాగినాడు — నీటిలో మునిగి చనిపోవుట యేమంత కష్టముకాదు. భూమిపైనుండి కాళ్ళు లేచినంతనే పనితీరిపోవును! ఈ తలపుతో నాతని హృదయము కంపించెను. 'చనిపోవుట యేల? ఎచటికైనను లేచిపోవుట మంచిదేమో'యనుభావము

త్తైను. ఇచటినుండి వెడలిపోయిన పిమ్మట నీయప్రతిష్ఠలు వినిపింపవుగదా! కాని యీ విషయము నాతఁడు మనసులో నిలువనీయలేదు. మోహముయొక్క కపటలీలలాతనిని మోస గింపజాలకపోయినవి. అతఁడు ధార్మికప్రవృత్తిగలవాఁడు కాక పోయినను, అదృశ్యము - నవ్యక్తమునైన భయమువలన నాతని హృదయము కంపించినది. భగవంతుఁడు దయాసముద్రుఁడు, కరుణాశీలియని తన మనసునకు నమ్మకము కలిగించుచున్నాఁడు. ఆత్మ తన్నుదామఱచిపోయినది. తన స్నేహితుని బొమ్మ విరుగకొట్టిన బాలుఁడు తనయింటికి పోవుటకే భయపడునట్లున్న దాతని యాత్మస్థితి.

కృష్ణచంద్రుఁ డీదేవిధముగ ముందునకు సాగి, నాలుగు మైళ్ళు నడచినాఁడు. గంగాతీరము సమీపించినకొలఁదియు నాతని హృదయావేగము హెచ్చిపోవుచున్నది. భయమువలన మనసు అస్థిరమైపోవుచున్నది. కాని, యాత డీయాంతరంగిక మైన దౌర్బల్యమును తన గమనవేగముతోడను, తిరస్కారము తోడను దొలగింపయత్నించుచున్నాఁడు — 'అరె! నేనెంత సిగ్గులేనివాఁడను! నేనెంతటియాత్మశూన్యుఁడను! ఇట్టి విపత్తు లందు సైతము చావుకు భయపడుచున్నానే!' అని.

చంద్రాస్తమయమైనది. పొగమంచు మఱింత దట్ట మైనది. అంధకారము, చెట్లు-కొండలు-ఆకాశముల భేదమును పోద్రోలినది. కృష్ణచంద్రుఁడొక కాలిబాటపై నడచుచున్నాఁడు. ఆ చీకటిలో దృష్టికంటె, ననుమానమే యెక్కువ పనిచేయు

చున్నది. జాలిబండలను, పొదలను తప్పుకొనుటయందు నిమగ్నుడై పోయి తనస్థితినే మఱచిపోయినాడు.

నదీతీరమున కేఁగినంతనే కొంచెము వెలుగుకన్పట్టినది. కట్టపైనుండి క్రిందకు దిగినాడు. గంగానది మంచుదుప్పటి కప్పుకొని పరుండి మూల్గుచున్నది. చుట్టుప్రక్కలనున్న అంధకారమునకును, గంగానదికిని భేదము ప్రవాహముమాత్రమే! ఇది ప్రవహించుచున్న అంధకారము!అది నిస్తబ్ధము! మృత్యువు పిమ్మట నింటిలో వ్యాపించు నిస్తబ్ధతవలె నున్నదచటి వాతావరణము!

కృష్ణచంద్రుడు నదియొడ్డున నిలువబడి యాలోచింప సాగినాడు — 'నా మృత్యువెంత సమీపముననున్నది! ఒక క్షణములో నీ ప్రాణములేమైపోవునో తెలియదు. పిమ్మటగతి యేమగునో తెలియదు. ప్రపంచముతోడి సంబంధము తీరి పోవుచున్నది. ఓ యీశ్వరుడా! ఇఁక నీశరణుజొచ్చుచున్నాను! నాపై దయజూడుము! నన్ను రక్షింపుము!'

పిమ్మట నొకక్షణకాలము తన హృదయమునకు దిటవు గూర్చినాడు. తాను నిర్భయుడనని తోచినది. నీటిలోనికి దిగినాడు. నీరు చల్లగనున్నది. అతనిశరీరము కొంకరులు వోయినది. అతడట్లే ముందునకు సాగినాడు. మెడబంటి లోతునకేఁగి యొక్కపర్యాయ మావిరాటరూపముననున్న తిమిరమును జూచినాడు. ఇయ్యది ప్రాపంచికప్రేమకు చివఱి గడియ. మనోబలమునకు, ఆత్మాభిమానమునకు చివఱి పరీక్ష. ఇంతవఱకు నాతడొనర్చిన దీపరీక్షకు సన్నాహము

మాత్రమే! ఇచ్ఛ, మాయలకు చివఱిసంగ్రామము! మాయ తనశక్తినంతటిని ప్రయోగించి తనవైపుకులాగినది. సుమన్ విదుషీవేషమున దృష్టిగోచరమైనది. శాంత శోకమూర్తియై సాక్షాత్కరించినది. ఇప్పటికైనను మించిపోయినదిలేదు. బైరాగి నెందులకు కాగూడదు? ప్రపంచము నాపేరు ప్రతిష్ఠలను చర్చించుటకు నేనేమంత గొప్పవాడనని? ఇట్టికన్యలెందఱు పాపపాశముల జిక్కుకొనుచున్నారో! ప్రపంచమెవరిని లక్ష్యము సేయదు. ప్రపంచము నన్నుచూచి నవ్వుననుకొనిన నేను నిజముగ మూర్ఖుడను. ఈ తర్కమునకు సమాధాన మీయ వలెనని యిచ్ఛాశక్తియెంతయో ప్రయత్నించినది. కాని నిష్ఫలమైపోయినది. ఇఁక మునుగుటయేయాలస్యము! జీవిత మునకు మృత్యువునకు నొక్కయడుగేదూరము! ఒకయడుగు వెనుకకు వేయుట యెంత తేలిక! ముందు కొకయడుగు వేయుట యెంతకష్టమో! ఎంతభయానకమో!

కృష్ణచంద్రుడు వెనుకకేఁగుటకు కాలుయెత్తినాడు. మాయ తన విలక్షణమైన శక్తిని, చమత్కారమును చూపి నది. వాస్తవముగ నది ప్రపంచముపై నుండు ప్రేమకాదు — అదృశ్యమును గుఱించిన భయము!

కాని, ఆసమయమున నాతనికి వెనుకకు పోజాలననిపించి నది. అత డప్రయత్నముగనే లోనికి జారిపోవుచున్నాడు. అతడు బిగ్గరగ కేకవేసినాడు. చల్లదనముచే శిథిలమైన కాళ్ళను, వెనుకకు నెట్టుటకు ప్రబల ప్రయత్నమొనరించినాడు. కాని, విధిలిఖిత మట్లున్నది - అతడు ముందుకే జారిపోయినాడు.

శోకము, లజ్జ, దుఃఖములచేత తప్తమైన హృదయదాహము శీతల జలమందు శాంతించినది.

* * * *

తెల్లవారినంతనే యీ శోకసమాచారము అమోలా గ్రామమంతయు వ్యాపించినది. ఎవరో యొకరిద్దరుతప్ప గ్రామమున నెవ్వరును నుమానాథుని యింటికి ఓదార్చుటకు రాలేదు. స్వాభావికమైన మృత్యువైనచో శత్రువుగూడ వచ్చి రెండు కన్నీటిబిందువులు కార్చిపోయెడివాడే! కాని, ఆత్మహత్యయనునది భయంకర సమస్య! ఆ విషయమున పోలీసులదే యధికారము! ఈ సమయమున మిత్రులుగూడ శత్రువులవలె వ్యవహరించిరి.

ఈవార్త వచ్చునప్పటికి ఉమానాథుడు నూతివద్ద స్నానము చేయుచున్నాడు. అతని కేమాత్రమును దుఃఖముగాని, ఆశ్చర్యముగాని కలుగలేదు. అతనికి కృష్ణచంద్రునిపై కోపముకలిగినది. పోలీసుల బేడీలకు సంబంధించిన శంక, శోకమునుగూడ నణచివేసినది. స్నానధ్యానముల కానాడు చాల ఆలస్యమైనది. సందిగ్ధమైన మనసుకు తన పరిస్థితి నాలోచించు కొనుట కవకాశము చిక్కదు. అది సమయ జ్ఞానశూన్యమైపోవును.

జాహ్నవి శోకములు మొదలుపెట్టినది. ఆమె యేడ్చుటనుగాంచి యామెకొమార్తె లిరువురును నందుకొనిరి. చుట్టుప్రక్కల స్త్రీలు ఓదార్చుటకే తెంచిరి. వారికి పోలీసుల భయము లేదు. వారి యార్తనాదములు శీఘ్రముగనే సమాప్తమైనవి.

కృష్ణచంద్రుని గుణదోషవిమర్శనము ప్రారంభమైనది. ఆతనిలో దోషములకంటె గుణములే యెక్కువగనుండెనని సర్వసమ్మతివలన స్థిరమైనది.

నిజమైన దుఃఖము శాంతకుతప్ప మఱెవరికినిలేదు. తన తండ్రి యసమర్థుడైనను, తన జీవితమున కొక యాధారముండెడిది. తన తండ్రియొక్క దైన్యస్థితియే యామె పితృభక్తికి గారణము. ఇప్పుడామె నిరాధారమైపోయినది. కాని నిరాశవలన నామెజీవితము లక్ష్యహీనము కాలేదు. ఆమె హృదయము మఱింత కోమలమైనది. కృష్ణచంద్రుడు వెళ్ళుటకు ముందిచ్చిన యుపదేశమునం దిప్పుడొక విలక్షణమైన ప్రేరకశక్తి పుట్టినది. నేటినుండి శాంత సహిష్ణుతామూర్తి యైనది. వర్షకాలపు చివరిబిందువువలె మానవుని చివరిమాట గూడ వ్యర్థముకాదు. తన తండ్రి యాత్మకు దుఃఖము కలుగునట్టి యేశబ్దమును శాంతనోటినుండి వచ్చుటలేదు.

మృతసంస్కారములనుండి నివృత్తుడై యుమానాథుడు మదనసింహునిపై వ్యాజ్యము దాఖలుచేయుటయందు నిమగ్నుడైనాడు. నీకే విజయములభించునని ప్లీడరు నమ్మకముగా చెప్పినాడు. అయిదువేలు లభించినచో నెంత బాగుండును! ఈ కల్పనమే యాతనియందు శుభాకాంక్షలను రేకెత్తించినది. ఒకనాడు జాహ్నవితో శాంత వివాహవిషయమై మాట్లాడినాడు. యోగ్యుడైన వరుడు లభించునట్లున్నాడు. శాంత యీ మాటలను వినినది. వ్యాజ్యము విషయములు వినునప్పు డామెకు దుఃఖముకలిగినను తాను మాట్లాడుట

యనుచితమని తలంచి యూరకున్నది. కాని వివాహసంబంధ మైన సంభాషణవిని యూరకుండలేకపోయినది. ఏదో ప్రబల మైన ప్రేరకశక్తి యామె లజ్జను, సంకోచమును ప్రక్కకు నెట్టివేసినది. ఉమానాథుఁడు వెడలిపోయినంతనే యామె జాహ్నవివద్ద కేఁగి - 'నే నంతభారముగనున్నానా? నన్ను దూరముగ నెట్టివేయజూచుచున్నారేమి? మామయ్యతో నా విషయమై బాధపడవలదని చెప్పుము!' అన్నది.

జాహ్నవి:—నీ వాయనకు ప్రియమైన కోడలివి. నీ దుఃఖ మాయన చూడజాలఁడు. నేనును - 'పోనిండు! యిప్పు డీ గొడవయేల? వ్యాజ్యము డబ్బు చేతికివచ్చినప్పుడు చూచు కొనవచ్చు'నని యంటిని. కాని నా మాట వినినగదా!

శాంత:—నన్నచటికే యేల పంపగూడదు?

జాహ్నవి యాశ్చర్యచకితయై 'ఎచటికి?'అని యడిగినది.

శాంత సరళభావముతో నన్నది - 'చునార్ గ్రామము, లేక కాశీకి.'

జాహ్నవి:—చిన్నపిల్లవలె మాట్లాడుచున్నావు! ఆ యోగమేయున్నచో నీ యేడుపుదేనికి? నిన్ను వారు తమ యింటిలో నుంచుకొనుట కంగీకరించియున్నచో నింతయుప ద్రవ మేలజరుగును?

శాంత:—కోడలిగా నంగీకరింపకపోయినచో దాసిగా నైనను నంగీకరింతురు.

జాహ్నవికి కోపమువచ్చినది. ఈ నిర్లజ్జతను సహింప లేకపోయినది - 'నోరుమూయుము! సిగ్గులేదు! తోఁచియు

తోచనమ్మ తోడికోడలు పుట్టింటికి పోయినదట! మనవిషయ మక్క-అలేనివారిని వారు లక్షాధికారులైననుసరే కన్నెత్తి చూడను. నీ వ్యవహార మీవిధముగనున్నది. వా రిచటి కేతెంచి నెత్తినోరు బాదుకొని ప్రాధేయపడినను మీ మామ దూరమునుండియే కసరికొట్టును.'

శాంత మాటాడలేదు. ప్రపంచ మేమనుకొనుచున్నను నామెమాత్రము వివాహితననియే తలంచుచున్నది. ఒక వివాహితమైన కన్యకు మఱియొక వివాహము జరుగుటకంటె లజ్జాస్పదమైన విషయ మింకొకటిలేదు. అంతకంటె అసహ్యాము లేదు. పెండ్లివారువచ్చుటకు సంవత్సరము పూర్వమునుండియు నామె సదనుని రూపగుణములు విని హృదయసమర్పణ మొనరించినది. అతడు తనయింటికి వచ్చినపుడు, ద్వారపూజావసరమున నాతనినామె పరునిగ చూడలేదు. తనవానిగ భావించినది. నేడు మఱొక పురుషునిగూర్చిన కల్పన యామె సతీత్వముపై కుఠారఘాతమువలె నున్నది. ఇన్నిదినములనుండి సదనుని తనభర్తగాతలంచుకొని నేడు హృదయమునుండి యెట్లు త్రోసివేయగలదు? అతడామెను స్వీకరింపకపోయినను, ఆమెను పలుకరింపకపోయినను ఆమెమాత్రము మఱొకనిపేరు విన జాలదు.

ఇంతవఱకు నామె కేనాడైనను తనభర్తయింటికి వెళ్ళగలనను ఆశయున్నది. ఏనాడైనను భర్తపాదములచెంత యాశ్రయము లభించునని యాశించినది. కాని నేడు వివాహావిషయము—పునర్వివాహవిషయము విని యామె యనురక్త

హృదయము కంపించినది. నిస్సంకోచముతో తన భర్త యింటికి పంపివేయుమని జాహ్నవితో జెప్పినది. కాని, నిర్దయతోగూడిన జాహ్నవిసమాధానముతో నామె యాశ దిగజారిపోవుచున్నది. మానసికచాంచల్యము పెరిగిపోవుచున్నది. రాత్రివేళ అందఱును నిద్రించినపిమ్మట పద్మసింహునిపేర వినయపత్రము వ్రాయనారంభించినది. ఇదియామె చివఱిసాధనము. ఇది నిష్ఫలమైనచో తన కర్తవ్యమును సైతము నిశ్చయించుకొనినది.

ఉత్తరము శీఘ్రముగానే సమాప్తమైనది. ఆమెముందే వ్రాయవలసిన విషయమును లోలోన గుణించుకొనినది. వ్రాయుటయే తడవు.

"పూజ్యులైన ధార్మికజనకుల చరణసన్నిధికి, సేవిక శాంత ప్రణామములొనర్చి వ్రాయునది - నేను చాల దుఃఖములో మునిగియున్నాను. నాపై కరుణించి తమచరణసన్నిధి యందాశ్రయమొసంగుడు. తండ్రిగారు గంగానదిలోపడి పరలోకగతులైనారు. వీరు మీాపై వ్యాజ్యము వేయు ప్రయత్నములో నున్నారు. నాపునర్వివాహ ప్రయత్నములు ప్రారంభమైనవి. వెంటనే నాగతి యాలోచింపుడు. ఒక వారము దినములవఱకు మీాకై ప్రతీక్షింతును. ఆపిమ్మట మీా రీయబల పిలుపు వినజాలరు."

ఇంతలో జాహ్నవికి మెలకువ వచ్చినది. దోమలు శరీరమంతయు పొడిచివేసినవి. గోకుకొనుచు — 'ఏమి చేయుచున్నావు?' అని యడిగినది.

శాంత నిర్భయముగా – 'ఉత్తరము వ్రాయుచున్నాను' అన్నది.

'ఎవరికి?'

'మామామగారికి.'

'ఏమాతిలోనైనను దూకకూడదూ?'

'ఏడవనాడట్లే చేయుదును.'

జాహ్నవి మాటాడలేదు. మఱల నిద్రపోయినది. శాంత కవరుపై అడ్రసువ్రాసి తన గుడ్డలమూటలో పెట్టి పండు కొనినది.

*　　*　　*　　*

మూడుజాములైనది. పద్మసింహుడు నిద్రపోయి యావు లించుచు లేచినాడు. అప్పుడే పోష్టు బంట్రోతు బేరింగుకవరు తెచ్చియిచ్చినాడు. ఈ బేరింగు ఉత్తరము తెచ్చి గొప్ప యపరాధము చేసినాడన్నట్లు పోష్టుజవానువైపు అప్రసన్న దృక్కులతో జూచినాడు. మొదట ఆ ఉత్తరమును త్రిప్పి వేయవలె ననుకొనినాడు. ఎవడో దరిద్రుడైన పార్టీ తన యేడుపు వ్రాసినాడేమో యని భావించినాడు. తరువాత కొంచెమాలోచించి కవరుతీసికొని విప్పినాడు. శాంతవ్రాసిన ఉత్తరము. దీనినొకపర్యాయము చదివి బల్లపైబెట్టినాడు. ఒక క్షణమాగి మఱల చదివి గదిలో పచారులుచేయసాగినాడు. ఆసమయమున మదనసింహుడచట నుండియున్నచో నాయుత్త రము జూపి —— 'ఇదిగో! మీకులమర్యాదకు, లోకాపవాద

భయమునకు ఫలితము! మీరొకనిని చంపినారు. ఆహత్యా పాపము మీకేతగులును.' అనెడివాడు. వ్యాజ్యము విషయము చదివి పద్మసింహుడు చాల సంతోషించినాడు. వ్యాజ్యము దాఖలు చేసిన నెంతబాగుండును! ఆక్షేయ పౌరుషేయములు మట్టిగలిసిపోవును! తప్పక డిక్రీయగును. వంశగౌరవమెంత మూల్యవంతమైనదో అన్నగారికి తెలిసివచ్చును. అయ్యో! పాపమాపిల్లగతియెట్లున్నదో! పద్మసింహుడుత్తరమును మఱల చదివినాడు. ఆయుత్తరమున నాతని కామెకు తనపైనున్న శ్రద్ధాభావము వెల్లునలై కానవచ్చినది. అయ్యది యాతని న్యాయప్రియత్వము నుత్తేజితమొనర్చినది. 'ధార్మిక జనకుడు' అను శబ్ద మాతనిని వశీభూతునొనర్చుకొనినది. ఆతని హృదయమున వాత్సల్యతంతువునుండి స్వరకంపనము బయలుదేరినది. అతడు గుడ్డలుమార్చుకొని విఠల్‌దాసు యింటికేఁగి, యాతనికి శాంతవ్రాసిన ఉత్తరము చూపినాడు.

'ఇపుడు మీరేమి చేయదలచినారు?' అని ప్రశ్నించినాడు విఠల్‌దాసు.

పద్మ:—నాకేమియు తోచుటలేదు. ఈయుత్తరమును జూచినప్పటినుండియు నేనొ నదిలోబడి కొట్టుకొనిపోవుచున్నట్లున్నది.

విఠల్:—శాంతను తీసికొనిరండు.

పద్మ:—ఇఁక, ఇంటివారితో సంబంధము తీరిపోవును.

విఠల్:—పోవుగాక! కర్తవ్యనిర్వాహణమున నితర భయములకు తావుండదు.

పద్మ:—మీరనినది నిజమే! కాని నాకంతటి సామర్థ్యము లేదు. అన్నగారికి కష్టము కలిగించుటకు సాహసముచాలదు.

విఠల్:——మీ యింటివద్ద నుంపవద్దు. వితంతు శర ణాలయమున నుంపుడు! ఇందులో కష్టమేమియు లేదుగదా!

పద్మ:——అవును! మీ యుపాయము బాగున్నది! నా కీమాత్రమైనను తోచలేదు. కష్టసమయములందు తఱచుగ నాబుద్ధి భ్రష్టమైపోవుచుండును.

విఠల్:——కాని, మీరుమాత్ర మచటికి తప్పక వెళ్ళ వలెను!

పద్మ:——మన మిరువురము వెళ్లుదము.

విఠల్:——సరే! ఎప్పుడు?

పద్మ:——నేడే టెలిగ్రామిత్తును – మేము శాంతను తీసి కొనివెళ్ళుటకు వచ్చుచున్నామని! ఎల్లుండి సాయంకాలపు బండికి బయలుదేరుదము.

విఠల్:——నిశ్చయమేనా?

పద్మ:——ఆ! నిశ్చయమే!

# 32

మనమారోగ్యము పొందవలెనను తలంపుతో నేదైన కొండపై కేఁగినప్పుడు అపథ్యము జరుగకుండ మిక్కిలి జాగ్రత్త వహింతుము. ఆహారవిహారములందు జాగ్రత్తవహింతుము.

ఆరోగ్యలాభమను లక్ష్యమే మనకనులముందుండును. సుమన్ విధవాశ్రమమునకు ఆత్మికారోగ్యలాభమునకై వెళ్ళినది. ఆమె తన యభీష్టలక్ష్యము నెన్నడును మరువదు. ఆమె యాశ్రమమందలి యితర సోదరీమణుల సేవాశుశ్రూషలందు తత్పరయై యుండును. ధార్మికగ్రంథముల జదువుచుండును. దైవోపాసన, స్నానాదికములందామె వ్యథితహృదయమున కొకవిధమైన శాంతిలభించుచున్నది.

విఠల్‌దాసు అమోలా సమాచారము లామెతో జెప్పలేదు. కాని, శాంత నిచటికిగొనివచ్చుట నిశ్చయమైపోయిన పిమ్మట, సుమన్‌తో నీవిషయములు జెప్పి, యామెను సిద్ధమొనరించుట యుచితమని తలఁచెను. ఆమెకు, జరిగిన విషయమంతయు జెప్పెను.

ఆశ్రమమంతయు నిశ్శబ్దముగనున్నది. రాత్రి చాల ప్రొద్దుపోయినది. కాని యెంత ప్రయత్నించినను సుమన్‌కు నిద్రపట్టలేదు. నేడామెకు తన దురాచారపు యదార్థ స్వరూపము సాక్షాత్కరించినది. క్లోరోఫారమ్ మత్తునుండి మేల్కాంచిన రోగి తనకొనర్చిన ఆపరేషను గాయములనుజూచి, బాధ-భయములతో మఱల మూర్ఛబోవునట్లున్నదామెస్థితి! తల్లి, తండ్రి, చెల్లెలు ముగ్గురును తన యెదుట కూర్చుండియున్నట్లున్నది. తల్లి లజ్జాదుఃఖములతో తలవంచుకొనియున్నది. తండ్రి క్రోధోన్మత్తారక్తనేత్రములతో జూచుచున్నాడు. శాంత నిరాశా-తిరస్కారపూర్ణములైన చూపులతో నొకసారి ఆకాశమువైపు, వేఱొకసారి భూమివైపు జూచుచున్నది. సుమన్

మనసు వ్యగ్రమైపోయినది. ఆమె మంచముపైనుండి లేచి, యావేగముతో తల నేలకు బాదుకొనినది. తనదృష్టిలో తానొక పిశాచినియైపోయినది. తలకు దెబ్బతగులుటవలన కనులు తిరిగి పడిపోయినది. ఒకక్షణమైన పిమ్మట మఱల స్మృతివచ్చినది. తలనుండి రక్తము కారుచున్నది. ఆమె మెల్లగా లేచి తలుపు తెరచినది. అంతయు చీకటిగనున్నది. పరుగెత్తి గేటు వద్దకేఁగినది. కాని గేటు మూసియున్నది. తాళము నటునిటు యూపినది. తాళము రాలేదు. ముదుసలికాపలావా డాసమీపముననే నిద్రించుచున్నాడు. ఆమె మెల్లగా నాతనివద్దకేఁగి తలక్రింద తాళముచెవికై తడుముచున్నది. ఇంతలో నాతడు మేల్కాంచి – 'దొంగ! దొంగ!' అని యఱచినాడు. సుమన్ అచటినుండి తనగదికి పరుగెత్తి తలుపువేసికొనినది.

కాని, ప్రాతఃకాలమగునప్పటికి గాలివలెనే మానసికోద్వేగముగూడ శీఘ్రముగ శాంతించును. ఆమె వెక్కి-వెక్కి-యేడ్చినది. 'అయ్యో! నావంటిరాక్షసి ప్రపంచములోనుండదు. నా విలాసతృష్ణకై వంశనాశనమొనర్చితిని. తండ్రి ప్రాణములు తీసితిని. శాంతమెడ నరికితిని. నేనామె కిప్పుడీకళంకితమైన మో మెట్లుచూపగలను? ఆమెముం దెట్లు నిలబడగలను? ఆమెపై పెట్లు చూడగలను? నా యీదుర్మార్గమును వినినక్షణమున తండ్రి యెంత దుఃఖించెనో!' ఈ విధముగ తలఁచుకొనుచు నామె యింకను నేడ్వసాగినది.

ఆ రాత్రియంతయు నామె మానసికవ్యథతోడనే గడపినది. నాలుగు గంటలకామె గంగాస్నానమునకు బయలు

చేరినది. ఆమె తఱచుగా నొక్క-తెయే వెళ్ళుచుండును. అందుచే కాపలావాడేమియుననుగలేదు.

సుమన్ గంగాతీరమును జేరి చుట్టుప్రక్క-ల నెవరైన నున్నారేమోయని చూచినది. నేడామె స్నానమునకై రాలేదు. మునిగి చనిపోవుటకే వచ్చినది. ఆమెకెట్టి జంకు, భయము లేదు. రేపైనను శాంత ఆశ్రమమునకు వచ్చును. ఆమె కీపాపిష్ఠిమొగము జూపుటకంటె గంగాభవాని యొడిలో మొగము దాచుకొనుటయే తేలికయైనపని.

అకస్మాత్తుగా నెవరో తనవైపే వచ్చుచుండుట నామె చూచినది. ఇంకను కొంచెము చీకటిగనేయున్నది. ఎవరో సాధువనిమాత్రము గుర్తించినది. సుమన్ వ్రేలికొక యుంగర మున్నది. దాని నాసాధువునకు దానమొనరింపవలెననుకొనినది. కాని, యాతడు సమీపమునకు వచ్చినంతనే యామె లజ్జా భయజుగుప్సలతో మోమునకు చేతు లడ్డముపెట్టుకొనినది. అతడు గజాధరుడు!

సుమన్ నిలబడియేయున్నది. అతడామె పాదములపై వ్రాలి రుద్ధకంఠముతో — 'నాయపరాధము క్షమింపుము!' అని ప్రార్థించినాడు.

సుమన్ వెనుకకు తగ్గినది. ఆమె కనులముందు తన్నవ మానించిన దృశ్యము సాక్షాత్క-రించినది. గాయము మఱల రేగినది. 'నీవే నాతండ్రినిచంపిన ఘాతకుడవు ! నీవే నాసమ స్తము నాశనమొనర్చిన పాపివి!'అని యాతనిని తిట్టవలె ననుకొన్నది. కాని యాతని దయతో గూడిన ఔదార్యము,

సాధువేషము, ప్రాణత్యాగనిశ్చయానంతరము కలుగునట్టి తన వైరాగ్యభావము నామెను ద్రవితమొనరించినవి. ఆమె కనులు సజలములైనవి. కరుణస్వరముతో — 'మీ యపరాధ మేమియు లేదు. అంతయు నాకర్మఫలము!' అనినది.

గజా:— కాదుసుమన్! అట్లనవలదు! ఇది యంతయు నా యజ్ఞానమునకు, నా మౌర్ఖ్యమునకు ఫలితము! దానికి తగిన ప్రాయశ్చిత్త మొనర్చుకొనవలెననుకొంటిని. కాని, నా దుర్మార్గముయొక్క భీషణపరిణామములను జూడగా దానికి ప్రాయశ్చిత్తమనునది లేదని విదితమైనది.

గజాధరుని యాత్మవేదన సుమన్ మనసులో మురికిపై సబ్బు పనిచేసినట్లు చేసినది. అయ్యది లోన కూడుకొని యున్న మాలిన్యమును తొలగించివేసినది. తాను రహస్యముగ నుంచవలెననుకొనిన సంచితభావములు పైకుబికివచ్చినవి — 'భగవంతుడు మీకు సద్బుద్ధినొసంగినాడు. మీరు మీసత్కీర్తి సాయమున నేమొనర్పగలిగినను, రెంటికిఁ జెడిన నాగతియేమి? అయ్యో! నావిలాసతృష్ణ నన్నెందుకును కొఱగాకుండ చేసివేసినది. ఇంక దాచుటయేల? మీపాశవిక, పైశాచిక వ్యవహారము జ్ఞప్తికివచ్చినపుడు హృదయమున నొక విధమైన జ్వాల బయలుదేరును. మిమ్మెన్నియో తిట్టితిని. కాని, యివి నా తుదిక్షణములు! క్షణములో నీశరీరము గంగాభవాని కర్పణమగును. తండ్రివద్దకేఁగి శరణువేడుదును. అందుచే మీయపరాధములను క్షమింపుమని భగవంతుని ప్రార్థింతును.'

గజా:—సుమన్! ప్రాణములు వీడినంతమాత్రముననే ప్రాయశ్చిత్తమగుచో నేనెన్నడో ప్రాణములను వీడియుండెడి వాడను!

సుమన్:— దుఃఖములైనను తొలగిపోవునుగదా!

గజా:— అవును! నీ దుఃఖములుమాత్రము తొలగి పోవును! కాని నీ దుఃఖములవలన దుఃఖితులైయున్నవారి దుఃఖములు మాత్రము తొలగవు. నీవు లేనప్పుడు అబలయైన శాంతగతి యేమగునో యాలోచింపుము! ఇంతవఱకును ప్రపంచమునందలి నిమ్నోన్నతము లెఱుంగనిముగ్ధ! నీకంటె నామె కీ ప్రపంచమున నెవరున్నారు? ఇఁక నామెగతియేమి?

ఆమెకు గజాధరుని మాటలయందు నిజమైన సమవేదన కన్పట్టినది. అతనివైపు కరుణసూచకమైన దృష్టినిగిడ్చినది— 'శాంతను కలిసికొనుటకంటె ప్రాణత్యాగమే నాకు సులభ మనిపించుచున్నది. ఆమె రేపిచటికి వచ్చును. ఆమె యెదుట పడుటకు భయము, ఆమెను చూచుటకు సిగ్గు నన్నువేధించు చున్నవి. ఆమె తిరస్కారముతో నావైపు జూచినచో నపుడు నేనేమిచేయవలె? అసహ్యముతో నన్ను కౌగలించుకొనుటకు వెనుకాడినచో నాగతియేమికావలె? విషము త్రాగుటకంటె గత్యంతరముండదు. ఆదుస్థితికంటె మరణమేమేలు!'

గజాధరుడు శ్రద్ధాభావముతో నామెవైపు జూచినాడు. ఇట్టి స్థితిలో సుమన్ చేయదలచినదే నేనును చేసియుందు ననుకొనినాడు — 'సుమన్! నీ భావములు యదార్థములే! కాని, నీ హృదయమున నెన్నిదుఃఖములు కలిగినను శాంత

కొఱకై నీవు వాటిని సహింపకతప్పదు. నీవలన నామెకు కలుగుమేలు మఱెవ్వరివలనను కలుగదు. ఇంతవఱకు నీవు నీకొఱకై జీవించితివి, ఇకనుండి యితరులకొఱకు జీవింపుము!'

ఈమాటలని గజాధరుడు తాను వచ్చినదిక్కునకే వెడలిపోయినాడు. సుమన్ గంగాతీరమున చాలసేపు నిలబడి యాలోచించినది. పిమ్మట స్నానమాచరించి ఆశ్రమమునకు బయలుదేరినది — యుద్ధక్షేత్రమున పరాజితుడైన సైనికుని వోలె!

# 33

శాంతయుత్తరముమాత్రము వ్రాసినది. కాని సమాధానము వచ్చునను ఆశ లేదు. మూడురోజులు గడచినవి. ఆమె నిరాశ దినదినమును పెరిగిపోవుచున్నది. అనుకూలమైన సమాధానము రానిచో సుమానాథుడు తప్పక వివాహముచేసి తీరును. ఈ యాలోచనతో నామెహృదయము కంపించు చుండెను. ప్రతిదినము ననేకపర్యాయములు తులసికోట వద్ద కేఁగి మ్రొక్కుకొనును. అప్పుడప్పుడు శివాలయమునకేఁగి తన మనోభీష్టము నివేదించును. ఒక్కక్షణమైనను నామెకు సదనుడు మఱపునకు వచ్చుటలేదు. ఆమె యాతనిమూర్తిని మనోనేత్రముల ముందుంచి చేతులు జోడించి ప్రార్థించును — 'ప్రాణనాథా! నన్నెందులకు స్వీకరింపకుంటివి? లోకాపవాద భయముననా? అయ్యో! నాప్రాణము లింతచౌకయైపోయెనా? నీవు నన్ను త్యజించినావు! అగ్నిలోనికి త్రోసివేసినావు!

నావలన తప్పేమి? సుమన్‌కు సోదరినగుటయేనా? ఇదేనా న్యాయము? నీవు నాకు లభించియున్నచో, నేను నిన్ను గ్రహించియున్నచో నెట్లు తప్పించుకొనియుండెడివాడవో చూచియుందును! నా కన్నీటికి కరుగకుండుటకు నీవు పాషాణమవుకావు! నీ కండ్లతో నొక్కసారి నాస్థితి జూచియున్నచో నిట్లుపేక్షించియుండెడివాడవుకావు. నీ విశాలహృదయము కరుణాశూన్యమైయుండజాలదు. ఏమిచేతును? నా హృదయస్థితిని నీకెట్లు చూపగలను?

నాల్గవనాటి యుదయము పద్మసింహుని యుత్తరము వచ్చినది. శాంతభయభీతయైనది. ఆమె ప్రేమాభిలాషలు శిథిలమైనవి. తన భావిస్థితిని గూర్చిన శంకలతో నామె మనసునకు శాంతిలేకుండెను.

కాని, ఉమానాథుడుమాత్రము సంతోషమును పట్టజాలకుండెను. మేళతాళములు మాట్లాడినాడు. మేనా సిద్ధమొనర్చినాడు. గ్రామమునంతను ఆహ్వానించినాడు. అతిథులకొఱకై వరండాలో తివాచీలు పఱపించినాడు. గ్రామములోనివారందఱు నాశ్చర్యచకితులైరి. ఇవేమియుపకములు! వివాహామే కానప్పుడీయుపకములేమిటి? ఉమానాథు డేదో యెత్తుయెత్తినాడనుకొనిరి. నిర్దిష్టమైన సమయమున ఉమానాథుడు స్టేషనుకేగి మేళతాళములతో నతిథులను గొని వచ్చినాడు. ఆదరముతో వారినిగూర్చుండబెట్టినాడు. ముగ్గురే యతిథులు — పద్మసింహుడు, విఠల్‌దాసు, ఒకనౌకరు.

మఱునాటిసాయంకాలము అంపకముల ముహూర్తము! మూడుజాములైనది! కాని గ్రామములోని స్త్రీ లెవ్వరును నుమానాథుని యింటికి రాలేదు. అతడు మాటిమాటికిని లోని కేగును. కోపించును. గోడలపై కేకలువేయును. వీరి సంగతి కనుగొనితీరుదునని గర్జించును. కాని యీ కేకలు, డబాయింపులు రైతులపై పనిచేసినట్లు స్త్రీలపై పనిచేయుట లేదు. గర్విష్ఠుల గర్వభంగ మొనర్చుటకు వారిటువంటి తరుణములకై వేచియుందురు.

సాయంకాలమైనది. బోయీలు పల్లకీ గుమ్మము ముందుంచినారు. జాహ్నవి శాంతను కౌగలించుకొని కంట తడిపెట్టినది.

శాంత హృదయము ప్రేమతో తొణికిసలాడినది. తానీ యింటిలో ననుభవించిన కష్టములను మఱచిపోయినది. వీరినిక చూడలేదు, ఈ యింటికిక రాలేదు. వీరితో సంబంధము తీరిపోవుచున్నది. ఈభావములతో నామెహృదయము విదీర్ణమైపోవుచున్నది. జాహ్నవిహృదయముసైతము దయతోనిండి పోయినది. మాతాపితృహీనయైన నీబాలికను కష్టపెట్టితిమని తలచుకొనినంతనే కనులనుండి యశ్రువులు జాలువారినవి. ఇరువురి హృదయములందును స్వచ్ఛస్నిగ్ధనిర్మలభావ తరంగము లుప్పతిల్లినవి.

ఉమానాథు డింటిలోనికే తెంచినంతనే శాంత యాతని పాదములకు చుట్టుకొని విలపించినది — 'మామయ్యా! నీవే నాకు తండ్రివి! నీ యీకుమార్తెను మఱువద్దు.'

'అమ్మాయీ! నాయిరువురు బిడ్డలవంటిదానవేనీవును! భగవంతుడు శుభములొసంగుగాక!' అని కంటనీరు పెట్టినా డుమానాథుడు.

సాయంసమయము. ఆవు యింటికి వచ్చినది. శాంత యావును చుట్టుకొని విలపించినది. మూడు నాలుగు సంవత్స రములనుండి యా యావుకు శుశ్రూషచేయుచున్నది. ఇఁక నుండి యెవరికొఱకు గడ్డితెచ్చును? ఎవరికై కుడితికలుపును? నల్లనిపూసలు గ్రుచ్చి యెవరిమెడ నలంకరింపగలదు? ఆవు తలవంచి యామె చేతులను నాకుచున్నది. వియోగదుఃఖ మాయావుకనులందు భాసించుచున్నది.

జాహ్నవి శాంతనుగొనివచ్చి మేనాలో గూర్చుండ బెట్టినది. బోయీలు మేనా నెత్తుకొనిరి. శాంతకు అగాధ సాగరమునబడి కొట్టుకొనిపోవుచున్నట్లున్నది.

గ్రామమందలి స్త్రీలు గుమ్మములవద్ద నిలువబడి మేనా వైపు జూచి కంటనీరుపెట్టిరి.

ఉమానాథుడు వారిని సాగనంపుటకు స్టేషనువఱకు వచ్చెను. తిరిగి వెళ్ళునపుడు తలగుడ్డతీసి పద్మసింహుని పాద ములపైనుంచి నమస్కరించినాడు. పద్మసింహుడాతనిని గ్రుచ్చి కవుగలించుకొనినాడు.

బండి బయలుదేరినపిమ్మట పద్మసింహుడు విఠల్ దాసుతో — 'ఇఁక నీయభినయమున క్లిష్టమైన ఘట్టము ప్రారంభమైనది.' అనినాడు.

విఠల్:— ఏమిటది? నాకర్థముకాలేదు.

పద్మ:—శాంతతో నేమియు జెప్పకుండ ఆశ్రమము లోనికి తీసికొని వెళ్ళుటయేనా? ముందామెకుజెప్పి యొప్పింప వలదా?

విఠల్:— అవును! మంచివిషయము జ్ఞప్తికి దెచ్చి నావు! వెళ్ళి చెప్పుదునా?

పద్మ:— నాకొకటి తోచుచున్నది. ముగల్‌సరాయి స్టేషనులో చాలసేపు ఆగవలసియుండును. అప్పుడే యీ విషయము చెప్పవచ్చును.

విఠల్:—గొప్ప ఆలోచన! అందుచేతనే పెద్దలు ఆలోచింపకుండ నేపనిని చేయవద్దనినారు. మీబుద్ధి సరిగనే పని చేయును - కాని కొన్ని వంకరలు తిరిగినపిమ్మట! ఈమాట మీకు ముందుతోచలేదు!

తొమ్మిదిగంటలకుబండి ముగల్‌సరాయి స్టేషనుచేరినది. విఠల్‌దాసువచ్చి శాంతను దింపినాడు. కొంచెముదూరము తీసికొనివెళ్ళి దుప్పటిపఱచి కూర్చుండబెట్టినాడు. ఇచట బండి మారవలె! బెనారస్‌బండి బయలుదేరుట కింకను నరగంట వ్యవధియున్నది.

శాంత స్టేషనువైపు జూచుచున్నది. ఈ దేశీయులు నెత్తిపై పెద్దపెద్ద మూటలు పెట్టుకొని యొక యిరుకుద్వారము గుండా బయటికిపోవుటకై యొకరిమీద మఱొకరు పడుచు త్రోసికొనుచున్నారు. మఱొక యిరుకుద్వారమునుండి వేల కొలఁది జనులు లోనికివచ్చుటకై గ్రుద్దులాడుకొనుచున్నారు.

కాని మఱియొక వైపున విశాలమైన ద్వారమునుండి తెల్ల దొరలు చేతికఱ్ఱలూపుకొనుచు కుక్కలను వెంటబెట్టుకొని పోవుచున్నారు. వారి నెవ్వరును అడ్డగించువారేలేరు. వారిని పలుకరించువారేలేరు.

ఇంతలో పద్మసింహు డామెవద్దకేతెంచినాడు — 'శాంతా! నేను నీధార్మిక గురువును! – తండ్రిని! పద్మసింహుడను!'

శాంత నిలువబడినది. చేతులు రెండును జోడించి నమస్కరించినది.

'మనము చునార్ గ్రామమున దిగనందులకు నీకాశ్చర్యము కలిగియుండవచ్చును. ఇంతవఱకును మామయ్యగారికీ విషయము చెప్పలేదు. అదియే కారణము! నీయుత్తరము చూచి నంతనే భయముకలిగినది. ముందు నిన్నచటినుండి తీసికొని వచ్చుటయే యుత్తమమని భావించితిని. మామయ్య గారితో మాట్లాడి నచ్చచెప్పుట కవకాశములభింపలేదు. అందుచే నీవు కొన్ని దినములపాటు కాశీలోనుండవలెను. ప్రస్తుతము నీసోదరి సుమన్ నివసించుచున్న యాశ్రమమునకే నిన్ను గొంపోదును. సుమన్‌తో నుండుటవలన నీకెట్టికష్టమును కలుగదు. నీవామె విషయమై వినిన కళంకిత విషయములను మనసునుండి పారద్రోలుము. ఇప్పుడామె మహాసాధ్వి. ఆమె జీవితము దోషరహితమై యుజ్జ్వలమైనది. అట్లుకానిచో నాధర్మపుత్రిక నామెతో నుంచుట కంగీకరించెడివాడనుకాను. ఒకనెల, రెండునెలలో మామయ్యగారిని త్రోవకుదెత్తును. నీకీవిషయమున నభ్యంతర

మున్నచో నాతో స్పష్టముగ జెప్పుము! వేఱొక యేర్పాటు గావింతును.'

శాంత యేడ్చుచు పద్మసింహుని చరణములపై వ్రాలి లజ్జావిషాదనైరాశ్యములతో- 'మీ శరణుజొచ్చితిని. మీ కుచితమనితోచినట్లు చేయుడు!' అనినది.

ఆమె హృదయమించుక తేలికయైనది. ఆమెకిక తన భవిష్యద్విషయమై చింతింపవలసిన యగత్యములేదు. కొన్ని దినములవరకును నామెకు తన జీవితమార్గము నిశ్చితమైనట్లు తోచినది. తన గుడిసెకు నిప్పు అంటుకొనినప్పుడు కొంత సేపటివఱకైనను నంధకారభయమునుండి విముక్తుడ నైతిని గదా యని సంతసించువానివలె నున్నదామెస్థితి.

పదునొకండు గంటలకు ముగ్గురును ఆశ్రమమును చేరిరి. సుమన్‌బాయితో జెప్పవలెనని విఠల్‌దాసు ముందు బయలు దేరినాడు. కాని యచటికేగునప్పటికామె స్పృహతప్పిపడి యున్నది. ఆశ్రమమందలి స్త్రీలామె కుపచారములు సల్పు చున్నారు. ఒకతె విసరుచున్నది, వేఱొకతె తలయొత్తుచున్నది. యింకొకతె పాదము లొత్తుచున్నది. మధ్యమధ్య మూల్గు వినిపించుచున్నది. విఠల్‌దాసు భయముతో- 'డాక్టరును పిలిచినారా?'యని యడిగినాడు. 'ఇప్పుడేవచ్చి చూచివెళ్ళినా' రని సమాధానము వచ్చినది.

కొందఱు స్త్రీలు శాంతను బండిలోనుండి దింపిరి. ఆమె సుమన్‌మంచమువద్ద నిలువబడి పిలిచినది- 'అక్కయ్యా!' సుమన్ కండ్లు తెరువలేదు. శాంత శిలాప్రతిమవోలె నిలువబడి

సజలనేత్రములతో నామెవైపు జూచుచున్నది. – 'మూడు నాలుగు సంవత్సరముల క్రితము కలిసి యాడుకొనిన సోదరి యేనా యీమె? ఆసుదీర్ఘ కుంతలములేవి? కుందనమువోలె ప్రకాశించునట్టి యావదనబింబమేది? చంచలములై, సజీవములై, చిరునవ్వుల జిందించునట్టి యా నేత్రము లేమైనవి? శిరీషకోమలమైన గాత్రము, ఆరక్తకపోలము లేమైపోయినవి? ఈమె నాసోదరియేనా? లేక శవమా? నిర్జీవమూర్తియా? ఆలావణ్యహీనమైన మోముపై విరక్తి, సంయమము, ఆత్మత్యాగజనితమైన ప్రశాంతజ్యోతి వెలుగొందుచున్నవి. శాంత హృదయము క్షమాప్రేమభావములతో పొంగిపోయినది. ఆమె యితరస్త్రీలనచటినుండి వెడలిపొమ్మని సంజ్ఞచేసి, యేడ్చుచు సుమన్‌ను కౌగిలించుకొనినది– 'అక్కయ్యా! కండ్లు తెరువవేమి? మనసెట్లున్నది? నీ చెల్లెలు శాంతను!'

సుమన్ కండ్లు తెఱచి యున్మత్తవోలె విస్మితదృక్కులతో శాంతవైపు జూచినది– 'ఎవరు? శాంతవా? దూరముగ నుండుము! నన్నుస్పృశింపవద్దు! నేను పాపిష్ఠిదానను, దౌర్భాగ్యురాలను, భ్రష్టను! నీవు సాధ్వివి, పతివ్రతవు, నీవు నన్ను స్పృశింపకుము! నా యీహృదయమును వాసనలు, లాలసలలు, దుష్కామనలు మలినమొనర్చినవి. నీవు నీస్వచ్ఛమైన ఉజ్జ్వలహృదయమును నాహృదయమునకు సమీపమునకు రానీయవద్దు. దూరముగనుండుము. అదిగో! నాకైనరకాగ్నికుండము ప్రజ్వలించుచున్నది. యమదూతలు నన్నా యగ్నికుండలములోనికి త్రోయుటకై లాగికొని పోవు

చున్నారు. నీవిచటనుండి పారిపొమ్ము.' ఇట్లని సుమన్ మఱల మూర్ఛబోయినది.

ఆరాత్రియంతయు శాంత సుమన్ మంచమువద్ద గూర్చుండి యుపచారములు సల్పుచునే యున్నది.

# 34

శాంత యాశ్రమములోనికేతెంచి యొకనెలదినము లైనది. కాని పద్మసింహుడు మాత్రము తన యింటిలో నెవరితోడను ఈవిషయమై మాటాడలేదు. అన్నగారికి ఉత్తరము వ్రాయవలెననుకొనును. ఒకప్పుడు స్వయముగా వెళ్ళి చెప్పవలెననుకొనును. మఱొకసారి విఠల్‌దాసును పంపవలె ననుకొనును. కాని యొకనిశ్చయమునకు మాత్రమురాలేదు.

అతనిమిత్రులు వేశ్యలకు సంబంధించిన తీర్మానమును మునిసిపల్ కౌన్సిల్‌లో ప్రవేశపెట్టుమనితొందరపెట్టుచున్నారు. వారికి తీర్మానము నెగ్గునను పూర్తినమ్మకమున్నది. ఆలస్య మైనచో నిబ్బందులు కలుగవచ్చును. పద్మసింహుడు వాయిదా వేయుచు వచ్చినాడు. మేనెల వచ్చినది. విఠల్‌దాసు రమేశ దత్తుల యొత్తిడివలన తప్పనిసరియై తీర్మానమునకు నోటీసు ఇచ్చినాడు. చర్చకొకరోజు కేటాయింపబడినది.

నేడు కౌన్సిలో తీర్మానము ప్రవేశపెట్టబడినది. మునిసి పల్ ఆఫీసు ఆవరణయంతయు జనసమూహముతో నిండిపోయి నది. వేశ్యలు తమ బలగముతోగూడ దండెత్తివచ్చిరి.

పురపాలకసంఘము సమావేశమైనది. సభ్యులందరును హాజరైరి. డాక్టరు శ్యామచరణుడు కొండపై కేగుటను వాయిదావేసికొనినాడు. మున్షీ అబుల్ వఫాకు రాత్రియంతయు నిద్రయేలేదు - లోనికి బయటికి పచార్లు చేయుచున్నాడు. నేడాతనిశ్రమకు, ఉత్సాహమునకు అంతులేదు.

పద్మసింహుడు తన తీర్మానమును ప్రవేశపెట్టుచు క్లుప్తముగ, తూచితూచి మాటాడి దానిని సమర్థించినాడు. ఆతీర్మానము మూడు భాగములుగ విభజింపబడినది. (1) వేశ్యలను పట్టణమునందలి ప్రముఖస్థానములనుండి తొలగించి పట్టణమునకు దూరముగానుంచుట, (2) పట్టణమునందలి ముఖ్యమైన వాహ్యాళికి వెడలుప్రదేశములందు (పార్కులు మున్నగు చోట్లకు) వారిరాకను నిషేధించుట, (3) వేశ్యల నృత్యప్రదర్శనములపై నెక్కువపన్నులను విధించుట, యెట్టిపరిస్థితియందైనను సార్వజనిక ప్రదేశములందు జరుగనీయకుండుట.

ప్రొఫెసర్ రమేశదత్తు తీర్మానమును బలపఱచెను.

సైయద్ శఫకత్ ఆలీ (రిటైర్డు డిప్యూటీ కలెక్టరు)- 'నాకీతీర్మానమువెడల పూర్తివిశ్వాసమున్నది. కాని తగిన సవరణలు లేకుండ నేనీతీర్మానము నామోదింపజాలను. నా యుద్దేశ్యమున తీర్మానమందలి మొదటిభాగమున నీశబ్దములను జేర్పవలెను—— 'తొమ్మిదినెలలలోగా వారందఱును వివాహములు చేసికొనవలెను లేదా గౌరవనీయమైన జీవనము గడపుటకు వీలైన విద్యనైన నభ్యసింపవలెను.'

అనిరుద్ధుడు:— 'నాకీసవరణ పూర్తిగానచ్చినది. ఈసవరణలేనిచో తీర్మానమందలి మొదటిభాగము మందులు పనిచేయని కత్తిగాయమువంటిది.'

ప్రభాకరరావు :- ఈ సవరణకును, తీర్మానమునకును సంబంధమేమియో నాకు బోధపడకున్నది. దీనిని మీరొక ప్రత్యేక తీర్మానముగ ప్రవేశపెట్టవచ్చును. సంస్కరణకై మీరేది చేయగలిగినను ప్రశంసనీయమే యగును. కాని, మీరు తలపెట్టినపని పట్టణమధ్యమందున్న నెంత తేలికయో పట్టణమునకు వెలుపలనున్నను నంతే తేలిక. ఇంతకంటె నచటనే యెక్కువ వీలుండును.

అబుల్ వఫా:- నాకీ సవరణపై పూర్తి విశ్వాసమున్నది.

అబ్దుల్ లతీఫ్:— ఈ సవరణలేని తీర్మానమును నే నామోదింపజాలను.

దీనానాథతివారీగూడ సవరణను నెగ్గించుటకై పట్టు బట్టెను.

పద్మ:— ఈ తీర్మానమందలి మా యుద్దేశ్యము వేశ్యలను బాధపెట్టవలెననికాదు. వారిని సన్మార్గమునకు గొనివచ్చుటయే! కావున నీసవరణ నామోదించుటలో నాకెట్టి యభ్యంతరమును లేదు.

సైయద్ తేగ్ ఆలీ:-ఈ సవరణవలన ప్రధానమైన తీర్మానోద్దేశ్యమే నాశనమైపోవుననుభయమున్నది. ఈసవరణ, ఇంటి సింహద్వారమును మూసివేసి దొడ్డితలుపు తెరచినట్లున్నది.

నేటివఱకును భోగవిలాసముల కలవాటుపడిన వేశ్యలు ఒడలు వంచి కాయకష్టమునకు సిద్ధపడుదురనుట అసంభవమైన విషయము. ఈ సవరణవలన వారనుచితమైన లాభమును పొందుదురు. ఈ సవరణ నామోదించుట యింగితజ్ఞానశూన్యత్వము నును ప్రదర్శించుకొనుటయే యగును.

డాక్టర్ శహరత్ ఖాన్ :— నాకు తేగ్ ఆలీ చెప్పిన మాటలే బాగున్నవి. ఈ సవరణవలన తీర్మానోద్దేశ్యము, తీర్మానలక్ష్యము పూర్తిగ మాయమైపోవునని నాదృఢ విశ్వాసము.

శరీఫ్ హసన్ (వకీలు) :- పద్మసింహుడు దయాపరుడైన పెద్దమనిషి యనుటలో సందేహములేదు. కాని వారీసవరణ నామోదించి తీర్మానముయొక్క లక్ష్యముపై దృష్టిని కేంద్రీకరించుటకు బదులు, తన దయాపరత్వమును, నిష్కల్మష హృదయమును వ్యక్తమొనర్ప యత్నించినారు. ఇంతకంటెను తీర్మానము ప్రవేశపెట్టకున్నచో బాగుండెడిది. సైయద్ శఫకత్ ఆలీసాహెబుగారు కొంచెము దూరదృష్టితో నాలోచించియున్నచో నీసవరణను ప్రతిపాదించెడివారు కారు.

సభాపతి బలభద్రదాసు తీర్మానమునందలి మొదటి భాగముపై నభిప్రాయముఁదీసికొనినారు. అనుకూలముగా 9, ప్రతికూలముగా 8 మంది. తీర్మానము నెగ్గినది.

పిమ్మట సవరణపై నభిప్రాయము గైకొనబడెను. అనుకూలముగా 8 మంది ప్రతికూలముగా 8 మంది అభిప్రాయ

మిచ్చిరి. సభాపతి అనుకూలముగా నభిప్రాయమొసంగెను. డాక్టర్ శ్యామచరణుడు తాటస్థ్యమునువహించెను.

ప్రొఫెసర్ రమేశదత్తు, ప్రభాకరరావు, రుస్తుంభాయి, యీ ముప్వురును సవరణగెలుపొందుట తమ కవమానముగ నెంచిరి- తమ యోటమిగ భావించిరి. విశ్వాసఘాత మొన ర్చించితివనినట్లు పద్మసింహునివైపు జూచిరి.

అబుల్ వఫా, యాతని మిత్రగణము విజయము తమదే యైనట్లు సంతసించిరి. వారిట్లు సంతోషముతో నుండుట ప్రభాకరరావు, ఆతని మిత్రులకు గాలమై గ్రుచ్చుకొనినది.

తీర్మానపు రెండవభాగముపై ఓటుతీసికొనబడినది. ఈసారి ప్రభాకరరావు, ఆతని మిత్రులు తీర్మానమును వ్యతిరేకించిరి. పద్మసింహు డొనర్చిన విశ్వాసఘాతమునకు ప్రతీకారమొనర్ప నెంచిరి. ఈ తీర్మానము వీగిపోయెను.

ఇంక తీర్మానపు మూడవభాగముపై వోటింగు జరిగి నది. అదియు త్రోసివేయబడినది.

రాత్రి ప్రొద్దుపోయినతరువాత సభవాయిదా వేయ బడెను. ఓడిపోవుదుమని శంకించినవారు సంతోషముతో నేగిరి. జయింతుమని నమ్మినవారు విచారముతో నేగిరి.

అందఱును వెడలిపోయిరి. చీకటి దట్టముగ వ్యాపించి నది. కాపలావాడును, తోటమాలియుగూడ గేట్లువేసి వెడలి పోయిరి. కాని పద్మసింహుడుమాత్ర మచటనే గడ్డిపై నిరు త్సాహియై - దుఃఖమూర్తియై గూర్చుండియుండెను.

ఈసవరణను సమర్థించుటయందు తాను పొఱబడిన ట్లాతనియంతరాత్మమాత్ర మంగీకరించుటలేదు. ఒక స్వల్ప విషయమునకై తనమిత్రు లిట్లువ్యతిరేకింతురని యాశింప లేదు. తీర్మానమునందలి యంశములు వీగిపోయినందుల కాత నికి దుఃఖములేదు. ఇదియంతయు నాతని సహచరుల అసహిష్ణు తకు, దూరదృష్టిలేమికి ఫలితమేయైనను, ఆదోషమంతయు నాతని నెత్తిపై రుద్దుదురు. ఆతని దృష్టిలో నీసవరణ స్వల్ప విషయము. ఆసవరణ దురుపయోగ మొనర్పబడుననువాదము నాతడు విశ్వసింపడు. ఆయవిశ్వాసమే తీర్మానమునకు సంబం ధించిన బాధ్యతయంతయు నాతని నెత్తిపై నుంచినది. ప్రస్తుత సామాజికస్థితిలో ఈతీర్మానమువలన నాశించిన యుద్దేశ్యము సిద్ధింపదను నిశ్చయమునకు వచ్చినాడు. అనవసరముగ నీబెడ దను తెచ్చి నెత్తినపెట్టుకొంటినని పశ్చాత్తాపము జెందును. ఈముండ్లపొదలో నిట్లుచిక్కుకొంటినేమని యాశ్చర్య పడును. ఈవిఫలమైపోవుభార మాసవరణ నెత్తినపడియున్నచో నాతనిబాధ్యత చాలభాగము తగ్గియుండెడిది. ఈయప్రతిష్ట యంతయు నాతనికే! విరోధివర్గము హేళనచేయును. ఆతని యుద్దండస్వభావమును విమర్శింతురు. ఈబాధ నాతడొక్కడే యనుభవింపవలెను. అతనికి మిత్రులు లేరు - ఓదార్చువారు లేరు. విఠల్‌దాసు తనపై కోపించిన మిత్రులను మరల కూడ గట్టుకొనివచ్చునని యాశించినాడు. కాని విఠల్‌దాసుసైతము తననే యపరాధిగ భావించినాడు - 'నీవీసవరణ నంగీకరించి సమస్తమును నాశన మొనరించితివి. కొన్నిసంవత్సరములనుండి

పడినశ్రమయంతయు బూడిదలోపోసిన పన్నీరైనది.' ఒక్క-అనిరుద్ధుడు మాత్రమే పద్మసింహుని వ్యథితహృదయము నాశ్వాసించువాడు ! అతనిపై సానుభూతి జూపువాడు !

ఒక నెలదినములవఱకు పద్మసింహుడు కోర్టుకు వెళ్ళ లేదు. ఏకాంతమున గూర్చుండి యీ విషయమునే యాలోచించును. అతని భావములకొకవిధమైె నిష్పాక్షికత్వ మబ్బినది. మిత్రుల వైమనస్యమువలననైన దుఃఖమును తలచుకొని-'చదువుకొనినవారు, ఆలోచనాపరులునైనవారే యీ విధమున నిశ్చితమైన సిద్ధాంతమునుండి చ్యుతులై వ్యతిరేకముగ వ్యవహరించుచో నిఁక దేశమునకు ముక్తియే లేదనుకొనును. నేను సవరణను బలపఱచి తప్పే చేసియుండవచ్చును. కాని నా యీపొరపాటు వారినెందులకు మార్గచ్యుతుల నొనరింపవలెే?' ననుకొనును.

# 35

సదనుడు సుమన్‌నుచూచి తిరిగివెళ్ళినంతనే యాతని స్థితి చిరకాలార్జితమైన ధనమును దొంగలవలన కోల్పోయిన వానివలెనున్నది.

ఆమె నాతో నేలమాటాడలేదు? నావైపు చూడనైనను లేదేమి? నన్నింత నీచునిగ భావించుచున్నదా? కాదు-ఆమె తన పూర్వప్రవర్తనకు సిగ్గుపడుచున్నది. నన్ను మఱచుటకు యత్నించుచున్నది. ఆమెకు నా వివాహవిషయము తెలిసి

యుండవచ్చును. నన్ను న్యాయవిహీనునిగ, నిర్దయునిగ భావించియుండవచ్చును !-అని యనుకొనినాడు. చాలదినముల పిమ్మట నామెను కలిసికొనవలెనను ప్రబలమైన ఉత్కంఠ జనించినది. మఱునాడు విధవాశ్రమమునకు సమీపముననున్న రేవువైపు కేఁగినాడు.

అతడచటికి జేరిన కొలఁదిసేపటికే ఆ వైపునకు వచ్చుచున్న సుమన్ కనిపించినది. ఆమె వెనుక మఱియొక సుందరి యున్నది. ఆమెముఖము మేలిముసుగుచే కప్పబడియుండెను.

సదనుని జూచినంతనే సుమన్ ఆగిపోయినది. చాల రోజులనుండి యామె సదనుని కలిసికొనవలెననుకొనుచున్నది. ఆమె మొదట సదనునితో మాటాడగూడదని నిశ్చయించుకొని యున్నను, శాంత నుద్ధరించుట కింతకంటె గత్యంతరము కన్పట్టలేదు. ఆమె సిగ్గుతో—'సదన్ ! అదృష్టవశాత్తు నేఁడు నీదర్శనమైనది. ఇటువచ్చుటయే మానివేసితివి! క్షేమమా?' అనినది.

సదనుడు:— సిగ్గుతో 'క్షేమమే!' అనినాడు.

సుమన్:- చిక్కిపోయినట్లున్నావు! ఏమైన సుస్తీ చేసినదా?

సద:- లేదు. హాయిగానున్నాను! నాకుగూడ చావు వచ్చునా?

సుమన్:- తప్పు! అవేమిమాటలు? నావలననే యిది యంతయు జరుగుచున్నది గాబట్టి నేను చనిపోవలెననుకొన

వచ్చును! ఈ రామలీలకు కైకేయిని నేను! నీతో నేను చాల విషయములు మాటాడవలెను. క్షమింపుము! ఇకనుండి నిన్ను సోదరాయని సంబోధింతును! ఇకనుండి నేను నీకు సోదరివంటి దానను — వదినను. కాబట్టి నీకు కష్టము కలిగించు మాట లేవైన నానోటినుండి వెలువడినను మనసులో కోపముంచుకొన వద్దు. నాస్థితిని నీవెఱుఁగుదువుగదా! మీ పినతండ్రిగారు నన్నుద్ధరించినారు. నేనిప్పుడనాథశరణాలయములోనుండి నా యదృష్టమునకు వగచుచున్నాను. ఎల్లప్పుడు నిట్లే యేడ్చు చుందును. ఒక నెలదినములైనది; దురదృష్టవంతురాలైన నా చెల్లెలుగూడ నిచటికే వచ్చినది. ఉమానాథుని యింటివద్ద నుండజాలకపోయినది. భగవానుడు మీపినతండ్రి చిరంజీవి యగునట్లనుగ్రహించుగాక! పాపమాయనయే అమోలా వెళ్ళి యీమెనిచటకి గొనివచ్చినారు. కాని ఇచటికి గొనివచ్చిన పిమ్మట మఱల నీమెవిషయము పట్టించుకొనలేదు. అన్నగారు దొంగతనము చేసినప్పుడు తమ్ముని బంధించుట యేమిన్యాయమో నీవే చెప్పుము! నీకు తెలియని విషయములు లేవు. నా దురదృష్టముకొలఁది, చెడురోజులువచ్చి, పూర్వజన్మ పాపఫలముగ ధర్మమార్గమును వదలితిని. దానికి తగిన శిక్షలభించినది. కాని, యీమెను మీరు త్యజించుట కీనిర్భాగ్యురా లేమియపరాధ మొనర్చినది? దీనికి సమాధానము నీవొసంగవలెను! ఇదిగో! చూడుము! పెద్దలపై బెట్టి తప్పుకొనజూడకుసుమా! అది పిరికిపందలపని. ఇదియన్యాయమగునో కాదో హృదయపూర్వకముగ చెప్పుము. ఒక

యబలయైన బాలికజీవితమును నాశనమొనర్చుచుండ నావంత యైనను దయకలుగలేదా?'

శాంత యచటికి రానిచో సదనుడు తన మనోభావములను వ్యక్తమొనరించుటకు సాహసించియుండెడివాడేమో! తన యన్యాయము నంగీకరించియుండెడివాడేమో! కాని, శాంతయెదుట తనయపరాధము నంగీకరించుటకు, తన పరాజయము నొప్పుకొనుటకు సిద్ధపడలేకపోయినాడు. దీనితో బాటు తనవంశమర్యాదల శరణుజొచ్చుటకును సంకోచము గనేయున్నది. శాంతమనసుకు దుఃఖము కలిగించుమాటగాని, వారికి అనవసరమైన ఆశను కలిగించుమాటగాని యన జాలడు. ఆతని పరిభ్రమించుచున్నదృష్టి శాంతపై పడుటతో నాతనిస్థితి మఱింతవిషమించినది. ఆసమయమున నాతని స్థితి, బంధువు గొనివచ్చిన మిఠాయివైపు ఆశతో జూచుచు, తల్లి కోపించుననుభయముతో సంకోచించుచున్న బాలుని వలెనున్నది — 'మీరు ముందే నా నోరునొక్కివేసినారు! ఇంక చేసినదంతయు పెద్దలే చేసినారని యెట్లుచెప్పగలను? దోషమంతయు వారినెత్తిపెరుద్ది నేను తప్పించుకొననెంచుట లేదు. ఆసమయమున లోకాపవాదమునకు నేను భయపడితిని. ప్రపంచములో నివసించుచు ప్రపంచపు పోకడనే యనుసరింపవలెనని మీరును అంగీకరింతురు. నే నీయన్యాయము నంగీకరించుచున్నాను. కాని యీయన్యాయ మొనర్చినది మేము కాదు — మనము నివసించుచున్న సమాజము!'

సుమన్:— సోదరా! నీవు చదువుకొనినవాడవు! మాటలలో నిన్ను నేను జయింపజాలను! నీకుచితమని తోచిన విధమున చేయుము. ఒకమనిషి చేసినను, జాతియంతయుగలిసి చేసినను అన్యాయ మన్యాయమేగదా! ఇతరులకు భయపడి యెవరికిని అన్యాయము చేయరాదు. శాంత యిచటనే యున్నదిగాబట్టి దానియెదుట దానిరహస్యములను బయట పెట్టరాదు. కాని, యొకవిషయము మాత్రము గుర్తించు కొనుము - మఱియొకచోట నీకు ధనము, గౌరవము, రూపము, గుణము నన్నియు లభింపవచ్చును; గాని ప్రేమమాత్రము లభింపదు. దీనిదికూడ నీవంటి హృదయమే యైయున్నచో నేడు క్రొత్తయత్తవారింట హాయిగ కులుకుచుండెడిది. కాని, నీపైనున్న ప్రేమయే యీామె నిచటికి లాగికొనివచ్చినది. నీవీమెనెట్లు చూచినను, జీవితాంతమువఱకు నీకై నీనామమే స్మరించుచు జీవించును.'

శాంత కనులనుండి యశ్రువులుజారి పాదములపై పడుచుండుటను సదనుడు గమనించినాడు. ఆతని సరళ ప్రేమతృషితహృదయము దుఃఖముతో నిండిపోయినది. కరుణ స్వరముతో – 'ఏమిచేయవలెనో తోచకున్నది. దుఃఖముతో నాహృదయము బ్రద్దలగుచున్నది! ఈశ్వరుడే యిందులకు సాక్షి!' యనినాడు.

సుమన్:— నీవు పురుషుడవు! పరమాత్ముడు నీకన్ని శక్తులను ప్రసాదించినాడు.

సద:— మీారెట్లు చెప్పిన నట్లుచేయుదును.

సుమన్:— అట్లని మాటయిత్తువా?

సద:— నా హృదయస్థితి భగవంతునికే యెఱుక! నోటితో నేమనిచెప్పుదును?

సుమన్:— 'పురుషులమాటపై నమ్మకము కుదురుట లేదు.' అని చిరునవ్వు నవ్వినది.

సదనుడు సిగ్గుతో- 'నాచేతనైనచో నాహృదయమును చీల్చి చూపించియుండెడివాడను.' అని, క్రీగంటితో శాంత వైపు జూచినాడు.

సుమన్:— సరే! ఈగంగానది యొడ్డున శాంత చేతిని పట్టుకొని — 'నీవు నాభార్యవు! నేను నీభర్తను! నేను నిన్ను భరింతును!'అని ప్రతిజ్ఞ చేయుము.

సదనుని కాత్మబలము చాలలేదు. దిక్కులు చూడ సాగినాడు — తన మొగము దాచుకొనుటకు తగిన ప్రదేశ మును వెదకుచున్నట్లు! తనాచ్ఛాదించుటకై గంగానది ముందునకు సాగివచ్చుచున్నదనిపించినది. అతడు మునిగి పోవుచున్నవానివలె నాకసమువైపు జూచినాడు — సిగ్గుతో కనులువంచి యాగియాగి యనినాడు — 'సుమన్! ఆలో చించుకొనుటకు గొంత వ్యవధినిమ్ము!' సుమన్ వినమ్ర స్వరముతో — 'అట్లే యాలోచించి నిశ్చయించుకొనుము. నీకు ధర్మసంకటము గల్గించుట నాయభిమతముకాదు.' అని, మఱల శాంతతో — 'ఇదుగో! నీభర్త యెదురుగనున్నాడు. నాచేతనైనదియు, నేచెప్పవలసినదియుచెప్పితిని. కాని, యాతని మనసు కఱుగలేదు. ఇక నీతడు శాశ్వతముగ చేయిజారి

పోవుచున్నాడు. నీప్రేమయే నిజమైనచో, నీప్రేమ శక్తివంత మైనదైనచో నీవీతని నాపుకొనుము. ఆతనివలన ప్రేమదాన మును పొందుము!' అనినది.

ఈమాటలని సుమన్ గంగానదివైపుకు బయలుదేరినది. శాంతగూడ మెల్లగా నామె వెనుకనే బయలుదేరినది. అభి మానముక్రింద నామెప్రేమ యణగిపోయినది. తా నెవనికొఱకై జీవితాంతము దుఃఖముల ననుభవించుటకు సిద్ధపడినదో, భర్త యని భావించి యెవని చరణములపై నాత్మార్పణము గావించి నదో, ప్రస్తుత మాతనిపై నలిగినది, బిఱ్ఱబిగిసినది. అతడామె స్థితిని గుర్తింపజాలకపోయినాడు. ఆమె కష్టములను గ్రహింప లేకపోయినాడు. ఆమె పరాధీనస్థితిని గమనింపలేకపోయినాడు. ఇప్పుడామె యాతనియెదుట చేతులుజోడించి నిలువబడుచో నామెయభీష్టము తప్పకసిద్ధించెడిది. కాని, యామె వినయము కంటె, యభిమానమునే యుచితమని భావించినది.

సదను డొకక్షణమచటనిలబడి పిమ్మట పశ్చాత్తప్తు డగుచు నింటికి బయలుదేరినాడు.

తానేదో మహాపాప మాచరించినట్లాతని కాత్మగ్లాని కలుగజొచ్చినది. మాటిమాటికిని తాననినమాటలను గుర్తుకు దెచ్చుకొని, దయావిహీనుడనని నిర్ధరించుకొనును. ప్రేమాభి లాష యాతని నున్మత్తునొనరించినది.

నా కీప్రపంచమనిన నింతభయమేల? ఈప్రపంచము నాకేమొసంగుచున్నదని? అసత్యమైన లోకాపవాదమునకు

భయపడి యీరత్నమును జాఱవిడుచుటయేనా ? — ఎన్ని పూర్వజన్మములందొనర్చిన యెంతటి తపస్సునకు ఫలితమో యీరత్నము! నా ధర్మమును నేను పాలించుకొనుచుండ నా బంధువులు నన్నుత్యజించినచో నిందు నష్టమేమున్నది? లోకాపవాధభయమున నధర్మ మొనరింపజాలను! ఆమె నీవిధముగ ప్రవాహమధ్యమున మునిగిపోనీయను! ప్రపంచ మేమనుకొనిననుసరే! నే నామె కన్యాయ మొనరింపజాలను!

తల్లిదండ్రులయాజ్ఞను మన్నించుట నా ధర్మమని యంగీకరింతును. కాని, ఆమెను క్షమించుటయే నా ధర్మమై యుండ, తల్లిదండ్రుల దురాగ్రహమున కామెను తిరస్కరింప జాలను. తల్లిదండ్రులు నన్నసహ్యించుకొందురు. నన్ను వారు త్యజించుటయు సంభవమే! నన్ను చనిపోయినవానిక్రింద జమకట్టుదురు. కాని కొలఁదికాలమిట్లు దుఃఖించి, నన్ను మఱచి పోదురు. కాలమే వారిదుఃఖమును కప్పివేయును.

అయ్యో ! నేనెంతటి కఠినుడను ! నా హృదయ మెంతటి పాషాణమైపోయినది! మహారాజ్ఞి కావలసిన యీయామె నాయెదుట నిలువబడి, నాదయనర్థించినపుడు నే నేమాత్రమును కరుణింపలేదు. అహో మందబుద్ధీ! నామాటల కామె కోమల హృదయ మెంతబాధపడినదో! ఈవిషయ మామెయభి మానమువలననే వ్యక్తమగుచున్నది. నన్నామె విరసునిగ, ప్రేమవిహీనునిగ, ధూర్తునిగ తలచియే నావైపు కన్నెత్తి చూడనైననులేదు. నిజమునకు నేనంతటివాడనే !

వెళ్ళి, నేనంటించిన అగ్నిని చల్లార్పివత్తునని బయలు దేరును. కాని బయలుదేరుసమయమునకు సాహసము చల్ల బడును —— 'ఇల్లెచటనున్నదో ! ఇప్పుడేమొగము పెట్టుకొని పోగలను?'

ఈ చిక్కునెట్లు విడదీయుటయాయని యాతడెల్లప్పుడు నాలోచించుచుండును. పట్టణమంతయు గాలించినాడు. ఆఫీసులవైపు కేగును. మఱొకసారి ఫ్యాక్టరీలవైపు కేగును. రెండుమూడుగంటలిట్లే తిరిగి తిరిగి యింటికిజేరును. ఈ విధముగ నొకనెలరోజులు తిరిగినాడు. కాని యెచటను నుద్యోగము లభింపలేదు.

ఈవిధముగ నిరాశతో, విచారముతో తిరుగుచు నొకనాడు గంగానదియొడ్డున కేతెంచినాడు. అచట ననేక నావలున్నవి. నదిలో చిన్నచిన్న నావలిటునటు తిరుగుచున్నవి. కొన్నినావలనుండి సుమధురగానము విననచ్చుచున్నది. కొన్నినావలపైనుండి బస్తాలను దింపుచున్నారు. సదనుడొక పడవపై కేగి కూర్చుండెను. శాంతిప్రదాత్రియైన సంధ్యారాగము, గంగాతీరమందలి కావ్యమయదృశ్యము నాతని మనసు నాకర్షించినవి. ఆహా! ఇది యెంతటి యానందమయమైన జీవితము ! ఈశ్వరుడు నాకుగూడ నొక కుటీరమిచ్చియున్నచో దానిలోనుండి సంతుష్టుడనై కాలము బుచ్చెడివాడనే! నే నీనదీతీరమునవిహరించుచు నానందముతో పాటలు పాడెడివాడను; ఆమె కుటీరద్వారమున నిలువబడి నాకై ప్రతీక్షించుచుండెడిది. అప్పుడప్పుడిరువురము నావపై

నెక్కి గంగానదిపై విహరించెడివారము! ఆతని రసికభావములు సుందరమైన చిత్రము చిత్రించినవి. ఆయానందమయమైన స్వప్నములో తల్లీనుడై పోయినాడు. ఆతని మనసువ్యాకుల పడినది. అచటి ప్రతివస్తువును సుఖశాంతి సంతోషములనే వ్యక్తమొనరించుచున్నది. అతడచటినుండి లేచి యొక పల్లె వానిని— 'ఏమయ్యా! ఇచట నొకపడవ యేదైననమ్మకమున కున్నదా?'యని ప్రశ్నించినాడు.

పల్లెవాడు కూర్చుండి చుట్టకాల్చుచున్నాడు. సదనుని గాంచినంతనే లేచి యనేకములైన నావలను చూపినాడు. అతనికొక క్రొత్తనావ నచ్చినది. బేరము ప్రారంభమైనది. చాలమంది పల్లెవారచట గుమిగూడిరి. చివరకు 300 రూపాయ లకు బేరము కుదిరినది ఆ నావను అమ్మినవాడే దానిని నడుపు టకుగూడ నిర్ణయమైపోయినది.

సదనుడింటికి పోవునప్పుడాతనికి తన జీవితమున మరెట్టి కోరికయు లేనట్లు ఆనందపరవశుడైనాడు. మహాసంగ్రామమున జయించినంత సంతోషముకలిగినది. రాత్రియంతయు నాతనికి నిదురపట్టలేదు. తెల్లవారినంతనే డబ్బెచటినుండి లభించునను చింతపట్టినది-ఎవరి నడుగుదును? ఎవరిత్తురు? ఏమని యడుగు దును? పినతండ్రితో జెప్పుదునా? వలదు! ప్రస్తుత మాయన వద్ద డబ్బులేదు. నాన్నగారి నడిగి తెచ్చుటయన నిసుకనుండి నూనె పిండుటయే! ఏమిచేయుదును? ఇప్పుడచటికి పోకున్నచో నాపల్లెవాడేమనుకొనును? డాబాపై నెక్కి యాతడిటునటు పచారులుచేయ మొదలిడినాడు.

అకస్మాత్తుగనాతనికొక యుపాయముతోచినది. శత్రువును భూమిపై పడవేసి హేళనగానవ్విన ట్లొకసారి పకపకనవ్వినాడు. నే నెంతటి మూర్ఖుడను! నాపెట్టెలో బంగారుగొలుసుండనే యున్నది. 300 వందలకంటె నెక్కువయేచేయును. దానినమ్మి వేయుదును. నన్నడిగినప్పుడు చూచుకొనవచ్చును. నన్నెవ రడుగుదురు? అడిగినచో నున్నదున్నట్లు చెప్పివేయుదును — అమ్ముకొనితినివేసితినని. వారికి చేతనైనది చేసికొందురు. అప్పటికి చేతికి నాలుగు డబ్బులేవచ్చుచో విసరి వారిమొగాన కొట్టుదును. అతడు లోనికేగి పెట్టెలోనుండి గొలుసు తీసినాడు. కాని దీనినమ్ముట యెట్లను ఆలోచనపుట్టినది. బజారులో నొకవస్తువును గొనిపోయి యమ్ముటయనిన తన గౌరవము నమ్ముకొనుటకంటె తక్కువ యవమానము కాదు. ఇట్లాలోచించుచుండగా నౌకరు — జీతన్ ఊడ్చుటకు వచ్చినాడు. సదనుడు దుఃఖముగా నుండుటనుగాంచి — 'బాబయ్యా! అట్లున్నారేమి? కనులు లోనికిబోయినవి. రాత్రి నిద్రపోలేదా?'యని యడిగినాడు.

'నిద్రపట్టలేదు. ఒక విచారముపట్టినది.'

'విచారమేమిటిబాబూ? నేను వినవచ్చునా?'

శీలవంతుడైన నిర్ధనుని నోటినుండి వెలువడునట్లు, ఎంతోసిగ్గుతో నాతని నోటినుండి — 'ఏమియులేదు.' అను శబ్దములు వెలువడినవి. పిమ్మట 'నావద్ద నొక బంగారుగొలు సున్నది. దానినమ్మిపెట్టుము. నాకు డబ్బుఅవసరమైనది!' అనినాడు.

జీతన్:— దానికేమిబాబూ! అదేమంత ఘనకార్యము? దీనికింత విచారమేల? అమ్మగారి నడుగరాదా? ఆమె యెన్న డును లేదనదే! అయ్యగారుమాత్ర మీయరు. ఈ యింటిలో నాయనవలన లాభములేదు. అమ్మగారే యీయవలె!

సదనుడు:— ఇంటిలో నెవరినడుగుటయు నాకిష్టము లేదు.

జీతన్ గొలుసుతీసికొని చూచినాడు. చేతితోనే తూచినాడు. సాయంకాలము లోగా అమ్మి తీసికొనివత్తునని చెప్పి వెడలిపోయెను.

పదిగంటలకే జీతన్ 325 రూపాయలు తెచ్చి సదనుని చేతియందుంచినాడు. సదనుని కెచటనో పడియున్న డబ్బు దొరికినట్లున్నది.

సాయంకాలమునకు సదనుని నావ ఆకాశములో మేఘమువలె గంగానదిపై తేలుచున్నది. పరీక్షలో నుత్తీర్ణు డైన పిమ్మట భవిష్యద్విషయమై చింతించు విద్యార్థివలె సదనుని మోమున నానందమునకు బదులు భావిశంకలనేక ములు తోచుచున్నవి. ఆతనిని కాపాడుచు వచ్చిన ప్రపంచ మనునదిపైనున్న యానకట్ట తెగిపోయినట్లును, తానొక యగాధసాగరమున నున్నట్లును తోచినది. నేను నావను మాత్రము నదిలోవైచితిని; కాని, అది యొడ్డుకు జేరునా? నది యగాధముగనున్నదని, వాయువు ప్రచండముగ నున్నదని, జీవనయాత్ర తాననుకొనినంత తేలికకాదని, యాతని కిప్పుడు తోచినది. అలలు మధురస్వరముతో పాడినట్లే, భీషణ

స్వరముతో గర్జించును గూడను! గాలి యలలను జోకొట్టి నట్లే, వాటిని పై కెత్తునుగూడను!

# 36

మునసిపల్ కౌన్సిల్‌లో తీర్మాన మామోదింపబడి మూడు నెలలైనది. ఆ తీర్మానపు సవరణవిషయమై తేగ్ ఆలీ ప్రకటించిన యనుమానములు నిరాధారములని తేలిపోయినది. దాల్ మండీ కొట్లలో దుకాణములు పెట్టబడలేదు; వేశ్యలు వివాహబంధనమున కంగీకరింపనూలేదు. కాని చాల కొట్లు మాత్రము ఖాళీయైనవి. ఆకొట్లయందలి వేశ్యలు త్వరలో నిర్వాసనము తప్పదని ముందే మఱియొకచోట నుండుట కేర్పాట్లు చేసికొనిరి.

పద్మసింహు డీతీర్మానమును వేశ్యలపైనున్న అసహ్యముచే ప్రేరితుడై ప్రవేశపెట్టెను. కాని, యీ విషయమై యాలోచించినకొలఁదియు నాతని యసహ్యము దయగా మారినది. ఈ భావమే యాతడు సవరణ నంగీకరించుటకు గారణమైనది. పాపము! ఈవేశ్యలు తమ యింద్రియతృప్తికై తమ సర్వస్వమును నాశన మొనరించుకొనుచున్నారు. భోగవిలాసములు వారిని గ్రుడ్డివారినొనర్చినవి. ఈ స్థితియందున్నవారిపై దయజూపవలసినదే!

మన మనసులోని భావములే కర్మకు మార్గదర్శకములగును. పద్మసింహుడు సంకోచమునువీడి కర్మక్షేత్రమున

నడుగిడినాడు. సుమన్ యెదుట నిలబడుటకు సంకోచించిన పద్మసింహుడే నేడు మధ్యాహ్నము పండ్రెండుగంటలకు సైతము దాల్ మండీలో కన్పట్టుచున్నాడు. అతనికి లోకాపవాదభయములేదు. ప్రజలేమైన ననుకొందురను సంకోచమును లేదు. అతని యాత్మకు విశేషమైన బలమబ్బినది. అతని హృదయమున నిజమైన సేవాభావముదయించినది. పచ్చికాయ తాతితో గొట్టినసురాలదు — కాని పండినపిమ్మట తనంతతానే రాలిపోవును. అతనిహృదయమున సేవాభావము పరిపక్వమైనది.

ఈవిషయమున విఠల్ దాసాతనికి దూరమైపోయినాడు. అతని కీజన్మలో వేశ్యల సంస్కరణ విషయమైన నమ్మకము లేదు. ఈయుద్యమమునకు జన్మదాతయైన శఫకత్ అలీగూడ తప్పించుకొని తిరుగుచున్నాడు. అనిరుద్ధుని కాతని సంగీత, సాహిత్య గోష్ఠులతో తీరికయే లేకుండెను. బైరాగియైన గజాధరు డొక్కడే యీవిషయమున పద్మసింహునికి సాయమొనర్చుచున్ననాడు. ఆసదుద్యోగియైన పద్మసింహుని యందు నిష్కామ సేవాభావముజాగృతమైనది.

## 37

ఒకనెల గడచిపోయినది. సదనుడు తన నూత్నవృత్తిని గూర్చి యింటిలో నెవరితోడను చెప్పలేదు. ప్రతిదినము నుదయమే లేచి గంగాస్నానమునకని చెప్పి వెడలును. పది

గంటల కింటికివచ్చును. భోజనమొనర్చి మజిల బయలు దేరును. రాత్రి యెనిమిదిగంటల కింటికి జేరును.

ఈ మధ్యలో మునిసిపాలిటీవారు పట్టణమునకు దూర ముగ వేశ్యలకై గృహములు కట్టించుటకు నిశ్చయించిరి. లాలాభగత్ రాంకు కంట్రాక్టు లభించినది. నదికి యీవలి యొడ్డున నాతనికి సున్నపుగానుగలకు, యిటుకఆవలమునకు దగిన చోటు లభింపలేదు. అందుచే నాతడు నదికావలనున్న ప్రదేశ మును తీసికొని యచటనే తనపని సాగించినాడు. ఆ యొడ్డు నుండి యిటుకలు, సున్నము, మున్నగువానిని జేరవేయుట కాతనికొకనావ యవసరమైనది. నావను మాటాడుట కాతడు పల్లెవారివద్ద కేతెంచినపుడు సదనునితో మాటాడినాడు. సదనుడు తన నావను చూపినాడు. అతనికది నచ్చినది. రేటు నిర్ణయమైనది. రోజుకు రెండుపర్యాయములు తిరుగునట్లు నిర్ణ యించుకొని భగత్ రాం బజానా యిచ్చినాడు.

డబ్బురుచి మిక్కిలి చెడ్డది. సదనుడు వెనుకటి సదనుడు కాడు. ఇప్పుడాతనిపై దుఃఖభారమున్నది; కర్తవ్యఋణ మున్నది. ఈ ఋణమునుండి ముక్తుడను కావలెనని యాతని కోరిక. అతడు దమ్మిడీనుండి లెక్కగట్టుచున్నాడు. డబ్బు సంపాదించి యిల్లు కట్టవలెనని యాతని పట్టుదల. ఆనాడాతడు గడియప్రొద్దుండగనేలేచి పల్లెవానినిలేపి నావ లంగ రెత్తించినాడు. సూర్యోదయమగునప్పటి కావలియొడ్డునకు జేరిరి. తిరిగి వచ్చునప్పుడాతడు స్వయముగ నొక తెడ్డు వేసెను. నవ్వుచు నొకటిరెండు తెడ్లు వేసినంతనే నావ వేగము

హెచ్చినది. అది చూచినంతనే యాతని యుత్సాహమినుమ డించినది. గబగబ తెడ్డు త్రిప్పినాడు. నావ వేగము రెట్టింపైనది. మొదటపల్లెవాడు నవ్వినాడు. కాని పిమ్మట ఆశ్చర్యపడినాడు. ఇతడు కేవలము పప్పుసుద్దకాడని గ్రహించినాడు. అవసరమైనచో నొక్కడే నావను నడుపగలడు. ఇంక మనము బిఱ్ఱబిగియుట మంచిదికాదనుకొనినాడు.

ఈ విధముగ రెండునెలలు పనిచేసినాడు. మంచి లాభము చేకూఱినది. మఱి యిరువురు పల్లెవాండ్రను నియమించినాడు.

సదనుడిప్పుడు పల్లెవాండ్రకు నాయకుడు. అతని కుటీరము తయారైనది. లోపలనొక సరంబి, రెండుమంచములు, లాంతరు; కూర్చుండుట కొకగది, వంటకొకగది, పరుండుట కింకొకగది. వాకిలిముందు అరుగు. దానికిటునటు తోట్లలో లతలు. అవి పెఱిగి యింటిపై కెక్కి యల్లుకొనినవి. ఆయరుగే పల్లెవాండ్రకు విశ్రాంతిస్థానము. అచట గూర్చుండియే చుట్టలు కాల్చుకొనుచుందురు. ఆఫీసర్లకుత్తరములు పత్రములు వ్రాసిపెట్టుచు పల్లెవాండ్రకు వెట్టిచాకిరి తప్పించి యుపకారమొనర్చినాడు. ఈ సాహసమాతనికి మంచి పలుకుబడిని సంపాదించిపెట్టినది. అతనివద్ద నిప్పుడు కొంతడబ్బుచేరినది. ఆడబ్బును పల్లెవాండ్రకు వడ్డీలేకుండ అప్పులిచ్చును. అతనికిప్పుడొక సైకిలు కొనవలెననియున్నది. అంతేకాదు - విలాసపురుషులు షికారుచేయుట కుపకరించు చిన్నబోటు కొనవలెనని

సంకల్పము! హార్మోనియంకు ఆర్డరిచ్చియేవేసినాడు. ఈ సన్నాహములన్నియు నాతనికి క్షణమైనను మఱపునకురాని యాదేవి కొఱకు !

సదనుడిప్పుడు సంసారభారమును భరించు స్థితిలో నున్నాడు. కాని, తన పినతండ్రితో జెప్పకుండ, ఆయన యనుమతిలేకుండ శాంతను తీసికొనిరాజాలడు. భోజనమునకు కూర్చుండినప్పు డీవిషయమును పినతండ్రితో జెప్పి నిర్ణయించుకొనవలెననుకొనును. కాని యాతని కోరిక నెఱవేఱుటలేదు. ఆతని నోటినుండి మాటయే పెగలివచ్చుటలేదు.

పద్మసంహునితో నాత డీవ్యాపారవిషయమును ప్రస్తావింపకున్నను, భగత్‌రాంద్వారా యాతని కీవిషయములన్నియు దెలిసినవి. అతడు సదనుని యుద్యోగశీలమునకు చాలసంతసించినాడు. మఱియొకటి రెండు నావలనుకొని వ్యాపారమును పెంచవచ్చును. కాని సదనుడు తానై చెప్పలేదు గాన తానును మాటాడకుండుటయే మంచిదనుకొనినాడు. మొదటినుండియు నాతనికి సదనుడనిన లక్ష్యమున్నది. ఇప్పు డాదరముగూడ పెఱిగినది. సుభద్రయాతనిని కన్నకుమారునివలెనే జూచుకొనుచున్నది.

ఒకనాటిరాత్రి సదనుడు తన కుటీరమున గూర్చుండి నదివైపు జూచుచున్నాడు. నేడేలకో నావవచ్చుట యాలస్యమైనది. ఎదుట దీపమువెలుగుచున్నది. ఆతని చేతియందొక వార్తాపత్రిక యున్నది. కాని, యాతని మనసు పత్రిక చదు

వుటలో లగ్నమగుటలేదు. పడవరానందువలన నాతని మన సేదియో యనిష్టము నాశంకించుచున్నది. అతడు పత్రిక నచటనుంచి యొడ్డునకు వచ్చినాడు. ఇసుకపై వెన్నెల బంగారు దుప్పటి పఱచినట్లున్నది. కదలుచున్న నదీజలముపై చంద్ర కిరణములు క్రమముగ విశాలమై ముందుకుసాగిపోవు సెలయేటి ప్రవాహమువలెనున్నవి. కుటీరమునకు ముందున్న అరుగుపై గొందరు పల్లెవాండ్రు మాట్లాడుకొనుచున్నారు. ఇంతలో నిరువురుస్త్రీలు పట్టణమువైపునుండివచ్చుట నాతడు చూచి నాడు. వారిలో నొకతె నావికులను — 'మేమావలి యొడ్డు నకు పోలెవను. నావపై దీసికొనిపోదురా?' అని యడిగినది.

సదను డామాటలను గుర్తించినాడు. ఆమె సుమన్ బాయి! ఆతనిహృదయమున చక్కలిగింతలు బయలుదేరినవి. కనులందొకవిధమైన మత్తు వ్యాపించినది. ఒక్కగంతులో నరుగువద్ద కేతెంచినాడు — 'సుమన్ ! ఇదేమిటి ? ఇచటికి వచ్చినావేమి?'అని యడిగినాడు.

సుమన్ తదేకధ్యానముతో సదనునివైపు జూచినది— ఆతనిని గుర్తింపనట్లు. ఆమె వెంటనున్నస్త్రీ మేలిముసుగు తప్పించి దీపకాంతినుండి ప్రక్కకుతొలగి చీకటిలోని కేగినది. సుమన్ ఆశ్చర్యముతో—'ఎవరు? సదనసింహుడా?'అనినది.

పల్లెవాండ్రు లేచి చుట్టును మూగినారు. కాని సదనుడు వారినందఱిని వెడలిపొమ్మనినాడు. వీరు మావాళ్ళే ! ఈ రాత్రి కిచటనేయుందురు. పిమ్మట సుమన్‌ను– 'వదినగారూ! సమాచారము లేమి? క్షేమమా?' అని యడిగినాడు.

సుమన్:- క్షేమమే! నాయదృష్టమున వ్రాసియున్న దనుభవించుచున్నాను. నేటి పత్రిక నీవు చూడలేదేమో! ప్రభాకరరావేమిచేసినాడో యేమో తెలియదు. ఆశ్రమ మంతట గోలబయలుదేరినది. మేమిరువురము నొక్కక్షణమచట నుండినను ఆశ్రమము ఖాళీయైపోయెడిది. అచటినుండి వచ్చి వేయుటయే మంచిదైనది. మాపైదయదలచి ఆవలియొడ్డునకు జేర్చుము. అచటినుండి బండి మాటాడుకొని ముగల్‌సారాయి జేరుదుము. అచటినుండి అమోలా జేరుట కేదోబండి దొరకును. ఇచటినుండి రాత్రికేదైన బండియున్నదా?

సదనుడు :— ఇప్పుడిక మీరు యింటికే జేరినారు. అమోలా వెళ్లుట దేనికి? మీకిన్నినాళ్ళును కష్టముకలిగియుండ వచ్చును. కాని నేను మీరిచటికే తెంచుటవలన నాకు గలిగిన యానందమును వర్ణింపజాలను. నేనే చాలదినములనుండి మీ వద్దకు రావలెనని యనుకొనుచున్నాను. కాని, పనులవలన తీరిక లభించుటలేదు. నేను మూడు నాలుగు నెలలనుండి నావికా వృత్తి నవలంబించినాను. ఇది మీ కుటీరమే! లోనికిపదండి.'

సుమన్ లోనికేఁగినది. కాని శాంతమాత్ర మచటనే చీకటిలో నిశ్శబ్దముగ నిలువబడి యేడ్చుచున్నది.

సుమన్ లోనికేఁగినంతనే సదనుడు మెల్లగా శాంత వద్దకువచ్చి కంపితస్వరముతో—'శాంతా!'యని పిలిచినాడు.

ఈమాటయనుచుండగా నాతని కంఠము సగద్గదమై యాగిపోయినది. శాంత ప్రేమగద్గదయైపోయినది. ఆమె ప్రేమ సంకుచిత స్వార్థమునకు తావులేని నిష్కామస్థితికి జేరినది.

ఆమె తనలోననుకొనినది - ఈ జీవితముపై నమ్మక మేమున్నది. బ్రతికియుందునో లేదో తెలియదు. ఇతని దర్శనము మఱల లభించునో లభింపదో తెలియదు. ఈతని చరణములపై శిరమునుంచి యీతని పాదముల నశ్రువులతో నభిషేకించుకోరిక తీర్చుకొనకుండు టెందులకు?'

ఈవిధముగననుకొని యామె సదనుని చరణములపై వ్రాలి యేడువసాగినది; కాని వాడిపోయినపువ్వు గాలి తగిలి నంతనే చెదరిపోయినది. సదను డామెను లేవనెత్తి గ్రుచ్చి కవుగలించుకొననెంచినాడు; కాని యామెస్థితిని గాంచినంతనే యాతనిహృదయము వికలమైపోయినది. అతడామెను మొదటి సారిగ నదీతీరమున జూచినపు డామె నూతన సౌందర్యపూర్ణ మైన అర్ధవికసితపుష్పమువలె కన్పట్టినది. నేడామె వసంత మున రాలినపండుటాకువలెనున్నది.

సదనుని మనసు నదిలో మెఱయుచున్న చంద్రకిరణ ములవలె కంపింపసాగినది. అతడు కంపించుచున్న చేతులతో నాసంజ్ఞాశూన్యమైన శరీరమును లేవనెత్తినాడు.

శాంతను కౌగలించుకొని కుటీరములోనికి గొనివచ్చి నాడు. పక్కపై బరుండబెట్టి, శోకాతురుడై — 'సుమన్! ఈమెను చూచుచుండుము. నేను డాక్టరుకొఱకు వెళ్ళివత్తును.' అనినాడు.

సుమన్ దగ్గఱకువచ్చి సోదరిని చూచినది. నుదుట చెమటబిందువులున్నవి. కనులు తేలవేసినది. నాడి యందుట

లేదు. ముఖము వివర్ణమైపోయినది. వెంటనే యామె విసరు కట్టె తీసికొని విసరుచు-'చల్లని నీరు తెమ్మి!' అనినది.

సదనుడు నీటిచెంబును సుమన్‌కు అందిచ్చి తాను విసరదొడగినాడు. సుమన్ శాంతమోమున నీరు చిలకరించి నది. అప్పటికిని శాంతకనులు తెరవకుండుటనుగాంచి సద నుడు—'డాక్టరుకొఱకు పోయివత్తునా?' అని యడిగినాడు.

సుమన్ :- వలదు! భయపడకుము! కొంచెము చల్ల గాలి తగిలినంతనే స్పృహవచ్చును. ఈరోగమునకు మందు డాక్టర్ల వలనకాదు.

ఇంతలో శాంత ప్రక్కకుతిరిగి మంచినీరడిగినది. సుమన్ మంచినీటిగ్లాసు నామె నోటికందిచ్చినది. ఆమె రెండుమూడు గుటకలువేసి మఱల మంచముపై వ్రాలినది.

సుమన్:- ఇక నిద్రపోవుచున్నది. నిద్రపోనిమ్ము. ఒక నిద్ర పట్టినచో నామెమనసు కుదటబడును. రాత్రి ప్రొద్దు బోయినది. నీవిక యింటికిపొమ్ము! మీ పినతండ్రి నీకై యెదురు చూచుచుందును.

సద:— నేటికి వెళ్ళను.

సుమన్:— కాదు, కాదు! వారు నీకై భయపడు దురు. శాంతకిక పరవాలేదు. ఎంత హాయిగ నిద్రించుచున్నదో చూడుము! ఇనాళ్ళకామె యిట్లు నిద్రించుట నేడే చూచితిని.

సదను డంగీకరింపలేదు. వసారాలోనికివచ్చి యచటనే పండుకొని యాలోచింపసాగినాడు.

# 38

విఠల్‌దాసు న్యాయప్రియుడు, సరళస్వభావుడు! న్యాయమాతని నెటులాగిన నటు పోవుచుండువాడు. అట్లేగుట కాతడేమాత్రమును సంకోచింపడు. పద్మసింహుడు న్యాయ మార్గచ్యుతు డగుటను కనిపెట్టినంతనే యాతని సాంగత్య మును వదలివేసినాడు. కొన్ని నెలలవఱ కాతనియింటికి పోలేదు. కాని, ప్రభాకరరావు ఆశ్రమముపై నిందలువేసి, సుమన్‌పై కొన్ని గుప్తమైన రహస్యములను బయటపెట్టినంతనే విఠల్ దాసుకుగూడ కోపమువచ్చినది. ఇప్పుడాతనికి పట్టణమున మిత్రుడనువాడు లేడు. ఇట్టి యితరుల సానుభూతి, సహాయ ములపై నాధారపడియున్న సంస్థ కధ్యక్షుడనై యున్నవాడ నేదోయొకపక్షము నవలంబించుట యనుచితమని తోచినది. అందఱికిని దూరముగానుండియు, వారందఱితో కలిసి మెలిసి యుండుటయే మంచిదనిపించినది. ఇదియే తన కుత్తమమైన మార్గమనిపించినది.

సాయంసమయము. ప్రభాకరరావు చేసిన ఆక్షేపణల కేమని సమాధాన మొసంగవలెనో యాలోచించుచున్నాడు. అతని యాక్షేపణలు కొన్ని సత్యములే! సుమన్ నిజముగ వేశ్యయే! ఆసంగతి తెలిసియే తానామెను ఆశ్రమమునకు గొనివచ్చినాడు. తాను కార్యవర్గముతో నీవిషయము చర్చింప లేదు. ఈవిషయమున నొకతీర్మానమును ప్రవేశపెట్టలేదు. నిజముగ తా నాశ్రమమును తన స్వంత సంస్థవలె భావించి

నాడు. నా యుద్దేశ్య మెంత ప్రశంసనీయమైనదైనను, దానిని రహస్యముగ నుంచుట అనుచితమేగదా!

ఇంకను విఠల్‌దా సొకనిశ్చయమునకురాలేదు. ఆశ్రమ మందలి యుపాధ్యాయిని వచ్చి నేనెంతవారించినను ఆనంది, రాజకుమారి, గౌరి తమయిండ్లకు వెడలిపోవ నున్నారని తెలిపినది. విఠల్‌దాసు కోపముతో —— 'పోనిమ్ము! వారికి భయపడను. వారికొఱకై సుమన్ శాంతలను వదలిపెట్ట జాలను!' అనినాడు.

ఉపాధ్యాయిని వెడలిపోయినది. ఇంతలో పోష్టుబంట్రోతు ఉత్తరములు తెచ్చినాడు. విఠల్‌దాసుపేర అయిదు ఉత్తరము లున్నవి. ఒక యుత్తరమున నిట్లున్నది —— 'నా కొమార్తెను (విద్యావతిని) ఆశ్రమములోనుంచుట నాకిష్టములేదు. ఆమెను తీసికొనిపోవుటకు వత్తును.'

'వేశ్యలను ఆశ్రమమునుండి వెడలగొట్టనిచో చందా యిచ్చుట మానివేసెద'నని మఱియొక మహాశయుడు డబా యించినాడు. మూడవ యుత్తరమునందును నిట్లేయున్నది. మిగిలిన రెండుత్తరములను విఠల్‌దాసు తెఱచిచూడనేలేదు. ఆత డీడబాయింపులకు భయపడకపోగా తనపట్టుదలపై మఱింత దృఢముగ నుండుటకు నిశ్చయించుకొనినాడు.

తన కారణముననే యీగోల బయలుదేరినదని యను కొనినది సుమన్. తానిచటికేతెంచుటయే తప్పైనది. ఇచటి స్త్రీల కామె యెంతో సేవచేసినది. దానికిది ఫలితము!

విఠల్‌దాసు తన్నిచటినుండి పోనీయడని యామె యెఱుంగును. అందుచే తానే ముందుగ వెడలిపోవుట మరచిదనుకొనినది. ముగ్గురు విధవలిచటినుండి వెడలిపోయిరి. మఱి యిరువురు ప్రయాణ సన్నాహములో నున్నారు. మిగిలినవారనేకులు తమ యిండ్లకు ఉత్తరములు వ్రాసినారు. ఎచటను గతిలేని వారు మాత్రమే నోరుమూసికొని కూర్చుండియుండిరి. కాని, వారుగూడ సుమన్‌ను తప్పుకొనియే తిరుగుచుండిరి. సుమన్ కిది యవమానముగదోచెను. ఆమె యీ యవమానమును సహింపలేకపోయినది. శాంతతో సంప్రదించినది. శాంతకేమి చేయుటకును తోచలేదు. పద్మసింహుని యనుజ్ఞ తీసికొనకుండ తా నీయాశ్రమమునుండి వెడలిపోవుట యనుచితమని భావించినది. కాని, సుమన్ అంగీకరింపక నీవుండదలచినచో నుండుము. నేనుమాత్ర మిచటనుండనని స్పష్టముగ చెప్పివేసినది. అందుచే శాంత కచటనుండుట యసంభవముగ తోచెను. అడవిలో త్రోవదప్పి తిరుగుచున్నవాడింకొకనిని జూచి, కేవలము తోడులభించినదిగదాయని 'వాని ననుసరించినట్లు శాంతయు సుమన్‌ను అనుసరించినది.

వారిరువురును చాలసేపు మాటాడుకొనిరి. ఇరువురును నేడ్చిరి. ఎనిమిది గంటలకు విఠల్‌దాసు భోజనమున కేగినంతనే వారిరువురు నెవరికిని కన్పింపకుండ బయలుదేరిరి.

రాత్రియంతయు నీవిషయ మెవరికిని తెలియలేదు. తెల్లవారినంతనే కాపలావా డీసమాచారమును విఠల్‌దాసు కెఱింగించినాడు. అతడు పరుగుపరుగున నాశ్రమమునకు

వచ్చి చూచినాడు. వస్తువులన్నియు నట్లేయున్నవి. కాని వారిరువురుమాత్రము లేరు. పాపమాత డెంతయో దుఃఖించెను. అకస్మాత్తుగ నాతనికి సుమన్ మంచముపై నొకయుత్తరము కన్పించెను. ఆతురతతో నాత డాయుత్తరమునుగొని చదివెను. సుమన్ వెడలిపోవునప్పుడు వ్రాసినయుత్తరమది. ఆ యుత్తరము చదివినపిమ్మట నాతనికి గొంతధైర్యముకలిగినది. కాని, సుమన్ చేసిన పనివలన తాను పరాజయము నంగీకరింపవలసి వచ్చెనుగదాయని దుఃఖించెను. తన్ను డబాయించి భయ పెట్టినవారి నవమానపరుపలెనని యాతని సంకల్పము. అట్టి మంచితరుణము చేజారిపోయినది. 'నేను భయపడితిననియే యందరు ననుకొందు'రని యాతని దిగులు.

ఆగదిలోనుండి బయటికేతెంచి, తలుపు బంధించి, తిన్నగ పద్మసింహుని యింటికి బయలుదేరినాడు.

పద్మసింహు డీవిషయమువిని ఆశ్చర్యభయకంపితు డైనాడు-'ఇప్పుడేమి కావలె?'

విఠల్:- వారు 'అమోలా' చేరియుందురు.

పద్మ:- కావచ్చును!

విఠల్:- ఒక టెలిగ్రామిచ్చి కనుగొనుడు!

పద్మ:- ఏ మొగముపెట్టుకొని యడుగుదును? శాంతను రక్షింపజాలని నేను, ఆమె విషయమై నోరెత్తియడుగుట లజ్జాజనకమైన విషయము. నాకు మీపై పూర్ణవిశ్వాసమున్నది.

మీరిట్లుపేక్షింతురని తెలిసియున్నచో నాయింటివద్దనే యుంచెడివాడను.

విఠల్ :- మీరీబాధ్యతయంతయు నాయొక్కనిపైననే వేయజూచుచున్నట్లున్నది.

పద్మ:- మఱియెవరిపై వేయుదును? ఆశ్రమ సంరక్షకులు మీరేగదా!

విఠల్ :- శాంత యిచటికేతెంచి మూడునెలలు గడచిపోయినవి. పొఱపాటుననైనను మీరాశ్రమమువైపుకు వచ్చినారా? మీరామెవిషయమే పట్టించుకొననప్పు డామె యేధైర్యముతో నిచట పడియుండగలదు? నాబాధ్యతను నేనంగీకరించుచున్నాను. కాని యీయపరాధమున మీకును కొంతభాగమున్నది.

ప్రస్తుతము కొలఁది దినములనుండి పద్మసింహునికి విఠల్ దాసుపై గోపముగనున్నది. ఆతని బలవంతముపైననే తానీ వేశ్యాసంస్కరణోద్యమమున నడుగిడినాడు. కాని, సరిగ పని చేయవలసిన తరుణము వచ్చినంతనే యాతడు తప్పుకొనినాడు. పద్మసింహు డాతని ముఖమునాయునట్లు చీవాట్లుపెట్టవలెనను కొనెను. కాని యీసమాధానమునువిని యూఱకుండవలసి వచ్చినది.- 'సరే! ఆమాత్రపుదోషము నాదియునున్నది.' అనినాడు.

పద్మసింహుడు తనదోషమును స్వీకరించి పందెమును త్రిప్పివేసినాడు. మనము కొంతవఱకు వంగి యితరులను వంపగలము. కాని, మనము బిఱ్ఱబిగిసి యితరులను వంపజాలము.

విఠల్ :— బహుశః సదనసింహునికి తెలిసియుండ వచ్చును. ఆతనిని పిలువుడు !

పద్మ:- వాడు రాత్రినుండియు కనపడుటలేదు. వాడు గంగానదియొద్దున నొక కుటీరమును నిర్మించినాడు. కొందరు పల్లెవాండ్రను నియమించినాడు. ఒక పడవను నడుపుచున్నాడు. రాత్రి వాడచటనే యుండియుండును.

విఠల్:- అప్పసెల్లెం డ్రిరువురు నచటికే జేరియుండ వచ్చును. వెళ్ళి చూచిరమ్మందురా?

పద్మ :- మీరు భ్రమపడుచున్నారు. వాడంతటి 'లిబరల్' కాడు. వారి నీడయే సోకరాదన్నట్లు తప్పుకొని తిరుగుచుండును.

అకస్మాత్తుగ సదను డాగదిలోనికి ప్రవేశించినాడు. పద్మసింహుడు ప్రశ్నించినాడు—'రాత్రి యెచటనుంటివి? రాత్రియంతయు నీకై యెదురు చూచితిమి.'

సదనసింహుడు భూమిపై చూపులను నిగిడ్చి-'నాకే సిగ్గగుచున్నది. రాత్రి తప్పనిసరియై యాగిపోవలసివచ్చినది. వచ్చి చెప్పివెళ్ళుటకైనను తీరికలేకపోయినది. సిగ్గువలననే నిన్నిదినములనుండి మీతో జెప్పలేదు. కొన్నినెలలనుండి ఒక పడవ నడుపుచున్నాను. ఆనదియొద్దునే యొకకుటీరము నిర్మించితిని. ఈ వ్యాపారమునే పట్టుదలతో సాగింపవలెనని నా యుద్దేశ్యము. అందుచే నాగుడిసెలోనుండుట కనుజ్ఞ వేడుచున్నాను.' అనెను.

పద్మ:- నీవు పెట్టినషరతు మంచిదికాదు. పట్టణములో నివసించుచు నీవు వేఱుగానుండుట నాకిష్టములేదు. ఇచట నుండుటవలన నీకు కొంత నష్టము కలిగిననుసరే, నీవు వేఱుగా నుండుటనుమాత్ర మంగీకరింపను.

సదన్:- కాదు, బాబాయీ! నేను తప్పనిసరియై గత్యంతరములేక మిమ్మీవిధముగ ప్రార్థించినాను. నాప్రార్థ నను మన్నింపవలెను.

పద్మ:- అంత తప్పనిసరియైన పనియేమిటి? నీమనసులో నున్న సంకోచమును స్పష్టముగ చెప్పుము.

సదన్:- నేను మీయింటిలోనున్నచో మీకప్రతిష్ఠ కలుగును. నేను నాకర్తవ్యమును పాలింపవలెనని నిశ్చయించు కొంటిని. కొన్నిదినములనుండి నాయజ్ఞానమువలన, పిఱికి తనమువలన నాకర్తవ్యమును త్రోసివేసి తిరుగుచుంటిని. నేను మీకుమారుడను. నాకు కష్టముతోచినప్పుడు మిమ్మాశ్రయింతును. ఏదైననవసరము వచ్చినచో మీతోవచ్చిచెప్పుచుందును. కాని వేఱుగామాత్ర ముందును. నా యీమాటను మీరు త్రోసిపుచ్చరని నమ్మకము.

విఠల్‌దాసు ఆతనిమాటలలోని నిగూఢభావమును గ్రహించినాడు.- 'నిన్న సుమన్, శాంతలను కలిసికొంటివా?' యని యడిగినాడు.

సదనునిమోము లజ్జారుణమైనది - సుందరిమోముపై నున్నమేలి ముసుగు తొలగినట్లు!- 'చిత్రము' అని మెల్లగా ననినాడు.

పద్మసింహుడు ధర్మసంకటమున జిక్కుకొనినాడు- అవుననలేడు కాదనలేడు. కొంతసేవటివఱకట్లే యాలోచించెను. చివఱ కనినాడు- 'సదన్! ఇయ్యది కఠినమైన సమస్య. అన్నయ్యను సంప్రదించువఱకు నేనేమియు జెప్పజాలను. నా సిద్ధాంతములను నీవెఱుంగుదువు. ఈశ్వరుడు నీకు సద్బుద్ధి నొసంగినందులకు, నీ వొనర్చిన పనికి ప్రశంసించుచున్నాను. కాని నేనుమాత్రము అన్నగారి యాజ్ఞయే అన్నిటికిని చివఱిదని భావించుచున్నాను. కాని, వారి కెట్టికష్టమును కలుగకుండునట్లు వేఱుగ నివసించుట కేర్పాటు చేయవచ్చును. అంతవఱకే! అంతకంటె నేనేమియు చేయజాలను. అన్నగారి యిష్టప్రకారమే జరుగవలెను.

సదనుడు:—— ఆయన యెట్టి సమాధాన మొసంగుదురో మీ రెఱుంగరా?

పద్మ:—— అవును! ఎఱుంగుదును.

సదనుడు:—— కావున, వారినడుగుట వ్యర్థము! తల్లిదండ్రులయాజ్ఞకై వారిచ్చిన యీ శరీరము నర్పింపగలను; కాని యొకనిరాపరాధిని జీవితమును నాశనమొనర్పజాలను.

పద్మ:—— అప్పుసెల్లెండ్ర నిరువురను వేఱొక ప్రత్యేక గృహమున నుంచుటలో నీకభ్యంతరమేమున్నది?

సదనుడు కొంచెము రోషముతో ననినాడు — 'నేను తప్పుచేయవలసివచ్చినప్పు డట్లుచేయుదును. నేనొనర్చునది పాపముకాదు - దాచుటకు, భయపడుటకు! ఇయ్యది నాజీవిత మందలి ముఖ్యకర్తవ్యముగాన దాచవలసిన యగత్యములేదు. నేటివఱకును పూర్తికాని వివాహసంస్కారము రేపు గంగా తీరమున పూర్తియగును. మీరు రచటికి విచ్చేయుచో నా యదృష్టమని భావింతును. లేనిచో భగవానుని యెదుట, సాక్ష్యులులేకుండగనే జరిగిపోవును.'

ఈమాటలని సదనుడు లేచి యింటిలోని కేగినాడు. సుభద్ర — 'కంటికి కనుపింపకుండ మాయమైపోవుచున్నావే! రాత్రియంతయు నీదేధ్యానము! ఎచటికేగితివి?'

సదనుడు రాత్రిజరిగిన వృత్తాంతమంతయు జెప్పినాడు. పినతల్లితో మాటాడునప్పుడాతనికి పినతండ్రియెదుటవలెసంకోచ ముండదు. సుభద్ర యాతని సాహసమును ప్రశంసించినది- 'తల్లిదండ్రులు కోపింతురని తాను చేసికొనిన భార్యనెవరు వదలిపెట్టుచున్నారు? ప్రపంచము నవ్విన నవ్వనిమ్ము! ప్రపంచము నవ్వునని మనయింలోనివారి ప్రాణములు తీయుదుమా? మీయమ్మనుజూచి భయపడుచున్నానేగాని లేనిచో నిచటనే యుంచెడిదానను.'

# 39

సదనసింహుని వివాహసంస్కారము పూర్తియైనది. ఆకుటీరము చక్కగా నలంకరింపబడినది. అదే వివాహమంట పముగా నుపయోగించినది. ఎక్కువమందెవరును రాలేదు.

పద్మసింహు డానాడే యింటి కేఁగి మదనసింహునితో సమాచారమంతయు జెప్పినాడు. ఈ విషయము వినినంతనే మదనసింహుడు మండిపడినాడు — 'ఆ దుర్మార్గుని తల బ్రద్దలుకొట్టుదును; ఏమనుకొనుచున్నాడో!' భామ — 'నే నీనాడే వెళ్ళి వానికి నచ్చజెప్పి వెంటగొనివత్తును. పిచ్చివెధవ! ఏమియు తెలియదు. వాడు ఆభోగముముండ సుమన్ మాటలకు లోబడిపోయినాడు. నామాట వా డెన్నడునుకాదనడు.'

కాని మదనసింహుడు భార్యను కేకలువేసినాడు — 'నీవచటికి వెళ్ళుదుననుమాట నోటరానీయవద్దు! జాగ్రత్త! ఆమాట మఱొకసారి యన్నచో మనయిరువురితలలు నిచట తెగిపోవలవలసినదే! వాడేమంత పాలుత్రాగు పిల్లవాడుకాడు. ఇది వాని మూర్ఖపుపట్టుదల. ఆవెధవకు చిప్పచేతికీయకున్నచో నన్ననుము! బాబుచనిపోయినపిమ్మట హాయిగ కాలక్షేపము చేయవచ్చుననుకొనినాడు కాబోలును! ఇది వాని పూర్వార్జిత మైన ఆస్తికాదు. ఇదియంతయు నా సంపాదన! ఈయాస్తి నంతను కృష్ణార్పణ మొనరింతును. చిల్లిగవ్వకూడ దక్క నీయను.

ఈవార్త గ్రామము నలుమూలల వ్యాపించినది. విమర్శలు ప్రారంభమైనవి. లాలాబైజ్‌నాథునికి ప్రపంచమునుండి ధర్మము లుప్తమైపోయినట్లనిపించినది. ప్రజలిట్టి నీచాతినీచము లైన కర్మల కొడిగట్టినప్పుడింకను ధర్మమెట్లుండును? ప్రభుత్వమేలేనిచో నీముండమోపి వ్యవహారము తేలిపోయెడిది. ఈ గ్రామములోని కింక నడుగెట్లు పెట్టునో చూతును!

పద్మసింహుడు రాత్రి చాల ప్రొద్దుపోవువఱకును అన్న గారివద్ద కూర్చుండియుండెను. సదనుని విషయమెత్తినంతనే యన్నగారు కోపముతో నాగ్నేయదృష్టిని ప్రసరించును. అంతటితో నాతనికి నోరెత్తుటకు ధైర్యము చాలుటలేదు.

మఱునాఁడుదయమే పద్మసింహుడు ప్రయాణమైనంతనే భామ కంటతడివెట్టుచుననినది — 'అబ్బాయీ! వీరి పట్టుదల చూచుచుము! పిల్లవాని ప్రాణములు తీయుటకే సిద్ధపడు చున్నారు. నీవైనను ముందువెనుక లాలోచించి యీ విష యమున జాగ్రత్త వహింపుము. పొరపాట్లు పెద్దలే చేయు చుందురు. ఇక ముక్కుమొగమెఱుఁగని పిల్లవాఁడొక లెక్కయా? నీవుమాత్రము వానిని మఱచిపోవద్దుసుమా! వాఁడెవరి కోప మును సహింపజాలడు. ఎచటికైనను దేశమువదలిలేచిపోవు నేమో! వానివిషయము కనుగొనుచుండుము. తిండితిప్పలకు బాధపడకుండ చూడుము. ఇచట నున్నచో రెండుపూటలు చిక్కనిపాలు త్రాగెడివాఁడు. ఆయనకు కనిపింపకుండ నేతి ముద్దలువేసెడిదానను. ఇప్పుడు వానివిషయ మెవరు కను గొందురు? పాపము! పిచ్చినెధవ! యెట్లున్నాఁడో యేమో! ఇచట తినువారులేరు — అచట వాడికి కడుపునిండ భోజన మైనను లభించుచున్నదో లేదో! బాబూ! వాడు తానే స్వయముగ పడవత్రోయుచున్నాఁడా?

పద్మ:— లేదు; ఇరువురు పల్లెవాండ్రను నియమించి నాము.

భామ:— అయినప్పటికిని రాత్రిం బవళ్ళు త్రిప్పట తప్పదుగదా! కూలివాళ్ళు సరిగ పనిచేయుదురా? ఇక నే చేయగలిగిన దేమియులేదు. వానిని నీకొప్పగించుచున్నాను. ఆ దిక్కు లేనివాని విషయము కనుగొనుచుండుము. నాయందలి ప్రత్యేకముగను నిన్నాశీర్వదించును. ఈసారి కార్తీకస్నానములకు వచ్చినప్పుడు వానిని తప్పక చూచివత్తును. మీయమ్మ నీకొఱకు యేడ్చుచున్నదని చెప్పుము. వాని దసలే పిఱికిగుండె. నన్ను తలచుకొని నిత్యము నేడ్చుచుండును. ఇదిగో! నావద్ద కొద్దిగ డబ్బున్నది. తీసికొని వెళ్ళి వానికిమ్ము.

పద్మ:— డబ్బు దేనికి? నేనచటనుండ నేయుంటినిగదా! నేను కనిపెట్టియుండగా వానికెట్టి కష్టమును కలుగదు.

భామ:— కాదునాయనా! తీసికొనిపొమ్ము! ఇంతలో పోయినదేమి? ఈ దుత్తలో కొంచెము నేయియున్నది. దానిని గూడ తీసికొనిపోయి వానికి పంపుము. బజారునేయి యింటి నేతితో సమానమగునా? డబ్బు పోవుటయేగాని రుచి యుండదు, వాసనయుండదు. వానికి ఆవకాయ యెంతో యిష్టము. కొంచెము పెట్టియిత్తును. నాయనా, దిగులు పెట్టు కొనవద్దని చెప్పుము. మీయమ్మ జీవించియున్నంతవఱకు నీకెట్టిలోటును లేదని చెప్పుము. మంచివాడైనను, చెడ్డవాడై నను నాకున్న ఆధారమేవాడు! ప్రపంచమునకు వెలిచి దూర ముగ నుంచినను మనసునకు మాత్రము దూరుడుకాడు.

# 40

సుందరమైన భావమువలన కవితకు ప్రాణమబ్బునట్లు, చక్కని రంగులతో చిత్రమునకు ప్రాణప్రతిష్ఠ జరుగునట్లు అప్పసెల్లెం ద్దిరువురి యాగమనమువలనను కుటీరమునకు ప్రాణము వచ్చినది. గ్రుడ్డికండ్లకు కనుపాపలు వచ్చినట్లైనది.

వాడిన మొగ్గవలెనుండిన శాంత సంపూర్ణముగ విక సించి యనుపమశోభతో ప్రకాశించుచున్నది. ఎండిపోయిన నది పొంగినది. జ్యేష్ఠ వైశాఖముల యెండలకెండిపోయిన ఆవు శ్రావణమున నోడలుచేసి సంతోషముతో చేలలో తిరుగు చున్నట్లు విరహతప్తయైన శాంత కోలుకొనినది — ప్రేమలో నిమగ్నమైయున్నది.

శాంత పాడుచుండును. సుమన్ వంటచేయును. శాంత తలదువ్వుకొని జడవేసికొనును. సుమన్ గుడ్డలుతుకుచుండును. శాంత ఆకలిగొన్నవానివలె కంచముపై కలియబడును. సుమన్ రోగివలె నయమగునా లేదాయని విచారించుచున్నట్లుండును.

సదనుని స్వభావముగూడ పూర్తిగ మారిపోయినది. ప్రేమానందము ననుభవించుటలో నాతడు తన్మయుడై యున్నాడు. ఇప్పుడాతడు ప్రొద్దెక్కినపిమ్మట లేచును. స్నాన మునకే గంటసేపుపట్టును. తలదువ్వును. వస్త్రములు మార్చి సెంట్లుపూయును. తొమ్మిది గంటలు కొట్టిననేగాని బయటి వసారాలోనికి రాడు. వచ్చినను నచట కొంచెముసేపైనను కాలు నిలువదు. మరల లోనికేగుచుండును. బయటనెవరితో

నైనను మాటామటయం దించుక యాలస్యమైనచో విసిగి కొనును. శాంత యాతనిపై వశీకరణము ప్రయోగించిన దేమో!

సుమన్ యింటిలోని పనియేగాక బయటిపనిగూడ చూచుచుండును. ఆమె గడియ ప్రొద్దుండగనే మేల్కాంచును. స్నానపూజాదికములు నిర్వర్తించుకొని సదనునికై పలహారము తయారుచేయును. పిమ్మట రేవుకేఁగి నావను బయలుదేర తీయించును. తొమ్మిది గంటలకు వంట ప్రారంభించును. పండ్రెండుగంటలకా పని పూర్తిచేసికొని యేదోయొక పనిలో నిమగ్నయగును. రాత్రి తొమ్మిదిగంటలకు అందఱు నిద్రించినపిమ్మట నామె చదువుట ప్రారంభించును. తులసీ రామాయణమనిన నామె కెక్కువప్రేమ. ఒక్కొక్కప్పుడు భక్తమాల చదువును. మఱొకప్పుడు వివేకానందుని యుపన్యాసములను చదువుచుండును. మీరాబాయి కీర్తనలపై నామెకు మక్కువ యెక్కువ. తఱచు ధార్మిక గ్రంథములనే చదువుచుండును. జ్ఞానమునందుకంటె ఆమెకు భక్తియందే యెక్కువ శాంతి లభించుచుండును.

పల్లెపడుచులందామెకు విశేషాదరము లభించినది. వారి తగవులు తీర్చుచుండును. ఒకరి పిల్లవానికి చొక్కాటోపీలు అల్లియిచ్చును. మఱియొకరి పిల్లకు కాటుక చేసి యిచ్చును. ఎవరికైనను జబ్బుచేసినచో వారి యింటికేఁగి మందుమాకులు చూచుచుండును. ఆమె తన పడిపోయిన గోడను మఱల నిలబెట్టుకొనుచున్నది. అచటి స్త్రీలందఱు

నామెను ప్రశంసించుచుండురు. ఆమెకు తన యింటిలోననే యాదరములేదు. ఎముకలు విఱచుకొని చాకిరిచేసినను సదనుని నోటివెంట కృతజ్ఞతాసూచకమైన శబ్ద మొక్కటియు వెలువడదు. శాంత దృష్టియందుసైత మామె శ్రమకు విలువయే లేదు. ఇంటి దాసియనియు, గానుగెద్దువలె పనిచేయుటయే యామె ధర్మమనునట్లును వారిరువురికి నామెవిషయమే పట్టదు. ఒక్కొక్కప్పు డామెకు తలనొప్పివచ్చును. ఎండలో తిరుగుట వలన జ్వరము తగులుచుండును. అప్పుడైనను నామె యథాప్రకార మింటిపని చేయుచునేయుండును. ఒక్కొక్కప్పు డామె యేకాంతమున తన దయనీయస్థితిని తలచుకొని గంటలకొలది యేడ్చుచుండును. కాని యామె నోదార్చువారెవరు? ఆమె కన్నీరు తుడుచువారెవరు?

కాని శాంతాసదనుల యీ యౌదాసీన్యమునకు గారణము వారి ప్రేమలిప్సయే యనుట సందేహాస్పదమే! కుష్ఠురోగిపై దయదలచియు మనము వానిని సమీపింపక దూరమునకు తొలగిపోవునట్లు సదను డామె కెల్లప్పుడును దూరముగనేయుండును. శాంత కామెపై నమ్మకములేదు. ఆమె రూపలావణ్యములనిన శాంతకు భయమే! సదనుడు సుమన్ కంటబడకుండ తప్పించుకొనుటయే మంచిదైనది. లేనిచో శాంత యామెపై మండిపడెడిది. కావున నిరువురును నీ సర్పము కనులబడకుండనుండుటయే మంచిదనుకొనిరి. కాని, సంకోచవశమున వారెన్నడును తమలోతా మీవిషయమును ప్రస్తావించుకొనలేదు.

సుమన్ విషయమైన ఈ రహస్యము క్రమక్రమముగ బయటపడుచున్నది.

ఒకపర్యాయము జీతన్ (నౌకరు) పద్మసింహుని యింటి వద్దనుండి యేవో వస్తువులను గొనివచ్చినాడు. అంతకుబూర్వ మాత డనేకపర్యాయములు వచ్చినాడు. కాని, సుమన్ ఆత నిని గాంచినంతనే దాగుకొనెడిది. ఈపర్యాయము వాని దృష్టి సుమన్‌పై బడినది. ఇంకేమున్నది? వానికడుపులో మంట బయలుదేరినది. వాడు అాఖ్యతినిధియైనను 'జీర్ణ మొనరించు కొనగలడుగాని మాటనుమాత్రము జీర్ణ మొనరించుకొనలేడు. పల్లెపెద్దవద్దకు చుట్టకాల్చు నెపమునవెళ్ళి యీకథయంతయు జెప్పినాడు. పల్లెవాండ్రలోగూడ గుసగుసలు, ఎత్తిపొడుపులు ప్రారంభమైనవి. ఆనాటినుండి పల్లెవాండ్రెవరును సదను నింట మంచినీటినిసైతము ముట్టుట మానివేసిరి. పల్లెపడుచులు సుమన్‌వద్దకే తెంచుట మానివేసిరి. ఇట్లే యొకపర్యాయము లాలాభగత్‌రాం యిటుకల్రపోగులను లెక్కించుటకువచ్చెను. దాహమైనంతనే పల్లెవానినొకనిని మంచినీటిని తెమ్మనెను. వాడు నూతిలోనుండి తోడితెచ్చెను. తన యింటిలోగూర్చుండి నూతిలోని నీటిని తెప్పించుకొని త్రాగుట సదనునికి చాల కష్టము కలిగించెను.

చివఱకు మఱుసంవత్సరము గడచిపోవుచున్నదనగా పరిస్థితి మఱింత విషమించినది. సదనుడు ప్రతి చిన్న విషయ మునకు సుమన్‌పై కోపగించుచుండును. సందర్భమున్నను

లేకపోయినను ప్రతిమాటయందును నాతని మనోభావము వ్యక్తమగుచునేయుండెను.

ఇఁక నీ యింటిలోనుండుట చాల కష్టమని సుమన్‌కు అనిపించుచుండెను. చెల్లెలు మఱదులతో బాటే తన జీవితమును నెట్లో గడచిపోవునని భావించినది. వారికి చాకిరి చేయుచు, రెండు ముద్దలుతిని, యేదోయొకమూల పడియుందు ననుకొనినది.ఇంతకంటె నామెజీవితమున వేఱొక యభిలాషయే లేదు. కాని పాపమామెచరణముల క్రిందనున్న యీ చెక్క సైతము తొలగిపోయి, యామె పూర్తిగ నలలలో కలిసి పోయినది.

సుమన్ పరిస్థితి యెంతశోచనీయముగనున్నను, శాంతా సదనులకుమాత్ర మెట్టిలోటును కలుగనీయుటలేదు. ధార్మిక ప్రేమ, తన వాస్తవిక పరిస్థితిని గూర్చిన పరిజ్ఞానము కలిసి యామెను మిక్కిలి వినీతనొనరించినవి. తన్నెఱిగినవా రెవరును లేని ప్రదేశమున కెచటికి వెళ్ళుదునాయని యామె యాలోచించును. కాని, యామె కెచటను స్థానమున్నట్లు తోచుట లేదు. నేటివఱకు నిర్బలమైన యామె యాత్మ యేదోయొక యవలంబనమును కోరినది. ఆధారములేకుండ ప్రపంచములో నుండవలెనన్నచో నామె హృదయము కంపించుచుండెడిది. ఆమె యొంటరిగ ప్రపంచసంగ్రామ క్షేత్రమున నడుగిడ జాలదు.

ఒకనాడు సదను డెచ్చటనో తిరిగి తిరిగి పదిగంటలకు వచ్చి కేకవేసినాడు - 'భోజనమున కింకను నెంత యాలస్య

మున్నది? త్వరగా చేయుము. నే నుమానాథుని కలుసుకొను టకు వెళ్ళవలెను. మా బాబాయిగారింటికి వచ్చినాడట!'

శాంతయడిగినది — 'ఆయన ఇచటి కెట్లువచ్చినాడు?'

సదన్:— నే నేమెఱుగుదును? ఆయన వచ్చినాడని, నేడే తిరిగివెళ్ళిపోదురని జీతన్‌వచ్చి యిప్పుడే చెప్పినాడు. ఇచటికి రావలెననుకొనినాడట, కాని... (సుమన్ వైపు సంజ్ఞ చేసి) ఏదో కారణమున రాలేదట.

శాంత:— ఇంకను చాల ఆలస్యమున్నది. కొంచెము సేపు కూర్చుండుము!

సుమన్ విసుగుతో:- ఆలస్యమేమున్నది? వంట పూర్తియైనది. పీటవేసి మంచినీళ్ళు పెట్టుము. నేను వడ్డింతును.

శాంత:— కొంచెమాలస్యమైన నింతలో పోయిన దేమున్నది ? రైలు తప్పిపోవునా ? ఉడికియు నుడుకని తిండి తినుటయేల?

సదన్:— రోజంతయు నేమిచేయుచుందురో నాకర్థమగుటలేదు. ఈమాత్రము వంటచేయుట కింతయాలస్యమా?

సదనుడు భోజనమొనర్చి వెడలిపోయిన పిమ్మట సుమన్ శాంతనడిగినది — 'శాంతా! నిజము చెప్పుము! నీకు నేనిచట నుండుట యిష్టమేనా? నీమనసులోనున్నవిషయము నేనెఱుగుదును. కాని నీనోటితోనన్ను విదిలించి బయటకు తఱుము వఱకు నేనిచటినుండి కదలను. నాకింకెచటను ఆశ్రయము లేదు.

శాంత:— అక్కయ్యా! అవేమిమాటలు? నీవుండ బట్టియే సంసారమెట్లో గడచిపోవుచున్నది. లేనిచో నావలన నగునా?

సుమన్:— ముఖప్రీతిమాటలు మాటాడవద్దు! నేనంత తెలియనిదానను కాను. మీ యిరువురికిని నేననిన నిష్టము లేదన్నట్లు భావించుచున్నాను.

శాంత:— అక్కయ్యా! కాదు; నీవు నాకొనర్చిన యుపకారమును నేను మఱునజాలను, కాని అసలువిషయ మేమన — వారికి అప్రతిష్ఠగానున్నది. లోకులిష్టమువచ్చి నట్లు మాట్లాడుచున్నారు. సుభద్రయిచటికి రావలెననుకొన్న దట! కాని నీవిచటనుంటివని తెలిసి రాలేదని వారనినారు. అక్కయ్యా! కోపమువద్దు! ప్రపంచపు పోకడయే యట్లున్నప్పుడు మనమేమిచేయగలము?

సుమన్ మాఱుమాటాడలేదు. ఆమె కాజ్ఞ లభించినది. కాని, యొక్కటే యభ్యంతరమున్నది — శాంత కొలఁది దినములలో తల్లి కానున్నది. ఈ స్థితిలో నీమెను వదలి వెళ్ళి నచో చెల్లెలు బాధపడునని తలఁచినది. ఎట్లో తన మనసును సమాధానపఱచుకొనినది — ఇన్ని దినములు గడపితినిగదా! అట్లే యీ రెండు నెలలును గడపివేయుదును. నాకారణముగ వారు బాధపడుచున్నారు. ఇట్టి స్థితిలో నేను వెడలిపోవుటయే ధర్మము.

సుమన్ కిప్పుడీయింటిలో క్షణ మొకయుగముగనున్నది. కాని యట్లే సహించుచు పడియున్నది.

ఱెక్కలులేని పక్షి పంజరములో నుండుటయే మంచి దనుకొనును.

# 41

పద్మసింహుని నాలుగైదునెలల సత్ప్రయత్నమునకు ఫలితముగా 20-25 మంది వేశ్యలు తమ పుత్రికలను అనాథ శరణాలయమునకు బంపుట కంగీకరించిరి. ముగ్గురు వేశ్యలు తమ యాస్తినంతయు ననాథశరణాలయమునకు దానమిచ్చిరి. అయిదుగురు వేశ్యలు పెండ్లి జేసికొనుట కంగీకరించిరి. సద్బుద్ధి-సత్యాకాంక్ష లెన్నడును నిష్ఫలములుకావు. అతడు సమాజ హితాకాంక్షియని, సంఘోద్ధరణమునే కాంక్షించువాడని, నిస్వార్థియని, సచ్చేవకుడని, నమ్మకము కలిగినంతనే సంఘ మంతయు నాతనినే యనుసరించును. కాని ప్రజలలో నీ విశ్వాసము నిజమైన సేవాభావమువలననే కలుగును. అంతఃకరణము దివ్యము, ఉజ్జ్వలము కానంతవఱకును నది తన ప్రకాశము నితరులపై ప్రతిబింబింపజేయజాలదు. పద్మసింహునియందు సేవా భావోదయమైనది. దేశసేవ చేయవలెనను సంకల్పము మనలో ననేకుల మస్తిష్కమున నుదయించుచుండును; కాని, యా భావము కీర్తికాముకతతో గూడియుండును. మన పేరు ప్రతిష్ఠ లినుమడించునట్టి పనులనే మనము చేయజూచుచుందుము. ఇతరులు ప్రశంసించునట్టి పనులనే చేయబూనుదుము. ఈస్వార్థ

ప్రేమకు తగిన ఫలితముగూడ మన కష్టాడప్పుడు లభింప వచ్చును. కాని, ప్రజాహృదయమున మాత్రము స్థానమును పొందజాలము. మానవుడు తానెంత దుఃఖమున మునిగి యున్నను, తన నిజమైన మిత్రుని యెదుట మాత్రమే తన దుఃఖగాథలను వెల్లడించుకొను.

పద్మసింహుని కిప్పుడు దాల్ మండీ కేఁగుటకు కావల సిన తీరికలభించినది. వేశ్యలజీవితమునుగూర్చి యాతడు తెలిసి కొనిన కొలఁదియు నాతని కెక్కువదుఃఖము కలుగుచుండెను. ఇట్టి కోమలాంగులు భోగవిలాసములకొఱకై సర్వనాశన మొనరించుకొనుచుండుటను చూచినకొలఁదియు నాతని హృదయము కరుణావిహ్వలమైపోవుచుండెను; ఆతని కనుల నుండి యశ్రువులు ప్రవహించుచుండెను. ఈ వేశ్యలు భావశూన్యలు కారనియు, ఆలోచనావిహీనలు కారనియు, కాని మాయాజాలమునకు వశమై వారి సద్వృత్తులన్నియు చెడుమార్గమున ప్రసరించుచున్నవనియు, తృష్ణ వారి యాత్మలను నిర్జీవము - నిస్తేజము నొనరించెననియు నాతడు గ్రహించెను. ఈ మాయాజాలమును తొలగింపవలెననియు, నిస్తేజములై చైతన్యహీనములైన యాత్మలను జాగృత మొనరింపవలెననియు, వారిని అజ్ఞానావస్థనుండి తప్పింప వలెననియు నాతని సంకల్పము. కాని యా మాయా జాలము దృఢమైనది! అజ్ఞానబంధనము బలమైనది! ఆ నిద్ర యొడలు తెలియనిది! అందువలననే పైనచెప్పినట్లు మొదటి

ఆరునెలలకాలములో నాతడు సఫలుడు కాజాలకపోయెను. ఈ వేశ్యలస్థితియు తప్పతాగినవాని మత్తువలెనే యుండెను.

ప్రభాకరరావు ఆతని మఱికొందఱు మిత్రులు మఱల తీర్మానమునందలి మిగిలిన భాగములను కౌన్సిల్‌లో ప్రవేశ పెట్టిరి. వారానాడు కేవలము పద్మసింహునిపై నున్న ద్వేషము కొలఁది తీర్మానమును వ్యతిరేకించిరి. కాని యీనాడు పద్మ సింహునికి వేశ్యాసంస్కరణోద్యమముపై నున్న అనురాగము జూచి తాము తయారొనర్చిన ఆయుధములతో తామే పూర్వ నిర్ణయముపై దెబ్బకొట్టిరి. ఆనాడు పద్మసింహుడు సభకు హాజరుకాలేదు. డాక్టర్ శ్యామచరణుడు నైనీతాల్ వెళ్ళి యున్నాడు. అందుచే నా రెండు తీర్మానములు నామోదింప బడినవి.

పురపాలకసంఘము తరఫున అల్మయీపుర ప్రాంతమున వేశ్యలకై ప్రత్యేక గృహములు నిర్మింపబడుచుండెను. లాలా భగత్‌రాం శ్రద్ధతో పనిచేయుచుండెను. కొన్ని గడ్డియిండ్లు, కొన్ని పెంకుటిండ్లు, కొన్నిడాబాలు, ఒక చిన్న మార్కెట్టు, ఒక చిన్న ఆస్పత్రి, ఒక పాఠశాల కట్టబడుచుండెను. హాజీ హాశిం ఒక మసీదు, సేఠ్ చిమ్మన్‌లాల్ ఒక గుడి కట్టించుట కుపక్రమించిరి. దీనానాథతివారీ యొక పార్కు వేయుటను ప్రారంభించినాడు. నియమితకాలములో భగత్‌రాం పని పూర్తిచేయునను ఆశమాత్రమున్నది. మిష్టర్ దత్తు, ప్రభా కరరావు, శాకిర్‌బేగ్‌లుమాత్ర మాతనిని కూర్చుండనిచ్చుట లేదు. కాని పనిమాత్రము పెద్దది; ఎంత తొందరగచేసినను

సంవత్సరముపట్టినది. అంతే! మఱునాడే దాల్‌మండీ విడిచి క్రొత్తగా నిర్మింపబడిన యిండ్లలో ప్రవేశింపవలసినదిగా వేశ్యలకు నోటీసులిచ్చిరి.

వేశ్యలు వ్యతిరేకింతురని ప్రజ లాశంకించిరి. కాని, వేశ్యలు సంతోషముతో నంగీకరించినందులకు వారికి సంతోషముతోబాటు ఆశ్చర్యముగూడ కలిగెను. ఒక్కరోజులో దాల్‌మండీయంతయు ఖాళీయైపోయినది. రాత్రింబవళ్లు శోభాయమానమైయుండిన వీధి జనశూన్యమై నిస్తబ్ధముగ నుండెను. తబల్లా దరువులు, వీణానాదములు, మధురగానములు, రసికుల యాగమనములు నన్నియు శూన్యములైపోయినవి. పైరు కోసివేసిన పొలమునలెనున్నది దాల్‌మండీ.

# 42

ఒకనాడు మదనసింహుడు గుమ్మముపద్ద కూర్చుండి 'ప్రేమసాగర్' చదువుచున్నాడు. శ్రీకృష్ణుని బాల్యలీలలో నాతనికి పిల్లలకువలె నానందము కలుగుచుండెను. సాయంకాలమైనది. అక్షరములు కనిపించుటలేదు. కాని యచటినుండి లేచుట కిష్టములేకుండెను - ఆతని మనసు పుస్తకమునందట్లు లగ్నమైపోయినది. అకస్మాత్తుగ కుక్కలు మొఱిగి గ్రామములోనికి క్రొత్తమనిషి వచ్చుటను సూచించినవి. మదనసింహుని గుండె వేగముగ కొట్టుకొనెను - సదనుడు రాలేదుగదా! పుస్తకమునూసి లేచిచూడగా వచ్చినవాడు పద్మసింహుడు.

పద్మసింహు డన్నగారికి నమస్కారముచేసినాడు. ఇరువురును కబుర్లు ప్రారంభించిరి.

మదన:—అందఱు క్షేమమా?

పద్మ:—భగవానుని దయవలన!

మదన:—ఆ దరిద్రునివిషయ మేమైన తెలిసినదా?

పద్మ:— తెలిసినది. కులాసాగానున్నాడు. పది పండ్రెండురోజుల కొకసారి మాయింటికి వచ్చుచుండును. అప్పుడప్పుడు వాని స్థితిగతు లడుగుచుందును. విచారింపవలసిన విషయ మేమియులేదు.

మదన:—ఆ దుర్మార్గు డెన్నడైన నిచటివారిని తలచుచుండునా? లేక పూర్తిగ చనిపోయిరనుకొనినాడా? ఇచటికి రాకూడదని యొట్టు పెట్టుకొనినాడా? మేము చనిపోయిన తరువాత వచ్చునాయేమి? వా డావిధముగ కోరుచున్నచో మే మెచటికైన నేగుదుము. వాని యిల్లువాకిండ్లు వానినే చూచుకొమ్మని చెప్పుము. అచట నేదియో యిల్లు కట్టించుచున్నాడని వింటిని! నిజమేనా? వా డచటనున్నచో నిచట యెవరుందురు? ఈ యిల్లెవరికిత్తును? ఏమిచేయుదును?

పద్మ:- లేదు - లేదు; ఇల్లువాకిండ్లేమియు లేదు. ఎవరో అబద్ధముచెప్పినారు. కాని, సున్నపుమిల్లుమాత్రము పెట్టినాడు. నది కావలియొడ్డున కొంత స్థలము కొనవలె ననుకొనుచున్నాడు.

మదన:—వచ్చి ముందీయింటికి నిప్పంటించి, పిమ్మట అచట స్తలముకొనుమని చెప్పాము.

పద్మ:—అవేమిమాటలు! మీరు, కోపపడుదురని భయపడి వచ్చుటలేదు. మీరు వానిని క్షమించినట్లు తెలిసి నచో క్షణములో నిచట వ్రాలును. మా యింటికి వచ్చి నప్పుడు గంటలకొలది మీ విషయములనే ప్రస్తావించు చుండును. మీ కిష్టమైనచో రేపేవచ్చును.

మదన:—వలదు! నేను వానిని పిలువను. మేము వాని కేమగుదుమని వా డిచటి కేతెంచును? కాని, యిచటికి వచ్చు టకుముందు పీపు జాగ్రత్తపఱచుకొని రమ్మనిచెప్పుము. వానిని చూచినంతనే నాకు పిచ్చియెత్తును. కఱ్ఱతీసికొని వెంటపడు దును. సన్యాసి! నాపై నలిగినాడు! పూజాసమయమున పుస్త కముపై చొంగకార్చినపుడు కోపింపలేదు; కంచమువద్ద నుచ్చ పోసినపుడు కోపింపలేదు. వానివలన నెన్నడును గుడ్డలు శుభ్ర ముగ నుండెడివికావు. ఉతికి యారవేసిన గుడ్డలను తడిపివేసెడి వాడు. మంచిగుడ్డలు కట్టుకొని కనిపించినంతనే మట్టికాళ్ళతో వచ్చి నెత్తికెక్కెడివాడు. అనాడు నాపై కోపింపలేదేమి? నేడు కోపించినాడు! నాయెదుటపడినచో తాత ముత్తాతలు జ్ఞాపకము వచ్చునట్లు చెవిమెలివేతును.

సోదరు లిరువురు నింటిలోని కేఁగినారు. భామ ఆవుకు చిట్టు పెట్టుచున్నది. సదనుని చెల్లెండ్రిరువురును వంట చేయు చున్నారు. భామ మఱదిని చూచినంతనే లేచినిలబడినది — 'ఏమినాయనా! దర్శనములే లేవే! బారెడు దూరముననున్నను

నెలకొకసారియైనను వచ్చుటయే మానివేసినావు! వీరున్నారా పోయినారా యను అజయే లేదు. అందఱుక్షేమమా?'

పద్మ:- నీయాశీర్వాదమువలన! ఏమివండుచున్నావు? నాకు క్షీరాన్నము, హల్వా పెట్టినచో శుభసమాచారము చెప్పుదును — నీమనుమని పుణ్యమాయని!

దుఃఖముచే మలినమైయున్న భామ మోమున నానందము తాండవించినది. ఆమె కనులు పువ్వులవలె వికసించినవి. 'పద! నేతిదుత్తలో నిన్నుముంచి లేవనెత్తుదును! నీయిష్టము వచ్చినంత తినుము!'

మదనసింహుడు మూతిత్రిప్పి యనినాడు — 'వీడు చెప్పినది మంచి సమాచారముకాదు. భగవంతుడెన్నడైన నన్యాయమొనర్చునా? నా కుమారుడు వేత్తై పోగా వానికి కుమారుడు లభించునా? ఇప్పుడు వాడొకటికి రెండైనాడు. నేనిక వానినెట్లు జయింపగలను? ఓడిపోవక తప్పినదికాదు. వాడు నన్ను తప్పక గొనిపోవును. నాకిచట కాలు నిలుచుట లేదు. నిజముగ భగవత్సమక్షమున మనము చెడుచేసినను మంచియే యగును. ఇదేమియు ప్రకృతి వ్యతిరేకమైన విషయముకాదుగదా! నాకిక చింతలేదు. వాడెచటికేగిననుసరే! భగవంతుడు మామొఱ నాలకించినాడు! ఎన్నిదినములైనది?

పద్మ:— నేటికి నాలుగు! నాకు వీలు చిక్కలేదు. లేనిచో నానాడే వచ్చియుండెడివాడను.

మదన:— ఇప్పుడు మాత్రము పోయినదేమున్నది? ఆరవనాటికి వెళ్ళగలను. నామకరణము బ్రహ్మాండముగ జరుగవలెను. సరే! రేపు బయలుదేరుదము.

భామ సంతోషమునకంతులేదు. ఆమె హృదయమానందపులకితమైనది. ఎవరికేమొసంగవలెనాయని యాలోచన! పేరంటములు, విందులు చేయవలెనని యభిలాష! సన్నాయిమేళములు వాకిట మ్రోగవలెనని యుబలాటము! మేళతాళములతో గ్రామము ప్రతిధ్వనింపవలెననికోరిక! ప్రపంచమున నసాధారణమైన విషయము జరిగినట్లు, ప్రంచమంతయు గొడ్డుపోయి తానొక్కతెయే మనుమని కనినట్లనిపించుచున్నదామెకు.

ఇంతలో పాలేరువచ్చి — 'అమ్మగారూ! గుమ్మమువద్ద నొక సాధువు నిలబడియున్నాడు!' అని చెప్పినాడు. ఆమె వెంటనే నలుగురికి సరిపోవునంతటి స్వయంపాక సామగ్రిని పంపినది.

భోజనములైనంతనే భామ తన కొమార్తె లిరువురితో గూడి యర్ధరాత్రివఱకును పాటలు పాడుచునేయున్నది.

# 43

సంధ్యాసమయము. ఆకాశమున సాంధ్యరాగము వ్యాపించియున్నది. మందవాయువు గంగాతరంగములపై క్రీడించుచున్నది — అలలకు చక్కలిగింతలు వెట్టుచున్నది.

ఆయల లొక్కొక్కప్పుడు చిరునవ్వుల చిందించును; ఒక్కొక్కప్పుడు పకాలున నవ్వినపుడు వాటి మౌక్తికదంతములు తళతళ లాడుచున్నవి. సదనుని కుటీరము నేడు పూవులతో తీగలతో నలంకరింపబడి రమణీయముగ నున్నది. గుమ్మము వద్ద పల్లెవారి సమూహమున్నది. లోపల పల్లెపడుచులు జేరి పాటలుపాడుచున్నారు. దొడ్డిలో గాడిపొయ్యి త్రవ్వినారు. దానిపై గుండిగలున్నవి. నేడు సదనుని కుమారుని జన్మోత్సవము!

కాని, సదనుడు మాత్రము విచారముగనున్నాడు. అతడు ముందున్న అరుగుపై గూర్చుండి గంగానదిని వీక్షించుచున్నాడు. ఆతని హృదయమందు సైతము భావవీచికలు బయలుదేరినవి — 'వారురారు! వచ్చెడివారైనచో నీపాటికి వచ్చియేయుందురు. వారిచటికి రారని తెలిసియున్నచో పినతండ్రితో నీవిషయము చెప్పెడివాడనేకాను. నన్ను వారు చనిపోయినవానిక్రింద జమకట్టినారు. నాతో వారికెట్టి సంబంధమును లేదని భావించియుందురు. నేను చనిపోయినను, బ్రతికినను వారికిపట్టదు. ఇట్టి శుభసమయములందు శత్రువుల యిండ్లకైనను వెళ్ళుచుందురు - ప్రేమతో గాకపోయినను, పైచూపులకైనను పోయి పలుకరింతురు! ఏదో వ్యవహార రీత్యా వచ్చినను నావాళ్ళున్నారని యనుకొనెడివాడను. పోనిమ్ము! రాకపోనిమ్ము! ఈ వ్యవహారమైపోయినంతనే నేనే స్వయముగా వెళ్ళి తేల్చుకొనివత్తును. పిల్లవాడెంత అందముగా నున్నాడు! పూర్తిగ నాపోలికయే! కనులుమాత్రము

శాంతవి! నావైపు మిటిమిట్టి చూచుచున్నాడు. నాన్నగారు రాకున్నను' అమ్మయైననువచ్చి పిల్లవాని నోడిలోనికి తీసికొనిన నెంతబాగుండెడిది!'

సదను డీభావములందు నిమగ్నుడైయున్నాడు. కొంచెము కనుచీకటిగనున్నది. ఇంతలో నేదో బండి యావైపునకు వచ్చుచున్నది. పినతండ్రియైయుండుననుకొనినాడు. బండి సమీపమునకు వచ్చినది. మదనసింహుడు దిగినాడు. వెనుక మఱియొక బండియున్నది. దానిలోనుండి సుభద్ర, భామ దిగిరి. సదనుని చెల్లెండ్రిరువురును వచ్చిరి. జీతన్ బండిదిగి లాంతరు చూపుచున్నాడు. సదనుడు వీరినందఱిని చూచి యింటిలోనివారందఱును వచ్చినారని గ్రహించినాడు. కాని వారివద్దకు పరుగెత్తలేదు. వారిని బ్రతిమాలవలసిన సమయము దాటిపోయినది. ఇది యాతడు కోపించి బిఱ్ఱబిగిసి కూర్చుండ వలసిన తరుణము. అతడు అరుగుపైనుండి దిగి లోనికేగినాడు- ఎవరిని చూడనట్లు! వీరు రాకపోయినందువలన నేను దిక్కు-లేనివాడనైపోతి ననుకొనిరి కాబోలును! వారికి నే నక్కరలేక పోయినట్లే, వారును నా కవసరములే దనుకొనినాడు.

సదను డింటిలోనికేగి వా శేమొనర్తునోయని పొంచి చూచుచున్నాడు. ఇంతలో జీతన్ గుమ్మమువద్ద కేకలువేయు చున్నాడు. కొందరు నావికులు పరుగెత్తుకొనివచ్చిరి. సదనుడు బయటికివచ్చి దూరమునుండియే తల్లిదండ్రులకు నమస్క-రించి ప్రక్క-కుతొలగి నిలబడినాడు.

మదన:—మమ్ము గుర్తింపనట్లే ప్రక్కకు తొలగి నిలబడితివేమి? నేను నీ కక్కరలేకపోయినను మీ తల్లి యేమొనర్చినది? ఆమెకైనను నమస్కరించి యాశీస్సులందుము!

సదన్:—నేను స్పృశించినచో మీ ధర్మము పాడైపోవునేమో!

మదనసింహుడు తమ్మునివైపు జూచి – 'వింటివా వీని మాటలు? వాడు మమ్ము మఱచిపోయినాడని నీతో ముందే యంటిని. కాని, నీవే మమ్ము లాగికొనివచ్చితివి. తల్లిదండ్రులు గుమ్మమువద్ద కేతెంచినను వీని మనసు కరుగలేదు. చూచితివా?' అనినాడు.

భామ ముందుకేతెంచి – 'నాయనా! నాన్నగారికి నమస్కరింపుము! నీవు తెలిసినవాడవైయుండియు నివేమి మాటలు?' అనినది.

ఇక సదను డెక్కువ యభిమానము చూపలేకపోయినాడు. కనులలో నీరు తిరిగినది. తండ్రి చరణములపై వ్రాలినాడు. మదనసింహునికిసైతము మేనుపువచ్చినది.

పిమ్మట తల్లికి నమస్కరించినాడు. తల్లి యాతనిని గుచ్చి యాశీర్వదించినది.

సంతోషముతో సదనుని పాదములు నేలపై నిలుచుట లేదు. పల్లెవారికేవో యాజ్ఞ లిచ్చుచున్నాడు – తన కిచట నెంత పలుకుబడియున్నదో చూపుటకు! ఒకడు మంచము తెచ్చుట కేఁగినాడు. మఱొకడు బజారు పరుగెత్తుచున్నాడు.

మదనసింహు డుబ్బిపోయి 'చూచితివా? వీడెంతవాడై నాడో?' యనునట్లు తమ్ముని వైపు జూచుచున్నాడు.

భామ సుభద్రతోఁ గూడ లోని కేఁగినది. చకితయై నలు వైపుల జూచినది - 'ఎంత పరిశుభ్రముగనున్న దీ యిల్లు! ఎచటివస్తువు లచట నున్నవి!'

వారు పురిటిగదిలోని కేఁగినంతనే శాంత యత్తలకు నమస్కరించినది. భామ పిల్లవాని నెత్తికొనినది. ఆమెదృష్టిలో నా పిల్లవాడు బాలకృష్ణునివలె నున్నాడు. ఆమె కనులనుండి యానందబాష్పము లుబికినవి.

కొలఁదిసేపటికి మదనసింహు డచటికి వచ్చినాడు. 'ఏమైనను కోడలుమాత్రము మంచి రూపవతి లభించినది - గులాబి పువ్వువలెనున్నది. పిల్లవాడు సాక్షాత్తు భగవంతుని యవతారమే!' అనినది భామ.

మదన:—అవునుమఱి! ఇంత తేజస్వి కానిచో తాత నిచటి కెట్లు రప్పింపగలుగును?

భామ:—కోడలు బుద్ధిమంతురాలు!

మదన:—అందువలననే దానికై వాడు తల్లిదండ్రులను గూడ త్యజించినాడు.

ఎవరి గొడవలో వారు నిమగ్నులై యుండిరి. కాని సుమన్ యెచటనున్నది? ఏమిచేయుచున్నదను విషయ మెవరికిని పట్టలేదు.

సుమన్ గంగానదికి స్నానమునకై వెళ్ళినది. తిరిగి వచ్చునప్పటి కింటివద్ద బండ్లున్నవి. గుమ్మమువద్ద చాలమంది యున్నారు. పద్మసింహుని గుర్తించినది. సదనుని తల్లిదండ్రులు వచ్చినారని గ్రహించినది. ఆమె లోని కడుగిడలేకపోయినది. ఆమెకాళ్ళకు సంకెళ్ళువేసినట్లైనది. ఇఁక తనకిచట స్థానము లేనట్లు, తన సంబంధముతీఱిపోయినట్లు భావించి, నిర్జీవప్రతిమ వోలె నిలబడి, యెచటి కేఁగవలెనాయని యాలోచించు చున్నది.

ఒక నెలదినములనుండి అప్పసెల్లెండ్రమధ్య మన స్పర్థలు బయలుదేరినవి. విధవాశ్రమమున దయా సౌజన్య మూర్తియైకన్పట్టిన శాంత నేఁడు సుమన్‌ను కష్టపెట్టుటకు, ఏడ్పించుట కేమాత్రమును వెనుదీయుటలేదు - ఆమె కదియే పని! స్థానము లభించుటకుముందు మనమెంత వినయశీలురమై యుందుమో, కర్తవ్యపరాయణులమై యుందుమో, స్థానము లభించిన పిమ్మట గూడ నట్లేయున్నచో దేవసదృశుల మగుదుము.

కాని, సుమన్ అన్నియు చూచుచుండియు చూడని యట్లున్నది; వినుచుండియు విననియట్లున్నది. నదిలో మునిగి పోవువానివలె నామె యీ యాధారభూతమైన తృణమును విడువజాలకున్నది. తన జీవనవిధానమును నిర్ణయించుకొన లేకున్నది. కాని, నేఁడు సదనుని తల్లిదండ్రుల నిచటగాంచి యీ యాధారమును వదలిపెట్టవలసివచ్చినది. ఇచ్ఛాశక్తి చేయలేనిపని పరిస్థితి చేసివేసినది.

ఆమె అడుగులలో నడుగులిడుకొనుచు దొడ్డిగుమ్మము నుండి యింటివెనుకకు వచ్చి, తన విషయమేమైన మాటాడు కొనుచున్నారేమోయని ధ్యానముతో నాలకింపసాగినది. అరగంటవఱకక్లే నిలబడియున్నది. భామ, సుభద్ర యేవో విషయములు మాటాడుకొనుచున్నారు. చివఱకు భామ యడిగినది — 'మఱి, ఈమె యప్పగారిచట నుండుటలేదా?'

సుభ:— లేకేమి? ఉన్నది! ఆమె యెచటికేగును?

భామ:— కనబడుటలేదే!

సుభ:— ఏదో పనిమీద వెళ్ళియుండును. ఇంటిపని యంతయు నామెదే!

భామ:— వచ్చిన పిమ్మట బయట పడియుండుమని చెప్పుము! సదనుడు దానిచేతికూడే తినుచున్నాడా?

శాంత పురిటిగదిలోనుండి యనినది — 'లేదు! మొన్నటివఱకు నేనే వండినాను. ప్రస్తుత మాయనయే వండుకొనుచున్నారు!'

భామ:- అయినప్పటికి, గుడ్డలు, గిన్నెలు ఆమె యంటు కొనుచునే యుండియుండును. ఆ కుండ బయటపారవేయుడు! ఆ గిన్నెలు మఱల తోమవలెను.

సుభ:— బయట పరుండుటకు చోటెక్కడిది?

భామ:— ఉండనిమ్ము లేకపోనిమ్ము! లోపల మాత్ర మామెను పరుండనీయను. అటువంటి మనిషిపై నమ్మక మేమిటి?

సుభద్ర:— చాలులెమ్మా! ఆమె యెంతో నిష్ఠపరురాలు! ఆమె యటువంటిదికాదు.

భామ:— చాలు, చాలును! గొప్పనిష్ఠపరురాలే! నానాజాతుల కూళ్ళుతిని, నేడు నిష్ఠపరురాలైనది పాపము! దేవతావిగ్రహములే పగిలినచో మఱల కలియవు! ఇక, ఈమె పతివ్రతమైన దన్నచో నేనెట్లు విశ్వసింతును?

సుమన్ ఇంతకంటె నెక్కువ వినలేక పోయినది. ఇనుప కడ్డీ కాల్చి హృదయమున గ్రుచ్చినట్లనిపించినది. వెంటనే వెనుకకు తిరిగి యాయంధకారమున లీనమైపోయినది.

చీకటి దట్టముగ వ్యాపించినది. త్రోవ బాగుగ కన్పట్టుటలేదు. కాని, యామె మాత్రము పడుచు లేచుచు నడచుచున్నది — ఎచటికో? యెందులకో? ఆమెకు బాహ్యస్ఫురణయేలేదు. మనసుగూడ పనిచేయుటలేదేమో! కఱ్ఱదెబ్బతిని దొర్లుచుపోవు కుక్కవలె మూర్ఛితావస్థలో ముందునకు సాగుచున్నది. ఆగవలెననుకొనును, కాని యాగలేదు. ఆమె కాలికొక పెద్దముల్లు గ్రుచ్చుకొనినది. అంతట నామె కాలుపట్టుకొని చతికిలబడినది. నడచుటకు శక్తిలేదు.

మత్తులోనుండి మేల్కాంచినవానివలె నాశ్చర్యముతో నిటునటు చూచినది. నలువైపుల నిశ్శబ్దము! దట్టమైన చీకటి! నక్కలుమాత్రము రాగాలాపనము చేయుచున్నవి. నే నిచట నొంటిగా నున్నానను భావము కలిగినంతనే యామెకు భయముకలిగెను. ఒంటరితనమననేమో నేఁ డామె కర్థమైనది. భయముతో కనులు మూసికొనినది.

నే నెంతటి దురదృష్టవంతురాలను! నా తో బుట్టువే నా మొగముచూచుట కిష్టపడకున్నది. దానినెంత 'నాదానిగ' నొనరించుకొనవలెనని యత్నించినను 'నాది' కాలేదు. నాకు కళంక మంటనేయంటినది. నేడది కడిగినను పోదు. చెల్లెలిని గాని, యితరులనుగాని నిందించి ప్రయోజనములేదు. ప్రభో! సౌందర్యమునిచ్చి, మనసు నింత చంచలమైనదానిగ నొనర్తు వేల? నేను చూచినవారిలో చాలమంది యందమైనవా రంద అను చంచలమనస్కులే! భగవంతు డీ యుక్తితో మన యాత్మలను పరీక్షించుచుండు నేమో!

సుమన్ చాలసేపటివఱ కీ యాలోచనలలో నిమగ్న మైయున్నది. దీనివలన నామె హృదయమునకు శాంతి లేకు న్నది. నేటివఱ కామె యెన్నడును నిట్లు ఆత్మవిమర్శనము చేసికొనలేదు. ఈ కష్టములలో నామె సత్సంకల్పము జాగృత మైనది.

రాత్రి గడచినది. శీతల వసంతవాయువు వీచుచున్నది. సుమన్ చీర సవరించుకొని మోకాళ్ళపై తల పెట్టుకొనినది. ఇదే ఋతువులో - ఇదేసమయమున - తన భర్త యింటివద్ద, యిల్లేకూర్చుండి యెచటికేగవలెనా యని యాలోచించిన విష యము జ్ఞప్తికివచ్చినది. ఆనాడు విలాసాగ్నిలోబడి తపించు చుండినది. నేడు శీతలభక్తిచ్ఛాయలో నాశ్రయముపొందినది.

అకస్మాత్తుగ నామెకు కునుకుపట్టినది; గజానందస్వామి కనిపించినాడు. మృగచర్మధారియై దయాపూర్ణ దృష్టితో

జూచుచున్నాడు. సుమన్ ఆతని చరణములపై వ్రాలి దైన్య భావములతో - 'ప్రభూ! నన్నుద్ధరింపుము!' అని వేడినది.

ఆమెకు స్వామి దయతో తననెత్తిపై చేతితో నిమురుచున్నట్లనిపించినది - 'భగవంతు డిందుకే నన్ను నీవద్దకు పంపినాడు! ఏమికావలెనో చెప్పుము!' అనినాడు.

సుమన్:—ప్రభూ! నాకు జ్ఞానమును ప్రసాదింపుము!

స్వామి:—సరే! వినుము! సత్యయుగమున జ్ఞానమువలననే మానవునికి ముక్తిలభించెడిది. త్రేతాయుగమున సత్యమువలనను, ద్వాపరమున భక్తివలనను ముక్తిలభించెడిది. ఈ కలియుగమున నొక్కటే మార్గమున్నది - అది సేవామార్గము. ఈ మార్గమును గ్రహించినచో నీకు శుభమగును. నీకంటెను దీనులైనవారిని, దరిద్రులను ఆశ్రయింపుము! నీకు వారి యాశీస్సులు లభించును! భగవంతు డీ కలియుగమున దుఃఖసాగరముననే (క్షీరసాగరమునకాదు) నివసించియుండును.

సుమన్ నేత్రములు తెఱచుకొనెను. ఆమె యటునిటు చూచినది. తాను మేల్కొనియున్నట్లామెకు నమ్మకమే! ఇంతలో స్వామిజీ యెట్లదృశ్యుడైనాడు? అకస్మాత్తుగ నామె కచటి చెట్లచాటున స్వామిజీ లాంతరుపుచ్చుకొని నిలబడియున్నట్లనిపించినది. కుంటుచు నామె యటు బయలుదేరినది.

ఆ వృక్షసమూహ మొకవంద లేక రెండువందల గజముల దూరముండు ననుకొనినది. కాని నాలుగువందల

గజముల దూరమేఁగినను అంతేదూరమున స్వామీజీ లాంతరు పట్టుకొని కన్పట్టుచుండెను.

'నేను నిద్రపోవుటలేదుగదా! ఇయ్యది స్వప్నమేమో! ఇంతదూరము నడచినను, నింకను నంతేదూర మున్న దేమి?' అనుకొని బిగ్గఱగా – 'స్వామీ! వచ్చుచున్నాను! అచటనే నిలువుడు!' అని కేకవేసినది.

'రమ్మ! నేను నిలబడియేయున్నాను!' అను శబ్దము లామెకు వినిపించినవి.

ఆమె మఱల బయలుదేరినది; కాని, రెండువందల యడుగుల దూరమేగి, యలసి చతికిలబడినది. ఆ వృక్షసమూహము, స్వామీజీ యెప్పటియట్లు వందగజముల దూరమున కన్పట్టుచున్నారు.

భయమువలన నామెకు రోమాంచముగలిగినది. గుండె వేగముగ కొట్టుకొనుచుండెను. కాళ్ళు గజగజ వణకుచుండెను. కేకవేయవలె ననుకొనినది; కాని మాట పెగలిరాలేదు.

స్వామీజీ యొక్క గుడిసెలోని కేఁగుట నామె చూచినది. వృక్షసమూహము మాయమైపోయినది. అదియే యాతని నివాస మనుకొనినది. ఆమె కెంతో ధైర్యముకలిగినది. ఆమె తప్పక స్వామీజీని కలిసికొనగలదు. ఆయనయే యీ సమస్యను భేదింపవలెను.

ఆమె కుటీరద్వారమువద్ద కేఁగి – 'స్వామీ! నేను! సుమన్‌ను!' అని పిలిచినది.

ఆ కుటీరము గజానందునిది. కాని, యాతడు నిద్రించు చున్నాడు. సుమన్‌కు సమాధానము రాలేదు.

సుమన్ ధైర్యము తెచ్చుకొని లోనికి తొంగిచూచినది. లోపల అగ్ని వెలుగుచున్నది. గజాధరుడు కంబళి కప్పుకొని నిద్రించుచున్నాడు. సుమన్‌కు ఆశ్చర్యము కలిగినది – ఇప్పుడే గదా వచ్చినాడు! ఇంతలో నెట్లు నిద్రించినాడు? ఆ లాంతరేమైనది? బిగ్గఱగా పిలిచినది – 'స్వామీ!'

గజానందుడు లేచి ఆశ్చర్యముతో సుమన్‌వైపు జూచినాడు. ఒక క్షణమువఱకు తదేకధ్యానముతో నామెను జూచినాడు – 'ఎవరు? సుమన్?'

'చిత్తము స్వామీ! నేనే!'

'నేనిప్పుడే నిన్ను స్వప్నములో జూచుచున్నాను.'

సుమన్ ఆశ్చర్యచకితయైనది – 'ఇప్పుడేగదా మీరు కుటీరములోని కేతెంచినది!'

గజా:—కాదు; నేను నిద్రించి చాలసేపైనది. నేను కుటీరమునుండి బయటికి కదుగుపెట్టనేలేదు. ఇప్పుడే స్వప్నములో మాత్రము నిన్ను జూచుచున్నాను.

సుమన్:—నేను మీ వెంటనే గంగానది యొద్దనుండి వచ్చుచున్నాను. మీరు నాముందు లాంతరుపట్టుకొని వచ్చుచున్నారు.

గజానందుడు చిరునవ్వునవ్వినాడు. 'నీవు మోసపోతివి!'

సుమన్:— మోసపోయినచో కనివిని యెఱుగని యిచ్చోటి కెట్లువత్తును? నే నా నదియొద్దున గూర్చుండి నే నెట్లుద్ధరింపబడుదునాయని చింతించుచుంటిని. నాపై కరుణింపుమని, నాకు శరణమిమ్మని భగవంతుని ప్రార్థించుచుంటిని. ఇంతలో మీరచటి కేతెంచి నాకు సేవాధర్మము నుపదేశించిరి. మిమ్మెన్నో విషయము లడుగదలచితిని. కాని మీ రదృశ్యులైరి. కాని మఱుక్షణమున లాంతరు పుచ్చుకొని కొలదిదూరమున కన్పట్టిరి. నేను మీ వెనుక పరుగెత్తితిని. నా కీ రహస్యమేమియో యర్థమగుటలేదు. దయయుంచి చెప్పుడు!

గజా:—అట్లు జరిగియేయుండవచ్చును. కాని యీ విషయములింకను నీ కర్థముకావు.

సుమన్:—మీ వేషమునుదాల్చి, నన్ను మీశరణమునకు గొనివచ్చిన దేవతకాదుగదా!

గజా:—కావచ్చును. నీవుచెప్పిన విషయమునే నేనును స్వప్నమున జూచుచుంటిని - నీకు సేవాధర్మము నుపదేశించుచుంటిని. సుమన్, నీవు నన్ను బాగుగ నెఱుంగుదువు. నావలన ననేకకష్టము లనుభవించితివి. నేనెంత నీచప్రకృతికి జెందిన అధముడనో నీవెఱుంగుదువు. కాని, నేను నావెనుకటి నైచ్యమును తలచుకొనినంతనే హృదయము వ్యాకులమగును. ఆదరింపదగిన నీపై నిరాదరణచూపితిని. ఇదియే మన దుఃఖములకు, మన దుస్థితికి మూలకారణము. మనజాతిలో స్త్రీల కాదరము లభించు రోజులెన్నడు వచ్చునో! ఆడుది పాతపీలికలను

ధరించి, ఆభరణవిహీనమై, గంజి త్రావుచు, గుడిసెలోనుండి, కూలినాలిచేసి, అన్నికష్టములను సహించుచున్నను ఆనందముగ నుండగలదు. కాని యింటిలోమాత్రమామె కాదరము లభింపవలెను. ఆదరము - ప్రేమ లభింపని స్త్రీ యంతఃపురమందైనను సుఖింపజాలదు. కాని, నేను అజ్ఞానాంధకారమున మునిగియుంటిని. నన్ను నే నుద్ధరించుకొనుటకు తగిన సాధనము నావద్దలేదు. జ్ఞానమా శూన్యము! విద్యయా పూజ్యము! కర్మసామర్థ్యమా లేదు! కావున నా బంధువులకు సేవచేయవలెనని నిశ్చయించుకొంటిని. ఇదియే నాకు సులభమైన మార్గము. నాటినుండి నాచేతనైనంతవఱకిదే మార్గమున నడచుచున్నాను. ఆత్మోద్ధరణమున కనేకమార్గములున్నను, వాటియందు నామభేదము తప్ప మఱేమియు లేదని నాకు తోచుచున్నది. నాకీమార్గముననే శాంతి లభించినది. నీకైనను నిదియే యుత్తమమార్గమని నా యుద్దేశ్యము.

ఆమెకు గజాధరుని ముఖారవిందముపై నొక నిర్మలజ్యోతిప్రకాశముకన్పట్టినది. ఆమె యంతఃకరణమున శ్రద్ధాభక్తులుదయించినవి - వీరియాత్మయందెంత దయయున్నది? ఎంత ప్రేమభావమున్నది! అయ్యో! నే నీపురుషరత్నమును తిరస్కరించితిని. వీరిసేవయందున్నచో నా జీవితము ధన్యమైయుండెడిది. ఆమె యీ విధముగననినది— 'స్వామీ! మీరు నాకు ఈశ్వరసదృశులు. త్రికరణశుద్ధిగ మీసేవ చేయుదును. నేనిదివఱలో నొకసారి యీ ప్రతిజ్ఞ చేసితిని. కాని, యజ్ఞానవశమున పాలింపజాలనైతిని. నేడు నేను విశుద్ధమైన మనసుతో

ప్రతిజ్ఞ చేయుచున్నాను. మీరు నా ప్రాణిని గ్రహించితిరి. నే నిప్పుడు పతితనై యున్నను తమ యౌదార్యముతో క్షమించి సన్మార్గమున నడిపింపుడు.'

గజానందుని కీ సమయమున నామె మోమున ప్రేమ, పవిత్రతల కాంతి కనిపించినది. అతడు వ్యాకులుడై నాడు. కొన్ని సంవత్సరములనుండి యణచియుంచిన భావములొక్క-మ్మడి జాగృతములై నవి. ఆనందము, సుఖములకు సంబంధించిన నూత్నభావము లుదయించినవి. అతనికి తన జీవితము శుష్కము, నీరసము, ఆనందవిహీనముగ తోచెను. అత డీ భావములతో భయభీతుడై పోయెను. నామనసులో నీభావము లే స్థిరముగ నుండిపోయినచో, నాసంయమము - నా వైరాగ్యము- నాసేవావ్రతము ఈ ప్రవాహములో తృణములవలె కొట్టుకొనిపోవునేమోయను సంకోచము కలిగినది — 'ఇచట అనాథాలయము నొకదానిని స్థాపించిన విషయము నీ వెఱుగుదువా?'

సుమన్:— ఎవరో చెప్పుకొనుచుండగా వింటిని.

గజా:— ఈ యనాథాలయమున వేశ్యలు మాకొప్పగించిన కన్యలే యెక్కు-వమంది యున్నారు. సుమారు 50 మంది పిల్లలున్నారు. ఈయనాథాలయమున కొక పవిత్రాత్మ కావలసియున్నది — నీవే యాయాత్మవు! నేనెందఱినో చూచితిని. కాని యీ పనిని ప్రేమభావముతో నిర్వహించువారు కానరాలేదు. తల్లివలె వారిని పోషించి, ప్రేమతో

వారికి తల్లి లేనికొఱతను దీర్పగలవారు కన్పట్టలేదు. జబ్బుపడిన పుడు వారికి సేవచేయుటకు,వారి కురుపులను-వారి మలమూత్ర ములను జూచి యసహ్యించుకొననివారును, తమ ప్రవర్తనవలన వారిలో ధార్మికప్రవృత్తిని జాగృత మొనరింపగల్గువారును, వారిపూర్వసంస్కారములను మఱపించువారును కావలెను. వాత్సల్యమున్ననేగాని యియ్యది సాధ్యముకాదు. భగవానుడు నీకు జ్ఞానము, వివేకము ప్రసాదించినాడు. నీహృదయమున దయాధర్మములున్నవి. నీవే యీ కర్తవ్యమును నిర్వహింప గలవు. నా ప్రార్థనను మన్నింతువా?'

ఆమె కనులు చెమ్మగిలినవి. నాపై నొక మహాత్మునికి, జ్ఞానికి యిట్టి యభిప్రాయమున్నదిగదాయని తలచుకొనినంతనే యామె హృదయము సద్గదమైనది. తనపై నింతటి విశ్వాస ముండునని యామె స్వప్నమందైనను భావింపలేదు. తన కింతటి సేవాగౌరవ మబ్బునని యామె యాశింపనులేదు. భగవంతుడే గజానందుని కీ బుద్ధిపుట్టించినాడని విశ్వసించినది. ఆమె వినీతభావముతో నన్నది — 'నేనందులకు తగినదాన నని మీరు భావించినచో నది నాయదృష్టము. మీరు చెప్పిన ఆదర్శమువఱకును నేను చేరజాలను. కాని యథాశక్తి మీ యాజ్ఞను పాలింతును.' అనినది. ఆమె శిరము వినమ్రమై యుండెను. కనులనుండి యశ్రువులు ధారలుకట్టెను. ఆమె భాష ప్రకటింపలేని భావములను ముఖము ప్రకటించినది.

గజా:— నేనదియే యాశించుచున్నాను. భగవానుడు నీకు మేలు కలుగజేయుగాక!

ఈ విధముగనని గజానందుడు లేచినాడు. తూరుపు తెలవారినది. కోయిలలు కూసినవి. అతడు తన కమండలమును గొని గంగాస్నానమున కేగినాడు.

సుమన్ నిద్రనుండి మేల్కాంచి చూచినట్లు కుటీరము నుండి వెలుపలికి వచ్చి చూచినది. ప్రకృతి యెంతరమణీయ ముగనున్నది! ఎంత ప్రశాంత వాతావరణము! ఎంతటి యుత్సాహపూర్ణమైన దృశ్యము! తన భవిష్యత్తుగూడ నట్లే యుండునా? ఆమె భావిజీవితమున ప్రభాతమగునా? అందు సైతమెన్నడైన ఉషఃకాంతులుకన్పట్టునా? సూర్యుని ప్రకాశ ముండునా? తప్పకయుండును! ఆరమణీయశాంతిమయ ప్రభాతము భావిజీవిత ప్రభాతద్యోతకమే!

# 44

ఒక సంవత్సరము గడచినది. కార్తికమాసము. పద్మసింహుడు సుభద్రను గంగాస్నానమునకు తీసికొనివెళ్ళినాడు. తిరిగి వచ్చునపుడు అలయాపురము మీదుగ వచ్చుచుండిరి. సుభద్ర బండికిటికీలోనుండి తొంగిచూచుచు నింతటి నిస్తబ్ధ ప్రదేశమున జనులెట్లు నివశించుచున్నారా యని యాలోచించుచున్నది. వారికిచట నేమితోచును? ఇంతలో నామెకొక సుందరమైన భవనము కన్పట్టినది. ఆ భవనముముందున్న గేటుపై పెద్ద అక్షరములతో 'సేవాసదనము' అని వ్రాయబడియున్నది.

సుభద్ర భర్తనడిగినది — 'ఇదియేనా సుమన్‌బాయి యున్న సేవాసదనము?'

పద్మసింహు డీత్రోవ నెందుకు వచ్చితిమాయని పశ్చాత్తాపపడుచు, నుదాసీనభావముతో 'అవును' అనినాడు. ఇప్పుడీమె తప్పక ఆశ్రమములోనికేగును. ఆమె వెంట నేనును లోనికేగవలసివచ్చును. పెద్దచిక్కు—వచ్చినది! అత డింతవఱకు నొకసారియైనను సేవాసదనమువైపు తిరిగిచూడలేదు. గజానందు డెన్నిపర్యాయములో యాతనిని తీసికొనివచ్చుటకు ప్రయత్నించినాడు; కాని, యెప్పటికప్పు డేదియో వంకబెట్టి తప్పించుకొనినాడు. అతడెన్నిపనులైనను జేయగలడు. కాని సుమన్ యెదుటకుమాత్రము రాజాలడు.

సుభద్ర:— బండినాపుము! దిగిచూచివత్తును!

పద్మ:— చాల ఆలస్యమగును. మఱొకసారి రావచ్చును.

సుభద్ర:— ఏమంత యాలస్యమగును? పదినిమిషములలో తిరిగి వత్తము.

పద్మ:— నీకు పట్టుదల పట్టుట యొక చెడుఅలవాటు! చెప్పితినిగదా నాకలస్యమగునని! కాని నామాటవినవు!

సుభద్ర:— కొంచెము తొందఱగా తోలినచో నీ యాలస్యము సరిపుచ్చుకొనును.

పద్మ:— సరే! అట్లయిన నీవుపొమ్ము! సాయంకాలము వఱకును గూర్చుండి నీయిష్టము వచ్చినపుడురమ్ము. నేను

వెళ్ళిపోదును. బండి యిచటనేయుంచి, బాడుగ బండిపై నేను వెళ్ళుదును.

సుభద్ర:—'దేనికి? మీ రిచటనేయుండుడు! ఇప్పుడే తిరిగివత్తును.' భర్తపై బాగుగ కేకలువేయవలె ననుకొనినది. కాని బండివాడచటనే యున్నాడు. అందుచే గొంచెము శాంతించినది. బండిదిగి యాశ్రమములోని కేఁగినది.

ఆమె వరండాలోని కేఁగినంతనే యొక స్త్రీ లోనికేఁగి సుమన్‌తో చెప్పినది. క్షణములో సుమన్ వచ్చినది. కేశవిహీనయు, ఆభరణశూన్యయునైన సుమన్‌ను జూచి సుభద్ర ఆశ్చర్యచకితయైనది. ఆమెయందిప్పుడు వెనుకటి లావణ్యము లేదు. వెనుకటి చాంచల్యములేదు. ఆ చిరునవ్వుల చిందించు కనులు పెదవులు నేడు కానరావు. రూపలావణ్యములకు బదులు పవిత్రత యామెమోమున భాసించుచున్నది.

సమీపమునకు వచ్చి సుమన్ సుభద్ర చరణములపై వ్రాలి, సజలనేత్రయై యనినది - 'నేనెంతో యదృష్టవంతురాలను. అందువలననే మిమ్మిచట దర్శింపగలిగితిని!'

సుభద్ర కనులు చెమ్మగిలినవి. సుమన్‌ను గుచ్చి కవుంగలించికొని సగద్గదయై యనినది - 'రావలెననియే యనుకొనుచుందును. కాని, సోమరితనమువలన రాజాలనైతిని.'

సుమన్:—ప్లీడరుగారుకూడ వచ్చినారా లేక మీ రొంటరిగ వచ్చితిరా?

సుభద్ర:—వెంటవచ్చిరి. కాని వారికి చాల ఆలస్యమైపోయినది. అందుచే మఱియొకబండిలో వెడలిపోయిరి.

సుమన్ విచారముతోనన్నది - 'ఏమంత యాలస్యమగును? వారికిచటికి వచ్చుటయే యిష్టములేదు. నా దురదృష్టము. వారీ యాశ్రమమునకు జన్మదాతమైయున్నను, నా కారణముననే యింతగా నసహ్యించుకొనుచున్నారు. ఒక పర్యాయము మీరిరువురును రావలెనని నాయభిలాష. సగము కోరిక నెఱవేఱినది. మిగిలినదిగూడ నెన్నడో పూర్తియగును. అదియే నా యాత్మోద్ధరణ దినమగును.' అని సుభద్రకు ఆశ్రమమును జూపసాగినది.

సుభద్ర కిచటి చక్కటి యేర్పాట్లు, శాంతి, కన్యల శీల స్వభావాదులు సంతసమును కల్గించినవి. 'సుమన్ యింత పెద్ద యాశ్రమము నెట్లు నడుపగలుగుచున్నది? నా వలన మాత్రము కాదు! ఏ యొక్కపిల్లయు విచారముగనున్నట్లు కన్పించుటలేదు!' అనుకొనుచున్నది.

సుమన్:—ఈ భారము నాపై నిడుకొంటిని. కాని ఈ భారమునువహించు శక్తి నాకులేదు. ప్రజలిచ్చు సలహాలే నాకు ఆధారము! మీకేదైన లోపమున్నట్లు తోచినచో దయయుంచి చెప్పుడు. నా కది యుపకారమొనర్చినట్లగును.

సుభద్ర నవ్వినది - 'సుమన్! నన్ను సిగ్గుపఱుపకుము! నా కిదియంతయు నాశ్చర్యకరముగనున్నది. నీకు నేనేమి

సలహాలొసంగగలను? ఇంతచక్కటి ఏర్పాట్లు విధవాశ్రమము నందు సైతము లేవనిమాత్రము చెప్పగలను.

సుమన్:— మీరు సంకోచించుచున్నారు.

సుభద్ర:— లేదు; సత్యమే చెప్పుచున్నాను. సరే! వీరికి పెండ్లిండ్లెట్లగును?

సుమన్:— అదియే పెద్దసమస్య! ఈకన్యలను నేర్పరులైన గృహిణులుగా తయారొనర్చుటయే మనకర్తవ్యము. సమాజము వారి నాదరించునో లేదో నేను చెప్పజాలను.

ఇంతలో 10 మంది బాలికలు సుందరమైన వస్త్రములను దాల్చి సుభద్ర యెదుట నిలువబడి మధురస్వరముతో పాడిరి.

ఓ జగత్ప్రభూ! దేవ దేవ!
ప్రేమచూపి, భక్తినొసగి
కావుమయ్య కరుణాలవాల!
భక్తిభావ భరితమగుచు
విషయవాసనాదూరమగుచు
మనునుగాక మామనసు ॥ఓ॥

సుభద్ర యీ పాటవిని సంతసించినది. పిల్లలకు 5రూపాయలు బహుమతి యిచ్చినది.

ఆమె వెడలిపోవు నప్పుడు సుమన్ కరుణస్వరముతో - 'రేపు ఆదివారము, మీకొఱకై యెదురు చూచుచుందును.'

సుభద్ర:—తప్పక వత్తును.

సుమన్:—శాంత క్షేమముగనున్నదా?

సుభద్ర:—ఉత్తరమువచ్చినది-క్షేమముగనేయున్నది. సదను డిచటికి రాలేదా?

సుమన్:—రాలేదు. కాని, నెలకు 2 రూపాయలు చందామాత్రము పంపుచున్నాడు.

సుభద్ర:—సరే! సెలవు!

సుమన్:—మీ రాకవలన కృతార్థనైతిని. మీభక్తి, మీ ప్రేమ, మీ కార్యకుశలతల నేమని వర్ణింతును? మీరు స్త్రీ సమాజమునకు శిరోభూషణమువంటివారు. (చెమ్మగిలిన నేత్రములతో) నేను మీ దాసివంటిదానను. బ్రతికియున్నంత కాలము మీ కీర్తిని పొగడుచుందును. నన్నుచేపట్టి నాశనమై పోకుండ రక్షించితిరి. భగవంతుడు మీ కెల్లప్పుడు శుభముల నొడగూర్చుగాత !



# ప్రేమ్‌చంద్ నిర్మల

## (ఒక కరుణామయ జీవిత గాథ)

ఇందులో వృద్ధవివాహాలవలని అనర్థాలను నిరూపిస్తూ, గృహజీవితంలో అకారణమైన అనుమానాలకు తావిచ్చేవారు సంసారాలను ఎలానాశనం చేసుకొంటారో అతిరసవత్తరంగా చిత్రించారు శ్రీ ప్రేమ్‌చంద్. బాల బాలికలు స్త్రీ పురుషులు వయోవృద్ధులు యావన్మంది చదివి గ్రహించవలసిన విషయాలెన్నో ఉన్నాయిందులో. చదవడం మొదలుపెట్టితే పుస్తకం పూర్తయేవరకు నిద్రాహారాలపైకి బుద్ధిపోదు. హిందీలో ఈ నవల లక్షప్రతులకుపైగా ఖర్చయినవంటే దీని ప్రాముఖ్యతనుగురించి వేరే చెప్పనక్కరలేదు.

356 పేజీలు; ముచ్చనైన త్రివర్ణముఖ చిత్రంతో

వెల రూ 3—0—0 లు మాత్రమే.

హాఫ్ క్యాలికో బైండు రూ 4—0—0 లు.

# ప్రేమ్‌చంద్ నారీ జీవనము

ఇది శ్రీ ప్రేమ్‌చంద్ అమరలేఖనినుంచి వెలువడిన మహోత్కృష్టమైన కథల సంపుటి, భారతదేశపు స్త్రీలసమస్యలను వివిధ దృక్పథాలతో పరిశీలిస్తూ ఒక్కొక దృక్పథంతో ఒక్కొక సర్వాంగ సుందరమైన కథను రచించారు—

320

శ్రీ ప్రేమ్‌చంద్. ప్రతి ఒక కథ ఒక వజ్రపుతునక. ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో స్త్రీకి ఎటువంటి స్థానమున్నది ? — ఎటువంటి స్థానముండాలి ? సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలకు, అక్రమాలకు కారణమేమిటి? మొదలైన అనేక సమస్యలను సమీక్షిస్తూ వ్రాసిన ఉత్తమకథలసంపుటి. ప్రతి తెలుగుబిడ్డ తప్పక చదివి తీరవలసిన సద్గ్రంథం.

ప్రథమ భాగం రూ 1-0-0. తృతీయ భాగం రూ 1-8-0
ద్వితీయ భాగం రూ 1-0-0. సంపూర్ణ సంపుటి రూ 3-8-0
హాఫ్ క్యాలికో బైండు రూ 4-8-0

# ప్రేమ్‌చంద్ ప్రేమపీఠం

మతవిభేదాలు మానవజాతికి అనర్థదాయకమని ఋజువు చేస్తూ, క్రొత్తగా దాంపత్య జీవితంలో అడుగుపెట్టే యువతీ యువకులకు అమూల్యమైన గుణపాఠాల్ని నేర్పుతూ సున్నిత మైన హాస్యంతో పాఠకుల హృదయాలను కవ్వించే చక్కని నాటకం.

వెల రూ 1—0—0

ప్రకాశకులు :
ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్
విజయవాడ-1

